1 డ 5142/493

విద్యానగర చరిత్ర నవలామాలిక :

# రా య ప రా భ వ ము

మూ ల ము :

కొరటి శ్రీనివాసరావు

అనువాదము :

శ్రీనివాసపురం సోదరులు

—: పబ్లిషర్సు :—

జ న తా ప్ర చు ర ణా ల యు ము

వి జ య వా డ-2.

# I. సామ్రాజ్యోదయ ఘట్టము

[క్రీ. శ 1224 మొ॥ 1336 వరకు]

1 దేవగిరి దుర్గము

2 దేవగిరి పతనము

3 కంపిల రాయలు

4 కుమార రాముడు

5 రాజ్యోదయము

## II. సామ్రాజ్య వైభవ ఘట్టము

[క్రీ. శ 1336 మొ॥ 1528 వరకు]

6 రాయ పరాభవము

7 గజవేటకాడు (సమ్రాట్ ప్రౌఢ దేవరాయలు)

8 రాజ్యక్రాంతి

9 తౌళవేశ్వరుడు

10 నాగలా దేవి

11 జగన్మోహిని

12 శాంతివాది

## III. సామ్రాజ్య దురంత ఘట్టము

## [క్రీ. శ 1528 మొ॥ 1565 వరకు]

## IV· సామ్రాజ్య పతన ఘట్టము

## (క్రీ. శ 1565 మొ॥ 1656 వరకు)

17 రఘునాథ విజయము

18 దేవీకోట

19 జ్ఞాతి కలహము

20 రాజ్యక్షయము

పంచాయతీ గ్రంథాలయం. కృష్ణా జిల్లా

# అతిథి సత్కారము

అది క్రీ. శ. 1305 వ సంవత్సరము—

చైత్రమాసపు యెండాకాలము. మధ్యాహ్న మార్తాండుడు తన తీక్ష్ణకిరణజ్వాలలచే సర్వప్రపంచమునూ 'ఉస్సు'రని నిట్టూర్పు జేయుచున్నాడు. భూమిమీద పాదము మోపిన బొబ్బలెక్కునట్టుగానున్నది. ఆ ప్రాంతమున ఎటు జూచిననూ కనుచూపుమేరలో ఛాయనొసగగల వృక్షముల జాడయే గోచరించలేదు. ఎడారివంటి ఆ ఎఱ్ఱటిభూమి మండువేసవి ఎండలకు నీటికొరకై నోరు తెరచుకొని వున్నట్టు బీటలువారిపోయినది. విశాలమైన ఆ మైదానములో ఎచ్చటనూ రైతులుగాని, పశువులుగాని, యితర ప్రాణులుగాని దృగ్గోచరము కాలేదు. చిత్రకారుని అద్భుత సృష్టివలె సకల చరాచరప్రపంచము స్తబ్ధముగానున్నది. అది మిట్టమధ్యాహ్నము. ఆ మండుటెండలకు సుదూరములో ఒక నిర్మల జలవాహిని ప్రవహించుచున్నట్టు భ్రాంతి గొలుపుచున్నది. కాని, అది ప్రవాహము కాదు. ఎండమావి. ప్రాణి సంచారమేలేని అటువంటి సమయములో ఒక వైదిక బ్రాహ్మణుడు భారమైన తన కృష్ణాజినపు పెట్టెనెత్తుకొని ముద్గల్లున కభిముఖముగా నడచి వెళ్ళుచున్నాడు. అతడొకసారి సూర్యుని చూస్తూ, మరొకసారి దూరపు దిగంతములో అస్పష్టముగా కనబడుచున్న ముద్గల్లును చూస్తూ, ఎండవేడిమిని భరించలేక, దప్పికగొని-నడువ నశక్తుడై-తడబడుతూ విశ్రమించుటకు చల్లనినీడ నివ్వగల ప్రదేశము కనబడకపోగా 'ఉస్సు'రని నిట్టూర్చుచూ మెల్లగా ముందుకు పయనించుచున్నాడు.

అనతిదూరములో చరిత్ర ప్రసిద్ధమైన ముద్గల్లుకోట మసక మసకగా కనుపించుచున్నది. ఎక్కువ అనిన ఒక్క క్రోసుకంటె దూరముండనేరదు. కాని ఆ దూరమును నడచుట కతనికి దేహములో త్రాణ

లేకపోయినది. ఎవరో చెప్పిన మాటలువిని ఎండ ముదరకమునుపే ముద్గల్లునుచేరి విశ్రాంతి తీసుకొనవచ్చునని వేకువనే బయలుదేరినాడు. కాని, రెండామడలు నడచునప్పటికే పొద్దు నెత్తికెక్కినది. ముద్గల్లు దగ్గర పడుచున్నకొలదీ అతని కాళ్ళు గుంజసాగినవి. పడుకొని విశ్రాంతి తీసుకొనుదమనిన, సమీపంలో ఎచ్చటనూ శిథిలమండపముగాని, ఛాయ నొసగు వృక్షములుగాని కంటికగపడలేదు. విధిలేక ఆ బ్రాహ్మణుడు భారమైన తన కృష్ణాజినపుపెట్టె నెత్తుకొని చెమట తుడుచుకొనుచూ 'పాడువూర'ని శపించుచూ, బసవన్న (కోకటిబంత) పురుగువలె మందగతిని పయనించుచూ మరొక అడుగు ముందుకు వేయుటకుకూడా సాధ్యము కాదనుకొనుచూనే ముద్గల్లును సమీపించినాడు. అతని అదృష్టముకొలది వూరిముందు ఒక మావితోపు కనబడినది. ఆ తోపులో ఒక మంచినీటి బావికూడా వున్నది. ఊరిలోని ఆడపడచులందరూ ఆ బావిలో నీరు తోడుకొని వెళ్ళుచున్నారు. 'ప్రస్తుతమునకు బ్రతికినదీ బీదప్రాణం' అనుకొనుచూ అతడు త్వరత్వరగా అడుగులువేసి బావిని సమీపించినాడు. అచ్చటనున్న శిథిలమండపములో తన భారమైన కృష్ణాజినపు పెట్టెనుంచి ప్రశాంతముగా ఒక నిట్టూర్పు విడచినాడు.

కాని, అది దిగుడుబావికాదు; చేదబావి. అందువలన అతనికి నిరాశకల్గినా హతాశుడు కానక్కరలేకపోయినది. అది ఆవూరి కంతటికీ వున్న ఒకేఒక్క మంచినీటిబావి. ఉదయమునుండి సాయంకాలంవరకూ ఆవూరి మగువలువచ్చి అందులో నీరు తోడుకొని వెళ్ళుచుండెవరు. అన్నదానప్ప అను మహాత్ముడా బావిని పాంథులకొరకై త్రవ్వించినాడని ప్రతీతి. అంతేకాక. ప్రయాణీకులు విశ్రాంతి తీసుకొనుటకొరక మామిడి తోపును, వంటచేసుకొనుటకొరక మంటపమును కట్టించి అతడు కీర్తిశేషుడైనాడట. అన్నదానప్ప నిర్మల హృదయమువలె ఆబావి నీరుకూడ స్వచ్ఛముగా, అమృత సదృశముగా నున్నదని జనవాణి. కనుకనే ఆ వూరి మగువలందరూ ఎంత పొద్దయినను, వూరి వెలుపలనున్న ఆ బావివద్దకు వచ్చి నీరు తోడుకొని వెళ్ళుటకు విసుగుజెందెడివారుకారు.

మన బ్రాహ్మణుడు అన్నదానప్ప తోపువద్దకు వచ్చునప్పటికి

అచ్చటి బావిలో నీరు తోడుకొని వెళ్ళుటకై యిద్దరు సమవయస్కులైన తరుణీమణులు వచ్చినారు. ఎక్కువ అనినవారికి సుమారు యిరువది సంవత్సరముల వయస్సు వుంటవచ్చు. ప్రఫుల్లమైన వారి వదనములలో నవయౌవనోత్సాహములు ప్రతిబింబించుచున్నవి. ఒకతె శ్యామల శరీరి; మరొకతె గౌరవర్ణ! ఆమె వేషభాషలను, ముఖవర్చస్సునుబట్టి ఉత్తమకుల సంజాతయని చెప్పవచ్చును. సాధారణమైన చీరకట్టుకొని, కొప్పుముడివేసి, ఒకే ఒక్క ఎర్రగులాబీని ముడిలో పెట్టుకొన్నా. చూచుటకామె నిరాభరణ సుందరివలె కనుపించుచున్నది. లతవలె ఊగాడుచున్న ఆమె శరీరంలో యిప్పుడిప్పుడే యౌవనవాహిని ప్రవహించుచున్నది. మావిచిగుళ్ళవంటి సుకోమల శరీరంలో తారుణ్యం పొంగి పొరలుచున్నది. దాని కతిసాహసముతో నిర్మించిన కట్టవలె ఆమె వక్షస్థలము స్తనభారముతో కృంగుచున్నది. విశాలమైన ఆ ముఖములో అమరిన మీననేత్రములకు ఎంతటివారినైనా చూపుమాత్రములో ఆకర్షించ గల సమ్మోహనశక్తి గలదు ఆమె కనులు, ముక్కు, పెదవులు, బుగ్గలు నిర్మించడములో సృష్టికర్త చాలా జాగ్రత్త వహించినట్టు తోచుచున్నది. ఆమె మోములోనున్న అసాధారణమైన కాంతిని, సౌందర్యమును చూచి బ్రాహ్మణుడు క్షణకాలం నివ్వెరపోయి నిలువబడినాడు. 'ఈమె ఎవరో శాపగ్రస్తురాలై జన్మించిన దేవకన్య. చక్రవర్తిని చేబట్టుటకై పుట్టి యున్న రాజపుత్రి' అనుకొన్నాడు.

ఆ వైదిక బ్రాహ్మణుడు విస్మయనేత్రాలతో తననే రెప్పవేయక తిలకించుచూ నిలబడడమును చూచి సిగ్గుపడి ఆమె తనదృష్టిని చెలివైపు త్రిప్పి ఏమోసంజ్ఞ చేసినది. అది ఆమె కర్థమైనదో లేదో? నీరు తోడడ మును నిలిపి :

"పార్వతీ! నేను వెళ్ళుదునా లేక నీవూ వచ్చెదవా?" అని నవ్వినది.

"ఎందుకు నీలా, అంతతొందర?" స్నేహితురాలి ఆతురతను చూచి విస్మితురాలై అనినది పార్వతి.

"మా నాయనగారు భోజనానికి కూర్చొనియున్నారు. ఇంటిలో

మంచినీళ్ళులేవు. ఇక్కడికి పరుగున వచ్చినాను. ఆలస్యమైనచో వారు రాద్ధాంతం చేయుదురు !"

"ఒకేఒక్క క్షణము నీలా, నేసును వచ్చివేయుదును"

"నీవెక్కడ వచ్చేదవు ? ఉతుకుటకు బట్టలుకూడా తెచ్చియున్నావు ! అవి ముగియుటకు ఒక ఘడియసేపు కాగలదు"

"లేదు నీలా ! బట్టలన్నియు సిద్దప్పమడుగులో ఉతికి తెచ్చినాను. ఇచ్చట అన్నగారి ధోవతిమాత్రం మలుచుకొని వచ్చెదను. ఒకేఒక్క క్షణమాగుము వచ్చివేయుదును"

"నీకు బట్టలుతుకుటకుకూడా త్రాగునీరే కావలెనా ? ఒక బిందెనీటికి ఒక్కవరహా యివ్వవలె తెలుయునా పార్వతీ !" అని నీల నవ్వినది.

"ఏమైననూ నీవు సుంకపువారి యింటిబిడ్డవుకదా ! అందుకని మంచినీటికికూడా సుంకమడుగుచున్నావు" అన్నది పార్వతి.

ఇదివిని నీల నవ్వింది.

"పార్వతీ, నీవన్నట్టు నీటికికూడా పన్నువేసినచో ఎంతసొమ్ము వసూలుకాగలదు ? చెప్పుము చూతము ?"

"ఊరిలో వేయి యిండ్లున్నవి. ఇంటికి రెండుకడవల ప్రకారం లెక్కించిననూ ఒకరోజుకు రెండువేల కడవలనీరు ! కాని మీయింటికే రోజుకు పదికడవలనీరు కావలయును"

"లేదు పార్వతీ ! వంటకుమాత్రమే ఈనీరు. రోజునకు అయిదారు బిందెలయిన చాలు !"

"కానిమ్ము, నీ లెక్కప్రకారమే అయిననూ నెలకు వంద ఏభై బిందెలు, సంవత్సరానికి వేయి ఎనిమిది బిందెలనీరు—అప్పుడు మీరే వేయిన్నీ ఎనిమిదివందల వరహాలను యివ్వవలసి యుండును"

"దొంగా, నామాటను నాకే ఒప్పించుచున్నావా ? మేము సుంకము వసూళ్ళుచేయు యింటివారము తెలియునా ?"

"అయిననేమి ?"

"మేమున్నది సుంకము వసూళ్ళకేగాని, సుంకము చెల్లించుటకు

కాదు. పన్ను వసూలుచేయువారికి పన్నులేదు ! నీకు తెలియదా ?" అని మితుర్రాలిని నవ్వించి, ఆమెతోబాటు తనుకూడా నవ్వింది.

వారు తమ సరస సంభాషణలో నిమగ్నులైవుండడంవలన ఆగంతుకుడు తమనే ఆశాదృష్టితో రెప్పవాల్చక చూచుచూ యింకా నిలబడడమును వారు గమనించలేదు. వారు ఏదో మాట్లాడుకొనుచూ, తమ పనులలో లీనమైనారు.

పార్వతి గుడ్డనుపిండి. నీరు చేదుటకు లేవగా, ఆశాదృష్టితో తమనే చూచుచూ నిలబడివున్న బార్రిహ్మణుని దైన్యవదనం ఆమె కంట పడినది. అప్పుడామె చెలివైపు తిరిగి మెల్లగా అన్నది :

"వారెవరో తెలియదు. అప్పటినుండియు యిచ్చట నిలబడి యున్నారు. బహుశా వారికి నీరు కావలయునో ఏమో ?"

"బార్రిహ్మణులవలె వున్నారు. మనము తోడిన నీరు ముట్టుకొందురా ?"

"అది తర్వాత విషయము. ముందు వారికేమి కావలయునో అడుగుము !"

"నీవే అడుగుము !"

"నాకు సిగ్గుచున్నది"

"నాకునూ సిగ్గుచున్నది"

"నీవు సుంకపువారి యింటిబిడ్డవు. నాకంటెనూ ధైర్యశాలివి !" అని ఆగంతుకునివైపు తిరుగగా అతడే నోరుతెరచి అడిగినాడు :

"అమ్మాయీ ! కొంత నీరు కావాలయును"

పార్వతి నీల ముఖము చూచినది.

ఆమె ఆ చూపులోని అర్థము గర్రిహించి అన్నది :

. "స్వామీ, తమరు బార్రిహ్మణులవలె నున్నారు. మేము ముట్టిన నీరును.... ...." మాటను మధ్యలోనే ఆపినది.

"అమ్మాయీ ! నీవు ఏ యింటి బిడ్డవు ?" ఆగంతుకుడు కుతూహలముతో పర్రిశ్నించినాడు.

"సుంకమువారి శంకరమంత్రి కుమార్తెను !"

"పేరు ?"

"నీల !"

"అమ్మయ్యా ! నీవో ?"

"శిల్పి తిమ్మోజీగారి కుమార్తె పార్వతిని !"

"అమ్మా, నీవు శిల్పి సిద్ధాంత తిమ్మోజీ కుమార్తెవా ?" ఆశ్చర్యముతో అడిగినాడు ఆగంతుకుడు.

"ఔను స్వామీ ! వారిపేరు మీరెక్కడైనా విన్నారా?"

"వినుట మాత్రమే కాదమ్మా, ఆ ప్రతిభాశాలి యొక్క దివ్య శిల్పాలను కొన్నింటిని చూచు భాగ్యము కూడా నాకు లభించినది."

"ఎచ్చట చూచినారు?"

"వారు కట్టిన దేవాలయము లొకటి రెండు విజయనగరములో వున్నవమ్మా !" అనినాడు.

ఈ మాటలు విని నీల—"స్వామీ ! తమరిది విజయనగరమా?" అని అడిగినది.

"ఔనమ్మా !"

"అచ్చట మీరేమి చేయుదురు ?"

"రాజపౌరోహిత వర్గములోని వాడినమ్మా!"

"తమపేరు?"

"శ్యామాదీక్షితులు."

"ఇప్పు డెచ్చటికి వెళ్ళుచున్నారు ?"

"శ్రీశైల యాత్రకు బయలుదేరినాను."

"ఏకాకిగా కాలినడకతో బయలుదేరినారే?"

"క్షేత్రయాత్ర యిట్లు చేసిననే పుణ్యమమ్మా. దేహము శ్రమించనిదే స్వామి మల్లికార్జున-భ్రమరాంబల దర్శనము లభించగలదా?" అనినవ్వినారు శ్యామాదీక్షితులు.

"విజయనగరపు వారమనుచున్నారు, మీకు వీరప్ప దండనాయకులు తెలియునా ?" నీల ప్రశ్నించినది.

"వారికేమి పని తల్లీ?"

"వారు విజయనగర రాజుల సైన్యంలో పెద్ద దండనాయక పదవిలో నున్నారు వారి కుమారులకు కూడా కోటలో కొలువు గలదు."

"వారి పేరు ?"

ఎందుకో నీల పేరు చెప్పుటకు సంకోచపడినది.

"ఎందుకమ్మా అంతసంకోచము ?" దీక్షితులు విస్మితులై అడిగినారు.

"అతనిపేరు వీరన్నస్వామీ ! అతడు నీలకు కాబోవు భర్త" అనినది పార్వతి.

"అదియా విషయము ! ఈసారి విజయనగరము వెళ్ళినప్పుడు తప్పక వారి పరిచయము చేసుకొందునమ్మా ! మీసంగతికూడా వారికెరుక పరచెదను! వారికి అంతఃపురములో ఏమిపని?" మరల ప్రశ్నించినారు.

"అంతఃపుర రక్షణసైన్యంలో నున్నారు. అంతఃపురమునకు, ప్రభువులకు తగిన రక్షణనిచ్చుచూ కాపాడుట అతని పని"

"అయితే వారిని వెతికి పట్టుకొనుటకూడా ఏమియునూ కష్టతరమైన పని కాజాలదు"

శ్యామాదీక్షితు లీ విషయములన్నియునూ మాట్లాడుచునే పార్వతి యిచ్చిన కుండీ కడిగి శుద్ధిచేసి, ఒకటి రెండు కుండీల నీరు తోడుకొని కాలుచేతులను, ముఖమును ప్రక్షాళితం చేసుకొన్నారు. 'పంపాపతీ, మల్లిఖార్జునా' అని చెప్పుకొని, తన ఆయాసమును పరిహరించుకొన్నారు. చల్లని పన్నీటివలెనున్న ఆ నీటిని శరీరమంతటా ప్రోక్షించుకొన్న తర్వాత వారి ఆయాసము, దప్పి, బడలికలు సగము పరిహారమైనట్లు తోచినవి. దీనితో సేదదీర్చుకొని సుప్రీతుడై —

"అమ్మాయీ, ఈ బావిని త్రవ్వించిన పుణ్యాత్ములెవరమ్మా ?" అని ప్రశ్నించినాడు.

"అన్నదానప్ప అను ధర్మాత్ముడు స్వామీ !"

"అతని కడుపు చల్లగావుండనీ తల్లీ ! ఎండలో బడలికజెంది

దప్పిగొని వచ్చినాను. పుదిసెడు నీరు త్రాగిన తర్వాత నా ఆయాసమం తయు పరిహారమైనది. అతని వంశపు వారందరూ సుఖముగా వుండనీ ! అదే విధముగా మీ కడుపుకూడా చల్లగా వుండుగాక !" అని మన స్ఫూర్తిగా కోరుకొన్నారు.

"స్వామీ ! మీరు నీరు బాగున్నదని, వాటితోనే పొట్టనింపుకో వలయునని వున్నారా ? పరస్థలమునుండి వచ్చినారు. పైగా మధ్యాహ్నపు మండుటెండ. మా యింటికి వచ్చిన వంట కనుకూలము చేయగలము" అన్నది పార్వతి.

ఈ మాటవిని శ్యామాదీక్షితులు చకితులైనారు.

"మీకెందుకమ్మా, నావల్ల తొందర ?"

"ఏ తొందరయు లేదుస్వామీ ! ఆకలిగొని వచ్చిన బ్రాహ్మణు లకు ఒకపూట భోజన సదుపాయము చేసిన ఏ నష్టమూలేదు! ఇంకనూ పుణ్యం రాగలదు. మేము బ్రాహ్మలమై యుండిన, మీరు వంటచేసుకో వలసిన ప్రమేయమే లేదు. ఇప్పుడు విధిలేక మీకు తొందర కలుగజేయ వలసి వచ్చినది."

"అది తొందరేమీ కాదమ్మా. నేను యాత్రాసమయములో స్వయంపాకం తప్ప వేరేమియునూ భుజించుట లేదని వ్రతము పట్టినాను. మీరు నాకై ఏ శ్రమయునూ పడనక్కరలేదు. కృష్ణాజినపు పెట్టెలో వంటకు కావలసిన పాత్రలు-పదార్ధములు అన్నీ వున్నవి. నేను యిచ్చ టనే స్వయంపాకం చేసుకొందును. ఎట్లునూ యిచ్చట ప్రశస్తమైన మంటపము, బావియునూ వున్నవి. ఇక మీకు నావలన తొందర యెందు లకు ?"

"స్వామీ ! మీరెందుకో చాలా సంకోచ పడుతున్నారు. నన్ను మీ కుమార్తెగా భావించి, మా యింటికి రండు, ఆకలిగొని వచ్చిన బ్రాహ్మ ణులకు అన్నంపెట్టిన పుణ్యం రాగలదు. మీరు వంట చేసుకొను నట్ట యిన ఈ అసమయంలో, నిర్జనమైన తోపులో ఎందుకు చేసుకొనవలె ? మీకు కావలసిన ఏర్పాట్లన్నియున్నూ మా తండ్రిగారు సంతోషంతో

చెయ్యగలరు. మీరు దయయుంచి మా యింటికివచ్చి, బీదల ఆతిథ్యమును స్వీకరించి, కృపజూప వలయును. రానిచో నే నిచ్చటినుండి వెళ్లుటయేలేదు" అని పార్వతి చిరుకోపం నటించుచూ తాళ్ళిడు బిగించిన బిందెను బావి గడ్డమీద పెట్టినది.

ఇది చూచి శ్యామాదీక్షితులకే మనిపించినదో-

"అట్లే కానిమ్ముతల్లీ! నీవు అంత ఒత్తిడి చేయునట్టయిన మీ యింటికి భోజనమునకు తప్పక వచ్చెను. పంపాపతి ఈనాటి భోజన ఋణమును మీయింట పెట్టియున్నప్పుడు నే నెందుకు వద్దనవలె?" అని, తన కృష్ణాజినపు పెట్టె నెత్తుకొని పార్వతి ననుసరించివారు.

నీల తన యింటికి బయలుదేరగా పార్వతి-

"నీలా! నావలన నీకు ఆలస్యమైనది. క్షమించుము!" అని అన్నది.

"వీరు దారిలో అడ్డుపడినారని చెప్పిన,అప్పాజీగారు కోపపడరు. ఇంకనూ మిత్రుల వూరినుండి వచ్చిన వారని సంతోషపడగలరు. నీవు వీరిని మాయింటి కెప్పుడు పిలుచుకొని వచ్చెదవు?"

"వారినే అడుగుము."

"స్వామీ, మా పేద కుటీరమున కెప్పుడు దయచేయుదురు?"

"మీ కందరికీ నావలన తొందర ఎందుకు తల్లీ?"

"తొందర ఏమియును లేదు స్వామీ! మీ పాదధూళితో మా గృహం పావనము కాగలదు. అంతియేకాక మీరు శ్రీశైల యాత్రకయి బయలుదేరినవారు. ఈ విషయములన్నియునూ వినిన మా తలిదండ్రు లెంత సంతోష పడగలరు? సాక్షాత్తూ మల్లికార్జున స్వామియే తమ యింటికి వచ్చినాడని భావించెదరు. గనుక మీరు తప్పక మా యింటికి రావలయును."

"సరేనమ్మా.ఇచ్చటినుండి వెళ్ళుటకు ముందు మీ యింటికికూడా ఒకసారి వచ్చెదను."

నీల కనుమరుగైన తర్వాత దీక్షితులు-"మంచిపిల్ల" అని స్వగ

తం పలుకుకొన్నారు. అనంతరం, "అమ్మా, మీ తండ్రికెంతమంది బిడ్డలు!" అని పార్వతిని ప్రశ్నించినారు.

"ఒక అన్న వుండేవాడు స్వామీ! కొన్ని సంవత్సరాలక్రిందటనే అతడూ కన్నుమూసినాడు. ఇప్పుడు తలిదండ్రులకు కొడుకు, కొమార్తె, అన్నియునూ నేనే!" అని గతించిన సోదరుని తలచుకొని, భారంగా ఒక నిట్టూర్పు విడచినది.

"అయిన, శిల్పి సిద్ధాంతుల పేరు చెప్పుట కిప్పుడెవరునూ లేరా? వారి నిరుపమానమైన ప్రతిభ వారితోనే అంతరించి పోవలసినదేనా?" అని సానుభూతిని వ్యక్తపరచినారు.

ఈ మాట విన్న పార్వతి-

'ఆ పుణ్యం అప్పాజీగారు అడిగి రాలేదు స్వామీ! అప్పాజీగారి పేరు చెప్పుటకు సమర్థుడైన అన్నను యిచ్చినవాడే పుచ్చుకొన్నాడు. అన్నగారు అప్పాజీ కనుపాపవలె వుండినారు. అతని మరణం అప్పాజీగారికి తీరని లోటు—తరగని వ్యథ! ఈ సంఘటన అమ్మమీద మరింత ఎక్కువ పరిణామ కారియైనది. పది దీర్ఘ సంవత్సరములైనా యింకనూ ఆమె పుత్రశోకమునుండి కోలుకొనలేదు. గతించిన పుత్రుని తలచుకొని యింకనూ శోకించుచునే యున్నది. నాయనగారు మాత్రం తమ విద్యను శిష్యులకు పంచిపెట్టి, వారే తమ పేరును నిల్పగల బిడ్డలని నిశ్చింతులైనారు. అంతటి వైరాగ్య భావం అమ్మకెట్లు అబ్బగలదు? ఏమైననూ ఆమెది స్త్రీ హృదయం! ఆమెకు కలిగిన గాయం యిక యీ జన్మలో వాసి కా జాలదు" అని కన్నీళ్ళు కార్చినది.

"పోనీ, విడచిపెట్టు తల్లీ! ఎందుకు శోకించెదవు? మీ తండ్రిగారి శిష్యులలో ఎవరైననూ గురువు పేరు నిలుపునంతటి ప్రతిభాశాలి గలడా?"

"చాలామంది వున్నారు స్వామీ! వారిలోకెల్లా మల్లన్నమీద నాయనగారికి చాలా నమ్మిక గలదు. వారు తమ విద్యనంతయునూ అతనికి నూరిపోసినారు. అతనివలన తమ కీర్తి దేశములో నలుమూలలా విస్తరించగలదను నమ్మిక వారికి గలదు. మల్లన్నను శిష్యుడని భావిం

చక, కన్న బిడ్డవలె చూచుకొనుచూ, తమ పుత్రివియోగమును మరచి నారు."

"మల్లన్న ఎవరు ? అతడు మీ తండ్రికేమి కాగలడు ?"

"మల్లన్న మా మేనత్త కుమారుడు స్వామీ ! బాల్యములోనే తల్లి దండ్రులను పోగొట్టుకొని మా తండ్రి ఆశ్రియమునకు వచ్చినాడట-నాకు బుద్ధితెలిసినది మొదలు అతడు మాయింటనే వున్నాడు. అతనిని అప్పాజీ గారు పుత్రివాత్సల్యముతో పెంచుచూ వచ్చినారు. మల్లన్నకూడా వారిని తండ్రినిగానే భావించినాడు. అతనివలన తమ యిల్లు నిలువగలదని అప్పాజీగారు ఆశించినారు. మల్లన్న వారి నిరీక్షను వ్యర్థపరచడన్న నమ్మిక అందరికీ ఏర్పడినది. కాని........"

"కాని. ఏమిజరిగినది తల్లీ !"

"మల్లన్న ఒక పిచ్చి ప్రితినబూని, వూరూరూ తిరుగుచున్నాడు. అతనిని దారికి తీసుకొని వచ్చుటకు మీరు సాయపడగలరా ?" పార్వతి దైన్యముగా ప్రార్థించినది.

"నేను మీకెట్లు సాయం చేయవలయును ? నావలన మీకేపని కావలయునో నిస్సంకోచముగా చెప్పుము !"

"మీరు రాజపురోహితుల వర్గములోనివారని పెలవిచ్చినారు. కనుక విజయనగర ప్రిభువులతో తమకు చాలా దగ్గర పరిచయముండ గలదు. ప్రభువులతో మాట్లాడి తమరేవిధంగానైననూ మల్లన్నకు రాజా శ్రియం లభింపజేయవలయును ! అతని శిల్పచాతుర్యము, కళాప్రితిభలు వెలుగునకు వచ్చుట కవకాశమును కల్పించవలయును. ప్రిభువులచే కీర్తింపబడి, సన్మానము పొందనిదే తను యింటికి తిరిగి వచ్చుటలేదని ప్రితినబూని అతడిల్లు వదలి వెళ్ళినాడు. తండ్రిగారి ఈ వార్ధక్యదశలో అతడు మరల యిల్లు చేరునట్లు మీరు సహాయపడవలయును ! అట్లుచేసిన ఒక గృహమును నిలబెట్టిన పుణ్యము మీకు లభించగలదు"

"అంతియేకదా ? శ్రీశైలయాత్రి ముగించుకొని నేను విజయ నగరమునకు వెనుదిరిగి వచ్చిన వెంటనే ఈపని చేయగలను. అప్పటికి మల్లన్నను రాజధానికి పంపు ప్రియత్నము చేయుము. ప్రితిభాశాలులైన

కళాకారులకు ఆశ్రియమిచ్చుటకు దేవరాయ ప్రభువులెప్పుడూ వెనుకాడరు ; ఆ విషయమై నీవు చింతించ వనిలేదు"

అని దీక్షితులు పార్వతికి మాట యిచ్చినారు.

మాటలలోనే వారు తిమ్మోజీ యింటిని సమీపించినారు. పార్వతి త్వరగా లోనికివెళ్ళి తండ్రిని తీసుకొని వచ్చి దీక్షితులను పరిచయం చేసినది. తిమ్మోజీ దీక్షితులను విశ్వాసముతో లోనికి పిలుచుకొనిపోయి అతిథి సత్కారము చేసినాడు. శ్యామాదీక్షితులు తిమ్మోజీని చూచి, విశ్వకర్మయే ఎదుటవచ్చి నిలబడినట్టుగా భావించినారు. ఆ భావోన్మాదముతో మైమరచిపోయినారు.

# శ్వశుర వరణము

## 2

ముద్గల్లు శిల్పసిద్ధాంతి తిమ్మోజీ పేరు విననివారు ఆ ప్రాంత్యములో అరుదు. శిల్పకళలో కణాచార్యుని దక్షిణ సాంప్రదాయమును జీవంతముగా నిలుపుకొనుచూ వచ్చిన వ్యక్తి అతడని ప్రజాసామాన్యులు మొదలు ప్రభువులవరకూ అనుకొనుచుందురు. అతడు బీదరికములోనే పుట్టి, బీదరికములోనే పెరిగి, బీదతనమునే యిప్పుడునూ అనుభవించుచున్నాడు. కావలయుననుకొన్న అతడు తన శిల్పకళతో శ్రీమంతుడుగా పేరుగాంచి యుండవచ్చును. కాని దైవదత్తముగా అలవడిన తన కళను ఆత్మానందమునకు సాధన చేసుకొన్నాడేగాని, ఉదరపోషణకు దాని నుపయోగించుకొనలేదు. అత డల్పసంతోషి ; సరళజీవనమే అతని జీవనసూత్రము. 'రేపెట్లు ?' అని అతనెప్పుడునూ చింతించెడివాడు కాదు. ఆపూటకు లభించినది భగవత్ప్రసాదమని స్వీకరించి, అంతటితోనే

సంతృప్తి బొందువాడు. అతనికి కీర్తి కండూతిలేదు. అయిననూ కీర్తి అతని విడువలేదు.

అతని కళాశ్రీతిభను, శిల్పచాతుర్యమును చూచి చాలామంది మాండలీకులు, దండనాయకులు, శ్రీమంతులు, కళాభిమానులు నివ్వెర పోయినారు. వారతనిచే గుడి, గోపురములను నిర్మింపజేసి, ధనకనక వస్తువాహనాదులచే అతనిని సన్మానించినారు. తిమ్మోజీ వాటిలో తన కవశ్యమైనంత మాత్రము స్వీకరించి, తక్కిన దంతయు తనతో కష్టించి పనిచేసిన పనివారలకు ఉదారముగా పంచిపెట్టెడివాడు. తనకు యిచ్చిన భూదానమును దేవాలయములకు దత్తంచేసెడివాడు. కనుకనే అతని ఔదార్యపు కీర్తి చాలాదూరము పాకినది.

ఇదివిని విజయనగర రాజు లతనిని తమ రాజధానికి రప్పించుకొని అతనిచే అనేకములైన శిల్పాలను, దేవాలయములను నిర్మింపజేసినారు. రాజాశ్రయంలోనే వుండియుండిన అతడిప్పటికాక గొప్ప శ్రీమంత శిల్పివలె లెక్కకువచ్చి యుండెడివాడు. కాని తను ప్రజా శిల్పిగా జీవించవలెనని అతని ఆశయము. కనుకనే రాజాశ్రయమును విడచి ఒకచోట స్థిరముగా నిలువక, పక్షివలె ఊరూరా తిరిగి అనేక నూతన దేవాలయములను నిర్మించినాడు. పురాతన దేవాలయములను పునరుద్ధరించి తన శిల్పకలను సత్పాత్రులకు ధారబోయదలచి యిప్పుడు వార్ధక్యదశలో తన స్వగ్రామమైన ముద్గల్లుకు వచ్చి చేరినాడు. సమీపపు పల్లెలోనున్న పొలమునుండి జీవనమునకు కావలసినంత ఆహార ధాన్యం వచ్చెడిది. అతనినుండి శిల్పకళను నేర్చుకొంటున్న శిష్యులిచ్చు కానుకలు, అతని శిల్పాలను మెచ్చి శ్రీమంతులు — తదితర కళాభిమానులు యిచ్చెడి సంభావనలతో ఉదర నిర్వహణ జరిగి పోయెడిది. అతడెప్పుడూ దేనికీ చింతించినవాడు కాడు. అతని జీవితము సుఖ-శాంతుల కాలవాలమైనది.

కాని తిమ్మోజీ ప్రవర్తన అతని భార్య గౌరాంబకు సరిపడలేదు. భర్త సంపాదించునప్పుడు ధనమును కూడబెట్టక బీదలకు పంచిపెట్టి వట్టి చేతులలో వుండుటను ఆమె సహించలేక పోయినది.బాగా జరుగునప్పుడు

కొంత మిగిల్చుకొనక పోయిన వార్ధక్యంలో ఎవరూ తమకు సాయపడ రని ఆమె భర్తకు పలుమారులు చెప్పిచూచి విఫలురాలైనది. ఆమె బుద్ధి మాటలు తిమ్మోజీ చెవికెక్కలేదు. అతడు రేపటికెట్లను భార్య కళవళ మును చూచి హాస్యము చేయుచుండెడివాడు. ఎన్నియోమారులీ విషయమై భార్యా భర్తలమధ్య తగవు లేర్పడుచుండెడివి.

చివరకు భార్య సంకుచిత బుద్ధికి విసిగి తిమ్మోజీ అనెడివాడు —

"గౌరా, భగవంతుడు మనకేమి తక్కువ చేసినాడని మనము చేయి బిగపట్టుకొనవలె? ఇచ్చువాడతడు, తీసుకొనునదీ అతడే! ఈ చేత యిచ్చి, ఆచేతితో తీసుకొని, మనతో దాగుడు మూత లాడుచున్నాడం తియే. దీనిని మనమాచరించు చున్నామనుకొనుట మూర్ఖత్వం - అవి వేకం."

"నా మాట మీకు మూర్ఖత్వమని తోచిననూ చింతలేదు. రేపు బిడ్డలచేతికి మీరు చిప్ప నిచ్చుటను మాత్రము నేను సహించలేను."

"బిడ్డల శ్రేయస్సుపట్ల నాకు ఆసక్తి లేదనుకొనుచున్నావా? భగ వంతుడు రెండు నేత్రములవలె మనకొక మగబిడ్డను-ఆడుబిడ్డను ప్రసా దించినాడు. వీరిద్దరి కొరకయి నేను ధనమును కూడబెట్టవలయునా? ఈ బిడ్డలుమాత్రి మెవరు? మన పిల్లలను భ్రమయున్నంతవరకూ మన అహంకారము చావదు. వాస్తవముగా మన మందరమూ దేవుని బిడ్డలం. తన బిడ్డలను భగవంతు డెప్పుడూ చేయి విడువడు. ఉపవాసములకు గురిచేయడు. ఇక వారికొరకై మనమెందుకు చింతించవలె!" అని చెప్పెడి వాడు. చేతికెదిగి వచ్చిన కుమారుడు మరణించిన తర్వాత తిమ్మోజీ వైరాగ్యం మరొక మెట్టు ఉన్నతి నందుకొన్నది. "ఎక్కడి బిడ్డలో, ఎక్కడి భార్యయో? అంతా వట్టి భ్రాంతి! సంసారమే ఒక స్వప్నం, స్వప్నవ్యాపారమువలె జీవితములోని సుఖదుఃఖాలను పరిగణించ వల యునేకాని, వాటినే నిజమని నమ్మి మనసు చెరపుకొనరాదు!" అని తనకు తానే సమాధానం చెప్పుకొనేవాడు. కాని, ప్రాపంచికురాలైన గౌరాంబ కింతటి వైరాగ్యభావ, నిర్లిప్తతలు ఎట్లు వస్తాయి?

ఆమెకు భర్త పరిష్కరించరాని సమస్యగా తయారైనాడు. భర్తను నమ్ముకొన్న తమ సంసార శకటం పల్టీ కొట్టగలదని గ్రహించడంవల్ల

ఆమే స్వయంగా కుటుంబ నిర్వహణా భారాన్ని భుజముమీద వేసు కొన్నది. ఆమె వ్యవహార దక్షత వలననే పెద్దలచే ఆర్జింపబడిన యిండ్లు వాకిండ్లు, భూములు యింకా వారి చేయి జారిపోలేదు. తిమ్మోజీ ఆర్జన బాగా జరుగుతూ వుండిన రోజులలో కుమార్తెకు వెండి-బంగారు నగలు యథేచ్ఛగా చేయించి పెట్టుకొన్నది. ఆపత్కాలములో అక్కరకు వచ్చు టకై ఒక గుప్తనిధిని కూడా సమకూర్చి పెట్టినది. గౌరాంబ లౌకికజ్ఞానం వలన వారి సంసారము దేనికీ తక్కువలేకుండా జరుగసాగినది.

కాని, యిప్పుడు తిమ్మోజీ జీవితంలో వూహించని మార్పులెన్నో జరిగినవి అతని శరీరంలో యిప్పుడు మునుపటి శక్తి లేదు. మనస్సుకు కూడా మునుపటి ఉత్సాహం లేదు. యౌవనంలో క్రొత్త క్రొత్త నిర్మాణ పథకములను వేసుకొని ఒక వూరినుండి మరొక వూరికి, పగలు-రాత్రి అనక తిరిగి తిరిగి, నల్లరాతిలో సౌందర్యమూర్తులను సృష్టించే మహ త్కార్యంలో మగ్నుడైన అతని చేతనమునకు నడుప్రాయంలోనేముదిమి ఏర్పడినది. ఇదివరకూ ఒకరోజులో చేస్తూవుండిన పనికి యిప్పుడు మాసంరోజులు కావలసి వచ్చినది. మునుపటివలె యిప్పుడు సుదృఢ ముగా ఉలిని పట్టుకొనుటకు గూడా సాధ్యము కావడములేదు. కనుచూపు కూడా మందగించినది. అందుచే అతని కిప్పుడు క్రొత్త నిర్మాణ కార్య ములు లభించుటలేదు. ఒకవేళ లభించినా సమర్థతతో నిర్వహించు టకు శక్తిలేదు. శిల్పకళలో ఆసక్తిగల పదునెనిమిదిమంది పిల్లలు మాత్రము అతనివద్ద తిరుగాడు చున్నారు. తిమ్మోజీ తను నేర్చిన విద్యను నిష్పక్షపాతంతో అభ్యర్థులకు నేర్పెడివాడు. గురుదక్షిణ క్రింద వారి చ్చినది సంతోషంగా స్వీకరించెడివాడు — అది ధనమైనాసరే,ధాన్యమైనా సరే। ఏమీ లేనివారు కృతజ్ఞత కనబరచిన చాలు. అంతటితో గురు దక్షిణ ముగుస్తూ వుండేది. ఈ విధంగా అతని యిల్లు ఒక గురుకుల మైనది. తిమ్మోజీ ప్రతిభ, పాండిత్యము, అనుభవాలను విన్న పర్రిజలు అతనివద్ద శిష్యత్వం స్వీకరించి, తాము తిమ్మోజీ శిష్యులమని సగర్వ ముగా చెప్పుకొంటూ వుండేవారు.తన అనంతరం తను విడచివెళ్ళుచున్న ఆస్తి ఈ శిష్య సంపదయేనని, అతడు తన శిష్యులను గురించి గొప్పగా చెప్పుకొంటూ వుండేవాడు.

వీరేకాక. దేశపు పలుతావులనుండి పెద్ద పెద్ద శిల్పులు కూడా తిమ్మోజీని సందర్శించి. సమాలోచనలు జరుపుటకై వచ్చెడివారు. దేవాలయాల నిర్మాణ విషయంలో వారికి అడ్డుతగిలిన సమస్యలను తిమ్మోజీతో చెప్పి పరిష్కరించుకొంటూ వుండేవారు. గర్భగుడి, సుఖనాసి, నవరంగ, కల్యాణ, ముఖమంటపాల సూక్ష్మరచనలో వారికి కలిగిన సందేహాలను నివారించుటకు తిమ్మోజీ అసాధారణ మేధాశక్తి సదా అక్కరకు వచ్చెడిది. పెద్ద పెద్ద దేవాలయాల రూపచిత్రాలను చిత్రించుకొని వెళ్ళుటకు పేరుగాంచిన శిల్పులూ,చిత్రకారులూ ముద్గల్లుకు యాత్ర వచ్చెడివారు. కనుకనే తిమ్మోజీ ఆ ప్రాంత్యమున కంతటికీ 'శిల్పిసిద్ధాంతి' అను విశేష గౌరవమునకు పాత్రుడైనాడు. అందరూ అతనిని ఆ పేరుననే పిలువసాగినారు. తిమ్మోజీ యీ పనులన్నిటి నడుమ ఎప్పుడైనా విరామం లభించినచో దానిని సద్గ్రంథ పఠనంలో గడిపేవాడు. మునుపటినుండి గ్రంథపఠనా వ్యాసంగ మతని జీవితములో ఒక భాగముగా పరిణమిస్తూ వచ్చినది. అది కేవలం వ్యాసంగం మాత్రమేకాక, జీవితమునకొక నిండుదనమును చేకూర్చే జ్ఞాన సంపాదనకు మార్గదర్శియైనది. శిల్పకళలో ఆతనికిగల ఆసక్తి సద్గ్రంథ పఠనానికి దారి చూపినది. ఈ వ్యాసంగమును అభివృద్ధి పరచిన కొలదీ కళా, సాహిత్య, శాస్త్ర,పురాణములతకని మనస్సును చెరగొన్నవి అందులో ధార్మిక సాహిత్యగ్రంథములు—ముఖ్యముగా హరి హరుని 'గిరిజాకల్యాణము', శివచరణుని 'రగడ' లు అతనికి చాలా ప్రియకరమైనవి. వీటిలో ఎన్నో రగడలు అతనికి కంఠోపాఠమైనవి. ఆ భక్త శ్రేష్ఠుల దివ్య జీవనము చదివిన కొలదీ తనూ వారివలె కావలెనన్న కోరిక జనించేది. వారి జీవితములో సమ్మిశితమై వచ్చిన భక్తి; జ్ఞాన; వైరాగ్యములు తిమ్మోజీకి తెలియకనే, అతని జీవితం మీద మహత్తర పరిణామమును కలుగజేసినవి. అందువలననే అతడు ఎదిగివచ్చిన కొడుకు, కుమారస్వామి గతించినప్పుడు, జీవితమును ఏవగించు కొనక, అంతా భగవంతుని మీదవేసి, నిర్లిప్త భావంతో గడుపగలిగినాడు.

కుమారస్వామి-పార్వతులు తిమ్మోజీకి యౌవనపు చరమాంకములో పుట్టినవారు. వారనిన అతనికి అమితమైన ప్రేమ ; వారికిముందు

నలువురేవురు పిల్లలుపుట్టి చనిపోయినారు. అందువలన ఆ పిల్లలిద్దరూ వారి సర్వస్వము. పార్వతికి పది, కుమారస్వామికి పదునారు సంవత్సరములు వచ్చునప్పటికి విధి వారి సంతోష భాండమును వ్రయ్యలు చేసినాడు.

కుమారస్వామి ఏదో పండుగకని మిత్రుల యింటికి వెళ్ళి తిరిగి వస్తూ జ్వరమును వెంటబెట్టుకొని వచ్చినాడు. రాగానే మంచం పట్టి పడుకొన్నవాడు మరల లేవలేదు. ఆ విషమ శీతజ్వరముతో బాధపడి చివరికొక రోజు కన్నుమూసినాడు. తలిదండ్రులుచేసిన దానధర్మములు, మొక్కులు, ఔషధోపచారములు ఒక్కటీ అక్కరకు రాకపోయినవి. తన యిహలోక ఋణము తీరినదన్నట్టుగా, అతడు తల్లిదండ్రులనూ — చెల్లినీ కన్నీటి కడలిలో ముంచి శివసాయుజ్యమును చెందినాడు. ఇది వారికొక పూరించరాని నష్టం ! సహించరాని సంతాపం.

తిమ్మోజీ స్వభావతః వైరాగ్య పరుడు కావడము వలన యీ దెబ్బను దైవచింతనతో మరచిపోయినాడు. కాని గౌరాంబకు మాత్రం కుమారుని పోగొట్టుకొన్న తర్వాత ప్రపంచమే శూన్యముగా గోచరించినది. కాలము గడచిన కొలదిని చూచుటకామె దుఃఖ ముపశమనమైనట్టు కనబడిననూ, హృదయాంతరాళంలో ఆ పుత్రశోకాగ్ని యింకా నివురుగప్పి నిలచియే యున్నది. ఎంత ప్రయత్నించినా దాని నామె మరువలేకపోయినది. లోలోపలనే అది జర్ఝరితము సేయ సాగినది.

ఇప్పుడామెకు తన చింతను మరువడానికి పార్వతియే ఏకైక సాధన మైనది. ఆ తలిదండ్రులు పార్వతిని క్షణకాలం విడువక, ఆమె అభ్యుదయ చింతనలో తమ దుఃఖమును మరువ ప్రయత్నించినారు. పార్వతి వారి కనుపాపవలె నుండిన దిప్పుడు హృదయమునుకూడా ఆక్రమించుకొన్నది. బాలగా నుండిన పార్వతిలో ఇప్పుడు యౌవనము తొంగిచూచినది. ఇప్పుడామె నవయౌవని. ఆ తలిదండ్రులకిప్పుడు ఒక నూతనమైన చింత — పార్వతీ పరిణయమును గురించిన చింత — బయలు దేరినది. పెండ్లిచేసిన, పార్వతిని దూరముగా పంపవలసి

యుండునని తల్లి గౌరాంబ వ్యథజెందసాగినది. కాని పెండ్లి చేయక కుమార్తెను యెంతోకాలము యింటపెట్టుకొనుటకు సైతం సాధ్యము కాదు. సరియైన వయసులో కుమార్తెకు పెండ్లిచేసి, ఆ మూలంగా వంశమును వృద్ధిపరుప వలెనన్న తల్లిదండ్రుల పవిత్ర కర్తవ్యమును వారు తప్పక నిర్వహించ వలసి యున్నది. తాము బ్రతికియుండగనే ఆమె జీవితములో ఒక దారికి వచ్చుటను చూడవలెనన్న ఆశకూడా గలదు. ఈ విధంగా పార్వతి వివాహమును గురించిన ప్రశ్న వారికి విడివడ రానిదై యున్నప్పుడు, దానికి పరిష్కారమన్నట్టుగా మల్లన్న తిమ్మోజీ మనఃఫలకంమీద ప్రతిబింబించినాడు.

మల్లన్న బాల్యంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొని అనాథయై తిమ్మోజీ-గౌరాంబల ఆశ్రయమునకు వచ్చినాడు. అతని తండ్రికి విజయనగరసైన్యంలో పనివుండేది. అతడు సైన్యానికి కావలసిన ఖడ్గము, కవచము, ఈటె, బల్లెము యిత్యాది ఆయుధములను తయారించి యిచ్చే కమ్మరివాడుగా నుండినాడు. ఈ పనిలో అతనికి చేతినిండుగా డబ్బు లభించెడిది. కాని విజయనగర రాజులకు బహమనీసుల్తానులతో జరిగిన యుద్ధంలో అతడు మరణించినాడు. భర్త మరణించగానే అతని భార్య పెద్దలు సంపాదించిన పొలము, ఇల్లు వున్న ముద్గల్లుకు వచ్చిచేరినది. యుద్ధమునకు భర్త బలిఅయినట్టుగా కుమారుడు మల్లన్నకూడా యుద్ధదేవతకు బలికాకూడదని ఆశించి, అతనికి శిల్పకళలో శిక్షణ నిప్పించ వలెనని అనుకొన్నది. కాని ఆమె దురదృష్టమునకు ముద్గల్లు విజయనగర బహమని రాజ్యముల వివాదగ్రస్తమైన భూమియైనది. మరల దానికొరకై ఇమ్మడి హరిహరుడు, మహమద్ షాహలకు యుద్ధం జరిగి, ముద్గల్లు విజయనగరరాజుల చేయితప్పి బహమనీ రాజ్యమునకు చేరినది. అచ్చట ముస్లిం సైనికులు శత్రువులమీద (హిందువులమీద) జరిపిన అత్యాచారమునకు బలియై మల్లన్న తల్లికూడా మరణించినది. మల్లన్న దిక్కులేని వాడైనాడు. అప్పుడతడు తనకుగల ఏకైక బంధువైన తిమ్మోజీ ఆశ్రయమునకు వచ్చినాడు. అప్పటినుండి తిమ్మోజీ-గౌరాంబలే తల్లిదండ్రులై నిల్చి అతనిని పెంచి పెద్దవానిని చేసినారు.

ఈ సమయంలోనే కుమారస్వామి మరణించినాడు. పుత్రశోక విహ్వాలులైన వారికి అనాథబాలుడైన మల్లన్నయే కుమారు డనిపించు కొన్నాడు. అతడు వారి నిరీక్షను వ్యర్థపరచలేదు. కేవల మిరువదేండ్ల ప్రాయంలోనే శిల్పవిద్యలో పరిణతుడై, ఆ ప్రాంతమున కంతటికీ 'శిల్పశ్రేష్ఠు' డను పేరు సంపాదించినాడు. తిమ్మోజీ పేరు నిలుపగల వాడొక్క మల్లన్నయేనని ప్రజ లనుకోసాగినారు. శిల్పవిద్యలో అతనికి గల అసాధారణ శక్తి-సామర్థ్యములను చూచి, తిమ్మోజీ తను చిర కాలంగా వెతుకుచూ ఉండిన శిష్యుడతడేనని గ్రహించి, తన విద్యనంతా అతనికి ధారబోసి, అతనిని ఉత్తమోత్తముడైన శిల్పినిగా తయారుచేసి నాడు. ఇప్పుడు పార్వతి పెండ్లి విషయమై మాటలురాగా తన అభిమాన పుత్రుడూ-చెల్లెలి కుమారుడూ, తన విద్యకు ఉత్తరాధికారియూ అయిన మల్లన్నకే కుమార్తెనెందుకు యివ్వగూడదన్న ఆలోచన కలిగినది.

పార్వతిని చేపట్టుటకు మల్లన్న అన్నివిధముల అర్హుడు. అతనికి విద్య, రూపము, యౌవనము అన్నీవున్నవి. పైగా మంచి గుణము, సత్ప్రవర్తన గలిగినవాడు. అటువంటివానికి బిడ్డనిచ్చిన సత్పాత్రునికి ధారబోసినట్టుకాగలదు. అంతేకాక, పార్వతిని దూరముగా పంపివేయ వలసిన ప్రమేయముకూడారాదు. తమ ముద్దులబిడ్డ తమ కనులముందే వుండగలదు. పైగా బాల్యమునుండి పార్వతి మల్లన్నను ప్రేమిస్తూ రావ టంకూడా తిమ్మోజీకి తెలుసు. ప్రేమించిన వ్యక్తినే ఆమె చేపట్టిన జీవి తం సుఖ-సంతోషముల కాలవాలము కాగలదని తిమ్మోజీ భావించినాడు. కాని ఈ విషయమును భార్యతో ప్రస్తావించగా ఆమెనుండి నిరుత్సాహ కరమైన ఉత్తరమే వచ్చినది. గౌరాంబ కెందుకో రాజపుత్రికవలెనున్న పార్వతిని దిక్కు-లేని పరదేశివలెనున్న మల్లన్న కిచ్చుటకు యిష్టంలేదు. పార్వతివంటి కన్యారత్నమును చేబట్టుట కతడనర్హుడని ఆమె భావన ! కుమార్తె నెవరికైనా శ్రీమంతుని కివ్వవలెననివున్న గౌరాంబ వెనుక ముందు లాలోచించక తిమ్మోజీ సలహాను తిరస్కరించినది. భార్య మాట లతనికి నిరాశను కలిగించినా, అతడీ విషయములో ఆమెను ఒత్తిడి చేయలేదు. సంతోషంతో జరుగవలసిన వివాహమంతటి మంగళ

కార్యంలో గౌరాంబ కన్నీరు కార్చడమతనికి కిష్టములేదు. అంతేకాక అతడు మొదటినుండి భార్యకు వ్యక్తిస్వాతంత్ర్య మిచ్చినట్టే-విచార స్వాతంత్ర్యమును కూడా యిచ్చినాడు. ఆమె యిష్టమునకు విరుద్ధముగా నడచుట కతడు సిద్ధపడలేదు. కాని అతడు తన హృదయాంతరాళములో పార్వతికి మల్లన్నయే తగిన వరుడని నిర్ణయించినాడు. ఎప్పుడో ఒక రోజు తన భార్యాకూడా ఆమె తప్పును గ్రహించి, అందుకై పశ్చాత్తాప పడి, మల్లన్నా-పార్వతుల వివాహానికి సమ్మతించగలదనే ఆశాలేశం అతనిలో అణగారిపోలేదు.ఆ సుదినము త్వరగా రావలెనని కోరుకొంటూ అతడు పార్వతి వివాహ విషయమై తొందరపడి ఏ నిర్ణయమూ చేయక, దానిని తాత్కాలికముగా మరికొన్నాళ్ళు ముందుకు వాయిదా వేసినాడు. కాని రోజులు గడచినకొలదీ పార్వతి వివాహ సమస్య విడివడుటకు మారు మరింత జటిలము కాసాగినది.

తను పార్వతిని చేపట్టడము గౌరాంబ కిష్టములేదని మల్లన్నకు సైతం తెలియక పోలేదు. ఇంటిలో జరిగెడి చర్చలన్నీ పార్వతి మూలం గా అతనికి తప్పక తెలుస్తూ వుండేవి.

మల్లన్న-పార్వతులు బాల్యంనుండి పరస్పరం ప్రేమించుకొంటూ వచ్చినవారు. వారు అక్షరములు నేర్వకమునుపే ప్రేమపాఠములు నేర్చు కొన్నారు. మల్లన్న తల్లిదండ్రులులేని అనాధ యని అతనిపట్ల పార్వతి కొకవిధమైన ఆదరము. అతడు శిల్పకళలో ప్రతిభావంతుడని మరొక వైపు అభిమానము. ఇవి రోజులు గడచిన కొలది, ఆమె చిన్ని హృద యములో అనురాగ బీజమును నాటినవి. తిమ్మోజీ ప్రోత్సాహపు జలా లతో వారి ప్రేమలత సొంపుగా పెరిగినది. తమ ఉభయుల ప్రేమ సఫల మగుటకు తల్లి గౌరాంబ అడ్డు రాగలదని వారనుకోలేదు. ఆమె అడ్డు రానడముతో యిప్పుడు వారికి కలిగిన నిరాశ చెప్ప సాధ్యము కానిది.

మల్లన్న అనాధ బాలుడై యింటికి రాగా గౌరాంబ అతనిని ఆద రించి తల్లివలె చూచినది. కాని, అతడు పార్వతిని పెండ్లాడు సంగతి తెలియగా అప్పుడామె ప్రతిఘటించినది. ఈ విధముగా జరుగ గలదని తెలిసియుండిన ఆమె మల్లన్నకు తన యింటిలో వుండుటకు అవకాశమే

యిచ్చి యుండెడిదికాదు. ఆమెకు తనకుమార్తె దిక్కులేని అనామధేయుని వివాహమాడుట ఏమాత్రిమునూ యిష్టములేదు. భాగ్యవంతుని భార్యయై, ఎనలేని సుఖభోగాలను అనుభవించ వలసిన తన కుమార్తె నిర్గతికుడైన మల్లన్నను చేబట్టి ఆమరణ పర్యంతమూ దారిద్ర్యపుటగ్నిచే దహింప బడడము ఆమె కిష్టములేదు. పార్వతిని మల్లన్న కిచ్చుటనిన చిలుకను ప్రేమగా పెంచి, పిల్లిపాలు చేసినట్టేనని అనెడిది. ఇంతవరకూ వారుభయులూ కలసి పెరుగుట కవకాశ మివ్వడమే తప్పైనది. ఇక తను జాగ్రత్త వహించనిచో. యౌవనపు పొంగులో వారిద్దరూ తొందరపడి తన పన్నుగడను ఫలించకుండా చేయగలరని కొంత చింతించసాగినది. ఇప్పుడామె సర్వదా పార్వతి మీద ఒక కన్నువేసి వుండసాగినది. సాధ్యమైనంత వరకూ పార్వతి మల్లన్న కంటపడకుండా జాగ్రత్త వహించినది.

కాని ఒకే యింటిలో వున్నమీదట వారు పరస్పరం చూడక,మాట్లాడక పోవడమెట్లు ? ఇది అసంభవమని తెలియడం వలన గౌరాంబ సాధ్యమైనంత తొందరగా పార్వతి వివాహమునునెరవేర్చుటకు ఉత్సుకురాలైనది. అయినా అనురూపుడైన వరుడు మాత్రిం లభించలేదు. యీ విషయంలో తిమ్మోజీ పూర్తిగా నిరాసక్తుడైనాడు. వరాన్వేషణకై భర్తకు చెప్పవలసినంతా చెప్పి విసిగి, యిప్పుడు గౌరాంబయే ఆ పనికి పూనుకొన్నది.

ఆమె కోరిన అర్హతలు గల శ్రీమంతులైన యువకులు యింకా ఆమె కంటపడలేదు. కనుకనే పార్వతి వివాహం వాయిదా పడుతూ వస్తున్నది.

ఇంతటి విరుద్ధ వాతావరణములో మల్లన్నకు యింటనుండుటకు మనస్కరించక పోయినది. ఇల్లు విడచిపోవలయునని అనుకొన్నా.తనను ప్రేమతో పెంచి, విద్యాబుద్ధులు గఱపిన తిమ్మోజీని, ప్రాణముకంటే అతిశయముగా నున్న పార్వతినీ విడచి వెళ్ళుట కతనికి కష్టమైనది. కాని, స్వాభిమానియైన అతనికి గౌరాంబ ప్రవర్తన - పలుకులు దుస్సహములైనవి తను నిర్గతికుడన్న కారణంతో పార్వతిని తనకిచ్చుటకు

గౌరాంబ నిరాకరించు చున్నదని ఖచ్చితముగా తెలిసినది. ఏవిధముగా నైనా తను కీర్తి ప్రతిష్ఠలనూ, అధికార సంపదలనూ కలిగి, సమాజ ములో గణ్యవ్యక్తి యైనచో అప్పుడు గౌరాంబ సంతోషముగా తనకు కుమార్తె నివ్వగలదని భావించి, అతడు గృహపరిత్యాగమునకు సిద్ధు డైనాడు. ఒకరోజు ఎవరికీ చెప్పక ఇల్లువదలి, తన అదృష్టమును పరీ క్షించు కొనుటకయి బయలు దేరినాడు.

మల్లన్న ఎందుకు యిల్లు వదలి వెళ్ళినాడన్నది అతడు వ్రాసిపెట్టి వెళ్ళిన ఉత్తరంవల్ల స్పష్టమైనా, అతడెచ్చటికి పోయినాడనునది ఎవరికీ తెలియదు. ఒకటి, రెండు సంవత్సరాలు గడచిపోయినా అతని ఆచూకీ ఎవరికీ తెలియకనే పోయినది. కాలక్రమేణా మల్లన్న కీర్తి విఖ్యాతులు నలుదిక్కులకూ ప్రాకి, మెల్లగా ముద్గల్లును కూడా చేరినవి. ఇప్పుడతడు ముద్గల్లు సమీపంలో ఒక శివాలయ నిర్మాణ కార్యంలో నిమగ్నుడై వున్నా డన్న వార్త వచ్చినది.

మల్లన్న తన అజ్ఞాతవాస కాలంలో దేశపు నలుమూలలా సంచ రించి, అనేక దేవాయతనములను నిర్మించినాడు. అందువల్ల అతనికి, తను కోరినవన్నీ లభించినవి. అమితమైన ధన సంపాదన చేసినాడు, కీర్తి ప్రతిష్ఠలార్జించినాడు. వీటి నన్నిటినీ గురుదక్షిణగా సమర్పించి, తిమ్మోజీ ఆశీర్వాదమును పొంది, పార్వతిని చేబట్టాలన్న కలగంటు న్నప్పుడే ముద్గల్లుకు పదిమైళ్ళ దూరంలో నున్న సోమలాపురమను పల్లెలో ఒక శివాలయ నిర్మాణ కార్యమున కతనికి పిలుపు వచ్చినది. దానిని ముగించుకొని ముద్గల్లుకు వచ్చి, జీవితంలో ఒక స్థిరత్వానికి రావ లయు ననుకొన్నాడు.

ఇకంతా కొన్ని మాసాలకాలం శ్రమించి పనిచేసిన శివాలయ నిర్మాణ కార్యం పూర్తి కాగలదు. అనంతరం తనూ—పార్వతి,శివ-పార్వ తులవలె లెక్కలేనన్ని సుఖ భోగాలనుభవింపవచ్చు....ఈ విధముగా అతడు కలగాంచ సాగినాడు.

మల్లన్న సోమలాపురములో కోవెల నిర్మాణ కార్యమునకు పూను

కొనియున్న సంగతివిని, తిమ్మోజీ పార్వతిని వెంటబెట్టుకొని వెళ్ళి హఠాత్తుగా అతనిని సందర్శించినాడు.

సుమారు అయిదు దీర్ఘసంవత్సరాల తర్వాత వారి సమాగమ మైనది. బండి దిగివచ్చిన తిమ్మోజీ - పార్వతులను చూచి మల్లన్న తన కనులను తానే నమ్మలేకపోయినాడు. అతడు ముద్గల్లుకు యింత సమీపములో నున్నా, ప్రారంభించిన పని పూర్తికానిదే చేసిన సంకల్పం నెరవేరనిదే, తను తిమ్మోజీకి కాని, పార్వతికి కాని ముఖము చూపకూడ దని హఠం పట్టి అచ్చటనే నిలచినా, తిమ్మోజీ పెంచిన ప్రేమ, శిష్య వాత్సల్యం అతనినే అచ్చటికి తీసుకొని వచ్చినవి. మల్లన్న పరుగున వచ్చి తిమ్మోజీని కౌగిలించుకొని, పసిపిల్ల వానివలె ఏడుస్తూ నిలబడి నాడు. ఇప్పుడతనికి తను యింత సమీపంలో వుండికూడా వారిని చూడక పోవడం అక్షమ్యాపరాధ మనిపించినది. అతని హృదయమందుకై పశ్చాత్తాప పడసాగినది. అతడు తన అపరాధమును క్షమించమని కోరు చున్న వానివలె దైన్యదృక్కులతో పార్వతివైపు చూసినాడు. ఆదృశ్యం చూడలేక పార్వతి చెరగుతో ముఖము కప్పుకొని, హృదయము తేలిక పడునంతవరకూ వాపోయినది.

ఆ ప్రకరణము ముగిసిన తర్వాత, మల్లన్న యిల్లువదలి వెళ్ళినది మొదలు అంతవరకూ జరిగిన తన వృత్తాంతము నంతా తిమ్మోజీకి వివ రించినాడు. రాజులు, మహారాజులు—సామ్రాట్టులు తనకొసగిన బిరుదు లను, బహుమానములనూ, ఖిల్లతులనూ చూపించినాడు.

"నాయనా, ఇవన్నియు అటుండనిమ్ము. నీవు నిర్మించుచున్న దేవాలయము చూతము పద" అని అన్నాడు తిమ్మోజీ. అతనికి నశ్వర మైన రజిత, స్వర్ణాభరణములకంటే, శాశ్వతమైన శిలా మూర్తులలో దాగి వున్న జీవకళను కనులారా గాంచవలెనన్న ఉత్సుకత ! పైగా వాటిలో శిష్యుని నిజమైన ప్రతిభను - యోగ్యతను చూడవలెనను కోరిక.

మల్లన్న తిమ్మోజీని, పార్వతిని తాను నిర్మించుచున్న శివాలయం వద్దకు తీసుకొని వెళ్ళి, ఒక్కొక్క శిల్పమునే వారికి చూపుతూ వచ్చి నాడు. శివాలయము చిన్నదైనా శాస్త్రోక్తముగా నున్నది. ఆ గ్రామ పెద్ద

కీర్తిశేషురాలైన తన మాతృమూర్తి పేరుతో ఆ శివాలయమును కట్టించినాడు. దేవాలయ నిర్మాణం మూడుభాగములు ముగిసినట్టే! ఇక గర్భగుడి పైభాగపు అలంకార మొక్కటే మిగిలినది. విగ్రహములకని తయారించిన గూళ్ళలో వాటిని జోడించే కార్యం జరుగుచున్నది. అది కాగానే గర్భగుడిలో శివలింగపు ప్రాణ ప్రతిష్ఠ। మల్లన్న ఆ సందర్భంలో పార్వతిని, ఆమె తలిదండ్రులను అచ్చటికి తోడ్కొని రావలెనను కొన్నాడు. కాని, అంతకు పూర్వమే వారు అనిరీక్షితముగా అచ్చటికి విజయంచేసినారు. మల్లన్నకిది చాలా ప్రియకరమైనది.

అతడు వారికి తను గర్భగుడి గోపురమును విగ్రహములతో అలంకరించాలని నిర్మించిన చిన్న ప్రమాణపు విగ్రహముల నన్నింటినీ ఒక్కొక్కటిగా చూపుతూ వచ్చినాడు. ఆ విగ్రహములన్నీ స్కాంద పురాణపు శివుని అనేక లీలా విచిత్రములను చిత్రించుచున్నవి. వాటి సౌందర్యమునూ, కళాభిజ్ఞతనూ చూచి తిమ్మోజీ తలూపసాగినాడు. అతడు శిష్యుని శిల్పకళకు మెచ్చినపుడి ఒక్కొక్క శిల్పమునూ చూచుచూ రాగా, ఒక విగ్రహ మతని దృష్టి నాకర్షించినది. దానిని మల్లన్న కావలయుననియే వేరుగా వుంచినాడు. దృష్టిదోషం తగులగలదని దానిని వెదురు చాపలతో మూసివుంచినాడు. అయినను అది తిమ్మోజీ కంటపడక తప్పినదికాదు.

"అది ఏమి విగ్రహము మల్లన్నా?" తిమ్మోజీ ప్రశ్నించినాడు.

"అదొక మదనికా విగ్రహ మప్పాజీ।"

"దాని నెందుకు ప్రత్యేకముగా దాచియున్నావు?"

"అది దేవతా విగ్రహముకాదు, అందుకని...."

"దానిని మేము చూడవచ్చునా?...."

"చూడవచ్చు. కాని అది చూడవలసినంతటి మంచి విగ్రహము కాదు...." మల్లన్న సంకోచపడుచూ అన్నాడు.

"మదనికా, విగ్రహము నీచేతిలో ఏవిధంగా రూపొందినదో చూచెదము" అని తిమ్మోజీ వచ్చి విగ్రహము ముందు నిలువగా గత్యంతరములేక మల్లన్న మూసివుంచిన తడికెను తీయవలసి వచ్చినది.

విగ్రహమును బాగుగా పరీక్షించి చూచిన తర్వాత తిమ్మోజీ ముఖంలో చిరునవ్వు చిందినది. అతడొకసారి మల్లన్ననూ, మరొకసారి పార్వతినీ అవలోకించినాడు. ఆ దృష్టి నెదిరించలేక మల్లన్న సిగ్గుతో తలవంచుకున్నాడు. అచ్చట అతడు చూచినదేమి ?

అచ్చట మల్లన్న తన హృదయసామ్రాజ్ఞియైన పార్వతి విగ్రహమును చూచినాడు. అంగవిన్యాసము, ఉడుపు, తొడవులన్నీ సాంప్రదాయిక మదనికా విగ్రహమునకువలె యున్ననూ ముఖము మాత్రము పార్వతి ముఖమునకు ప్రతిబింబముగా నున్నది. అవే విశాలనేత్రాలు, అదే ముక్కు, అవే చిరుపెదవులు, అదే చుబుకము....అన్నీ అచ్చు గుద్దినట్టే వున్నవి. మల్లన్న తన హృదయేశ్వరిని కేవలం ఊహతో బలపజాతిమీద మలచినాడు. ఆ విగ్రహమును చూచిన పార్వతియే లేచి వచ్చినట్టు తోచును. విగ్రహము అంత జీవంతముగానున్నది. ఇది చూచి పార్వతి ముఖము సిగ్గుతో ఎరుపెక్కినది. కాని తిమ్మోజీకి ఆ శిలాబాలను చూచి ఏమనితోచినదో అతడు మల్లన్నను కౌగలించుకొని జలజల కన్నీరు కార్చినాడు. అనంతర మతడు పార్వతిని-మల్లన్ననూ సమీపమునకు పిలిచి, వారి చేతులను తన హస్తములతో తీసుకొని ...

"నాయనా ! ఈ నాటికి నేను ధన్యుడనైనాను. నావేయి కలలీనాడు నిజములైనవి. నీ అసాదృశ శిల్పకళకు నే నొసగు యీ చిరుకానుకను సంతోషముగా స్వీకరించుము" అని చెప్పి మల్లన్నను ఆలింగనం చేసుకొన్నాడు.

ఈ ఒక్కఘటన మల్లన్నకు పార్వతిమీదగల ప్రేమ ఎంతగాఢమైనదో తిమ్మోజీకి తెలియపరచినది. అతడు ముద్గల్లుకు వెనుదిరిగి జరిగిన సంగతులన్నియునూ భార్యకు తెలుపగా, ఆమె అర్థంలేని నవ్వు నవ్వి వూరుకున్నది. ఈ సంగతులన్నీ విన్న తరువాత ఆమె మరింత జాగ్రత్త వహించినది. మల్లన్న ఆలయనిర్మాణం పూర్తికావించి ముద్గల్లుకు రాకమునుపే పార్వతి వివాహమును చేసివేయవలయునని ఎక్కువ ఉత్సాహముతో వరాన్వేషణ సాగించినది. కాని ఆమె ఆతురతకు తగినట్టు

ఎచ్చటనూ ఆమెకోరిన సులక్షణ సంపన్నుడైన వరుడు లభించలేదు. మల్లన్న ముద్దల్లుకు తిరిగివచ్చు దినము సమీపించిన కొలదీ, గౌరాంబ చింత హెచ్చుచూ పోసాగినది. ఇటువంటి సమయంలో వారి యింటికి శ్యామాదీక్షితు లరుదెంచిరి.

తిమ్మోజీ దంపతులు దీక్షితులకు స్వయంపాకమునకు కావలసిన ఏర్పాటులన్నీ చేసి యిచ్చినారు. దీక్షితులు గృహాంగణములోనున్న బావి నుండి నీరు తోడుకుని, స్నాన సంధ్యావందనములను ముగించి. వెంట తెచ్చిన యిష్టదేవతా విగ్రహమును పూజించి, స్వయంపాకము చేసుకొని భుజించి, విశ్రమించునప్పటికి ఒక ఘడియ దాటినది. మరుదినపు ప్రయాణమునకు సిద్ధముకాకమునుపే తమను ఆదరంతో సత్కరించిన తిమ్మోజీ దంపతులకు ఏవిధముగానైననూ తన కృతజ్ఞత లర్పించవలె నన్న కోరిక దీక్షితులకు కలిగినది. అందుల కవకాశమును గౌరాంబయే కలిగించినది. ఆమె శ్యామాదీక్షితులతో లోకాభిరామాయణము మాట్లా డుతూ "దీక్షితులుగారూ ! మీరునాలుగుచోటులు తిరుగువారు, మీకంటికి మాపార్వతి కనుగుణుడైన వరుడెవరైననూ కనబడిన కృపజూపి తెలియ జేయగలరా ?" అనినది.

"కానిమ్మా తల్లీ ! ఆమె కనురూపుడైన వరుడు కనబడినచో తప్పక తెలుపగలను" అని ఆశ్వాస మిచ్చినారు దీక్షితులు. క్షణకాలా నంతర మేదియో జ్ఞప్తికి తెచ్చుకొని "తల్లీ ! మీ కుమార్తె జాతక మున్నచో యిటు తీసుకొని రండు" అన్నాడు.

"ఎందుకు స్వామీ ?"

"ఆమెకింతవరకూ కంకణబలమెందుకు కూడిరాలేదో చూడవలసి యున్నది"

"నేననూ ఆ విషయమునే అడుగవలెననుకొన్నాను" అని చెప్పి గౌరాంబ పార్వతి జాతకమును తెచ్చియిచ్చినది. దీక్షితులు వేదశాస్త్ర పురాణములలో ఎంతటి పారంగతులో, జ్యోతిష్యములోసైత మంతటి పాండిత్యము గలవారు. చూపుమాత్రములో వారికి వ్యక్తి కులగోత్ర ములు, గుణావగుణములు తెలుసుకొనునంతటి ప్రజ్ఞగలదు. జాతకమును

చూచుటలో, ప్రశ్నాఫలమును చెప్పుటలో అసాధారణ పాండితి గలవారు. కాని వంశపారంపర్యముగా వచ్చిన రాజపౌరోహిత్యము విడువరాదని రాజపురోహితులుగనే వుండిపోయినారు. వారు తొలిసారిగా బావివద్ద పార్వతి ముఖ మవలోకించగనే ఆమె అసాధారణ తరుణియని తెలుసుకొన్నారు. ఆమె ముఖవర్చస్సు, లక్షణములనుబట్టి ఆమె ఏ రాజపుత్రుని చేపట్టుటకో పుట్టియున్నదని గ్రహించినారు. ఇప్పుడామె జాతకచక్రమును సూక్ష్మముగా పరిశీలించగా ఆ భావన మరింత దృఢమైనది.

"తల్లీ! నీవు మీకుమార్తె విషయమై చింతించనక్కరలేదు. ఆమె ఏ రాజకుమారునో చేపట్టుటకై పుట్టినది. కనుకనే ఆమెకింతవరకూ మాంగల్యయోగము కూడిరాలేదు. ఇప్పుడే ఆమెకు గురుదశ ప్రారంభమైనది. మీరు వివాహప్రయత్నములు చేయకపోయిననూ, ఆమెకు కంకణబలము కూడిరాగలదు. తనంతటతానే వివాహం జరిగిపోగలదు! ఎవరెన్ని అడ్డంకులు పెట్టినా పెండ్లి మాత్రము నిలువదు!" అని అన్నాడు.

"అయిన, మా మల్లన్నతో ఆమెకు వివాహము కాగలదని మీ అభిప్రాయమా?" అని అచ్చటనే కూర్చునియున్న తిమ్మోజీ అడిగినాడు.

"మల్లన్న యనిన మీ శిష్యుడా?"

"ఔను" అని తిమ్మోజీ సంగ్రహముగా అతని చరిత్రను దీక్షితులకు చెప్పినాడు.

"బహుశః పార్వతి వివాహము మల్లన్నతో జరుగదని నాభావన. ఎందుకనిన జన్మస్థానములో రవియుండుటవలన. ఈమె జ్యోతిష శాస్త్రప్రకారము రాజపుత్రుని చేపట్టవలె. ఒకవేళ రాజపుత్రుని చేపట్టకపోయిననూ, అత్యంత ప్రతిభాశాలియైన లక్ష్మీపుత్రుని భార్యయగుట తథ్యము. కాని...." అని అనుమానించినాడు.

"యెందు కనుమానించు చున్నారు?"

"నా మాటలవలన మీ మనస్సు కేమైనా బాధ కలిగి యుండిన క్షమించ ప్రార్థన! మీవంటి సుజనులకడ సత్యమును దాచిపెట్టలేక

వాస్తవాంశమును చెప్పుచున్నాడను....మీ అమ్మాయికి త్వరలోనే కంకణ బలం కూడిరాగలదనుటలో సంశయములేదు. వివాహమయినచో ఆమె రాజేశ్వరి వలె జీవించగలదు. లేనిచో ఆమరణ పర్యంతమూ కన్యగానే వుండగలదు. ఒకవేళ వివాహమగుచో వేదికమీద ఆమెకొక గండ మున్నది. అది అగ్నితో రావచ్చు, విషముతో రావచ్చును. లేదా రక్త స్రావ రూపంతో రావచ్చును. మొత్తముమీద ఒక పెద్ద గండము రానున్నది. అది నివారణమైనచో మీ కుమార్తె దీర్ఘకాలము సౌభాగ్యవతిగా జీవించగలదు."

"ఆ యోగము చూచుభాగ్యము మాకు గలదా స్వామీ!" గౌరాంబ అడిగినది.

"అదియే అనుమానము తల్లీ!"

"మేమంతదనుక బ్రతుకక పోయిననూ చింతలేదు. పార్వతి ఎక్కడైననూ సుఖముగానుండిన చాలును." అని ఆమె నిట్టూర్పు విడచినది.

"తల్లీ, మీరింతగా అధైర్య పడవనిలేదు. ఈ అపమృత్యువుల కన్నింటికిని తగిన పరిహారము లేకపోలేదు. మీరు తదుచితములైన– హవన హోమాదులను, అష్టోత్తర శత మృత్యుంజయ జపమును నవ గ్రహారాధనను, యోగ్యములైన దానధర్మములను చేసి దానిని నివారించ వచ్చును. గ్రహముల వక్రదృష్టి నివారణమైనచో మీరునూ, మీ కుమార్తెయునూ సుఖముగా నుండగలరు."

"అయిన పార్వతి వివాహమును మల్లన్నతో నిశ్చయించి, పెండ్లి లగ్నమునుకూడా పెట్టించినాను కదా" తిమ్మోజీ బరువుగా నిట్టూర్చినాడు.

"ఈ వివాహము జరుగదని నా నమ్మిక"

"ఎందులకు?"

"మీ కుమార్తెకు రాజయోగ మున్నది! ఆమె వివాహమాడినచో రాజపుత్రునే వివాహమాడవలె!"

"మల్లన్నయే రాజపుత్రుడు కావచ్చును. అతడు రాజసన్మా

నితుడై పార్వతిని చేపట్టవచ్చును ! అతని భవిష్యత్తు ఎట్లున్నదో కొంత చెప్పగలరా ?" అనుకంపధ్వనితో అడిగినాడు తిమ్మోజీ.

"అతని జాతక చక్ర మున్నదా ?"

"లేదు"

"అట్లయిన మీ రీ ఘడియలో అడిగిన ప్రశ్నను బట్టి చెప్పినచో...." అని గుణించిచూచి-"మీరేమియును అనుకొనకపోయిన ఒక మాట చెప్పగలను" అన్నాడు.

"చెప్పుడు"

"మల్లన్నకు త్వరలోనే శనిదశ ప్రారంభము కానున్నది. రాజ సన్మానమునకు మారతనికి రాజద్రోహాపాదనకై శిక్ష కాచుకొని యున్నది."

"ఏమీ, రాజద్రోహమునకుగా శిక్షయా?"

"ఔను. బహుశః వొకటి రెండు సంవత్సరములు కారాగార వాసము-లేదా మరణదండన. మొత్తముమీద అతనికి దుష్టగ్రహముల బాధ కాచియున్నది. మీంప్పుడే మృత్యుంజయ జపము - నవగ్రహ పూజ చేయుట మంచిది"

"అయిన మల్లన్నకూ పార్వతికీ వివాహము కాదా ?" హతాశుడై అడిగినాడు తిమ్మోజీ.

"కాగలదు. కాని ఈ జన్మలో కాదు !"

అని చెప్పి దీక్షితులు అప్పటినుండి లేవ బ్రియత్నించినారు. తిమ్మోజీ-గౌరాంబ లతడుచెప్పిన భవిష్యమును తలచుకొని చేష్టలుడిగి కూర్చున్నారు..

# పరాజయము

## 3

శ్యామాదీక్షితులు శ్రీశైల యాత్ర ముగించుకొని విజయనగరము నకు తిరిగివచ్చి, క్షేత్రయాత్రా కాలమున తనతో తీసుకొని వచ్చినఅన్ని పుణ్యక్షేత్రముల తీర్థప్రసాదములను సామ్రాట్ దేవరాయల కిచ్చుటకై అంతఃపుర చంద్రశాలకు వచ్చినాడు. అచ్చట దేవరాయలు తన దైనం దిన రాచకార్యములు ముగించుకొని వచ్చి విశ్రాంతి తీసుకొనుచున్నాడు. దీక్షితులతనిని చూచి, తీర్థప్రసాదము లొసగి, ఆశీర్వదించి, యాత్రా కాలమున తాను కన్న-విన్న సంగతులను వర్ణించినారు—

"దీక్షితులూ, క్షేత్రయాత్ర వర్ణన అటుండనిమ్ము. మీరు విన్న-కన్న రాజకీయ పరిస్థితులను వివరించుడు !"

అని మధ్యన ప్రశ్నించినాడు దేవరాయలు.

అతనికి క్షేత్రయాత్ర వర్ణనకంటెనూ ముందు శత్రువుల స్థితి గతులను తెలుసుకొనవలెనని యున్నది. దీక్షితులు యాత్రా నెపముతో శత్రురాజ్యమున కూడా ప్రయాణము చేసినారు, బహమనీ సుల్తానుల సీమలో సంచారము చేసినారు. శత్రువుల బలాబలములు, సరిహద్దు ప్రదేశములో నున్న సైన్యముల స్థితిగతులను గురించి తెలుసుకొనుట ప్రస్తుతము దేవరాయలకు కావలసినది. ఈ విషయముపట్ల అతడుత్సుకు డైయున్నాడు. పూర్వమునుండియు రాయ చూరుగడి ప్రదేశముగనూ, ముద్గల్లు విజయనగర--బహమనీ సుల్తానుల వివాద ప్రదేశముగనూ వుంటూ వచ్చినది. దాని ఆధిపత్యమునకై బహమనీ సుల్తానులకూ,విజయ నగర రాజులకూ అనేక పర్యాయములు యుద్ధములు జరిగినవి. ఈ యుద్ధములలో రాయచూరు మొదలైన ప్రదేశములు విజయనగరరాజుల చేయి విడచి, బహమనీ రాజ్యములో చేరిపోయినవి. ఫిరోజ్‌షా ఇప్పుడు

బహమనీ సుల్తానుడైనాడు. అతడు దురాచారియూ, స్త్రీలోలుడునూ, యగుటచే ఆతనినుండి ఆ ప్రదేశములను మరల గెలుచుకొనుటకు దేవ రాయలాలోచించి, సింహాసన మెక్కిన వెంటనే తన ఆలోచనలను కార్య గతము చేయుటకై నిశ్చయించినాడు. దిగ్విజయ యాత్రకన్ననూ తనకు జరిగిన అవమానమునకు ఫిరోజ్‌షా మీద పగదీర్చుకో వలయు ననునది అతని మహత్త్వాకాంక్ష ।

దేవరాయలు ఇమ్మడి హరిహరుని కాలమున,యువరాజుగా నున్న ప్పుడు జరిగిన యుద్ధంలో ఫిరోజీషా చేసిన తంత్రమునకు బలియై పరా జయము పొందినాడు. అప్పుడు తను జయించిన ముద్గల్లు, రాయచూరు- ఆదవాని మొదలైన ప్రదేశములను శత్రువుల పాలుచేయటమేగాక— యుద్ధ వెచ్చమునకయి పదిలక్షల విలువగల బంగారము నిచ్చి సంధిచేసు కొనవలసి వచ్చినది.దురహంకారియైన మహమద్ షహామద్యపుమైకంలో చేసిన పిచ్చియాజ్ఞను విజయనగర రాజులు నిర్లక్ష్యపరచి, అవమానిం చుటే యీ రగడ కంతటికీ మూల కారణమైనది.

విజయనగరమును బుక్కరాయలు పరిపాలించునప్పుడు మహ మద్‌షా అను ఒక సమర్థుడైన సుల్తాను అల్లావుద్దీన్ హసన్‌గంగూ బహమనీచే స్థాపించబడిన బహమనీరాజ్యమునకు ప్రభువైనాడు. ఇతడు మహత్త్వాకాంక్షగల సుల్తాను. చిన్నదియగు తన సామ్రాజ్యమును విస్త రింప వలయునన్నది యితని ప్రధానాశయము. అప్పుడప్పుడే ప్రాబల్య ములోనికి వచ్చుచున్న విజయనగరముయొక్క విస్మయకరాభివృద్ధి అతనికి కన్నుకుట్టినది. ఎట్లయిననూ దాని ప్రాబల్యమును పడగొట్టవలె నని మహమద్‌షా సంకల్పించినాడు. విజయనగరముమీద దండెత్తి వెళ్ళుట కతనికి ఒక కారణం కావలసివచ్చినది. ఆ కారణముకొరకై అతడు నిరీక్షించసాగినాడు.

అతడొకనాటి సాయంకాలపువేళ తన మిత్రులతో కలసి మద్య మును సేవించుచున్నాడు. అర్ధనగ్న శరీరులైన సుందరీమణులు సువర్ణ పాన పాత్రములను పట్టుకొని ఎదుట నిలబడియున్నారు. ఒకవైపు నృత్యము, మరొకవైపు గానము జరుగుచున్నది. సుల్తాను మహమద్‌షా

తనమిత్రులుచేసే అశ్లీల హాస్యముతో సంతోషపడుచూ, యధేచ్ఛగా మద్యమును సేవించుచున్నాడు. అటువంటి సమయమునందు బిజాపురపు నాయకులు కొందరు సుల్తానుని కోరికమేరకు పర్షియాదేశపు సుప్రసిద్ధ కవి అమీర్ ఖుస్రూ పద్యములను శ్రావ్యముగా గానముచేసినారు.వాటిలో నొకటి ప్రభువులను శ్లాఘించెడి పద్యమున్నది. దానిని గాయకులు మహమద్ షా కన్వయించి పాడగా, సుల్తానునకది బాగుగా తోచినది. అతడు గాయకులను తగినరీతిని బహుమానించదలచి, వెంటనే తన ఆప్తమిత్రులను, మహాదండనాయకులను, ప్రధాన వజీరుడైన మల్లిక్ సైయద్ వుద్దీన్ ఘోరీని సముఖమునకు రప్పించుకొని "ఈ రెండువందలమంది గాయకులకు, ప్రతి ఒక్కరికీ ఒక్కొక్క వేయి బంగారు నాణెములను బహుమతిగా నివ్వవలసినదని ఒక ఆజ్ఞాపత్రము, హిందీలేఖను వ్రాసి, రాజముద్ర నద్ది విజయనగర రాజునకు వెంటనే పంపుడు" అని ఆజ్ఞాపించినాడు.

ఈమాటవిని వజీరుడు నోటమాటరాక నిలబడినాడు. సుల్తాను మద్యపు మైకంలో ఆయాజ్ఞ చేసినాడని భావించినాడు. దాని నచ్చటనే తిరస్కరించిన అతడు తనమీద కుపితుడు కావచ్చునని భీతిల్లి "తమ ఆజ్ఞ జహాపనా !" అని చెప్పి అచ్చటినుండి నిష్క్రమించినాడు.

మరునాడు వజీరు తనవద్దకురాగా, మహమద్ షా "వజీరులూ, నిన్న నేను చేసిన ఆజ్ఞను కార్యగతము గావించడమైనదా ?" అని ప్రశ్నించినాడు.

"లేదు జహాపనా !" వజీరు వణుకుచునే జవాబిచ్చినాడు.

"ఎందుకని చేయలేదు ?"

"తమరు........"

"మద్యపు మైకంలో చేసిన ఆజ్ఞ యది యని భావించినారా?" అని వజీరు ముఖమును తీక్షణముగా చూచినాడు.

"జహాపనా, గరీబుని తప్పును క్షమించ ప్రార్థన ! తమరు చేసిన ఆజ్ఞను వెంటనే అమలు పరచెడివాడను. కాని తమరు ఇన్నూరు మంది

గాయకులకు, ప్రతి ఒక్కరికీ వేయి బంగారు నాణెముల చొప్పున ఇవ్వ మని విజయనగర రాజులకు ఆజ్ఞాపించినారు ।"

"అవును."

"వారు మన ఆశ్రిత రాజులైనచో అమాటవేరు.కాని విజయనగర రాజులు స్వతంత్ర సామ్రాట్టులు. వారు తమ ఆజ్ఞను ధిక్కరించిన మన కవమానము కాదా ?"

"విజయనగర రాజులకు మన ఆజ్ఞను తిరస్కరించు నంతటి గుండెధైర్య మున్నచో తిరస్కరించనిమ్ము. దాని పరిణామమును త్వర లోనే అనుభవించగలరు."

"ఖామంద్। ఇప్పుడు మనము విజయనగరరాజులతో ఒప్పందము చేసుకొని యున్నాము. మనంతట మనమే మరల దాని నుల్లంఘించిన నెట్లు ?"

"మీరు మా సర్వసైన్యాధ్యక్షులుగా నుండియునూ విజయనగరపు వారిమీద యుద్ధమాడుటకు భీతిల్లు చున్నట్టు తెలియుచున్నది" అని మహ మద్ షా నవ్వినాడు.

"యుద్ధమునకు నే నెప్పుడూ భయపడలేదు హుజూర్ । కాని. నిష్కారణముగా విజయనగరముమీద దండెత్తి వెళ్ళుట మంచిది కాదని నాయభిప్రాయము. అంతియే ।"

"ఎందులకు ?"

"దండెత్తి వెళ్ళుటకు సరియైన కారణము, సరియైన సమయము కావలయును హుజూర్ ।"

"సమయాసమయములు చూచుచూ కూర్చొన్న, మనము మన సామ్రాజ్యమును విస్తరించుటకు వీలుకానేరదు; శత్రువులను నాశనము చేయుటకు సాధ్యముకాదు. ఆ హిందూ రాజ్యమున్నంత వరకూ మనకు మనుగడలేదు. దానిని నాశమొనర్చిననేగాని గండము తప్పదు. కనుక యిప్పటినుండియు యుద్ధపు ఏర్పాటులను చేసుకొనుడు. మీరిప్పుడే నా ఆజ్ఞప్రకారము హుండీ లేఖను వ్రాయించి విజయనగరమునకు పంపుడు.

దానిని తిరస్కరించిన, విజయనగర ప్రభువు తన గోతిని తానే త్రవ్వు కొనగలడు" అని పైశాచిక నవ్వు నవ్వినాడు.

వజీరున కిక వేరు మార్గము గోచరించలేదు. అతడు మహమద్ షా ఆజ్ఞప్రకారము విజయనగర ప్రభువుకు హుండీ లేఖను వ్రాసి, సుల్తానుల రాజముద్ర నద్ది పంపినాడు.

వార్తాహరుడు దానిని తీసుకొనివెళ్ళి బుక్కరాయలకు అందజేసినాడు.

నిండుసభలో బుక్కరాయలా లేఖను చదువుకొన్నాడు. అందులో యీ విధముగా నున్నది.

"విజయనగర సార్వభౌములకు,

మమ్ములను మధురగానముతో మైమరపించిన రెండు వందల మంది గాయకులకు, తలకొక వేయి బంగారు నాణెముల చొప్పునయిచ్చి, సత్కరించినాము. కాబట్టి ఈ మొత్తమును మీ రాజ భాండాగారమునుండి తీసి, గాయకులకు చెల్లించవలసినదని యిందుమూలముగా ఆజ్ఞాపించడ మైనది.

ఇట్లు,
బహమనీ సుల్తాను మహమద్ షా"

ఈ లేఖను చూచి స్వాభిమానియైన బుక్కరాయలు కోపముతో నిప్పులు గ్రక్కినాడు. సభాసదులిదివిని క్షుబ్ధులైనారు. విజయనగర సామ్రాట్టులకు ముందెన్నడూ ఎవరూ యింతటి లేఖ వ్రాసి యుండలేదు; ఈ విధముగా అవమాన పరచి యుండలేదు సభికుల ప్రతిక్రియను ప్రతిబింబింపజేయునట్లు మహాప్రధానులు సాయణామాత్యులు గంభీర స్వరముతో అన్నారు :

"ప్రభూ ! శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మేదినీ మీసరగండ యిత్యాది బిరుదాంకితులైన విజయనగర సార్వభౌములను ఎవరూ యింతవరకూ ఈవిధము గాచులకన గాచూడలేదు.మదోన్మత్తుడైన ఆసుల్తానుకు చెడుకాలము దాపురించుటవలననే యింతటిదుర్బుద్ధిపుట్టినది. లేనిచో స్వతంత్ర సామ్రాట్టులైన తమకు ఈ విధమైన లేఖను వ్రాసి

యుండెడివాడుకాడు. ఈ పత్రివాహకుని ముక్కు చెవులను కోసి, గార్ధభముమీద కూర్చొనజేసి రాజవీధిలో ఊరేగించి, తనకు జరిగిన పరాభవ కథను సుల్తానుకు తెలుపుట కతనిని వెనుకకు పంపించవలె!" అని అన్నాడు.

అదేవిధముగా పత్రివాహకుని అంగవిచ్ఛేదనజేసి, మహమద్‌షా వద్దకు పంపడమైనది. విజయనగర రాజుయొక్క నీచప్రివర్తనను చూచి సుల్తాను క్షుబ్ధుడైనాడు. అతడు విజయనగరముమీద దండెత్తి వెళ్ళుటకు తన సైన్యమున కాజ్ఞ యిచ్చినాడు. మహాదండనాయకుడు సైయద్‌వుద్దీన్ ఘోరీ నేతృత్వముక్రింద ఇరువదివేల అశ్వికదళము, మూడువేల గజ సైన్యము, లక్ష పదాతిసమూహము బయలుదేరి వెళ్ళి విజయనగరము మీద పడినవి.

ఈ ముట్టడి నెదుర్కొనుటకు విజయనగర ప్రిభువులుకూడా సిద్ధముగానే యున్నారు. బుక్కరాయలు, ప్రిధాన సైన్యాధ్యక్షుడైన ముద్దన్న నేతృత్వముక్రింద అపారమైన సైన్యమునూ, ఆయుధములనూ యిచ్చి శత్రువులమీద యుద్ధమునకు బంపినాడు. ముద్దన్న తన సైన్యముతో వెళ్ళి ముద్గలుమీదపడి దానిని స్వాధీనపరచుకొన్నాడు. ఆదవానిలో ముసల్మానులు హిందువులమీద జరిపిన అత్యాచారములకు ప్రితిగా వారి మీద పగదీర్చుకొన్నాడు. ఇదివిని మహమద్‌షా మండిపడి—"లక్షమంది హిందువులను ఈ కత్తికి బలియివ్వనిచో నేను మహమద్‌షాను కాను" అని ఘోరమైన ప్రితిజ్ఞ చేసినాడు. తను మరణించిన, తన అనంతరం సింహాసనమునకు వారసునిగా మజీద్‌షహాను నియమించినాడు రాజ ప్రితినిధిగా మల్లిక్‌వుద్దీనుని ఎన్నుకొన్నాడు. వారిని గుల్బర్గాకు పంపి, సైన్యసమేతంగా ఆదవానిమీదకు తానే బయలుదేరినాడు.

విజయనగర సైన్యము మహాసేనాధిపతి మల్లినాధుని నేతృత్వములో ఆదవానిని రక్షించుటకు బయలుదేరినది. అతని సైన్యములో నలభైవేల అశ్వికదళము, అయిదులక్షల పదాతిదళము వున్నది. అతడు సైనికులను రణోత్సాహులనుగా చేయుటకు ఆస్థానపండితులను, కవులను ప్రోత్సహించి వారికి విపులముగా ధన కనకవస్తు వాహనముల నిచ్చి గౌరవించి

నాడు. వారు హిందూ ధర్మసంస్కృతులకు యవనులవలన ఏర్పడిన దురవస్థను వర్ణించి కావ్యములను వ్రాసి, వారిలో క్షాత్రతేజమును ప్రవహింపజేసినారు.

ఉభయసేనలకూ క్రీ. శ. 1366వ సంవత్సరము జూలై 23వ తేదిన ఘోరమైన యుద్ధము జరిగినది. సుల్తానుపక్షపు దళపతులైన మూసేఖాన్, ఈసేఖానులు మరణించినారు. అప్పుడు మూడువేల అశ్వసైన్యముతో సుల్తానే స్వయముగా రణరంగమునకు దిగినాడు. కాని సరిగా అదే సమయములో హిందువుల దురదృష్టమన్నట్టు 'శిర్ శికార్' అను శత్రుపక్షపు ఏనుగకు పిచ్చిపట్టి విజయనగర సైన్యమును చాలా నాశనము చేసినది. దానిని సంహరించుటకు వెళ్ళిన మల్లినాథ దండనాయకునికి గాయములైనవి ఇది చూచి విజయనగర సైన్యము బెదరి పారిపోయినది. పారిపోవుచున్న సైన్యమును వెన్నంటి తరిమి, మహమద్‌షా హిందువులమీద అమానుషరీతిని పగతీర్చుకొని తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొన్నాడు. నిరపరాధుల హత్యాకాండను నిలుపుటకు చివరకు విధిలేక బుక్కరాయలు సుల్తానుని కోరికమేరకు గాయకులకు సంభావన లిచ్చుటకు ఒప్పుకొన్నాడు. కేవలం రెండులక్షల బంగారు నాణెములకై జరిగిన ఈ యుద్ధము విజయనగరపు ఓటమితో పర్యవసానము నందినది.

ఇది హిందువుల మనసులో చెరగని ముద్రగా, అవమానముగా చిరకాలము నిలచినది. దేవరాయ లెట్లయిననూ ఈ మచ్చను తుడిచివేయవలెనని నిశ్చయించినాడు. అతడు యిమ్మడి హరిహరుని కాలంలో యువరాజుగా నున్నప్పుడే యవనులమీద పగ దీర్చుకోగోరి ప్రచండసేనలతో బహమనీ రాజ్యముమీద పడినాడు. కాని బహమనీ సుల్తానైన ఫిరోజ్‌షా పన్నిన తంత్రమువలన మరల పరాజయపు అవమానమును ఎదుర్కొనవలసి వచ్చినది. ఎంత ప్రయత్నించిననూ ఆ ప్రకరణమును మరచిపోవుటకు దేవరాయలవలన సాధ్యము కాకపోయినది.

మహమద్‌షా అనంతరం బహమనీ సుల్తానులైన వారిలోకెల్లా ఫిరోజ్‌షా అత్యంత సమర్థుడు. మహమద్‌షా అనంతరం అతని కుమారుడు మజీద్‌షా మూడు సంవత్సరముల కాలం రాజ్యపాలనచేసి, పుత్ర

సంతతిలేక మరణించినాడు. అతని మరణానంతరం సైన్యములో మిక్కిలి ప్రభావవ్యక్తిగా నుండిన దావూద్ అను రాజపుత్రుడు సింహాసనము నాక్రమించుకొన్నాడు. కాని మజీద్‌షా సోదరి సింహాసనమునకై పితూరీ జరిపి, దావూద్ మసీదులో ప్రార్థన జరుపుచున్నపుడు మోసంతో అతనిని చంపించినది. అతని పిమ్మట మహమద్‌షా యిరువది సంవత్సరములు రాజ్యపాలనము చేసిననూ సింహాసనముకై జరిగిన పోరాటము ముగియలేదు. అతని వెనుక సుల్తానైన నయాజుద్దీన్ అను తరుణ వయస్కుని, లాలచీన్ అను గులాము ప్రధాన వజీరుకు కావలయునన్న కోర్కెతో హత్యచేసినాడు. అతని అనంతరం సింహాసన మెక్కిన షంసుద్దీనును కన్నులూడదీయించి, సుల్తాను దావూద్ యొక్క మరియొక కుమారుడైన ఫిరోజ్‌షా సింహాసనము నాక్రమించుకొన్నాడు.

ఫిరోజ్‌షా అధికారమునకు రాగానే దానిని తన చేతిలో భద్రపరచుకొని, సామ్రాజ్య విస్తరణకు పూనుకొన్నాడు. సుల్తాను మహమద్ కాలములో నిండియుండిన రాజ భాండాగారము అతని మహదాశయమునకు అన్నివిధముల అనుకూలించినది.

ఫిరోజ్‌షా యెంతటి గొప్ప యోధుడో అంతటి విలాసి–రసికుడు కూడాను. అతడు తనను "దక్కను విలాస సామ్రాట్టు" అని గర్వముగా పిలిపించుకొను చుండెడివాడు. సంగీత సాహిత్యములలో అతనికి అత్యంతాసక్తి గలదు. కవులకు–కళాకారులకు–పండితులకు ఆశ్రయ దాతయై యుండెడివాడు. పగలంతా పూర్తిగా రాచకార్యములలో గడపి, సాయంవేళలను వినోదములలోనూ, మనోల్లాసకర కృత్యములలోనూ వేగించెడివాడు మిత్రులకొరకై అతడు రోజుకొక పిధమైన మనోల్లాసకార్యములను ఏర్పాటు చేసెడివాడు. దీని కెవరైననూ రావచ్చును, అడ్డులేదు. అతని జనానాలో దేశ విదేశములనుండి ఏరి తెచ్చిన వెయ్యారుమంది సుందరీ మణులు గలరు. ఫిరోజ్‌షాకు అనేక భాషలు వచ్చెడివి. ఆయా దేశపు సుందరిని అతడా యా దేశ భాషలలో పలుకరించెడివాడు. కేవలము తన విలాస భోగములకనియే అతడు భీమానది ఒడ్డున ఒక సుందరమైన అంతఃపురమును కట్టించినాడు. కాలక్రమేణా అచ్చట ఒక నగరము

రూపొందినది. అతడు దానికి 'ఫిరోజాబాద్' అని పేరు పెట్టినాడు. తన విరామ వేళల నచ్చటనే గడుపసాగినాడు.

వైభవశాలి, సాహస ప్రియుడూ అయిన దక్కను విలాస సామ్రాజ్యము సులభముగా ఓడించుటకు దేవరాయలవల్ల కాకపోయినది. అయిననూ దేవరాయలు ఎదగుందక, రాయచూరు మొదలగు గడిప్రదేశములను గెలుచుకొనుటకు సైన్యసమేతముగా బయలుదేరి వెడలి, కృష్ణ ఒడ్డున దండు విడిసినాడు. అతని సైన్యములో మూడు వేలకు మించిన అశ్వికదళము. లెక్కకు మీరిన పదాతి దళము నున్నవి. కాని పెరన్‌జీ అను ఖాజీచేసిన పితూరీ వలన దేవరాయలు యుద్ధము చేయక పరాజయము నొంది; వెనుదిరుగ వలసి వచ్చినది.

# దారుణ హత్య

## 4

దేవరాయలు కృష్ణను దాటి వచ్చిన అతనిని ఓడించుటదుస్సాధ్యమని గ్రహించిన ఫిరోజ్‌షా ఆలస్యమొనరించక తన సైన్యములతో బయలుదేరి వచ్చి కృష్ణానదికి మరొక వైపున దండు విడిసినాడు. అది వర్షాకాలమగుటచే కృష్ణ ఇరుదరు లొరసికొని ప్రవహించుచున్నది. దానిని దాటి వచ్చుటకు ఉభయ సేనలకూ అపాయముగా తోచినది. అప్పుడేమి చేయుటకును తోచక ఫిరోజ్‌షా తన ఆప్త దండనాయకులతో సమాలోచించినాడు. వారిలో వారికి దీర్ఘ చర్చలు జరిగిననూ ఏవిషయమూ నిర్ణయముకాలేదు. ఈ చర్చనంతయూ మౌనముగా వినుచూ కూర్చొని యున్న —ఫిరోజ్‌షా ఆప్త వర్గములోని వాడైన— పెరన్‌జీ అను మహమ్మదీయ ఖాజీ లేచి నిలబడి ఈ విధముగా చెప్పినాడు:

"హుజూర్ ! నాదొక విన్నపము. ఆలించ ప్రార్థన. ఇప్పుడు మనవలెనే విజయనగర సైన్యముకూడా కృష్ణ కావలి గట్టున విడిసి యున్నది. వారు నదిని దాటివచ్చి మనమీద పడిన,మనకు ఓటమి కలుగు సందర్భమేర్పడవచ్చును. యెందుకన, వారి బలము అసంఖ్యాకముగా నున్నది. మనమిప్పుడు శత్రువులను ఉపాయముచే ఓడించి, వెనుకకు తరుమవలె ! అట్లు చేయవలెనని ఇదియే మంచి తరుణము. నదీ ప్రవాహము తగ్గుదల కెదురుచూచుచూ, వారు మనోల్లాసకర కృత్యములలో మునిగి యున్నారు. శత్రుభీతి లేక మైమరచి యున్నప్పుడే, వారి శిబిరాలను ఉపాయాంతరముగా ప్రవేశించి, ముఖ్యులైన వారినందరినీ హతమార్చిన తక్కిన సైన్యము భీతిల్లి పారిపోగలదు. పారిపోయిననూ నాయకులులేని సైన్యమును సులభముగా ఓడించి తరిమివేయవచ్చు !"

"ఇది విచారార్హమైన సలహాయేగాని, చాలా అపాయకరమైన కార్యము ! దీనిలో మనము యశమునందిన, యుద్ధములేకయే అఖండ దిగ్విజయము లభించగలదు. విఫలులమైన శత్రువుల ఖడ్గాహతికి చిక్కి మరణించ వలసి యుండును ! దీనికి సిద్ధముగా నున్న వీరు లెవరున్నారు ?" అని ఫిరోజ్‌షా ప్రశ్నించినాడు.

"మీ రాజ్ఞాపించినచో ఈ కార్యమును నేను సాధించుకొని రాగలను. నాకు నల్వురు భటులను యివ్వుడు. విజయ వధువునుతెచ్చి మీకు అప్పగించగలను" అని పెరన్‌జీ ఆవేశములో అన్నాడు.

అతని మాటలు విని అందరునూ నిశ్చేష్టితులైనారు. తమ వలన సాధ్యముకాని కార్యమును ఒక సామాన్య ఖాజీ సాధించు నట్టుగా చెప్పుటను విని వారాశ్చర్యపడినారు.

"హుజూర్, ఖాజీ సాహేబులు చెప్పునంత సులభముగా యీ కార్యము సాధింప బడుచో ఇటువంటి దిగ్విజయములను నూరింటిని మనము సులభముగా సాధించవచ్చు. కాని శత్రువులను మోసగించుట చాలా కష్టము. అందుననూ నాయకులను హతమార్చుటనిన మరింత కష్టము ! దీనివలన వృధా ప్రాణహానియే తప్ప ఏ ప్రయోజనమునూ లేదు." అని ఒక వృద్ధ వజీరుడు లేచి నిలబడి విన్నవించినాడు.

"మనము భీతిల్లి కూర్చొన్న ఏ కార్యమునూ సాధించలేము. యుద్ధమునకై బయలుదేరివచ్చి యిప్పుడు ప్రాణభీతిని కనబరచినదెట్లు? యుద్ధమునకు భీతిల్లుపట్లయిన యింటివద్దనే యుండవలసినది. రణరంగమున అడుగిడిన తర్వాత బెదరిన రాగల ప్రయోజనమేమి ? ప్రాణభీతి వదలి ధీరులై ముందుకు దూకిన విజయవధువు మనను వరించగలదు. ఆమె వీరులను వరించగలదేకాని, భీరువులను కన్నెత్తికూడా చూడదు. ఈ విషయమును రణరంగమందే జీవితమును సమయింపజేసిన నేను వృద్ధవజీరులకు తెలియజేయవలసి వచ్చినందుకు విషాద పడుచున్నాను."

ఈ మాట విని ఫిరోజ్‌షా ఖాజీని కౌగిలించుకొని,భావోన్మాదంలో అన్నాడు :

"మౌలానా సాహేబ్,మిమ్ములను నేను ఇంతవరకూ కులగురువులని భావించితినేకాని, యుద్ధవీరులని అనుకొనలేదు. కురాను మొదలగు ధార్మిక విషయములలో పండితులని అనుకొన్నాను. మీరు యుద్ధ విషయములలో కూడా మంచి అభినివేశము, ప్రవీణత్వము కలిగి యున్నారు. మీ సలహా నాకు చాలా ప్రియకరమైనది.కాని దానిని కార్యగతము చేయువారెవరు?"

"హుజూర్, మీరు నాకు ఆజ్ఞ యివ్వండి. ఇప్పుడే బయలుదేరి వెళ్ళెదను"

"తెలిసి–తెలిసీ మిమ్ములను అపాయమునకు గురిచేయుట నాకిష్టములేదు !"

"జహాపనా ! మీరు నాకంటెనూ గొప్పవారు. మీకంటెనూ దేశము గొప్పది. దేశమునకన్ననూ పవిత్రమైన ధర్మము గొప్పది. పవిత్రమైన ధర్మమున కంటెనూ సర్వశక్తుడైన 'అల్లా' గొప్పవాడు. మనము దైవముపేర, ధర్మముపేర–స్వార్థత్యాగంచేసి కార్యాచరణకు పూనుకొనవలయును. ఇప్పుడు కాఫరులైన ఈ హిందువుల వలన మన ఇస్లాం మతమునకు గండము సంభవించినది. దేశ, మత, ధర్మ సముద్ధరణార్థమై మన సర్వస్వమును సమర్పించుటకు, యిప్పుడు మనము వెనుక ముందాడరాదు."

అని వీరావేశముతో చెప్పినాడు. తక్కిన దండనాథు లీ సలహాను ఆమోదించి, జయఘోష చేసినారు. ఫిరోజ్‌షా ఈ కార్యమును ఖాజీ కప్పగించి తను నిశ్చింతుడైనాడు.

ఆరోజే ఖాజీ తన సంగడి కాండ్రితో కలసి, మారువేషముతో బయలుదేరి శత్రు శిబిరములను చేరుకొన్నాడు.

కృష్ణ ఒడ్డున యువరాజు దేవరాయల శిబిరములు రెండు క్రోసుల వరకునూ విస్తరించి యున్నవి. నదిలో నీరు తగ్గుముఖమైననేకాని సైన్యము కార్యాచరణకు పూనుకొనుటకు సాధ్యము కాదు. వారు నీరు తగ్గుదల నెదురుచూచుచూ, శత్రుభీతి యనునది యించుకయిననూ లేక మనోల్లాసకర కృత్యములలో మగ్నులైనారు. వారికి ఉల్లాసమును కలిగించుట కొరకెందరో దొమ్మరాటగాండ్రు, పాములవాళ్ళు, పగటివేషగాండ్రు, గాయకులు, నటకులు అచ్చట విడిసియున్నారు.

వెయ్యారుమంది వేశ్య లచ్చట తమ కులవృత్తిని సాగించుచున్నారు. వారికందరికీ మరొకప్రక్క వసతు లేర్పరుపబడినవి. సర్వవేళలా సైనికులు తేనెటీగలవలె వేశ్యావాటికల వైపు తిరుగాడసాగినారు. అచ్చట నృత్య-గానములు విధి విరామములులేక జరుగసాగినవి. సొగసుగా సింగారించుకొన్న విటపురుషులు, కళాభిమానులు, పుష్పబాలికలు, అత్తరు, చందనాది సుగంధద్రవ్యముల నమ్మే వ్యాపారులు, రత్నవ్యాపారులు, రసికశిఖామణులు గుంపులు గుంపులుగా వచ్చి పోసాగినారు. సైనికుల కావలి అచ్చట కొంత సడలింపబడినది. ఆ శిబిరములలోనికి ప్రవేశించు వారి నంతగా సంశయ దృష్టితో చూచుటయునూలేదు; వారిని పరిశోధనకు గురిచేయుటయునూలేదు. అచ్చటికి వచ్చిపోయెడి వారివలన ఏ విధమైన అపాయమూ రాజాలదని దళపతి భావించినట్టున్నది. కనుకనే భటులకావలి-లక్ష్యము ఆవైపు అంతగాలేదు. ఇది గ్రహించిన ఖాజీసాహేబు తన దురాలోచనమునకు దానినే కేంద్రస్థానముగా చేసుకొనదలచినాడు.

వేశ్యావాటికలో తలమానికమువలె కనబడుచున్న శిబిరము రాజ

నర్తకి మోహనది. ఆమె శిబిరము దేవేంద్రుని అంతఃపురమువలెనున్నది. నేలపై రత్నకంబళమును పరచియున్నారు. చుట్టునూ కెంపువర్ణపు తెరలను కట్టియున్నారు. పట్టుబట్టలతో కూర్చబడిన మెత్తటి దూదిపాన్పులు విలాసపురుషులకు స్వాగతమును పలుకుచున్నవి. ఆమె శిబిరంలో నృత్యగానములు విరామము లేకుండా సాగుచునేయున్నవి. ఆమె యువరాజు దేవరాయల పెద్దకుమారుడైన భాస్కరరాయల విశేషానుగ్రహమునకు పాత్రురాలైనందువలన, గణుతికెక్కిన వారుతప్ప, తక్కిన వారెవరూ ఆవైపు నడయాడుటలేదు. అయిననూ అచ్చట జరిగెడి నృత్యసంగీతములకొరకై ఉన్నతాధికారులు,సుప్రతిష్ఠిత వ్యక్తులు నియమితకాలమందు వచ్చి వెళ్ళుటకు వీలుండెడిది. తక్కిన సమయములలో ఆమె శిబిరములోకి ఎవరికీ ప్రవేశములేదు.ఆమె శిబిరమును ఆయుధపాణులైన భటులు సర్వదా కావలి కాయువారు. వారి అనుమతిలేక ప్రవేశించినవారు మరణదండనకు గురి చేయబడుదురు. ఖాజీ మోహనద్వారా తన పన్నుగడ సాధించ చూచినాడు.

సుమారు నలుబదేండ్ల వయసు వచ్చిననూ చూచుట కతడు యింకనూ యిరువదియైదు సంవత్సరములు నిండని యువకునివలె కనబడుచున్నాడు. అతని వదనము గంభీరమైనది. ఆ కనులకు ఎంతటి హృదయమునైననూ భేదించుశక్తి గలదు. మోహన పరిచయమును సంపాదించుకొనుట కతడు విటపురుషునివలె అలంకరించుకొని, ఆ సాయంకాలము రసికుల కొరకై ఏర్పాటు చేయబడిన నృత్యమునకు వెళ్ళినాడు.

నృత్యమును చూచుటకు యింకనూ చాలామంది సుప్రతిష్ఠిత వ్యక్తులు వచ్చినారు. నృత్యప్రదర్శన ముగిసిన తర్వాత మోహన ప్రేక్షకులలో కనబడిన క్రొత్తముఖమును చూచి కుతూహలమును వ్యక్తపరచినది. "వీరు మన శిబిరములలో క్రొత్తగా దుకాణము తెరచిన రత్న వ్యాపారులు. పేరు గోపాలదాసులు" అని వెంటవచ్చిన సంగడికాడు ఖాజీని మోహనకు పరిచయము చేసినాడు. ఈమాట విని మోహన ముఖము వికసించినది. తన అభిమానులలో ఒక క్రొత్త వ్యక్తి చేరినా

డని, అతనికి గాలంవేసి ఎక్కువ డబ్బు దోచుకొనవచ్చునని. ఆమె మనోభావములను క్షణమాత్రమున గ్రహించిన ఖాజీ తన సంచిలోనున్న జేబురుమాలును వెలికితీసి, అందులో చుట్టిపెట్టిన ఒక చిన్న పెట్టెనుండి రెండు మంచి ముత్యములను తీసి మోహనకు కానుకగా యిచ్చినాడు. వాటిని మోహన తల్లి తీసుకొనుచూ—

"మీ పరిచయ భాగ్యము కలిగినందుకు చాలా సంతోషం. అప్పుడప్పుడూ వచ్చి వెళ్ళుచు !" అని యనినది.

ఖాజీ అర్ధగర్భితమైన నవ్వు నవ్వి అచ్చటినుండి వెళ్ళిపోయినాడు.

కాని మోహన సాన్నిధ్య సుఖము అంత సులభముగా అందరికీ లభించుటలేదు. ఆమె రాజనర్తకి యగుటవలననూ, రాజకుమార భాస్కరరాయల విశేషానుగ్రహమునకు పాత్రురాలైనందువలననూ అతనిని తప్ప కన్నెత్తి చూచుటకు వీలులేకపోయినది. వెలయాలైననూ ఆమె ప్రేమ భాస్కరరాయలకు ఒక్కనికి మాత్రమే పరిమితమైనది. అతడామెను సుఖభోగాలతో పోషించుచూ వచ్చినాడు. ఆమెకు కొరత కలుగకుండా చూచుకొన్నాడు. కాబట్టి ఆమె యితరులకు కొంగు పరచవలసినంతటి యగత్యము లేకపోయినది. అయిననూ మోహనతల్లి వృత్తిసహజమైన ధనమోహముచే మోహన నృత్య-గానములతో రసికుల మనస్సును రంజింపజేసి, ఆ మూలముగా ఎక్కువ ధనమార్జించసాగినది. ఇటువంటి కచేరీలేవైననూ భాస్కరరాయలు అచ్చటికి రాని సమయములలో మాత్రమే సామాన్యముగా జరుగుచుండెడివి. ఎవరైననూ సరియే ! రాత్రి మొదటిఝాము దాటిన తర్వాత మోహన అంతఃపురమును ప్రవేశించుటకు వీలులేదు. ఆమె సహవాసము భాస్కరునికి మాత్రమే ప్రత్యేకింపబడినది. అతడులేని సమయములలో రసికులు మోహన మోహన రూపమును చూచి మనస్సున ఆనందపడెడివారు. ఈ మాత్రపు బాహ్య సుఖముతో వారు తృప్తిపడవలసి వచ్చినది. అంతకంటెనూ ఎక్కువగా వారు కోరిననూ లభించెడిదికాదు.

ఒకరోజు అందరూ వెళ్ళిపోయిననూ ఖాజీ యింకనూ అచ్చటనే కూర్చొనియున్నాడు. ఇది చూచి ఒక దాసి లోపలనున్న మోహన తల్లి

కి విషయమును తెలియజేసినది. అతడు పచ్చకప్పుర విడెముకొరకై బహుశా కాచుకొని యుండవచ్చునని భావించి, ఆమె తనే స్వయముగా వచ్చి విడెమును మడిచి యిచ్చినది. అయిననూ ఖాజీ వెళ్ళుసూచన కన బడలేదు. ఒకవైపు రాత్రి మొదటిఝాము దాటుచున్నది. మోహన తల్లి హృదయము దడదడ లాడసాగినది. తమ యింటి పద్ధతి తెలిసియూ గోపాలదాసు ఎందుకీ విధముగా హఠముపట్టి కూర్చున్నాడనునది తెలి యక పోయినది.

మోహన తల్లియే పలుకరించినది :

"శ్రీమంతులూ, మాయింటి పద్ధతి మీకు తెలియుననుకొందును. మేము రాజకుమార భాస్కరరాయలకు ఆశ్రితులము. వారికి తెలియని విధముగా, గోప్యముగా మోహన నృత్యగానములు జరుగుచున్నవి. అంతియేకాని రాత్రి మొదటిఝాము గడచిన పిమ్మట ఎవరునూ ఇచ్చట నిలచుటకు వీలులేదు. ఈ విషయము రాజకుమారులకు తెలిసిన మన ఉభయుల తలలు ఎగిరిపోగలవు. తమరు దయయుంచి...."

"వెళ్ళుటకు నా అభ్యంతరమేమియునూలేదు. కాని, మోహనతో నాదొక ప్రార్థన గలదు. దయయుంచి ఆమెను పిలువగలరా ?"

"మోహన భోజనము చేయుచున్నది.మీరు చెప్పదలచినదేదియో నాతోనే చెప్పవచ్చును"

"అది చాలా ఆత్మీయమైన విషయము"

"నాతో చెప్పుటకు సంకోచమైన క్షణమాగుడు.మోహననే పిలువ గలను" అని ఆమె అచ్చటినుండి లేచి వెళ్ళినది.

"మోహన అనుగ్రహమేకాదు; మీ అనుగ్రహముకూడా నాకు కావలయును"

"అయిన మీరు చెప్పవలయుననుకొన్నది ఈ'అనుగ్రహ'విషయ మేనా ?" ఆమె అర్థగర్భితముగా చూచినది.

"హుం....నేను మూడు మాసములుగా విరహవ్యథతో కృంగి పోవుచున్నాను. మోహన సాన్నిధ్య సుఖమునకై పరితపించుచున్నాను. అందుకై ఎంత ధనము వెచ్చమైననూ సరియే ! ఒక్కరోజు....ఒకేఒక

రాత్రి....ఆమె నావశమైనచో....నా యంతటి అదృష్టశాలి యింకొక డీ జగత్తున నుండడు. దీనికై నా సర్వస్వమునూ అర్పించగలను - నీవు కృప జూపవలె. ఈ విరహవ్యధ సహించుటకు నావలన సాధ్యము కాకున్నది" అని భారముగా నిట్టూర్చినాడు.

ఇది విని మోహని తల్లి శ్రీమంత గోపాలదాసులకు ఏనాడో మోహన పిచ్చి పట్టినదని అనుకొన్నది.

"అది వినా, వేరేమికోరిననూ మోహన శ్రీమంతుల సేవకు సిద్ధముగా నున్నది" అన్నదామె.

"అయిన దప్పిగొని వచ్చిన వానినట్లే వెనుకకు పంపెదరా ?"

"ఆకలిగొని వచ్చినవారికి అన్నము లేదనుట మా కులవృత్తి కాదు. అయిననూ ప్రస్తుత పరిస్థితిలో మేము మరేమియునూ చేయలేము"

"ఎందులకు ?"

"మేము రాజకుమారుల ఆశ్రితులము"

"కాని మీరు నిత్య సుమంగళులు. మీప్రేమ ఒకే వ్యక్తికి అంకితమైనదికాదు"

"ఈ నియమము సామాన్య వేశ్యలకు అన్వయించగలదు. కాని, మేము రాజనర్తకీ మణులము. అంతఃపురపు ఉప్పుతిని పెరిగినవారము. ఈ శరీరమేమైననూ ప్రభువుల సేవకే ప్రత్యేకించబడినది"

"అయినచో నే నిచ్చటికి వచ్చుటకు మీరెందుకు ప్రోత్సాహమిచ్చినారు ? ప్రతిసారియు ఎందుకుత్తేజ పరచినారు ?"

"శ్రీమంతులు కళను మెచ్చి యిచ్చిన కానుకను గ్రహించుట యపరాధమా ?"

"అంతకన్న మరే ఉద్దేశ్యమునూ లేదా ?"

"ఖండితముగా లేదు"

"అయినచో నన్నెందులకు అప్పుడప్పుడూ రమ్మని ఆహ్వానించినారు ?"

ఈ మాటకు మోహన తల్లి వెంటనే జవాబు చెప్పజాలక తట పటాయించినది.

"నావద్దనున్న ధనముకొరకా ?" ఖాజీ మరల ప్రశ్నించినాడు.

"నిజము పల్కినచో శ్రీమంతులు విసుగుపడరాదు. మీ మాటలు సత్యములు"

"ధనమునకు మీకళ లభించినట్టే. మీ ప్రేమకు మూల్య మెంతయో ?"

"దానిని మేము విలుచుటకు చూపెట్టలేదు"

"అయినచో నేను వెళ్ళెదను ?"

"మీ యిష్టము !"

"ఇచ్చట నిలచుమన్ననూ వద్దనుచున్నారు. వెళ్ళుదమన్ననూ వద్దనుచున్నారు. ఏమి ఈ మాటలకర్థం ?"

"శ్రీమంతులు కోపపడరాదు. వాస్తవమును విన్నవించుకొను చున్నాను. మేము భుజించెడి అన్నములో మీ ఋణముకూడా కలిసియే యున్నది. మూడు మాసములనుండి మీరు మా కనేక విధములైన బహు మానములనూ, వస్త్రాభరణములను యిచ్చినారు. మీ మైత్రిని వదలు కొనుట మా కిష్టములేదు. మీవంటి రసికులను పోగొట్టుకొనుట యనిన మాకు చాలా విచారకర విషయము"

"అయినచో నేను వెళ్ళుట మీకు సంతోషకరము కాదా ?"

"కాదు !"

"అయిన నే నిచ్చటనే నిలువవలెనా ?"

"మీరు మమ్ములను ధర్మసంకటములో పెట్టుచున్నారు. సర్వ మునూ తెలిసినవారు. అయిననూ పసిబిడ్డవలె హఠం చేయుచున్నారు. తెలిసిన వారికి చెప్పుటకు మేము సమర్థులము కాము. మీరిప్పుడు లభిం చుచున్న దానితోనే ఎందుకు తృప్తి చెందరాదు ? అట్లుచేసిన ఉభయు లకూ క్షేమకరము"

"అనిన నృత్యసంగీతములను చూచుకొనుచునే ?"

"ఔను !"

"అయినచో మోహన వేశ్యకాదు ! రాజకుమార భాస్కరరాయల భార్య !" అని వ్యంగ్యముగా అన్నాడు.

"రెండింటి అర్థమూ ఒకటే ! మోహన వారి భోగకాంత"

"మాకు ?"

"మిత్రురాలు !"

"నేను ఈ మైత్రి కొరకై రాలేదు"

"అయిన మీయిష్టము. నే నింతకంటే నెక్కువగా చెప్పుట కసమర్థురాలను"

"ఎందరినో వెలయాండ్రను చూచినాను.కాని పెండ్లాడని భర్తకై యింత నిష్ఠ గలిగియుండుటను ఎచ్చటనూ చూడలేదు"

ఈ మాటలకు మోహన తల్లి నవ్వినది.

చాటున నిలచి ఈ మాటలన్నియునూ విన్న మోహన అచ్చటికి వచ్చినది.

"మోహనా ! ఎట్లును వచ్చినావు. నీవే చివరి తీర్మానమును చెప్పివేయుము" అని ప్రణయోన్మాదములో గోపాలదాసు అన్నాడు.

"నేను చెప్పునదేదియో అది మా తల్లిగారే చెప్పినారు"

"అయినచో అదే అంతిమ తీర్మానమా ?"

"ఔను !"

"పోనిమ్ము, నాదొక కోర్కెగలదు.దానినైననూనెరవేర్చగలవా?"

"ఏమికోర్కె ?"

"మోహనా ! నీవు నాదానవు కాకపోయిననూ చింతలేదు. ఇంత నిష్ఠగా నీవు సేవచేయుచూ వచ్చిన రాజకుమార భాస్కరరాయలను నా కొకసారి పరిచయం చేయగలవా ?"

"ఎందులకు ?"

"నీ సౌందర్యా రాధకుడైన ఆ భాగ్యశాలిని చూచి సంతోషించెదను"

"మీరు భాస్కరరాయలను వారి శిబిరములో కలుసుకొనవచ్చును"

"నీవే వారి పరిచయమును చేయవలెనని నాయాశ. ఈమాత్రపు కోర్కెను నెరవేర్చలేవా ?" అని దైన్యముగా ప్రార్థించినాడు.

"సరే కానిమ్ము. కాని వారు యిచ్చటనుండగా ఒక పురుగైననూ వచ్చుటకు సాధ్యపడదు. మీకు వారి పరిచయము కావలయుననిన మీ వేషము మార్చవలసి యుండును"

"అందుకు నేను సిద్ధముగా నున్నాను"

"మీరు స్త్రీ వేషం ధరించవలసి యుండును"

"సంతోషముగా ధరించెదను. చిన్నప్పుడు నాటకాలలో స్త్రీ వేషములు వేసి నా కనుభవమున్నది"

"అయిన చాలా అనుకూలమే అయినది. మీకు సంగీతము వచ్చునా ?"

"ఎందులకు ?"

"పాడుటకు వచ్చియుండిన మరింత మంచిది. రాజకుమారులు గానప్రియులు ! వారిని సంగీతముతో సులభముగా వశపరచుకొనవచ్చును"

"నాకు ఉత్తరాది సంగీతము మాత్రమే వచ్చును"

"రాజకుమారులు మంచి సంగీతాభిమానులు. వారికి ఉత్తరాది సంగీతముకూడా ప్రియకరమే !"

"అయిన నేను సోనాబాయి వేషంలో రాజకుమారులను ఆశ్చర్యగొలిపెదను"

"అట్లేకానిండు" అని గోపాలదాసును ఆ తల్లీ-బిడ్డలు వీడ్కొలిచ్చి పంపినారు. అతడు వెళ్ళిన తర్వాత "మంచి పిచ్చివాడే"అని చెప్పుకొని తమలో తామే నవ్వుకొన్నారు.

అంతయు వారి పన్నుగడ ప్రకారమే జరిగినది. రాజకుమార భాస్కరరాయలు సోనాబాయి సంగీతము వినుటకు ఆతురుడైయున్నాడు. ఆమె అనేక రాజాస్థానములలో మన్ననపొందిన గాయకురాలని అందరూ అనుకోసాగినారు. నిర్ణీత సమయమునకు సరిగా భాస్కరరాయలు తన ఆప్తమిత్రులతో వచ్చి సుఖాసీనుడైనాడు. వేదికమీద గాయకురాలు కూర్చొని యున్నది. ఆమెకొకవైపున ఒక సితారు వాద్యగాడు, మరొకవైపున మార్దంగికుడు కూర్చొనియున్నారు. గాయకురాలి ప్రాస్తావిక

పరిచయమైన తర్వాత సోనాబాయి తన మధురగాత్ర తరంగములతో శ్రోతలకు తన్మయత్వము కలిగించినది. అందరూ ఆమె కంఠ మాధుర్యమునకు నిశ్చేష్టితులైనారు. నిజముగా ఆమె ఒక ఉత్తమ గాయకురాలని గ్రహించినారు. వారు ఆమె శ్రావ్యమైన రాగరసపాన మూర్ఛితులై కూర్చొన్నారు.

ఉన్నట్లుండి ఒక్కసారిగా వారి భావనసమాధికి భంగము వాటిల్లినది. ఆ కళామందిరములోని దీపము లొక్కసారిగా ఆరిపోయినవి. కారు చీకటి క్రమ్ముకొన్నది. ఒకరి ముఖము లొకరికి కనుబడుటలేదు. ఒకరి ధ్వని మరియొకరికి వినబడుటలేదు. సంగీతము హఠాత్తుగా ఆగిపోయినది. ఏవైపు చూచిననూ కేకలు, పెడబొబ్బలు, గడబిడలు. క్షణకాలము అందరూ తిమిరగర్భంలో చొచ్చినట్లయినది. ఉన్నట్లుండి ఎవరో బిగ్గరగా అరచినారు. "అయ్యో, చచ్చితిని!" అని. "దీపములను తీసుకొని రండు! దివిటీలను తీసుకొని రండు!" అని నాలుగైదు గొంతుకలు వినిపించినవి. వాస్తవముగా జరిగిన విషయమేమియో ఎవరికియునూ తెలియదు. ఎవరో పరుగున వెళ్ళి దివిటీలను తీసుకొని వచ్చినారు. వాటి మందప్రకాశములో కనబడిన దృశ్యము హృదయ విదారకమైనది. ఎవరో దురాత్ములు రాజకుమార భాస్కరరాయలను హత్యచేసినారు. భాస్కరరాయలు రక్తపు మడుగులో పడియున్నాడు. విషపూరితమైన బాకు హృదయమును భేదించి, అతనిని ఆహుతి తీసుకొన్నది. ఆ హత్య చేసిన వారికొరకై చుట్టునూ కలయజూచినారు. వేదికమీద వుండిన గాయకురాలు, ఆమె ప్రక్కన వాద్యగాండ్రును లేరు. అందరునూ వారికొరకై వెతికినారు. ఎంతవెతికిననూ ఆ చీకటిలో వారు కనబడలేదు. అందరి కనులూగప్పి తప్పించుకొన్నారు. వారి పథకము ప్రకారమే అన్నియూ జరిగినవి. దీపములు హఠాత్తుగా ఆరిన వెంటనే వారు భాస్కరరాయలను హత్యచేసి, చీకటిలోపడి తప్పించుకొని పారిపోయినారు.

ఈ సమయములోనే సైనిక శిబిరములలో మరొకవైపునుండి కేకలు, ఆర్తనాదములు వినబడినవి. స్కంధావారములో పలుచోట్ల నిలు

వెత్తు మంటలు లేచినవి. "శిబిరములకు నిప్పంటుకొన్నవి" అని అను కొనుచూ సైనికులు దాని నార్పు గడబిడలోనున్నారు.

ఈ సమయము చూచి, శత్రుసైన్యములు తెప్పలమీదను,దోనెల మీదను దాటివచ్చి హిందూసేనలను హఠాత్తుగా ముట్టడించినవి. చేతికి చిక్కిన వారిని చీల్చి చెండాడుతూ, అడ్డుతగిలిన శిబిరములకు నిప్పంటించుచూ "దీన్, దీన్" అని అరచుకొనుచూ వారు ముందుకు దూకి వచ్చుచున్నారు. ఎటు జూచిననూ శత్రువుల విజయఘోష, హిందూసైనికుల ఆర్తనాదములు. ఉన్నట్లుండి!'దేవరాయలు శిబిరములో హత్య గావింపబడినాడ'ను వార్త పొక్కినది. ఈ వార్తవిని హిందూసైనికు లధీరులై నారు. ఇది నిజమని భావించి, యిక తమకు అంత్యకాలము సమీపించినదని భీతిల్లి దిక్కుకొక్కరై పారిపోసాగినారు.

సైనిక శిబిరములలో అవ్యవస్థ తలజూపినది. దేవరాయలే స్వయముగా నిలచి తను హత్యగావింపబడినాడను వార్త అబద్ధమని అరచిననూ ఆ చీకటిలో ఎవరూ ఆ మాటను నమ్మలేదు. భీతిల్లి పారిపోవుచున్న సైనికులను అదుపులోనికి తీసుకొని రాలేక దేవరాయలు శిబిరమును విడచి వెళ్ళిపోవలసి వచ్చినది. అతడు శిబిరమునుండి తప్పించుకొనుటయూ, శత్రువులతని శిబిరమును ప్రవేశించుటయూ రెండునూ ఏక కాలములో జరిగినవి.

దేవరాయలను చెరబట్టుటకు ఫిరోజ్‌షా పన్నిన పన్నుగడ విఫలమైనది. అయిననేమి ? అతని అమూల్య శిబిరములు శత్రు హస్తగతమైనవి. యుద్ధము లేకయే విజయనగర సేనలు శత్రువులకు భీతిల్లి పారిపోయినవి. చివరకు సెంన్‌జీ చేసిన కుట్ర ఫలించినది. ఈ యుద్ధములో దేవరాయలకు అపారమైన నష్టము సంభవించినది. పెద్దకుమారుడు భాస్కరరాయల దారుణహత్య జరిగినది. అంతియేకాదు, అతని ముఖ్య సైన్యాధిపతు లనేకులు మరణించినారు. మునల్మానులతో సంధి చేసుకొనుటకు రాయచూరు, ముద్గల్లులను వదలుకొన్నదేకాక వదిలక్షల వరహాలను పరిహారద్రవ్యముగా యివ్వవలసి వచ్చినది. ఈ పరాభవ

మును మరచిపోవుటకు ఎంత ప్రయత్నించిననూ దేవరాయలవలన సాధ్యముకాక పోయినది. అది అగ్నిజ్వాలవలె అతని హృదయమును దహించుచునే యున్నది.

# పెండ్లి పెత్తనము

## 5

"ప్రభూ ! నేను తీర్థయాత్రా సమయములో అనేక దేశములను తిరిగినాను.కాని ముద్గల్లులో నేను చూచిన పార్వతివంటి కన్యారత్నమును మరెచ్చటనూ యింతవరకూ చూచియుండలేదు" అని శ్యామాదీక్షితులు తమ మాటల కుపోద్ఘాతమును ప్రారంభించినారు.

"దీక్షితులూ, నే నడిగినది ఆడుదాని విషయమును గురించికాదు. అరివీరుల స్థితిగతులను గురించి. మీరేదియో స్త్రీ విషయమును చెప్పుచున్నారు"

"నేను ముద్గల్లును గురించి చెప్పుచున్నాను ప్రభూ !"

"ముద్గల్లు విశేషమేమి ? అచ్చట శత్రుసైన్య మేసంఖ్యలో నున్నది ? దానిని సులభముగా మనము వశపరచుకొన వచ్చునా ?"

"ముద్గల్లు విషయము చెప్పుటకు ముందు పార్వతిని గురించి కొంత చెప్పవలసియే యున్నది ప్రభూ !"

"ఎవరా పార్వతి ?"

"ఆమె ఒక అపూర్వసుందరి. సర్వలక్షణ సంపన్న - నారీమణులలో ఉత్తమురాలైన ఉవిద.తమవంటి సామ్రాట్టులకు భార్య కాదగినది" అని ఆ వరవర్ణిని వర్ణనకు ప్రారంభించినాడు. ఈ వర్ణనవిని స్వభావతః రసికుడైన దేవరాయల నోట నీరూరినది.

"దీక్షితులూ, ఆ దేవకన్య ఎవరు ? ఆమె ఎవరిబిడ్డ ?" కుతూహలముతో ప్రశ్నించినాడు.

"ప్రభువులు శిల్పిసిద్ధాంతి తిమ్మోజీగారి పేరు వినియుండవచ్చును"

"లేదు"

"వారు విజయనగరములోకూడా ఒకటి రెండు దేవాలయములను నిర్మించియున్నారు. తమకు పూర్వముండిన ప్రభువులు వారికి ఆశ్రియమిచ్చి యుండిరి"

"ఏమీ, మీరు చెప్పుచున్న స్త్రీ ఆ కంసాలి కుమార్తెయా ?"

"ప్రభూ ! కంసాలి కుమార్తెయని మీరా సౌందర్యనిధిని ఉపేక్షించరాదు. ఆమె మానవాంగనకాదు, శాపగ్రస్తయై పుట్టిన సురసుందరియై వుండవలె లేనిచో వారి గర్భమున అంతటి నారీరత్నము జనించుటనినేమి ?"

"ఆమె అంత రూపవతియా ?"

"ఆ విషయము నేను చెప్పుటకన్నను రసికులైన తమరే చూచిన బాగుగా నుండగలదు"

"మీ వర్ణనను విని మాకామెను చూడవలెనను కాంక్ష గలిగినది"

"ఒకసారి మీరామెను జూచిన ఆమెకొరకై రాజ్యకోశములను సైతము వదులుకొనగలరు. ఆమె యంతటి అనుపమ రూపవతి !"

"అయినచో నేనామెను పొందియే తీరవలయును"

"అంతటి సౌందర్యనిధి తమవంటివారి వద్ద నుండవలయుననియే నేనింత చెప్పుట. సామ్రాజ్యపు అనర్ఘ్య నిధులూ, అపూర్వ వస్తువులూ రాజ్యక్షేమముకొరకై సామ్రాట్టుల సొత్తయి యుండవలెనని పెద్దల వాక్కు. తమరు ఆమెను వివాహమాడి, అంతఃపురమునకు చేర్చిన అంతఃపురమునకే ఒక వినూత్న శోభ చేకూరగలదు"

"కాని...."

"ఎందుల కనుమానించుచున్నారు ?"

"నాకోరిక నెరవేరగలదా ?"

"ప్రభువు లీ విషయమై సందేహించవలసిన పనిలేదు. తమవంటి సామ్రాట్టులు తనను వివాహమాడ గోరుచున్నారని తెలిసిన ఆమె సంతోషముగా తమ చరణదాసి కాగలదు. నేనామె జాతక చక్రమునుకూడా పరీక్షించినాను. ఆమెకు రాజయోగమున్నది. సార్వభౌముల పత్ని కాగలదని తిమ్మోజీ దంపతులకు కూడా చెప్పినాను"

"అయిన నే నామెను కోరుటలో తప్పులేదుకదా ?"

"సార్వభౌములు దైవాంశ సంభూతులు. వారెప్పుడైననూ సామాన్య స్త్రీ మీద మోహము జెందగలరా ? ఆమె తక్కువ కులములో పుట్టిననూ తమను చేబట్టుటకు అన్నివిధములా తగియున్నది."

"ఆమె అర్హతను గురించి నేను సందేహించుటలేదు దీక్షితులూ ! నా యోగ్యతను గురించియే ఆలోచించుచున్నాను...."

"అట్లనుచున్నారేమి ప్రభూ ?"

"దీక్షితులూ, బాల్యమునుండి మీరు నన్ను బాగుగా నెరిగినవారు. మీతో దాపరికమెందులకు ? మునుపటి నుండియు స్త్రీ యనిన నా చిత్తము చెప్పిన మాట వినదు ! నేను పార్వతిని కోరుట అవివేకము కాదా ?"

"అవివేక మెందుకు కాగలదు ప్రభూ ?"

"ఇంకేమి కాగలదు, దీక్షితులూ ! నేను ఈడువచ్చిన బిడ్డల తండ్రినైనాను. నాకిప్పుడు దాదాపు ఏభై సంవత్సరాలు సమీపించుచున్నవి. ఈ వయసున నేను పదునెనిమిదేండ్ల ప్రాయపు కన్యను కోరిన అది యవివేకము కాదా ? పార్వతి సైతము నన్ను పెండ్లాడ సమ్మతించగలదా ?"

దేవరాయల శంక యథార్థమైనదే. అతని కిప్పుడు నలుబది అయిదవ సంవత్సరము నడచుచున్నది. ఇదివరకే అతనికిశాస్త్రోక్తముగా వివాహమాడిన నల్వురు భార్యలు, అనేకమంది భోగకాంతలు వున్నారు. వారిలో హేమాంబిక గర్భమున వీరవిజయుడను కుమారుడూ, ఒక కుమార్తెయూ జన్మించినారు. మరొక పత్ని మల్లాంబికకు వీరమల్లప్ప అను కొడుకు పుట్టినాడు. భీమాదేవి అను మరొక జైనపత్ని పండితా

చార్యుల శిష్యురాలైనది. వీరుకాక పంపాదేవి, అన్నలాదేవి యను మరి ద్దరు పత్నులుకూడా నున్నారు. అన్నలాదేవి కుమారుడు భాస్కర రాయలే కిందటి యుద్ధమున ముసల్మానుల మోసకృత్యమునకు చిక్కి మరణించినవాడు.

పిల్లలందరూ పెరిగి పెద్దవారైనారు. వారిలో చాలమంది సామ్రా జ్యపు వేరు వేరు భాగములను పరిపాలించుచున్నారు. వీరిలో వీర విజ యుడు యువరాజైనాడు. అతడు ముళబాగలు రాజ్యపు మాండలీకుడుగా వున్నాడు. మరొక కుమారుడు ముమ్మడి హరిహరుడు 'తెరకణాంబి' రాజ్యమును పాలించుచున్నాడు. ఇతని రాజ్యములో హొయిసలముకూడా చేరినది. వీరమల్లనకు చిత్రి దుర్గసీమ సంక్రమించినది. రామచంద్రు డను మరొక కుమారుడు ఉదయగిరి రాజ్యమును, ఇప్పటి బెంగళూరు లోని కొన్ని ప్రదేశములనూ పరిపాలించుచుండెను. ఈ విధముగా దేవ రాయలకు వయసున నున్న పుత్రు లనేకులుండుటచే, తను యీ వయ సున పార్వతిని వివాహ మాడగోరుట హాస్యాస్పదము కాదా ? అని ఆలోచించినాడు.

"ప్రభూ ! తమరీ విషయమై చింతించ పనిలేదు. తమకు వయస్సు ఎక్కువగా నున్ననేమి ? ఇంకనూ పరువము తరుగలేదు. తమను కీర్తిశేషులైన ఇమ్మడి హరిహర ప్రభువుల బింబ – ప్రతిబింబ భూతులని పిలుచుట తప్పు కానేరదు. తమరీ వయసున పార్వతిని పరి ణయ మాడుటకు సంకోచపడుచున్న ఆమెను ఉప పత్నినిగా స్వీక రించుడు. పార్వతి చిన్న పిల్లకాదు ! నవయౌవని, పూర్ణశరీరి ! సామ్రా ట్టులను చేబట్టుటకు ఆమె ఎన్నడూ తిరస్కరించదని నా భావన. యే యువతి చక్రవర్తి భార్య యగుటకు సమ్మతించదు ?...."

"ఆమె తలిదండ్రులీ సంబంధమునకు సమ్మతించగలరా ?"

"తమరికా సందేహ మక్కరలేదు. సార్వభౌములతో శరీర సం బంధ మేర్పరచుకొనుటకు ఎవరాతురత జెందరు? అదియును కాక పార్వ తికి రాజయోగ మున్నది. ఆమె సార్వభౌముల భార్య కాగలదని నేను వారికి చెప్పియున్నాను. మీరు పార్వతిని కోరిన తిమ్మాజీ దంపతులు

సంతోషముగా మీకు తమ కుమార్తెను ధారబోయగలరు. ఈ మాట యథార్థము!"

"మీరింత చెప్పిన తర్వాత పార్వతిని చేపట్టుటకు నేను సమ్మతించుచున్నాను. ఈ విషయమును తిమ్మోజీ దంపతులకు తెలియజేయుడు. మీరిప్పుడే మంగళద్రవ్యములను రాజమర్యాదతో తీసుకొని వెళ్ళి. వధువును రాజధానికి తోడ్కొని రండు. కావలసిన పరివారమును వెంట తీసుకొని వెళ్ళుడు. ఈ విషయముపట్ల అన్ని ఏర్పాటులనూ చేయుటకు నాగన్న దండనాయకులకు తెలుపగలను."

శ్యామాదీక్షితుల ముఖతః నవవధువు పార్వతి వర్ణన విన్నమీదట దేవరాయలకు తక్కిన సంగతులన్నియూ నిస్సారములుగా తోచినవి. అతడు క్షణకాలము రాజకీయ గొడవలను మరచి, పార్వతీ పాణిగ్రహణమునే తలచుకొనుచూ కూర్చొన్నాడు. ఆమె వర్ణనను విని. అతనికి ఎట్లయిననూ పరియే ఆమెను తనదానినిగా చేసుకొనవలెనను ఆశ జనించినది. ముద్దల్లు నందలి ఆ సురసుందరి ఎప్పుడు తన అంతఃపురము చేరగలదో నను తమకము అతని హృదయమున తలచూపినది. తొలిసారిగా విరహవేదన దేవరాయల హృదయమున తొంగిజూచినది. అతడు పార్వతిని గురించి యెన్నియో బంగారు కలలు కంటూ మైమరచి కూర్చొన్నాడు. శ్యామాదీక్షితులు అచ్చటినుండి వెళ్ళిన తర్వాత కూడ చాల సేపటివరకూ అతడచ్చటనే కూర్చొని వుండిపోయినాడు.

ఆ మరునాడే శ్యామాదీక్షితులు దేవరాయల ఆజ్ఞప్రకారం పార్వతిని రాజమర్యాదతో తోడ్కొని వచ్చుటకై మిత పరివారముతో ముద్దల్లుకు బయలుదేరినారు. వారి వెనుక మంగళ ద్రవ్యములనూ, తదితర విలువగల కానుకలనూ ఎత్తుకొని సేవకులు వెళ్ళినారు. ఈసారి దీక్షితులు రాజఠీవితో ముద్దల్లుకు వెళ్ళినారు. తమకు ఆదరాతిథ్యమొసగిన తిమ్మోజీ దంపతుల ఋణము నీ విధముగా తీర్చుకొనుట కవకాశము లభించినందుకు వారికి చాల సంతోషమైనది. తమ కన్యార్థిత్వము యశోవంతము కాగలదను వట్ల వారి కే సందేహమునూ లేదు. ఈ కన్యారత్నమును దేవరాయల కంఠరత్నముగా సమర్పించిన రాజఋణము, తిమ్మోజీ

దంపతుల ఆతిథ్యపు ఋణము రెండునూ తీరిపోగలవని వారు భావించినారు.

కొన్ని రోజులు ప్రయాణించి వారు ముద్గల్లును చేరుకొన్నారు.

తిమ్మాజీ-గౌరాంబలకు, వార్తయైననూ పంపక హఠాత్తుగావచ్చిన దీక్షితులనుచూచి, ఎట్లు స్వాగతము పలుక వలయుననునది తెలియక పోయినది. మునుపటి దీక్షితులకూ, యిప్పటి దీక్షితులకూ ఎంతయో భేదమున్నది. అప్పుడు దీక్షితులు క్షేత్రయాత్రకై బయలుదేరి వచ్చినారు. ఇప్పుడు రాజ పురోహితులుగా, రాజఠీవితో వచ్చియున్నారు.వారి వైభవము, శ్రీమద్గాంభీర్యములను చూచి తిమ్మాజీ దంపతులు చకితులైనారు. పల్లకీనుండి వారు దిగగానే యెవరో రాజపుత్రుడు దారితప్పి తమయింటికి వచ్చినాడని అనుకొన్నారు. దీక్షితుల తలకు చుట్టిన జలతారు రుమాలు, చెవినిగల వజ్ర కుండలములు, కంఠమున సన్న బంగారు రుద్రాక్షమాల, హస్తద్వయ మలంకరించిన నవరత్న ఖచితములైన కంకణములు, కప్పుకొన్న కాశ్మీరు శాలువ, ధరించిన పీతాంబరము వీటినన్నింటినీ చూచి, వారతనిని సమీపించుటకు సైతము భీతిల్లినారు. కాని దీక్షితులే వారిని పలుకరించి, వారి సంశయమును పారద్రోలినారు.

దీక్షితులను వారు విశ్వాసముతో ఆహ్వానించి, ఉచిత రీతిని సత్కరించినారు. అనంతరము దీక్షితులు తమ పరివారమువైపు చూచినారు. వారి చూపులోని అర్థమును గ్రహించిన పరిజనులు మేనాలోని వస్తువులను ఒక్కొక్కటిగా తెచ్చి తిమ్మాజీ దంపతుల ముందిడి,చేతులు కట్టుకొని నిలువబడినారు. ఆ వస్తు సముదాయమును చూచి తిమ్మాజీకి ఆశ్చర్యము కలిగినది.

"ఇవన్నియూ యెందులకు స్వామీ ?" అని ప్రశ్నించినాడు.

దీక్షితులు ఒక్కొక్క పళ్ళెరముమీది వస్త్రమునూ తొలగించినారు. ఒక పళ్ళెరములో అక్షింతలు,కుంకుమ,బంగరు అద్దము,గాజులు-గంధము, పూవులు మొదలగు మంగళ ద్రవ్యము లున్నవి. మరొకదానియందు రక రకముల ఫలము లున్నవి. వేరొక దానిలో పట్టుచీర, రవికె, విలువగల పీతాంబరములు, సొమ్ములు వున్నవి. ఈ వస్తువుల

నన్నింటిని బంగరు పళ్ళెరములలో అమర్చి, వాటిమీద అల్లిక పనిచేసిన పట్టుబట్టలను కప్పియుంచినారు. వాటిని చూడగానే గౌరాంబ హృదయము సంతోషముతో పరవళ్ళు త్రొక్కినది.

"ఇవన్నియునూ ఎవరికొరకు దీక్షితులూ ?" అని గౌరాంబ కుతూహలముతో ప్రశ్నించినది.

"ఈ వస్తువుల నన్నింటినీ సామ్రాట్ దేవరాయ ప్రభువులు మీమీద అనుగ్రహించి పంపినారు తల్లీ !"

"ప్రభువులు మామీద ఎందులకు అనుగ్రహం చూపినారు ?"

"మీ కుమార్తె కీర్తి అంతటిది తల్లీ !"

"అనిన ?"

"మీ కుమార్తె అదృష్టము గొప్పది తల్లీ ! సామ్రాట్ దేవరాయ ప్రభువులు మీ కుమార్తెను చేబట్టుటకు సమ్మతించినారు"

"మీరు చెప్పునదేమి దీక్షితులూ ?"

"ఔనమ్మా ! పంపాపతి సాక్షిగా నామాట సత్యము. మీ కుమార్తె అదృష్టము గొప్పది. ఆమె సార్వభౌముల పత్ని కాగలదని నేను చెప్పిన మాట చివరకు నిజమైనది"

"స్వామీ ! మీ మాట లొక్కటియునూ నా కర్థమగుటలేదు. వివరముగా చెప్పుడు. మీరు శ్రీశైలయాత్రకని వెళ్ళుచూ మా వద్దకు వచ్చినారు. తర్వాత ఏమైనది ?"

తిమ్మోజీ కుతూహలము నాపుకొనలేక ప్రశ్నించినాడు.

"స్వామి అనుగ్రహముచే యాత్ర సాంతముగా నెరవేరినది. అనంతరము నేను విజయనగరమును చేరి, ప్రభువులకు తీర్థప్రసాదముల నిచ్చినాను. నా క్షేత్రయాత్రా విషయములను ప్రభువులకు వర్ణించి చెప్పు నప్పుడు ప్రసంగ వశమున మీసంగతి కూడా వచ్చినది. మీరు మాకు చేసిన అతిథి సత్కారములను ప్రభువులకు నివేదించినాను. వారు సుప్రసన్నులైనారు. మీ కుమార్తె పార్వతి విషయముకూడా చెప్పినాను.

ప్రభువు ఉదార హృదయులై మిమ్మనుగ్రహించినారు. చివరకు నేను ఆనాడు చెప్పిన జాతకఫలము నిజమైనది"

ఈమాటవిని గౌరాంబకు సంతోషముతో మేను పులకరించినది. ఆమె కుమార్తె అదృష్టమును తలచుకొని ఆనందబాష్పములు రాల్చినది. ఈ విషయములను తెలియజేయుటకై ఆమె కుమార్తెను పిలుచుచూ పెరటిలోకి వెళ్ళి, ఆమెను కౌగిలించుకొని, సంతోషముగా "చూడు తల్లీ! ఎవరు వచ్చినారో ?" అని చెప్పి ఆమె చేయిపట్టి పిలుచుకొని వచ్చి దీక్షితులను చూపినది.

పార్వతి శ్యామాదీక్షితులను చూచి నిశ్చేష్టితురాలైనది. వారి వేషభాష కంటెనూ, వారు తెచ్చిన వస్తుసముదాయములను చూచి ఆమె నిర్విణ్ణయైనది"

"ఇవన్నియునూ ఎవరికొరకు ? ఎవరు పంపినారు స్వామీ ?" అని నిట్టూర్చినది పార్వతి.

"ఇవన్నియునూ సామ్రాట్ దేవరాయలు నీకు కానుకగా పంపినారమ్మా !" అన్నది ఆమె తల్లి.

"ఎందుకమ్మా ఈ కానుకలు ? అంతటి ప్రసంగము యిప్పుడేమి వచ్చినది ?"

"తల్లీ, నీభాగ్య భవన ద్వారములు తెరువబడినవి. సార్వభౌములు నీమీద అనుగ్రహం చూపినారమ్మా !" అని అన్నది గౌరాంబ.

"వారు నామీద ఎందుకు అనుగ్రహము చూపవలెనమ్మా ?"

"వారు ఉదార హృదయులై నిన్ను పెండ్లాడుటకు సమ్మతించినారమ్మా !"

"నన్నెందులకు వారు వివాహమాడవలె ?"

ఏమి ప్రశ్న ? ! ఇటువంటి అర్థములేని ప్రశ్న పార్వతి వేయగలదని గౌరాంబకాని, దీక్షితులుకాని నిరీక్షించలేదు.

"నీకు రాజయోగమున్నది తల్లీ! అందువలననే ప్రభువుల కృపాకటాక్ష వీక్షణము నీమీద ప్రసరించినది. నిజముగా నీవు సౌభాగ్యరాలవు !" అని దీక్షితు లనినారు.

"నాకెవరి కృపాకటాక్షమూ అక్కరలేదు స్వామీ! నా పాటునకు నన్ను వదలిన మీకు వేయి నమస్కారములు !"

ఈ మాటవిని దీక్షితులకు వేయి వృశ్చికము లొక్కసారిగా కుట్టి నట్టయినది.

గౌరాంబకు కూడా కుమార్తె మాటవిని పిడుగుపడి నట్టయినది.

"ఏమిది? పిల్లాబయా పార్వతీ? నీవు ఎవరితో మాట్లాడుచున్నావు? ఏమి మాట్లాడుచున్నావు ? అనునది తెలియునా ?" అని ఆమె కటువుగా అన్నది.

"ఎవరితో మాట్లాడుచున్నదీ నాకు బాగుగా తెలుయునమ్మా ! నా కేసామ్రాట్టు కృపయూ అక్కరలేదు"

"ఎందులకు తల్లీ ?"

"నే నే సార్వభౌములనూ పెండ్లాడ దలచలేదు"

"నీకు పిచ్చిపట్టలేదు కదా?" అని గౌరాంబ కోపముగా అన్నది.

"అంతస్తు-అధికారముల పిచ్చి పట్టియున్నది నీకుగాని; నాకు కాదు" అని పార్వతి అచ్చట నిలువక సుడిగాలివలె పెరటిలోకి వెళ్ళి పోయినది. ఆమె ప్రవర్తనకు శ్యామా దీక్షితులూ, గౌరాంబయూ ఆశ్చర్య పోయినారు.

ఈ మాటలన్నియు మౌనంగా వింటూ కూర్చొనియున్న తిమ్మోజీ అన్నాడు :

"స్వామీ ! పార్వతి మూర్ఖప్రవర్తన వలన మీ మనసునకు బాధ కలిగియుండిన క్షమించ ప్రార్థన ! ఆమెకు ఎవరితో ఎట్లు మాట్లాడవలెనో తెలియదు. ఆమె అవివేకపు మాటలకు మీరు విసుగుజెందకుడు. బహుశా ఆమె కీ సంబంధము యిష్టములేదేమో ! లేనిచో ఆమె ఈ విధముగా ధిక్కరించి మాట్లాడునది కాదు. ఆమె కిష్టములేని కార్యము చేయుటచే ఎవరికినీ సుఖముండదు. మీకు చాలా తొందర కలిగినది. దయయుంచి క్షమించుడు !" అని విషాద సమ్మిశ్రిత కంఠముతో అన్నాడు.

"శిల్పిగారూ, యిది తొందరపడు విషయముకాదు. మీ కుమార్తె భావోన్మాదములోపడి ప్రభువుల అనుగ్రహమును తిరస్కరించినది.

అన్నియూ తెలిసిన మీరుకూడా సామాన్రిజ్ఞుల కృపాహస్తమును త్రోసి పుచ్చుచున్నారా ?"

"ఈ విషయమై నేనేమియునూ చెప్పలేను స్వామీ !"

"ఎందులకు ?"

"మీ యెదుటనే పార్వతి ఈ సంబంధమును తిరస్కరించినది. ఆమె యిష్టమునకు వ్యతిరేకముగా నడచుటకు నాకు మనస్కరించుట లేదు"

"అనుటచే ఈ వివాహము మీకునూ సమ్మతము కాదన్నమాట?"

"నా వైయక్తి కాభిప్రాయ మటుండనిమ్మ స్వామీ ! పార్వతి కెందులకో ఈ సంబంధము యిష్టములేదని స్పష్టమైనది"

"బుద్ధిలేని ఆ చిన్నదాని మాటలతో బనిలేదు. మీరు మీ యభిప్రాయమును స్పష్టముగా తెలుపుడు తిమ్మోజీగారూ ! గృహ యజమానులు మీరు. మీ అభిప్రాయము మీదనే ఈ వివాహము జరుగుటయూ, జరుగకపోవుటయూ ననునది ఆధారపడియున్నది"

"అట్లేకానిండు; ఆలోచించి తెలియజేసెదను" అని ప్రస్తుతమున కా విషయమునకు స్వస్తివాచకము పలికినారు.

"మేము వెంటనే రాజధానికి వెళ్ళవలసియున్నది. అయిననూ మీకొరకై ఒకటిరెండు రోజు లిచ్చట నిలచుటకు మా అభ్యంతరమేమియునూలేదు. ఈ వ్యవధిలో మీ అభిప్రాయమును స్పష్టముగా చెప్పిన మేము వెళ్ళి ప్రభువులకు దానినే నివేదించుకొనగలము.ఏ విషయమునూ తొందరపడి నిర్ణయించక, బాగుగా ఆలోచించి అంతిమ తీర్మానమునకు రాగలరని నమ్ముచున్నాము" అని చెప్పి దీక్షితులుకూడా అచ్చటినుండి లేచినారు"

వారటు వెళ్ళిన తర్వాత యిటు గౌరాంబ భర్తమీద కోపగించుకొని హేళనగా అన్నది :

"దీక్షితులు మన కుపకారము చేయగోరి ప్రభువులతో పార్వతి విషయమును నివేదించినారు. సార్వభౌము లుదార హృదయులై, మన బిడ్డను పెండ్లాడి మన నుద్ధరించుటకు సమ్మతించినారు. ఇటువంటి అదృ

ష్టము అందరికీ రాగలదా? మన నోము గొప్పది కనుకనే ప్రభువులు మనతో బాంధవ్యమునకు అంగీకరించినారు. వెదకికొంటూ యింటికి వచ్చిన భాగ్యలక్ష్మి నెవరైననూ కాలితో త్రోసిపుచ్చ గలరా? ఏమిది- మీ పిచ్చి? పార్వతి యనిన బుద్ధిలేని పిల్ల! మీరింత తెలిసినవారై యుండియూ, ఆమె ఆడినట్లు ఆడుటయా? బాగున్నది మీ ప్రవర్తన! దీక్షితులంతటి గొప్పవారితో ఎట్లు ప్రవర్తించవలె ననునది కూడా నేను మీకు నేర్పవలెనా? మీకు ఏండ్లు వచ్చినవికాని ప్రయోజనములేదు."

"గౌరా! నా మీద ఎందులకు ?ోప పడెదవు? అనరాని మాట వారితో నేనే మన్నాను?"

"మీరు అనరాని మాట అనలేదా? దీక్షితులు మీ అభిప్రాయము నడుగగా మతిచెడి మీరు కుమార్తె పక్ష మవలంబించుటయా? ఆమె కిటు వంటి విషయములలో నే మనుభవమున్నది? పిల్లల బాగోగులు తల్లి తండ్రులమీద ఆధారపడి యుండును. దానిని మనము సరిగా నిర్వహించ నక్కర లేదందురా?"

"సరి, నీ అభిప్రాయమేమి గౌరా?"

"ఈ బాంధవ్యమును తిరస్కరించిన; మనము మూర్ఖులము కాగ లము. ఇంతటి భాగ్యము మూడుజన్మలు తపస్సుచేసిననూ మనకు లభిం చదు. ప్రభువులు సహృదయులై మన అమ్మాయిని పరిగ్రహించుటకు సమ్మతించుటయే మన భాగ్య విశేషము. వివేకవంతు లెవరునూ ఇంతటి సదవకాశమును జారవిడుచుకో జాలరు"

"అయిన పార్వతి ఎందులకీ వివాహమునకు సమ్మతించలేదు?"

"ఆమెను చెరిపినవారు మీరే!...."

"ఎట్లు?"

"ఆ దరిద్రుడగు మల్లన్నకు మీ రామెను కట్టబెట్టుటకు నిర్ణ యించుటచే ఆమె యీ విధముగా ఆడుచున్నది!"

"పార్వతి బాల్యమునుండియూ మ??న్నను ప్రేమించుచూ వచ్చు చున్నది."

"బాలికల పసిబాలాలను నమ్మి ఎవరూ వివాహమువంటి మహ త్కార్యమును నిర్ణయి?చరు"

"పార్వతి—మల్లన్నల ప్రేమ పసి భావనకాదు. అది వారి హృదయాంతరాళపు భావన యని నేను గ్రహించినాను. మల్లన్ననుతప్ప ఇంకెవరినీ వివాహమాడనని పార్వతి ఒక్కటే హఠముపట్టి కూర్చొని యుండుట నీకునూ తెలియును."

"ఆమెకేమి తెలియును? వివాహమనిన బొమ్మలాట యని భావించినది కాబోలును! ఆమె పిచ్చిమాటలు విని ఆమెను మల్లన్నకిచ్చి పెండ్లి చేసిన, ఆమరణ పర్యంతమూ దారిద్ర్యపు టగ్నిలో పడి మాడవలసి యుండును! చిలుకవలె సాకి ఆమె నా మొరటువాని పాలుచేయుటయా? నేను జీవించి యున్నంతవరకూ ఈ సంబంధమునకు సమ్మతించను. ఈ మాట ఖండితము!"

"తల్లిదండ్రు లగువారు పదవీ వ్యామోహములకు—భాగ్యమునకు బిడ్డల సుఖమును బలియివ్వరాదు!"

"పార్వతి శ్రేయస్సు కోరియే నేను మల్లన్ననామె వివాహమాడుటకు తిరస్కరించుచున్నాను."

"పార్వతి మల్లన్నను త్రికరణశుద్ధిగా ప్రేమించుచున్నది. అతనిని పెండ్లాడినచో ఏ అధికారమూ, పదవీ, శ్రీమంతతా యివ్వలేని సుఖభోగముల నామె యనుభవించగలదు. చివరి వరకు జీవితమును సుఖవంతముగా గడుపగలదు. ఇంతకంటెనూ ఎక్కుడుగా ఆమె కేమి కావలయును?"

"ఆ పుట్టు దరిద్రునికి రాజకుమారివలె నున్న పార్వతినిచ్చి పెండ్లి చేయుటయా? అంతకంటెనూ ఆమెను గొంతుగోసి చంపుట మేలు. లేదా ఏ బావియందో - చెరువునందో త్రోయుట మంచిది!"

"మల్లన్న పేదవాడైనంత మాత్రమున పార్వతి అతనిని చేపట్టి సుఖపడదని నీ వెందుకు భావించ వలయును? పరస్పర ప్రేమికులైనవారు పేదరికములో సైతము సుఖముగనే యుందురు"

"శుష్క వేదాంత మిక చాలించుడు! మన పార్వతి నావలెనే పేదరికము ననుభవించుట నా కిష్టములేదు. ఆమెను మనము రాజపుత్రి

వలె పెంచినాము. భర్తయింట ఆమె రాణివలె వుండవలయునన్నదే నా యాశ। మల్లన్నవద్ద ఏమున్నదని ఆమె నతని కిచ్చుట ? అతనిని పెండ్లియాడిన జీవితము సేవగింపుగా గడుపవలసి యుండును. ఆమె జీవితము కన్నీటి కడలి కాగలదు। శిష్యునిమీది వాత్సల్యమున కంటెనూ,కుమార్తె క్షేమమును ముందాలోచించుడు."

"మల్లన్న పేదవాడైననూ, ఉత్తమశిల్పి। అతనియందు శ్రీమంతులవద్ద సైతము లేని హృదయసంపద గలదు। అతడు ప్రతిభాశాలి. మున్ముందు మంచి ఉన్నతిలోకి రాగలడు. అప్పుడు వారు సుఖపడగలరు."

"గురువెంతయో శిష్యుడూ అంతియే। మీ ఆదర్శము నూతగొనిన అతడుమాత్రమెట్లు శ్రీమంతుడు కాగలడు ? తెలిసి-తెలిసీ ఎవరునూ పగలు చూచిన బావిలో రాత్రి పడబోరు। ప్రభువుల వద్దలేని ఏయర్హత అతనిలో నెక్కుడుగా వున్నదని మీరు పార్వతి నతని కిచ్చుటకు నిశ్చయించినారు ? ఆ విషయమైననూ చెప్పుడు, విని సంతోషించెదను।"

"వా రుభయులూ పరస్పర ప్రాణమైక జీవులు :"

"రేపు పార్వతి ప్రభువులను పెండ్లాడిన వారినీ ప్రేమించగలదు. భర్తను ప్రేమించుటెట్లని భార్యకు నేర్పవలయునేమి? అది భార్యాభర్తల సహజ గుణము। ఈ ఒక్క అల్పవిషయమునకై మీ రామె జీవితమును నాశమొనరించ దలచితిరా ?"

"ప్రభువులను పెండ్లాడిన పార్వతి సుఖపడదు."

"మీ రెందు కట్లు భావించుట?"

"నా యంతరాత్మ ఆ విధముగా చెప్పుచున్నది."

"నా అంతరాత్మ తద్విరుద్ధముగా చెప్పుచున్నది."

"అందులకే ఈ విషయమును పార్వతికే వదలివేయుట మంచిదని నేను చెప్పుట."

"ఆమెకేమి తెలియును?"

"ఆమె ఆడుకొను బాలికకాదు. తన జీవన మార్గమేదైనదీ ఆమెకు తెలియును."

"అట్లనుకొనుట మీ యవివేకము। పార్వతి ఒక పసిపాప।ఆమెకు ప్రపంచ మెట్లున్నదో తెలియదు. లేనిచో ప్రభువులను తిరస్కరించి ఆమె మల్లన్నను చేపట్టబోయెడిది కాదు. ఆమె నిర్ణయమున కామెన్ను వదలిన, ఆమె జీవితము నాశనమగుట తథ్యము.మనము బ్రతికియూ తర్వాత ప్రయోజనములేమ. ఇది తొందరపడు సమయమునూ కాదు — విషయమునూ కాదు। బాగుగా ఆలోచించుడు."

"నేను ఈ విషయమై బాగుగనే ఆలోచించినాను. ఒక నిర్ణయమునకు గూడా వచ్చినాను."

"ఏ నిర్ణయమునకు వచ్చినారు?"

"ఏమైననూ నేను పార్వతి సౌఖ్యమును కోరువాడనేకాని, ఆమె యిష్టమునకు విద్ధముగ నడచువాడను కాను !"

"అనిన....?"

"ఆమె యిష్టమే నా ఇష్టము."

"అయినచో మీకు బుద్ధి చెప్పుటకు మూర్ఖురాలే కావలయును। కాని ఒక్క మాట మాత్రము స్పష్టముగా చెప్పుచున్నాను. మన పూర్వకృత పుణ్యము ఫలించినట్టు పార్వతి భాగ్య భవన ద్వారములు తెరువబడినవి. సార్వభౌము లామెను పెండ్లాడ గోరినారు. పార్వతి పెండ్లాడునట్లయిన ప్రభువులనే పెండ్లాడవలె ! లేనిచో ఆమె ఆజన్మాంతమూ కుమారిగనే వుండవలయును ! మల్లన్నను వివాహ మాడుటకు మాత్రము నేనునమ్మతించను. ఈ మాట సత్యము।" అని గౌరాంబ సుడిగాలివలె అచ్చటి నుండి లేచి, వెళ్ళిపోయినది.

# ప్రభుతిరస్కారము

## 6

ఆ మూడు రోజులు పార్వతి జీవితమందొక సందిగ్ధకాలము. ఆమె భవిష్యత్తు తిమ్మోజీ—గౌరాంబలు, దీక్షితులు వీరు ముగ్గురునూ కలసి నిర్ణయించెడి విషయము మీద ఆధారపడి యున్నది. పార్వతి ఆ మూడురోజులు యమయాతన ననుభవించినది. ఈ యాతనలో సైతమామెకు గల ఒకే ఒక్క ఆశాజ్యోతి ఆమె తండ్రి—తిమ్మోజీ!

తిమ్మోజీకి పార్వతి మల్లన్నను హృదయపూర్వకముగా ప్రేమించుచున్న విషయము తెలియును. ఇదివరకూ అతనికి సైతము వారి 'ప్రేమ ప్రగాఢత' ఎంతటి దనునది తెలియదు. కాని, మల్లన్న తన హృదయేశ్వరిని శిల్పముగా చెక్కి ఆరాధిస్తూ యుండుటను చూచిన తర్వాత అతని పరిణయవాంఛ తిమ్మోజీ కర్థమైనది. బాల్యమునుండియు వా రుభయులూ పరస్పరము అనురాగము కలిగి యున్నారని అతనికి సూక్ష్మముగా తెలియును. కాని పార్వతి వివాహ ప్రశ్న తలెత్తునంతవరకూ మల్లన్న వరుడుగా అతనికి గోచరించలేదు. అతనిపై సోదరి కుమారుడన్న కారణముతో ప్రేమ యుండెడిది. తన విద్యకు ఉత్తరాధికారి కాగల శిష్యుడని అభిమానమూ గలదు. పార్వతీ ప్రియకరుడని తెలిసిన తర్వాత అతడు తన వంశోద్ధారకుడన్న ఆత్మీయ భావముకూడా ఏర్పడినది.

అన్నివిధములా తన అభిమానమునకు పాత్రుడైన మల్లన్న పార్వతిని వివాహమగుటలో అతనికి వైయక్తికానందమున్నది. మనసు కలసిన మనువుతో వివాహముచేసిన, ఉభయులూ చివరివరకూ సుఖశాంతులతో జీవించగలరన్న నమ్మిక అతనిది. పార్వతివంటి సుసంస్కృత భావజీవికి మల్లన్నయే ఆదర్శపతి యని అత దేనాడో నిర్ణ

యించినాడు. కాని అతని నిర్ణయము కార్యరూపమును ధరించుటకు గౌరాంబ అడ్డు తగిలినది. ఇప్పుడీ సమస్యను దీక్షితులు తెలియక మరింత పట్టిషం చేసినారు. ఈ చిక్కునుండి పార్వతిని విడిపించుటెట్లనునది అతనికి తెలియకపోయినది.

పార్వతి వివాహ విషయములో భార్యా భర్త లేకాభిప్రాయులు కాకపోవుటను దీక్షితు లెప్పుడో గ్రహించినారు. పార్వతిని మల్లన్న కిచ్చుటకు గౌరాంబ కిష్టము లేదను విషయముకూడా వారు తెలుసుకొన్నారు. సర్వలక్షణ సంపన్నయైన పార్వతి, ప్రభువులను చేబట్టిన, ఆమె జీవితము సుఖవంతము కాగలదని వారి భావన. పార్వతి యంతటి కన్యారత్నమును సరియైన చోటికి చేర్చి ఆ మూలముగా వారికి తన యథాశక్తిని సాయము చేయవలెనని దీక్షితు లాలోచించేవారు. కాని తిమ్మోజీ కుమార్తె పక్ష మవలంబించుటను చూచి, తమరు వచ్చిన కార్యము విఫలమైనదని భీతిల్లి—"తల్లీ! మీ యింట ఒక పూటయుండి, అన్నము తిన్న ఋణమును తీర్చుకొనుటకీ విధమైన సహాయము చేయవలెనన్న ఆశయే గాని, వేరే స్వార్థమునూ నాకు లేదు! మీ కుమార్తె సుఖముగా నుండుటయే నేనునూ గోరుచున్నాను. ఆమె భాగ్యశాలిని. ఆమె పుణ్యము గొప్పది. అందువలననే ప్రభువు లామెను చేబట్టుట కుదారులై సమ్మతించినారు. ఇది అందరికీ లభించునట్టి యవకాశము కాదు. సామ్రాట్టులను చేబట్టిన ముందొకనాడామె సామ్రాజ్ఞిగా వెలుగ గలదు! మూండలీకులు, మన్నీలు అందరూ అప్పు డామెను గౌరవించగలరు! సర్వసంపదకూ ఆమె అధికారిణి కాగలదు. ప్రభువులు మీ అల్లుండ్రు కాగలరు. కష్ట—కార్పణ్యపు బ్రతుకును వదలి మీరు అధికార వైభవములతో చివరివరకూ జీవించవచ్చును. మీరు నిర్ణయించ బోయెడి తీర్మానము మీద మీ భవిష్యత్తు ఆధారపడి యున్నది. కనుక తొందరపడక ఆలోచించి నిర్ణయించ గలరని నమ్ముచున్నాను" అని గౌరాంబతో అన్నారు.

ఈ మాట గౌరాంబ మీద పరిణామకారియైనది. దేవరాయలు పంపిన అమూల్య రత్నాభరణములు, పట్టుపీతాంబరములు ఆమె మీద యింతకంటెనూ విక్కుదు పరిణామమునే కలిగించినవి. పార్వతి సామ్రా

ట్టులను చేబట్టిన యింతకు నూరు మడుంగు లెక్కువ సిరిసంపదలు తమవి కాగలవని ఆమె అంతరాత్మ ఘోషించసాగినది. తాము రాణివాస స్త్రీలు కావలెనను కోరికతో ఆమె కుమార్తె సుఖమును సైతము బలి యిచ్చుటకు సంసిద్ధురాలైనది.

పార్వతి మల్లన్నను ప్రాణముకంటే నెక్కుడుగా ప్రేమించు చున్న సంగతి ఆమెకు తెలియును. మల్లన్న ప్రేమకై పార్వతి తన సర్వస్వమునుసైతము బలిగావించుటకు సిద్ధముగా నున్నది. త్రికరణ పూర్వకముగా ఆమె తను మల్లన్న కేర్పరుపబడిన వధువని భావించినది. ఇతరు లామెకు పరపురుషులు. ఇట్లుండగా సామ్రాట్ దేవరాయల నామె కన్నెత్తి చూడగలదా? అంతటి విషమ సమయము సమీపించిన ఆత్మ హత్య చేసుకొనుటకు తీర్మానించుకొన్నదే కాని, పరపురుషునితో బ్రతుకు సాగించదలచుకొనలేదు. పార్వతి యొక్క ఈ కఠోరనిర్ణయము గౌరాం బకు తెలియదు. కుమార్తె జీవితములోని ఈ రౌద్రిముఖ పరిచయ మామెకు కలుగలేదు. అందువలననే కుమార్తెను తన వంకకు త్రిప్పు కొనుటకై గౌరాంబ ఈసారి కొంత నయముగా మాట్లాడినది.

"తల్లీ, నీ మనోవ్యధ నాకు తెలియును! నీ విప్పుడు జీవనయాన మందలి యిరు పాయల కూడలిలో నిలబడి యున్నావు. ఈ రెండింట నే మార్గమునననుసరించిన నీకు నిజమైన కల్యాణము చేకూరగలదన్నది నిర్ణ యించుకొనలేక, వివేచనా శూన్యురాలవై యున్నావు. మేము నీ శ్రేయో భిలాషులమని తలచుచో మామాట నిజము. నీ మేలుకోరియే చెప్పు చున్నాము. నీవే మా వంశాంకురము—మా యింటి దీపమవు! నీవు తగిన చోటుకు చేరవలయుననియే మా హృదయాంతరాళపు కోర్కె!.... నా మాటల నన్యథా భావించవలదు. విజయనగర సామ్రాట్టులు మన మీద అనుగ్రహించి. నిన్ను పెండ్లాడ గోరినారు. ఇది అందరకు లభించు నవకాశముకాదు. నీవు అదృష్టవంతురాలవు కనుకనే దేవుడు సామ్రాట్టు లను నీవద్దకు తీసుకొని వచ్చినాడు. నీవు వారిని తిరస్కరించకుము. వారిని చేబట్టిన నీవు సామ్రాజ్ఞి పదవి నందగలవు! మల్లన్నను చేబట్టిన వచ్చు భాగ్యమేమిగలదు? ప్రభువులను పరిణయమాడిన అష్టైశ్వర్య

వంతురాల వగుదువు! మల్లన్నను పెండ్లాడిన దరిద్రుని భార్య కాగలవు! ఇది నీకు ప్రియమేనా? తొందరపడక విచారించుము! నీవు ఏమియూ తెలియని పసిబాలవు కావు. ఈనాటి తొందరపాటునకు రేపు పశ్చాత్తాప పడిన ప్రయోజనములేదు." అని కుమార్తె మేను నిమిరినది.

తల్లి అనుకంప వాక్కులను విని, పార్వతికి దుఃఖము పెల్లుబికి వచ్చినది. ఆమె తల్లి ఒడిలో పసిపిల్లవలె బిగ్గరగా ఏడ్చినది. కొంత సేపటి తర్వాత సమాధానపడి అన్నది. "అమ్మా, మీకు నిజముగా నేను సుఖపడవలెనని యున్నదా?"

"ఎంత విచిత్రమైన ప్రశ్న తల్లీ—మేము బ్రతికియున్నది నీ సుఖమును చూచుటకేకదా?"

"అయినచో, మీరెందుకి వివాహమునకు నన్నొత్తిడి చేయు చున్నారు?"

"ఒత్తిడి చేయకూడదా తల్లీ!"

"ఈ వివాహము వలన నాకు నిజముగా సుఖము కలుగదు!"

"అట్లనుకొనుట ఎందులకు తల్లీ! సామ్రాట్టులను చేబట్టి,సామ్రా జ్యమునకు మహారాణివిగా అందరిచే గౌరవింపబడుటలో సుఖములేదా? కోరిన వస్తువులు; దాసదాసీలు, పరిజనులు; అధికార సంపదలు వీటి కన్నింటికీ యజమానురాలివై వెలుగొందుటలో సుఖము లేదా?

"నిజము చెప్పవలయుననిన యివన్నియునూ నాకు సుఖమును కలిగింపజాలవు!

"ఎందులకు తల్లీ!...."

"మీ సుఖ గమ్యమునకూ,నా సుఖ గమ్యమునకూ చాల వ్యత్యాస మున్నది!

"అదేమితల్లీ, అట్లనుచున్నావు?"

"ఔనమ్మా! నీవు దేహసౌఖ్యమునే ప్రధానముగా భావించి నావు. నేను దైహిక సుఖమువలెనే మానసిక సుఖముకూడా ప్రధానమని భావించినాను"

"దేహము సుఖముగా నున్నచో మనస్సుకూడా సుఖముగా నుండ గలదు"

"నీమాట పూర్తిగా సత్యముకాదమ్మా! దేహసుఖముతో ఆత్మ సౌఖ్యము లభించునట్టయిన రాజులు, మహారాజులు సింహాసనమును, రాజ్యకోశములను ఎందులకు వదలుకొనెదరు? ఆత్మసౌఖ్యము ముందు దైహికసుఖము తృణప్రాయమని బుద్ధుడు మొదలగు మహాపురుషులు బోధించి యుండలేదా?"

"అమ్మా, మహాపురుషుల మాటవేరు, ఇహసౌఖ్యముకొరకే మానవులందరూ జీవన్మరణ పోరాటము జరుపుచున్నారు. కాని జీవిత ములో సుఖసంపదలు అందరికీ లభించుటలేదు. కొందరు ఆ మాయా మృగము వెన్నంటి పరుగిడిన, మరికొందరి వాకిటి కదియే వెదకికొని వచ్చును. ఈ ద్వివిధములైన వారిలో రెండవ తెగకు చెందినదానవు నీవు. కనుక లభించిన సదవకాశమును జారవిడుచుకోవలదు. బాగుగా నాలోచించుము"

"నేనడిగి వచ్చినది బీదరికపు జీవితమేనమ్మా!"

"అది నిజమేయైనచో ఎంతయో హాయిగా నుండెడిది. కాని నీవు సామ్రాజ్ఞులను చేపట్టుటకై పుట్టియున్నావు. ఈ విషయమునే దీక్షితు లానాడు నీ జాతకమును చూచి చెప్పినారు. ఇప్పుడు వారిమాట నిజమగు సమయము చేకూరినది. నీవు తొందరపడకు తల్లీ!"

"నాకన్న కొలదిని నన్ను వదలిన ఎంతయో ఉపకారము చేసిన వారగుదురు. నా నుదుట వ్రాసిన ప్రకారము జరుగనిమ్ము! ఎందుకు నన్ను నిర్బంధపరచెదరు?"

"నుదుటి వ్రాలునెవరునూ చెరుపలేరు తల్లీ! బ్రహ్మ వ్రాసిన దానిని అనుభవించియే తీరవలయును. విధి నీ నుదుట సామ్రాజ్ఞి పదవిని వ్రాసియుండగా, నీవెందుకు వ్యథపడుచున్నావు?"

"నేను మల్లన్నను తప్ప ఈజన్మలో వేరొకరిని వివాహమాడను"

"నీవు సార్వభౌములను పెండ్లాడకపోయిననూ చింతలేదు. కాని ఆ మల్లన్నను పెండ్లాడుటకు మాత్రము నేను సమ్మతించను"

"అంతటి పరిస్థితి ఏర్పడినచో నేను కన్యగానే వుండిపోగలను"

"సామ్రాజ్ఞిపదము చేపట్టుటంతకంటెనూ తక్కువయా? నీ మనస్సున నేమున్నదో స్పష్టముగా చెప్పుము. ప్రభువుల విషయములో నీ కెవరో భీతిని కలిగించి యుందురు"

"అమ్మా, నా హృదయంగతము నెరిగియుండిన మీరీ మాట లనువారు కారు. మాతృహృదయముతో చూచుటకన్ననూ, స్త్రీ హృదయముతో విచారించి చూచిన మీకు నా పరిస్థితి అర్థము కాగలదు. సామ్రాజ్ఞి పదము చేపట్టుమని మీరు నన్నొత్తిడి చేయుచున్నారు. సార్వభౌముల కిప్పుడు దాదాపు ఏబది సంవత్సరముల వయస్సు వచ్చినది. తలవెండ్రుకలు నెరసినవి. చర్మము ముడతలు పడినది. నా వయస్సుగల బిడ్డలు పలువురున్నారు. మీ వయస్సుగల భార్య లనేకమంది గలరు. వీరుగాక నూరారుమంది భోగకాంతలు, బంగారపువారూ నున్నారు. సార్వభౌములను పెండ్లాడి నేను వారి శతాధిక సంఖ్యలోని ఉపపత్నులలో ఒక్కతెనుగా నుండవలెనని మీ ఆశయమా?"

"ఈ విషయములన్నియు నీకెవరు చెప్పినారు తల్లీ? సామ్రాజ్ఞులైన పిమ్మట వారిప్రేమ ఒక స్త్రీకే ప్రత్యేకించబడగలదా? వారు దక్షిణనాయకులు-బహూవల్లభులు. నీ అంతస్థుకు, స్థాన మానములకు భంగము కలుగని రీతిని వారు నిన్ను సామ్రాజ్ఞిని చేయగలరట. దీనికి నీవెందుకు సమ్మతించరాదు?"

"అంతేకాదు, సామ్రాజ్ఞులను చేబట్టిన తర్వాత ఎవరికిని తల్లిదండ్రుల వద్దకు వచ్చుటకు సైతము అనుమతి లభించదని విన్నాను"

"ఈ విషయం నీకెవరు చెప్పినారమ్మా?"

"నేనెందరినోటనో విన్నాను"

"బహుశా యిది నిజమైయుండదు. కానిమ్ము, దీక్షితుల నడిగిన వాస్తవ విషయము తెలియగలదు. ఇది నిజమైనచో...." అని గౌరాంబ పీడకల చూచిదానివలె ఉలిక్కిపడి అచ్చటినుండి వెళ్ళిపోయినది.

పార్వతి యింకా తన చింతలోనే మైమరచి కూర్చొనియున్నది. ఆమె ఏకాంతముగా కూర్చొని ఆలోచించుచూ యుండుట చూచి, ఏదియో పనిమీద అచ్చటికి వచ్చిన తిమ్మోజీ—

"అమ్మా, పార్వతీ ! ఎందుకు తల్లీ, అట్లా కూర్చొనియున్నావు? సాయంకాలము ఎచ్చటికీ విహారార్థము వెళ్ళలేదా?" అని కలవరపడుచూ అడిగినాడు.

"ఏమియునూ తోచక యిట్లూరక కూర్చున్నా నప్పాజీ!

"ఏమియునూ తోచకపోవు టెందులకమ్మా?"

పార్వతి మాటాడలేదు.

"మీ అమ్మ తిట్టినదా?"

"లేదప్పాజీ!...."

"అయినచో, నీ యీ విచారమునకు కారణమేమి తల్లీ?"

ఆ మాట వినగానే పార్వతికి దుఃఖము పొంగివచ్చినది. తండ్రి వక్షస్థలముమీద తలవాల్చి గొల్లున ఏడ్చినది.

"అప్పాజీ!....అప్పాజీ!...." అని వెక్కివెక్కి ఏడ్చినదే కాని, ఆమె ఏమియునూ చెప్పలేకపోయినది.

"ఏమైనది తల్లీ?"

"ఇంకేమి కావలె నప్పాజీ? నేను సామ్రాట్టులను చేబట్టినగాని, అమ్మ నన్ను ప్రాణములతో విడచునట్టులేదు!"

"అంతటి దురవస్థ యిప్పుడేమిటి వాటిల్లినది తల్లీ?"

"ఇదివరకునూ అదియే ప్రవరజరిగినది విని చెవులు చిల్లులు పడినవి! నా సౌఖ్యమును కోరుదానికి చిన్నసత్య మెందులకు తెలియకపోయినదో? ఈ పెండ్లివలన నాకు సుఖము కలుగదని చెప్పిననూ ఆమె తన హఠమునే సాధించుచున్నది...."

"నీకా వివాహము యిష్టములేనిచో వారిని పెండ్లాడుమని నేను బలవంత పరచుటలేదమ్మా నీ కిష్టము వచ్చిన వారిని పెండ్లాడి, సుఖముగా నుండుము. మాకు కావలసినది నీ సౌఖ్యమేకాని, సిరిసంపదలు కాదు సుఖములేనిచే అవి శవసమాధి స్థలమునకు సమానము! నీవు దీనికై వగవ బనిలేదు తల్లీ! నీ యిష్టమునకు వ్యతిరిక్తముగా ఎవరునూ నీకు వివాహము చేయలేరు!" అని ధైర్యము పలికినాడు తిమ్మోజీ.

"అప్పాజీ! మీకునూ-అమ్మకునూ ఎంత భేదము గలదు! మీరు

నన్నర్థము చేసుకొన్నట్టు ఆమెయూ నన్నర్థము చేసుకొనిన...." విషాదపు నవ్వు నవ్వింది.

"మీ తల్లి స్వభావమే అటువంటిది తల్లీ! ఆమె చెడుస్వభావము గల మనిషికాదు. నీ మీదగల ప్రేమాతిశయముతో ఆ విధముగా జేసిన దంతియే! శ్రీమంతుని పెండ్లాడిన నీవు సుఖపడగలవని ఆమె అనుకొన్నది. కాని, మల్లన్నతో జరుగు వివాహమునుందు యీ ఎల్ల పపపీ - అధికారములు, సిరిసంపదలు ఎందుకూ మా అక్కరకురావని ఆమె కెట్లు తెలియును? ఆమె మాట నంతగా పట్టించుకొనకు తల్లీ!"

"అప్పాజీ! నా వయస్సుగల బిడ్డలూ-మనుమలూవున్న సామ్రాట్టులను వారి సిరి-సంపదలకై చేబట్టి, అజ్ఞాత రాణియై యుండుటకన్న మల్లన్నకు పత్నిగా నుండుటలో నాకు చాల సంతోషమున్నది. శ్రీమంతుని భార్యయగుటకన్ననూ, ప్రేమించినవానితో పేదరికము ననుభవించుటయే ఎక్కువ మధుర తరము. ఈ విషయమును మీరు గ్రహించినట్టు, అమ్మయూ గ్రహించి యుండిన...."

"ఆమెకు సంపదయే సర్వస్వము తల్లీ! అధికారము, సిరిసంపదలముందు జీవితములో ఇంకేమియునూ సాధించవలసినది లేదనుకొను స్వభావురాలైన మీ తల్లి నిన్నెట్లు అర్థము చేసుకొనగలదు? నీ మనోవ్యథ ఆమెకెట్లు తెలియగలదు? ఆమెదొక మతము. మన ఉభయులదీ మరొక మతము! అందువలననే మనలో యీ విభిన్నత లేర్పడినవి!"

"మరొక వార్తనుకూడా విన్నా నప్పాజీ!... ఒకసారి రాణివాసమునకు చేరిన స్త్రీ, యిక జన్మలో ఆమె తలిదండ్రులను చూచుటకు వీలులేదట. అంతటి కామాంధ ప్రభువుకు భోగకాంతగా నుండుటకంటెనూ, వ్యక్తి స్వాతంత్ర్యముగల పేద జీవనమే నాకు వేయి మడుంగు లెక్కువని దోచుచున్నది....అప్పాజీ! స్వతంత్రముగల చిలుకవలె పెంచి, నన్నిప్పుడు ప్రభువుల పంజరపు చిలుకనుగా చేయవలెనని యున్నారా?"

"లేదు తల్లీ! నీ వ్యక్తి స్వాతంత్ర్యమునకు లోటుగలుగునట్టి ఏ పనియునూ నే నాచరించను. నీ వధైర్యపడకుము"

అని తిమ్మోజీ ధైర్యము చెప్పిన తర్వాత పార్వతి హృదయము తేలిక పడినది. ఆమె కుబుసము విడచిన పామువలె, చింతను వదలి, సంతోషితయైనది.

తిమ్మోజీ కుమార్తె ముఖములో బహుకాలానంతరం ఆవిధమైన ఉత్సాహమును చూచి, సంతసించినాడు. కుమార్తెనే తిలకించుచూ అత డన్య మనస్కుడై కూర్చొన్నాడు. అతని మనస్సు స్వప్నసీమలో విహరించుచున్నది. అచ్చటి సుందరోద్యాన వనములో మల్లన్న-పార్వతులు స్వేచ్ఛగా మయూరములవలె విహరించు చున్నట్టి దృశ్యమును కన్నాడు.

శ్యామాదీక్షితు లిచ్చిన రెండురోజుల గడువు పూర్తియగుచూ వచ్చినది. కాని పెండ్లి విషయమై యింకనూ ఏదియూ తీర్మానము కాలేదు. ఆ సాయంకాలము వారిని సందర్శించి దీక్షితులే మరల యీ విషయమై ప్రస్తావించినారు:

"శిల్పిగారూ, రేపటి ఉదయము నేను రాజధానికి వెళ్ళవలయునని నిశ్చయించినాను. మీ అభిప్రాయమును తెలిపిన, ప్రభువులకు విన్నవించుకోగలను. ముఖ్యముగా అన్నింటికీ ఋణానుబంధ ముండవలయును" అని తమ మాటల కుపోద్ఘాతమును ప్రారంభించినారు.

"స్వామీ ! నా నిర్ణయమును యిదివరకే తమతో విన్నవించుకొన్నాను. పెండ్లాడునది పార్వతి. కనుక ఆమె అభిప్రాయమే ముఖ్యం! అన్నియూ కూలంకషముగా ఆలోచించి, ఆమె ఒక నిర్ణయమునకు వచ్చినది...."

"ఆ నిర్ణయమేది?"

"సార్వభౌములను పెండ్లాడుట కామె సమ్మతించలేదు"

"ఎందులకు ?"

"ఆమె మల్లన్నను తప్ప ఈ జన్మలో యింకెవరినీ వివాహ మాడదట. అతడు వినా తక్కిన వారందరూ ఆమెకు సోదర సమానులట. ముఖ్యముగా ఋణానుబంధము లేదు సమ్మతిపై జరుగవలసిన పెండ్లికి బలవంతము చేసిన ప్రయోజనములేదు. మీకు తొందర కలిగించినందుకు దయయుంచి క్షమించుడు !"

"ముఖ్యముగా యిది ఋణానుబంధ విషయము శిల్పిగారూ! నుదుట వ్రాయకున్న ఎవరెంత బలవంతము చేసిననూ జరుగదు. ఇంత కునూ మీ కుమార్తెకు ప్రభువులను చేబట్టి సామ్రాజ్ఞిగా ప్రకాశించు యోగము లేదని తెలియుచున్నది. కాని...."

"ఆగినారేమి ?"

"మీ కుమార్తె ప్రభువులను త్రోసిరాజని మల్లన్నను పెండ్లాడ దలచినది. కాని ఆ వివాహ మీజన్మలో జరుగదని చెప్పవలసి వచ్చి నందుకు విషాదముగా నున్నది"

"ఆమె నుదుట వ్రాసిన విధముగా జరుగనివ్వండి, స్వామీ!" అని తిమ్మోజీ నిరుత్సాహముగా అన్నాడు. మరల —

"రేపు జరుగబోవున దీ రోజు ఎవరు చూచినారు ?" అని తన మాటలు ముగించినాడు.

"అది నిజమేలెండు! ఎవరి నుదుట ఏమి వ్రాసియున్నదో ఎవరికి తెలియును. కాని విషాదకరమైన విషయమేమనగా, మీ కుమార్తె వివాహ మాడదలచిన మల్లన్న పూర్ణాయుస్సు కలవాడుకాదు. అతనికి రాజద్రోహిగా చిరకాలము చెఱసాలలో శిక్ష ననుభవించుయోగమున్నది. అతనిని చేబట్టినచో మీ కుమార్తె యాశించిన సుఖము నిజముగా నామెకు లభించదు. కనుక అతని విషయమున నెక్కువాశలను పెట్టుకొనకుడు!"

ఈ మాటలు విని తిమ్మోజీ నేలపై దృక్కులను వాల్చి వూరక కూర్చుండి పోయినాడు.

"అమ్మా పార్వతీ! దీక్షితుల మాటలు విన్నావుకదా ? ఇకనైనా నీ మొండి పట్టుదల మాని, మా మాట వినుము" అన్నది గౌరాంబ.

"ఔను తల్లీ! తలిదండ్రులంత గట్టిగా ఎందుకు చెప్పుచున్నారను నది క్షణకాల మాలోచించిన—నీకే తెలియగలదు. నీ క్షేమమును కోరియే వారు యింతదూరము చెప్పుచున్నారు. నిన్ను వెతజెందుమని ఎవరన్నారు? నీపాలిటి భాగ్యలక్ష్మి తనంతట తానుగానే మీ యింటికిప్పుడు వచ్చి యున్నది. ఆమెను వెళ్ళిపొమ్మనుట మూర్ఖత్వము కాగలదు. తర్వాత కావలయునని కోరుకొన్ననూ యింతటి సదవకాశము లభించదు. బాగుగా నాలోచించుము" అని దీక్షితులుకూడా స్వరమును మేళవించినారు.

"నేను అన్నియూ బాగుగా ఆలోచించియే యీ నిర్ణయమునకు వచ్చినాను స్వామీ" పార్వతి నిష్ఠురముగా అన్నది.

"సంతోషము. అయినచో, భగవదేచ్ఛప్రకారమే జరుగనిమ్ము! మనమంతయూ అతడాడించు బొమ్మలము. ఎవరి నుదుట నేమి వ్రాసి యున్నదో ఎవరెరుగుదురు?" అని దీక్షితు లన్నారు.

"స్వామీ ! ఈ సత్యమునే తమరు గ్రహించినచో సార్వభౌము లను పెండ్లాడుటకు నన్నింత ఒత్తిడి చేయువారు కారు. మన మందరూ ఆ జగదీశ్వరుని చేతి కీలుబొమ్మలు. సార్వభౌములను వివాహమైన మంచిదని భగవంతుడు మీకు బుద్ధినిచ్చినట్టే, ఆ వివాహముతో మంచి జరుగదన్న బుద్ధిని నాకూ ప్రసాదించినాడు. దీనికి నన్నేమి చేయుమనె దరు? నా అంతరాత్మ చూపిన త్రోవన నడచుకొంటున్నాను. మిమ్ము లను నిరాశపరచి యుండిన, దయయుంచి క్షమించ ప్రార్థన" అన్నది పార్వతి గంభీర కంఠంతో.

"అయినచో నా వెంట తెచ్చిన మంగళద్రవ్యములను వెనుకకు తీసుకొని వెళ్ళుమనెదవా ?"

"అవశ్యము తీసుకొని పొండు"

"సార్వభౌముల కేమని చెప్పమందువు ?"

"ముద్గల్లులోని తిమ్మోజీ కుమార్తె పార్వతి,ప్రభువుల ఆజ్ఞమేరకు నడచుకొనుటకు సమ్మతించలేదని తెలుపుడు...."

ఈ మాట విని దీక్షితులు నిర్విణ్ణులైనారు. వారి వదనము నిస్తేజ మైనది. పార్వతి నుండి యింతటి పౌరుషమైన జవాబు రాగలదని వారను కొనలేదు ! మారుపలుకక వారు తమవెంట తెచ్చిన మంగళద్రవ్యము లతో అచ్చటినుండి లేచినారు.

# కృతకవేషము

## 7

శ్యామాదీక్షితులు తమ పరివారముతో బాటు విజయనగరమునకు వెనుదిరిగినారు. వారికి తమ కన్యార్థిత్వము విఫలమైనందుకు అవమానకరముగా తోచినది. పార్వతికి ఉపకారము చేయుటకై వెళ్ళి, ఆమెచే తిరస్కృతుడై వెనుదిరిగి రావలసియుండునని అతడు కలలోనైతఁ మనుకొని యుండలేదు. అంతయునూ వారి నిరీక్షణకు వ్యతిరిక్తముగా జరిగిపోయినది. ఒక సామాన్య స్త్రీ సామ్రాట్టులను ధిక్కరించినది. నిశ్చింతులై యుండిన సామ్రాట్ దేవరాయలను చేయిపట్టిలాగి నూతిలో పడద్రోసి అనుమానించి నట్టయుంది గదా యని దీక్షితులు ఖిన్నవదనులైనారు. తమ విఫల కన్యార్థిత్వ విషయమును ప్రభువులకు తెలుపుటెట్లను నది తోచక విహ్వలులైనారు. విజయనగరమును చేరుకొనగనే విధిలేక సామ్రాట్టుల సముఖమునకు వెళ్ళి మౌనముగా నిలబడినారు.

దీక్షితుల ముఖమవలోకించగనే వారి సంధి విఫలమై యుండునని దేవరాయలు ఊహించినాడు. అయిననూ - సంపూర్ణముగా నిరాశ జెందక "దీక్షితులూ, మీరు వెళ్ళిన కార్యభారమేమైనది ?" అని ప్రశ్నించినాడు.

"ప్రభూ ! ఆ హతభాగ్యురాలికి తమ వంటి మహానుభావులను చేపట్టగల అదృష్టములేదు !" అని దీక్షితు లన్నారు.

"అనగా, మీ సంధి విఫలమైనదని యర్థమా ?"

"విఫలము కాలేదు ప్రభూ ! ఆమె తలిదండ్రులీ వివాహమునకు సమ్మతించినారు. కాని, పార్వతికి తమనుచేబట్టి సుఖించు భాగ్యములేదు!"

"ఏమీ, ఆ తుంటరి నా కోరికను తిరస్కరించినదా ?" దేవరాయలు ఉగ్రుడైనాడు.

"ఆమె తమను తిరస్కరించుటలేదుప్రభూ ! కాని, ఆమెకు తమను చేపట్టగల భాగ్యములేదు !"

"దీక్షితులూ, ఏమి జరిగినదో వివరముగా చెప్పుడు" అసహన ముతో దేవరాయలనినాడు.

జరిగిన సంగతు లన్నింటినీ దీక్షితులు సవివరముగా తెలియ జేసినాడు.

"ప్రభూ ! తిమ్మోజీ-గౌరాంబల కీ వివాహము చాలా యిష్టముగా నున్నది. పార్వతి కూడా తమను పెండ్లాడుటకు సమ్మతించు చున్నది. కాని...."

"విషయమేమి ?"

"ఆ రాక్షసుడు, మల్లన్న పార్వతి తమ సొత్తగుటకు అడ్డువచ్చు చున్నాడు !"

"ఎవరా మల్లన్న ?"

"అతడొక హతభాగ్యుడు ప్రభూ ! పార్వతి అతనిని బాల్యం నుండియూ ప్రేమించుచూ వచ్చుచున్నదట....బాల్యంలోనే తల్లిదండ్రు లను పోగొట్టుకుని అతడు తిమ్మోజీ ఆశ్రయమునకు వచ్చినాడట. అతని వద్ద శిల్పకళ నభ్యసించి, యిప్పుడు దేశాటనకు బయలుదేరినాడట. అత నిని పెండ్లాడుటకు పట్టుబట్టినది ఆ పిచ్చిది ! ఏమైననూ ఆమె హీనకుల సంజాతగదా ? తమరు ఆమె నుద్ధరించవలెనను తలంపుతో అనుగ్రహ మును వ్యక్తపరచినారు. కాని...."

"దీక్షితులూ, మీ ఉపన్యాసమిక చాలించుడు ! ఆమె అనుపమ రూపలావణ్యాదులను వర్ణించునప్పుడు మీకీ బుద్ధి ఎక్కడికి పోయినది ? అప్పుడామెను దేవసుందరి, సత్కులప్రసూన, శాపగ్రస్తయగు దేవ కన్య ! యని పొగిడి నన్ను ఈ వివాహమునకు ప్రేరేపించి, ఇప్పుడామె హీనకులజయని చెప్పుటకు మీకు నోరెట్లు వచ్చినది? మీ నాలుకకు నరములేదని దానిని యిష్టము వచ్చినట్లు ఆడించుచున్నారా ? ఎవరితో మాట్లాడుచున్నారనునది తెలిపి ప్రవర్తించుడు!" కనులెర్రజేస్తూ అన్నాడు దేవరాయలు. అతనికి తన నొక సామాన్యస్త్రీ తిరస్కరించుట చాల అవ మానకరముగా దోచినది.

"ప్రభూ! నావలన అపరాధము జరిగియుండిన క్షమించ ప్రార్థన. నేనామె జాతకమును చూచి మోసపోయినాను...."

"మోసపోవుటకు ముందు మీ వివేకము నెచ్చట దాచినారు? మీరు నాతో పరాచిక మాడుచున్నారా? ఆమెను పొగడునప్పుడు మీకీ జ్ఞానమేమైనది? నిష్కారణముగా నన్నవమానించినారు....మిమ్ముల నేమి చేయవలయునో తెలియునా?" దేవరాయలు గర్జించినాడు.

"నా వలన మహాపరాధము జరిగినది ప్రభూ! నా తప్పును మన్నించ ప్రార్థన!....ఇట్లు జరుగగలదని నేను స్వప్నమున సైత మూహించలేదు. కాని, దైవేచ్ఛముందు మన ప్రయత్నము లొక్కటీ జరుగవు. బహుశః ఈ వివాహము దైవేచ్ఛకు రాలేదుకాబోలును?"

"అయినచో మా కవమానము జరుగవలెనని దైవేచ్ఛయా?"

ఈ మాటకు దీక్షితు లేమియునూ జవాబు చెప్పలేదు.

"ఒక సామాన్య స్త్రీ సామ్రాట్టులను ధిక్కరించు టనిననేమి? సామాన్య శిల్పి కుమార్తె మహారాజాధి రాజులను ఒక నిర్భాగ్యుడైన శిల్పి కంటెనూ నీచముగా భావించి, మంగళ ద్రవ్యములను త్రిప్పిపంపి అవ మాన పరచుటనిననేమి? దీని కంతటికిని మీరే కారణభూతులు! బాధ్యులు! ఇందుకు మీరేమి చెప్పగలరు?"

"ప్రభూ, నే నేమి చెప్పిననూ అది వ్యతిరిక్తమే కాగలదు. నా గ్రహగతి బాగుగా లేనప్పుడు నే నెవరినీ ఆక్షేపించుటలేదు. ఉపకారము చేయబోయి, నే ను తమ కపకారము చేసినట్లయినది! నావలన తమ సన్నిధి కపచారము కలిగియుండిన, తమ యిష్టము వచ్చిన శిక్షను విధించుడు. సంతోషముగా అనుభవించగలను. ఈ శరీర మెట్లునూ తమ ఉప్పుతిని పెరిగినది. ఇప్పుడూ తమ సేవలోనే నశించిపోవనీ!...."

"దీక్షితులూ, ఎంత సులభముగా మీకీ మాట లనుచున్నారు?"

"దైవోపహతు డింకేమి చెప్పగలడు ప్రభూ!"

"నిశ్చింతుడై యుండిన నన్ను మీరు నిష్కారణముగా అవమాన మునకు గురిచేసితిరి."

"ప్రభూ! ఇటువంటి విషయములను మనము వ్యక్తిత్వపు

దృష్టితో చూడరాదు. ఇదంతయునూ ఋణానుబంధము ! పశువు-పత్ని-సుతుడు, ఆలయము యివన్నియునూ ఋణాను బంధములేనిదే ఎవరికిని లభ్యము కానేరవన్న ఆర్యోక్తి తమకు తెలియనిది కాదు ! సర్వమునూ తెలసినవారికి నేను చెప్పున దేమున్నది ?"

"ఈ వివేకము పార్వతిని గురించి వర్ణించునప్పుడు మీ కెందుకు లేకపోయినది ?"

"నడచుచున్నవాడు ముందుకు పడక, కూర్చున్న వాడు పడగలడా ప్రభూ !"

"ఇటువంటి మాటలతో మీరు నన్ను సమాధాన పరచలేరు దీక్షితులూ ! నాకు జరిగిన అపచారమును తుడువలేరు. మీరు నాతో ఆ పార్వతి సౌందర్యమును వర్ణించు నప్పుడే ఈ బుద్ధి యుండవలసినది. ఆనాడు మీరామెను మేరమీరి వర్ణించినారు. నే నామెను చూడకపోయిననూ మీ మాటలు విని ఆ తుంటరిని చేబట్టుటకు సమ్మతించినాను. మీ మాటలు విన్నందుకు నా కవమానము జరిగినది ! అదియును శత్రు రాజ్యమందలి ఒక సామాన్య స్త్రీచే సామ్రాట్టులకు అవమానము! మీకు మాత్రమిది అంతయును సామాన్య సంఘటనవలెనే దోచుచున్నది కదూ, దీక్షితులూ !".... దేవరాయలు వ్యంగ్యముగా అన్నాడు.

"ప్రభూ ! నావలన సన్నిధానమునకు మహాపరాధమైనది. రాజ పౌరోహిత్య వర్గమునకు చెందిన వాడగుటచే ఈ విధముగానైననూ ప్రభువుల ఋణము దీర్చుకొనవచ్చునని ఆశించితిని. కాని నేనొకటి తలచిన దైవమొకటి తలచినది. నా యపరాధమున కేశిక్షనైననూ విధించుడు— అనుభవించగలను".

"మిమ్ములను శిక్షించిన ప్రయోజనమేమి దీక్షితులూ ! శిక్షించిన ఆ మదోన్మత్తురాలైన పార్వతినే శిక్షించవలయును. అవమానము జరిగినది ఆమెవలననే కాని, మీవలన కాదు. నేను మీ మాటలువిని ఆమె కులశీలములను సైతము విచారించక మంగళద్రవ్యములను బంపి పెద్ద తప్పుచేసినాను. ఇప్పుడు దానిని సవరించుకొనవలయుననిన ఎట్లయిననూ ఆమెను వివాహమై నా యభీష్టమును నెరవేర్చుకొనవలయును. లేనిచో

నేను సామ్రాట్టునై యుండియూ వ్యర్థమే! శత్రురాజ్యమందలి ఒక్క అబల గర్వభంగము చేయనిచో చరిత్రలో నేను పిరికిపందనుగా నిలువ గలను. ప్రజలు నన్ను అభిమాన శూన్యుడని యనగలరు. మా పూర్వులకు బహమనీ సుల్తానులవలన జరిగిన అవమాన, తేజోవధల కళంకమే చాలును. ఇప్పుడీ కళంకమును మరల నాపాదించుకొని సింహాసనములో సుఖముగా కూర్చొనలేను. నా రాజ్యకోశములనైననూ బలిగావించి ఆ ధూర్త స్త్రీ గర్వభంగము చేసియే తీరవలయును. లేనిచో నేను దేవరాయలను కాను" అని భీకర ప్రతిజ్ఞ చేసినాడు.

ఈ ప్రతిజ్ఞను విని దీక్షితులు బొడు గరచుకొన్నారు.

"ప్రభూ! ఇప్పటికే నావలన ఒక మహాపరాధమైనది. తొందర పడి నేను తమ సచ్చారిత్రమునకు మసిపూయునంతటి కార్య మొనరించి నాను. ఇప్పుడు దానికంటెనూ ఘోరమైన తప్పిదము తమవలన జరుగ రాదు. ఆ నిర్భాగ్యురాలు తెలిసియో, తెలియకనో తమ కవమానము చేసి నది. మహాభాగవతులైన ప్రభువులు ఆమె తప్పును కడుపున నిడుకొని క్షమించవలయును. వలయుననిన ఆమెను బలాత్కారముగా పట్టితెచ్చి, పెండ్లాడి గర్వభంగము చేయుడు-నేను వద్దనుటలేదు. కాని ఆమెను శిక్షించరాదు. ఆమెమీద చేయి చేసుకొనరాదు. స్త్రీ హత్య మహాపాతకము"

"దీక్షితులూ, నేనొక అబలమీద చేయి చేసుకొనునంతటి మూర్ఖుడని భావించినారా? నాకు కావలసినది ఆమె గర్వభంగమేకాని, శారీరకముగా ఆమెను శిక్షించుటకాదు. ఆమె ఔద్ధత్యమునకు తగినశిక్ష విధించ వలయునని నా యాశయము. అనగా నన్ను తిరస్కరించిన ఆమెను బలాత్కారముగా పెండ్లాడి, పరిత్యజించుట-ఇంతకంటెనూ ఘోరమైన శిక్ష ఏదీ ఆమెకు విధించుటలేదు"

"ప్రభూ! ఈ సమయములో నాదొక కోరిక నెరవేర్చగలరా?"

"ఏమి కోర్కె?"

"ఈ సందర్భమున తా మెవరిమీదయునూ పగదీర్చుకొనరాదు! రక్తపాతము జరుగరాదు. ఏవిధమైన హానికీ అవకాశ మివ్వరాదు. మన

మీనాడు తొందరపడి ఏ కార్య మాచరించిననూ ముమ్ముందు ఈ సంఘటన ఉభయరాష్ట్రముల హితాసక్తికి వైర కారణము కాగలదు. ఇప్పుడు ఏర్పాటు చేసుకొనియున్న ఒప్పందమును త్రోసిరాజని బహమనీ సుల్తానులు మనమీద యుద్ధమును ప్రకటించుట కిది కారణము కారాదు."

"దీక్షితులూ, ఒకవేళ పరిస్థితి విషమించి యుద్ధముగా పరిణమించినయెడల నేను భీతిల్లగల ననుకొన్నారా ? అందుకు నేను సిద్ధముగానే యున్నాను."

"ప్రభూ ! నా మాటను తమ రన్యదా భావించకుడు ! బహమనీ సుల్తానులమీద యుద్ధము జరిగిన నేను వద్దనుటలేదు. కాని ఒక సామాన్య స్త్రీ కొరకై ఉభయ రాజ్యముల నడుమ భీకర పోరాటము సంభవించు టెందులకని యనుచున్నాను. ఇది ఎవరికీ శ్రేయస్కరము కాదు ! వీలైనంత వరకునూ యీ కార్యమును ఎక్కువ సందడి లేకయే సాధించుట క్షేమము!"

"ఆ విషయము నాకునూ తెలియును ! ఇప్పుడు మనము బలాత్కారముచేసిన కార్యభంగము కలుగవచ్చును. ఉపాయముగా పార్వతిని చెరబట్టి తీసుకొని రావలయును. అపాయముగా సూచన తెలిసి మనచేతి నుండి ఆమె తప్పించుకొని పారిపోవక మునుపే, మల్లన్నను వివాహ మాడక మునుపే—ఆమెను మన దానినిగా చేసుకొనవలయును. మన మిచ్చ్యెడ నతి జాగ్రత్తగా ప్రవర్తించిన మాత్రము కార్యసాఫల్యము కాగలదు ! లేనిచో మన ప్రతిజ్ఞ నెరవేరక పోవుటయేగాక, వచనభ్రష్టులము కూడా కాగలము. ఈ కార్యమును ఏమాత్రమూ సందడిలేక గోప్యముగా సాధించుకొని రావలయును. ఇందుకు సమర్థులే కావలయును" అని ఏదియో నాలోచించుచూ కూర్చొన్నాడు.

క్షణకాలానంతర మేదియో నిర్ణయించుకొని, సేవకుని బిలచి—

"నాగన్న దండనాయకులను వెంటనే రమ్మని చెప్పుము" అని యాజ్ఞాపించినాడు.

ఈ కార్యమున కతనిని నియమించిన, సులభముగా సాధించుకొని రాగలడను నమ్మిక దేవరాయలకు.

నాగన్న దండనాయకుడు దేవరాయల బాల్యమిత్రుడు. అతడు తన ధైర్యసాహస, పరాక్రమ, నిష్ఠ ఇత్యాది సద్గుణములతో పైకివచ్చి ఇప్పుడు ప్రధానామాత్య, మహా దండనాయక పదవుల నధిష్ఠించినాడు. అతని ప్రభు సేవకు మెచ్చి దేవరాయ లతనిని ముళువాయి రాజ్యమునకు మాండలీకునిగా చేసినాడు. దేవరాయల ఆంతరంగిక మిత్రులలో యితడు ముఖ్యుడు.

ప్రభువుల త్వరితంపు టాజ్ఞను విని నాగన్న సేనాని ఆందోళనా చిత్తముతో అంతఃపురమునకు పరుగునవచ్చినాడు. దేవరాయ లతనినిఉచిత రీతిని ఆహ్వానించి, తాను పిలువనంపిన కారణమును చెప్పి, ఎట్లయిననూ పార్వతిని చెరబట్టి తీసుకొని రావలసినదని యాజ్ఞాపించినాడు. ఈ కార్యములో అతనికి సాయపడుటకై దీక్షితులను కూడా పంపుటకు సమ్మతించినాడు.

ఆ మరునాడే నాగన్న సేనాని ముద్గల్లుకు బయలుదేరినాడు. అవసరమైనప్పుడు తనకుసాయపడుటకై వేయిమంది అశ్వికభటులను వెంట తీసుకొని వెళ్ళినాడు. ఆ సైన్యమును తమ రాజ్యపు సరిహద్దు ప్రాంతములో విడచి, కొంతమంది అనుచరులతో వేషాంతరమున ముద్గల్లుకు వచ్చి చేరినాడు.

ఊరు చేరగనే శ్యామా దీక్షితులు, నాగన్నసేనాని మారువేషంతో తమ కార్యాచరణకు పూనుకొనినారు.

ఉన్నట్టుండి గ్రామమున కావలనున్న దానప్ప తోపునందలి శిధిల మంటపములో బాలాంజనేయస్వామి లను మహాత్ములు శిష్యసమేతులుగా వచ్చి విడిసి యున్నారను వదంతి ముద్గల్లునం దంతటా ప్రాకినది. స్వామివారి మహిమ ప్రాకినకొలదిని ప్రజలు తండోపతండములుగా వచ్చి వారి యాశీర్వాదమును పొంది వెళ్ళనారంభించినారు. స్వాములవారు త్రికాలజ్ఞులనియు, భూతభవిష్య ద్వర్తమానములను వున్నదున్నట్టుగ చెప్పగలరనియు, ప్రజలను కొనసాగినారు. భక్తాదుల గుంపు పెరిగిన కొలదిని వూరి వారికి స్వాములవారి మహిమ పట్ల నమ్మిక పుట్టసాగింది. వారు. దొంగసాధువులని దూషించు చుండిన నాస్తికులు సైతము స్వామి

వారి ముఖములోని తేజస్సును, వారు చెప్పెడి యదార్థ విషయములను, వారి పూజ, ధ్యానము, నిష్ఠ ఇత్యాదులను చూచి నిశ్చేష్టులై, నాస్తికులుగా వచ్చినవారు ఆస్తికులుగా వెనుదిరుగ సాగినారు. దినదినమునకును వారి కీర్తి పెరిగినట్లే, వారి దర్శనార్థమై వచ్చెడి ప్రజల గుంపుకూడా పెరుగ సాగినది.

బాలాంజనేయ స్వాములవారు వేకువఝామునకే లేచెడివారు. దానప్ప బావిలో స్నానసంధ్యావందనాదులను తీర్చుకొని, ఇష్టదైవమగు ఆంజనేయస్వామి యొక్క ఏకాంతసేవకు కూర్చొను వారు. వారివద్దఒక అడుగు ప్రమాణపు 'మారుతి' రజిత విగ్రహమున్నది. స్వామివారు ఏకాంతసేవలో నున్నప్పు డెవరునూ వారి దర్శనము చేసుకొనుటకు వీలు లేదు. ఈ సేవ సూర్యోదయము వరకూ జరిగెడిది. అనంతరము నిత్య పూజకు ప్రారంభము కాగలదు. భక్తాదులు సమర్పించు పూవులు ఫలము లతో స్వామిని భక్తిగా ఆరాధించెడివారు. మొదటి ఝాము పూజ ముగి సిన తర్వాత మధ్యాహ్న సమయము వరకునూ భక్తాదు లడిగెడి ప్రశ్న లకు జవాబు లిచ్చెడివారు. వారి సమస్యలకు బాలమారుతి యొక్క అనుగ్రహముతో తమకు తోచిన పరిష్కారమును తెలుపుదురు. తర్వాత భోజనము. భోజనానంతరము ఒక ఘడియసేపు విశ్రాంతి. అటుపిమ్మట సాయంకాలము వరకునూ భావుక ప్రజలకు సందర్శన మిచ్చెదరు. అది ముగియగనే మరల'మారుతి' ఏకాంత పూజకు కూర్చొనువారు. ఏకాంత సేవముగిసినవెనుకవారుసమాధి స్థితికి వెళ్ళుదురు. రాత్రివేళ వారు భోజ నము చేయుటలేదు. భక్తులు తెచ్చిన పాలు; పండ్లను మాత్రము సేవిం చెదరు.

నిష్ఠాగరిష్ఠులైన స్వామి వారి జీవితమును చూచిన భావుకుల కంటి కతడొక మహాత్ముడుగా గోచరించెడివాడు. నిర్మానుష్యముగా నుండిన దానప్ప తోపు, బాలాంజనేయస్వాములవారి రాకతో యిప్పుడు సదా జన సందోహమై యుండసాగినది. నిర్విరామముగా వచ్చెడి భక్తాదుల వలన స్వామివారి ఏకాంతమునకు భంగము కలుగకుండుటకై నల్వురు శిష్యులు సదా జాగ్రత్త వహించెడివారు. ఒక శిష్యుడు వారి పూజకు కావలసిన

పూలను సేకరించిన, మరొక శిష్యుడు వారి భోజనపు ఏర్పాటులను చేసెడివాడు. మూడవవాడు వారి వస్త్రములను ఉతికిపెట్టువాడు. నాల్గవవాడు పట్టపుశిష్యుడై, స్వామివద్ద కూర్చొని, పూజాసమయమున వారికి సాయ పడుచుండును. ఈ విధముగా వారు నల్వురు భక్తాదుల వలన స్వామి వారి ఏకాంతమునకు భంగము వాటిల్లకుండా చూచుకొనువారు.

ఒకటి రెండు వారములు గడచినవి. అప్పటికే స్వామివారి భక్తుల, అభిమానుల గుంపు చాల పెద్దదైనది. బావిలోనీరు తోడుకొని వెళ్లుటకై వచ్చు స్త్రీలు, తప్పక స్వామివారిని చూచి, వారి యాశీర్వాద మును పొంది వెళ్ళెడివారు. ప్రతిరోజూ ఉదయం, సాయకాలములందు వూరిలోని వనితలు, వృద్ధులు, పిల్లలు బాలమారుతికి జరిగెడి పూజాభి షేకములను చూచుటకై గుంపులు కూడువారు. మరికొందరు గృహకల్లో లములను స్వామి వారికి నివేదించి, పరిష్కారమును తెలియగోరి వచ్చెడి వారు. వేదాంతులు వారితో తాత్త్విక విషయములను గురించి చర్చించు టకై వచ్చెడివారు. ఈ విధముగా సదా అచ్చట ప్రజలు గుమిగూడియే యుందురు. ఒక్క విషయము మాత్రము అందరికీ ఆశ్చర్యమును కలుగ జేసినది. స్వాముల వారు జరిగినది జరిగినట్టే చెప్పుచున్నారు. త్రికా లజ్ఞులు కానిచో వారికీ శక్తి ఎక్కడిది? అని వారిపై ప్రజలు భక్తి భావమును కనపరచ సాగించారు.

ఊరిలోని స్త్రీలందరూ ఏదోఒక కారణమును ముందుంచుకొని స్వామివారి దర్శనము చేసుకొన్ననూ, పార్వతి మాత్రము వారి దర్శ నమునకు వెళ్ళలేదు.ఆమె దూరమునుండియే స్వామికి చేతులు జోడించి, నీరు తోడుకొని యింటికి తిరిగి వెళ్ళుచుండెడిది. తన హృదయ వ్యధను స్వామివారికి నివేదించి, వారినుండి పరిహారమును పొంద వలయునని ఆమె కనేకమారులు భావన కలిగిననూ, అంతమంద యెదుట తన అంత రంగమును బయల్పరచుట కిష్టములేక, స్వామివారు బాలబ్రహ్మచారులని వినియుండుటచే, నిండుజవ్వనియైన తను ఏకాకిగా అచ్చటికి వెళ్ళుటకు భీతిల్లినది.

ఒకరోజు నీల, స్వాతి యిరువురూ నీరు తోడుకొని వెళ్ళుటకై బావి వద్దకు వచ్చినారు. నీల యిదివరకే తన తల్లివెంట ఒకటి రెండు

పర్యాయములు స్వామివారి దర్శనమునకు వచ్చియున్నది. ఆమెకు స్వాములవారి పట్ల అమితమైన శ్రద్ధాభక్తు లేర్పడినవి. ప్రసంగ వశమున వారికి పార్వతి వివాహమును గురించి మాటలురాగా,

"పార్వతీ! నీవెందులకు స్వామివారిని నీ భవిష్యత్తును గురించి అడుగలేదు? వారి నడిగిన మల్లన్నతో నీ వివాహ మెప్పుడు జరుగునదీ చెప్పగలరు! ఎందుకీ విధంగా లోలోపలే కుమిలిపోయెదవు?" అన్నది.

"ఆ యదృష్టము నే నడిగి రాలేదు నీలా! ఈ జన్మలో నాకు వివాహము జరుగుటలేదు!" అని భారంగా నిట్టూర్చింది పార్వతి.

"ఎందుకు పార్వతీ! ఇప్పుడంతటి ఆశాహంతమేమి జరిగినది?"

"ఇంకేమి జరుగవలయును నీలా! నేను నిలబడిన ప్రదేశమే నన్ను మ్రింగ నుంకించినది! కన్నతల్లియే కుమార్తెపై కత్తిగట్టినది! పెండ్లాడినచో నేనా ముదుసలి రాజును పెండ్లాడవలె. లేనిచో ఆమరణ పర్యంతమూ కుమారిగనే వుండిపోవలె. కాని, మల్లన్నను చేబట్టుటకు ఈ జన్మలో సాధ్యముకాదని ఖచ్చితముగా చెప్పినది!"

"ఈ విషయములో తల్లిదండ్రులెవరినిగానీ ఒత్తిడి చేయరాదు! అందువలన ఎవరికీ సుఖము లభించదు!"

"నా సుఖ మెవరికి కావలయును నీలా! ఆమెకు కావలసినది నా సుఖము కాదు — నా సమాధిమీద తన సుఖసౌధమును నిర్మించుకొనుట కావలసియున్నది. పాపం! అప్పాజీ గారొక్క రేమి చేయగలరు? అమ్మనోటికి భీతిల్లి వారు వూరకున్నారు!...." అని చెప్పి కనులలో నీరు పెట్టుకొన్నది పార్వతి.

"పార్వతీ! ఎందుకు కన్నీరు కార్చెదవు? విధివ్రాత యెట్లున్నదో అట్లు జరుగనిమ్ము. రమ్ము—స్వామివారిని ప్రశ్న అడుగుదము! వారు నీ యీ విషమ సమస్యకొక పరిష్కార మార్గము చెప్పవచ్చు! వారి మాట చాలవరకూ యదార్థము కాగలదు" అనినది నీల.

"నా నుదుటివ్రాత యెంతటిదో నాకు తెలియకపోలేదు నీలా! ముంజేతి కంకణమునకు అద్దమెందుకు? ఇంతకునూ నా అదృష్టము మంచిదికాదు" అని నిట్టూర్చినది.

"నీవెందుకు అట్లనుకొనవలయును ? మహాత్ముల అనుగ్రహము వలన ఎంతటి విపత్తులైననూ పరిహారము కాగలవు. నీ వధైర్యపడకుము రమ్ము...."

"నీలా, అచ్చటికి రావలెనన్న నాకెందులకో భీతికలుగుచున్నది"

"దైవ సాన్నిధ్యమునకు వెళ్లుటకు భీతియా ?" అని చెలిని బల వంతముగా బాలాంజనేయస్వామి వద్దకు పిలుచుకొని పోయినది నీల.

వారు మంటపములో అడుగు పెట్టునప్పటికి అచ్చట శిష్యులుతప్ప యింకెవరునూ లేరు। పార్వతి హృద్గతమును వెలిబుచ్చుటకది ప్రశస్త సమయము. నీల, పార్వతితోబాటు వచ్చి గురువులకు (స్వామివారికి) నమస్కరించి. అచ్చటనే ఒక ప్రక్కగా ఒదిగి కూర్చున్నది.

గురువులు పద్మాసనా సీనులై —వ్యాఘ్రాజినము మీద-కూర్చొని యున్నారు. వారినుదుట విభూతిరేఖలు మెరయుచున్నవి. తలను కాషా యాంబరము మూసివున్నది. వారు కాషాయాంబరములను ధరించి యున్నారు. చేతిలో రుద్రాక్షల జపమాల యున్నది. నడుమ నడుమ వారు 'బాలమారుతి' నామస్మరణ చేయుచున్నారు. ఇద్దరు శిష్యులు ఏదో పనిలో నిమగ్నులై యున్నారు.

దర్శనార్థమై వచ్చిన నీలా పార్వతులను గురువులు ఆశీర్వదించి, వారు కూర్చున్న తర్వాత క్షణకాలము రెప్పవాల్చక వారినే తిలకించినారు. ఆ ముఖమును ఎచ్చటనో చూచినట్టు పార్వతికి తోచినది. కాని, ఎచ్చట చూచినదియునూ ఆమెకు స్పష్టముగా తోపలేదు. తననే రెప్పవేయక చూచుచున్న గురువుల క్రూరదృష్టిని భరించలేక ఆమె,తలవాల్చి కూర్చొ న్నది. ఆమె హృదయములో ఆందోళన చెలరేగినది. సాధ్యమైనంత తొందరగా అచ్చటినుండి లేచి పోవలయు ననుకొన్నది. కాని నీల వద లినగదా ? ఆమెయే ధైర్యముచేసి, చెలి బాధను గురువులకు నివేదించి నది —

"స్వామీ ! నా చెలి మనోవ్యథ ఎప్పుడు తీరగలదు ? ఆమె మీద బాలాంజనేయస్వామి కృపాదృష్టి యెప్పుడు ప్రసరించగలదు ?" అని ప్రశ్నించినది.

గురువు లీ ప్రశ్నవిని చకితులైనారు. వారు క్షణకాలము కనులు మూసి ధ్యానించి, మరల కనులు తెరచి అనినారు:

"తల్లీ ! నీ చెలి చాలా అదృష్టవంతురాలు. ఆమె అనతికాలం లోనే ఒక మహాపురుషుని భార్యయై అష్టయిశ్వర్యములు ననుభవించ గలదు !"

"ఆమె ప్రేమించుచున్న వ్యక్తితోనే వివాహము కాగలదా ?"

"తను చేపట్టినవారి నామె ప్రేమించగలదు !"

ఇంకనూ వారి సంభాషణ యీ విధముగా జరిగెడిదేమో ! కాని, యింతలో భక్తులెవరో దర్శనార్థమై అచ్చటికి వచ్చినారు. నీలా - పార్వతులు తాము వచ్చినపని ముగిసినదని అచ్చటినుండి లేచినారు. వెళ్లుచూ గురువులకు నమస్కరించి వెళ్ళినారు. గురువులు "ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు !" అని ఆశీర్వదించి, వారి చేతిలో మారుతీ ప్రసాదము నుంచినారు.

గురువుల అభివచనములు పార్వతి వ్యధిత హృదయమునకు అమృత సేచనములైనవి. ఆమె తను ప్రేమించిన మల్లన్నను చేబట్టి అష్టయిశ్వర్యవతిగా జీవించునట్టి సుందర స్వప్నమును గనుచూ వెను దిరిగినది.

ధర్మ కర్మ సంయోగమువలె, ఆనాటి సాయంకాలమే, గౌరాంబ కూడా తన మిత్రురాలిని వెంటబెట్టకొని స్వామివారి దర్శనమునకు వచ్చినది. ఆమె చాలరోజులుగా స్వామివారి దర్శనము చేసుకొనవలయు నని వేచియున్నా తగిన సమయము లభించలేదు. ఆరోజు ఆమె స్నేహితురాలు పూవులు-పండ్లు తీసుకొని గురువుల దర్శనమునకై బయలు దేరగా, గౌరాంబ కూడా ఆమె ననుసరించినది.

గురువుల మహిమను గౌరాంబ పలువురి నోట విన్నది. స్వభావతః భావుకురాలైన ఆమెకు గురువులపట్ల భక్తి — గౌరవము లేర్పడి నవి. ఆమె దూరమునుండియే స్వామివారికి భక్తితో నమస్కరించి, వారి యాశీర్వాదమును పొంది, ఒకవైపున కూర్చొన్నది. ఆమె రాకకు మునుపు ఎవరో భక్తులు ప్రశ్న నడుగుటచే కుతూహలము కొలదిని

ఆమె స్వామివారి ముఖమవలోకించినది. ఆమెకా ముఖమును ఎచ్చటనో చూచినట్టు భాసమైనది. అది తనకు చిరపరిచితమైన ముఖమువలె నున్నట్టు తోచినది. యెచ్చట చూచినానని; యెంత ఆలోచించిననూ ఆమెకు జ్ఞప్తికి రాకపోయినది. ఆమె తననే రెప్పవాల్చక చూచుచుండు టను గమనించిన గురువుల ముఖములో క్షణకాల మేదో అనుమానరేఖ పొడసూపి, మరల మాయమైనది. వారి వదనములో కలిగిన మార్పును గౌరాంబ గుర్తించకపోలేదు. గురువులు ప్రశ్నించుచున్న వారిని పంపి వేసి, తమ లక్ష్యమును వారివైపుకు త్రిప్పినారు.

గురువులకు గౌరాంబ పూవులు-ఫలములు సమర్పించినది. వారి చ్చిన తీర్థప్రసాదములను స్వీకరించినమీదట—

"స్వామీ, నా దొక ప్రశ్న" అనినది.

"ఔను-కుమార్తె వివాహ విషయమై అడుగవలయు ననుకొన్నారు కదూ?" అన్నారు గురువులు.

ఈ జవాబుతో గౌరాంబ చకితురాలైనది. గురువులు త్రికాల వేదులు కానిచో తన మనసులోని విషయం వారికెట్లు తెలియగలదు?

"ఔను స్వామీ! మా అమ్మాయికి యెప్పుడు వివాహము కాగ లదు?"

"అనతికాలంలోనే కంకణబలం చేకూరగలదు తల్లీ, కాని ఆమెకు గ్రహ గతులు బాగులేవు. మనస్సు చంచలముగా నున్నది. గొప్పవారి నుండి వచ్చిన సంబంధమును మూర్ఖురాలై తిరస్కరించినది. కాని ఆమె తిరస్కరించిన వారితోనే ఆమె పెండ్లి జరుగ వలయునని భగవ త్సంకల్పము తల్లీ."

ఈ మాట విని గౌరాంబకు శరీరంలో విద్యుత్తు ప్రవహించి నట్ట యినది. ఆమె హృదయం భావోద్వేగముతో దడ దడ లాడసాగినది. గురువులు సర్వజ్ఞులు కానిచో వారి కీ విషయములన్నీ యెట్లు తెలియ గలవు? అని ఆశ్చర్యపోయినది.

"అయినచో ఆమెకు సొంత బంధుత్వముతో పెండ్లి జరుగదని అంటున్నారా?"

"ఔను...."

"కుమార్తె అదృష్ట మెట్లున్నది?"

"ఆమె భాగ్యవంతురాలు తల్లి. అష్టయిశ్వర్యము అనుభవించ గలదు."

అక్కడికి ఆమె ప్రశ్నలు ముగిసినవి. ఇంటికి వెళ్ళగనే ఆమె ఈ విషయముల నన్నింటనీ భర్తతో వివరించినది.

"చూడుడు, బాలాంజనేయ స్వాములవారుకూడా ఈ విషయమునే చెప్పినారు. మీరు మాత్రి మింకనూ మల్లన్నను పట్టుకొని గంతులిడు చున్నారు" అని హేళనచేసినది.

"యెందులకో నాకు బాలాంజనేయ స్వాముల వారి మహిమలు వింటున్నకొలదీ వారి మీద అనుమానము ఎక్కువగు చున్నది. ఒకచోట మూడు రోజుల కంటెనూ యెక్కువగా నిలుచుటలేదని చెప్పుకొను వారిచ్చట మాసము రోజులుగా యుండుటను చూచిన నా కెందులకో సంశయము కలుగుచున్నది. ఇందులో ఏదో మోసమున్నది. వారి విషయములో కొంత జాగ్రత్తగా యుండుట మంచిది" అనిఅన్నాడు తిమ్మోజీ.

ఈ మాటలకు గౌరాంబకు విపరీతమైన కోపము వచ్చినది.

"మీకు వయస్సు వచ్చియూ ప్రయోజనము లేదు. రోజులు గడ చిన కొలదిని మీరు నాస్తికు లగుచున్నారు. ఇది మంచి సూచన కాదు." అని గట్టిగా శ్వాసపీల్చి, భర్తను మ్రింగివేయు దానివలె చురచుర చూచి, అచ్చటినుండి వెళ్ళిపోయినది.

# కన్యాపహరణము

## 8

ఆ రోజు బాలాంజనేయస్వామి చెప్పిన మాటలకు తన సొంత అర్థము నన్వయించుకొని పార్వతి పరమానంద భరితురాలైనది. తనను చేబట్టగల అదృష్టవంతుడు మల్లన్నయేయై యుండవలెనని ఊహించినది. అతనిని పెండ్లాడి తను అష్టైశ్వర్యవతి యగు కలనుగన్నది. మల్లన్న తను నిర్మించుచున్న కోమలాపుర మందలి శివాలయమును పూర్తి చేసి, ముద్దల్లుకు తిరిగి వచ్చెడి దినము సమీపించు చున్నది. అతడు తిరిగిరాగానే అతనితో తన వివాహము చేయునట్లుగా తిమ్మోజీ కుమార్తెకు మాటయిచ్చి నాడు. తండ్రి మాటమీద నమ్మకముంచి, పార్వతి మల్లన్న కొరకై చాతక పక్షివలె నిరీక్షించుచూ కూర్చున్నది.

ఇట్లుండగా ఒకనాడు పార్వతి చెలికత్తె నీల వెంట బట్ట లుతుకుటకు సిద్దప్ప మడుగునకు వెళ్ళినది. సిద్దప్ప మడుగు గ్రామమునకుకొంత దూరముగా నున్నది. దానిచుట్టూ కురుచటి చెట్లూ, దేవగన్నేరు పొదలూ పెరిగియున్నవి. వాటి నడుమగల గుంటలో నీరు నిలచి పెద్ద మడుగైనది. అచ్చట సంవత్సరములో అన్నివేళలా నీరు సమృద్ధిగా నుండును ఊరిలోని రైతులు లేగలకు-గోవులకు నీరు త్రాగించుటకు అచ్చటికే వెళ్ళెడివారు. ఆడవారు బట్టలుతుకుటకు అచ్చటికే వెళ్ళువారు. సామాన్యముగా పార్వతి బట్టలుదుకునది అచ్చటనే.

స్నేహితురాండ్రి యిద్దరూ ఏదియో నుబుసుపోకకు మాటాడు కొనుచున్నారు. వారి మాటలు ఎచ్చటనో ప్రారంభమై, ఎచ్చటికో వెళ్ళి చివరకు ఆ వూరికివచ్చి మాసమురోజులుగా తిష్ఠవేసిన బాలాంజనేయ స్వాముల వారి వరకూ వచ్చినవి. ఉన్నట్టుండి ఏదియో జ్ఞాపకము చేసు కొన్నదాని వలె పార్వతి అనినది :

"చూడు నీలా, నీవు ఎవరికిని చెప్పనని మాటయిచ్చిన ఒక విష యం చెప్పగలను........"

"చెప్పనులే, కానిమ్ము...."

"ఆ బాలాంజనేయ స్వామిని నీవు బాగుగా చూచితివా?"

"చూచినాను, ఏమి?"

"నీకేమని తోచుచున్నది?"

"తోచునదేమి? వారు మహాత్ములు. ఆ విషయమై సంశయ మక్కరలేదు!"

"నిన్న మొన్నటి వరకునూ నేనునూ అదేవిధముగా అనుకొన్నాను! మొన్న అప్పాజీ గారి మాటలు విన్నది మొదలు నాకు సంశయము ఎక్కువైనది. ఆరోజు మనము వారి దర్శనమునకు వెళ్ళినప్పుడు నేను వారిని పరీక్షగా చూచినాను. ఆ ముఖమును ఎచ్చటనో చూచినట్లు తోచినది. కాని, ఎచ్చట? అనునది మాత్రం ఎంత ప్రయత్నించిననూ జ్ఞప్తికి రాలేదు. నిన్నరాత్రి ఏదియో నాలోచించుచూ పడుకొని యుండగా అప్పుడు వారి నెచ్చట చూచినానన్నది చప్పున జ్ఞప్తికి వచ్చినది........"

"వారినెచ్చట చూచినావు?"

"వారిని చూచినచో, ఆరోజు మన యింటికి వచ్చియుండిన శ్యామాదీక్షితులను చూచినట్లు తోచుటలేదా? అదే ముఖము, అవే కనులు. అన్నియూ అవియే! కాని వీరికి గడ్డము-మీసములు నున్నవి. అవి కృతకములైనవి ఎందుకు కారాదు? ఎందులకో వారిని చూచినది మొదలు నా హృదయములో ఆందోళన బయలుదేరినది! అది యింతటి దని చెప్పవీలుగాని అవ్యక్తపు భీతి! నా ఊహ నిజమైనచో వారివలన నాకు...."

"ఏ గండమూ సంభవించదు! నీ వధైర్యపడకు! వారు కృతక వేషధారులైనచో వారి నిజస్వరూపము బయలు పరచుదము! ఈ విషయము అప్పాజీకి చెప్పి, వారిమీద ఒక కన్నువేసి యుండుమనెదం. నీవేమియూ చింతించకు పార్వతీ!...." అని నీల ధైర్యము చెప్పనది. కాని, పార్వతి గుండె దడ మాత్రము తగ్గలేదు. తన ఊహ నిజమై, బాలాంజనేయస్వామియే శ్యామాదీక్షితులైనచో...."

ఈ విధముగా ఆలోచించుచూ పార్వతి బట్టలుతుక సాగినది.ఆమె ఉతుకుట ముగించిననూ, నీల యింకా ముగించలేదు. "నీలా, నేను నాలుగు దేవగన్నేరు పూవులను కోసుకొని వచ్చెదను. నీవు ఉతుకుట ముగించిన వెంటనే నన్ను పిలువుము" అనిచెప్పి: పక్కనయున్న దేవగన్నేరు పొదలవైపు వెళ్ళినది.

మడుగు సమీపములో దేవగన్నేరు పొదలు సొంపుగా పెరిగి యున్నవి. ప్రతి శుక్రవారమునూ బట్ట లుతుకుటకు మడుగు వద్దకు వచ్చినప్పు డంతయూపార్వతి దేవగన్నేరు పూలను కోసుకొనివెళ్ళి అందమైన హారముగూర్చి దేవుని మెడలో వేసెడిది. పద్ధతి ప్రకారము ఆరోజుకూడా పూవులను కోసికొని వచ్చుటకై వెళ్ళినది. సమీపములో నున్న పొదలలోని పూవులను బాలాంజనేయస్వామి శిష్యులు కోసుకొని వెళ్ళినారు మరికొంత ముందుకు వెళ్ళిన గన్నేరు వనమే యున్నది. అచ్చట వలసినన్ని పూగుత్తులు గలవు. వాటిని కోసుకొని వచ్చుటకై పార్వతి ఆవైపునకు వెళ్ళినది.

పూలుకోయుటకై వెళ్ళిన పార్వతి యిప్పుడు రాగలదు, యిక కొంతసేపటిలో రాగలదు, అని నీల ఆమె రాకకై ఎదురు చూచినది. కాని, ఎంతసేపటికీ పార్వతి వచ్చు జాడ కనబడలేదు. నీల కెందులకో ఆందోళన కలుగసాగినది. దానికి తగినట్టు క్షణం క్రిందట పార్వతి తన అనుమానమును వ్యక్తపరచినది. నీల గుండె దడదడ లాడసాగినది.ఆమె ఉద్విగ్నురాలై, 'పార్వతీ !" అని బిగ్గరగా పిలచుచూ సమీపములోనున్న గన్నేరు పొదలనన్నిటినీ వెదికినది. కాని,' ఎచ్చటనూ పార్వతి జాడ లేదు ! ఆమె కిప్పుడు మరింత భీతి జనించినది !

"పార్వతీ ! పార్వతీ !" అని పిచ్చిదానివలె బిగ్గరగా అరచుచూ చుట్టుపట్లగల పొదలనంతయూ వెదకినది. అట్లు వెదకుచూ రాగా, కొంత దూరములో ఎవరో పార్వతిని ఎత్తుకొని పారిపోవుచుండుట కనబడినది. ఆ దృశ్యమును చూడగనే నీలకు జరిగిన సంగతి అర్థమైనది. ఆమె పార్వతిని దుష్టుల బారినుంచి రక్షించుటకై బిగ్గరగా అరచుకొనుచూవానిని వెన్నంటి పరుగిడినది.

ఆమె కేకలను విని, పొలములలో పని చేయుచుండిన రైతులు పరుగిడి వచ్చినారు. నీల వారి పార్వతి యపహరణపు సంగతిని తెలిపి, ఆ నీచుని బారినుండి పార్వతి నెట్లయిననూ రక్షించ వలయునని ప్రార్థించినది. రైతులు "పట్టుకొనుడు, ఆ దుష్టుని పట్టుకొనుడు !" అని పొలి కేకలు పెట్టుచూ పలుగు, పార తీసుకొని వానిని వెన్నంటి తరిమినారు. నాలుగు దిక్కులనుండి, పొలములలో పనిచేయుచున్న రైతు యువకులు ఆ ధూర్తుని పట్టుకొనుటకై వేటకుక్కలవలె పరుగిడినారు. ఇక పార్వతి నెత్తుకొని పరుగిడడము సాధ్యము లేదని గ్రహించి, ప్రాణంమీది ఆశతో ఆమె నచ్చటనే పడవేసి పారిపోసాగినాడు. కాని, అతడు రైతుల చేతి నుండి తప్పించుకొని పోలేక పోయినాడు. వలపన్ని వేటమృగమును పట్టినట్టుగా వారు ఆ దొంగను చుట్టుముట్టి పట్టుకొన్నారు.

నీల పరుగున వెళ్ళి పార్వతి నోటకుక్కిన గుడ్డలను తీసివేసినది. కాలుచేతులకు బంధించిన కట్లనూ తీసినది. అదృష్టము కొలదిని ఆమె కే యపాయమునూ సంభవించి యుండలేదు. నీల శైత్యోపచారములు చేసిన తర్వాత తెలివిగొన్న పార్వతి సంగ్రహముగా జరిగిన సంగతులన్నియూ వివరించినది.

ఆమె దేవగన్నేరు పూవులను కోయుచుండగా ఎవరో వెనుక నడచిన చప్పుడైనది. తిరిగి చూడగా ఎవరునూ కనబడలేదు. గాలిసవ్వడి యని ఆమె మరల తన పనిలో నిమగ్నురాలైనది. పూలు కోసుకొనియిక వెళ్ళుద మనునంతలో వున్నట్టుండి ఎవరో వెనుకనుండి వచ్చి ఆమె తలకు ముసుగువేసి, కేకలు పెట్టకుండా నోటిని భద్రముగా అదిమిపట్టి, తర్వాత క్రిందకు తోసి నోటిలో బట్టలు తురికి, కాలుచేతులను బంధించి, మూపుపై వేసుకొని వెళ్ళినారు. అంతలో నీల పార్వతిని వెదకుచూ అచ్చటికి వచ్చినది. ఆమె రాక మరికొంత ఆలస్యమై యుండిననూ పార్వతి ఆమె చేతికి చిక్కెడిది కాదు.

రైతులు యింతసేపటికి ఆ దుర్మార్గుని అచ్చటికి పట్టి తెచ్చినారు. బాగుగా దేహశుద్ధి చేసిన తర్వాత అతడు తనతప్పును ఒప్పుకొన్నాడు. కాని, పార్వతిని ఎత్తుకొని రమ్మని తనను బంపిన వ్యక్తుల పేర్లను

మాత్రము అతడు చెప్పలేదు. రైతు లతనిని కాలుచేతులు కట్టి గ్రామ చావడి వద్దకు తీసుకొని వెళ్ళినారు. అచ్చటగల కంబమునకు బిగించి కట్టి, నాలుగు కమ్చీ దెబ్బలు కొట్టగా అప్పుడు చెప్పినాడు. ప్రాణంమీది ఆశలో విషయములన్నీ వివరంగా తెలియజేసినాడు—

దేవరాయల ఆజ్ఞ ప్రకారము పార్వతిని ఉపాయముగా బంధించి తీసుకొని వచ్చుటకై మహామాత్యుడు, దండనాయకుడును అగు నాగన్న, శ్యామాదీక్షితులు బాలాంజనేయస్వామి వేషముతో ఆడిన నాటక మిది యని అతడు చెప్పినాడు. చివరకు పార్వతి సందేహము నిజమైనది.

బాలాంజనేయ స్వాములను బంధించుటకై ఉద్రిక్తులైన ప్రజలు కొందరు దానప్ప తోపు వద్దకు పరుగిడినారు. కాని, వారు వెళ్ళునప్పటికే, ఈ విషయమెట్లో గ్రహించిన స్వామివారు శిష్యసమేతముగా పారిపోయినారు! పారిపోవు గడబిడలో వారు తమ 'మారుతి' పూజిత పూజావిగ్రహమును వెంట తీసుకొని వెళ్ళుటకు మరచినారు! ఉద్రేక పూరితులైన యువకులు వంచకులు చేయిజారిపోయినందుకు చాల చింతించినారు. వారు నాగన్నసేనానిని, దీక్షితులనూ వెదకుచూ పగలంతయూ తిరిగినారు. కాని, ఎచ్చటనూ వారి జాడ కనబడలేదు. వారి కోప మిప్పుడు పట్టుబడిన హతభాగ్యునిమీద కేంద్రీకృతమైనది. కాని, తిమ్మోజీ అతని కడ్డుపడి, వాని పేదప్రాణములను మిగిల్చినాడు. తిమ్మోజీ మాట మీరలేక గ్రామపెద్దలు ఆ సైనికునికి తలగొరిగించి, గార్దభము మీద ఊరేగించి, పార్వతి జోలికి వచ్చిన దేవరాయలకు సైతమిదియే దుర్గతి పట్టగలదని చెప్పి, అతనిని పంపినారు.

మొత్తముమీద పార్వతి ఒక పెద్ద గండమునుండి బయట పడినది. ఆమెకు వచ్చిన ఆపద తల్లిదండ్రులకు కనువిప్పు కలుగ జేసినది. పార్వతి ఊరిలో నున్నచో ఆమెకు అపాయము తప్పదని వారు గ్రహించినారు. సాధ్యమైనంత త్వరితముగ ఆమెను మల్లన్నకిచ్చి వివాహము చేసి, దేవరాయల కాముక దృష్టినుండి తప్పించ వలయునని ఆశించినారు. ఇదివరకు కుమార్తెను మల్లన్నకివ్వరాదని పట్టుబట్టిన గౌరాంబ,యిప్పుడు పార్వతి నపహరించుటకు దేవరాయలు చేసిన తంత్రమును విని, అతని

మీద తనకుగలట్టి సద్భావనల కన్నింటికి తిలా ౦లి నిచ్చి, కామాంధుడైన ప్రభువును చేపట్టుట కంటెనూ, మల్లన్నను చేబట్టిన ఆమె ఎక్కువ సుఖ పడగలదను అభిప్రాయమునకు వచ్చినది. సాధ్యమైనంత త్వరలో మల్ల న్నతో పార్వతి వివాహమును చేయుటకు వారుత్సుకులైనారు. కాని, ఇంతలో గ్రామమునకు మరొక గండము సంభవించినది.

ముద్గల్లు నివాసులచేత చిక్కి అవమానితుడైన సైనికుడు వెళ్ళి, నాగన్న సేనాని జరిగిన సంగతులన్నియూ వివరముగా చెప్పినాడు. నాగన్నసేనానికిపార్వతి తమ చేతినుండి తప్పించుకొని వెళ్ళక మునుపే, ఆమెను చెరబట్టుటకును ముదిగల్లు వాసుల మీద పగదీర్చు కొనుటకును తన అశ్వసేనతో మెఱుపువలె వచ్చి, ముద్గల్లును ముట్టడించి దానిని వశ పరచుకొన్నాడు।

ఇదంతయూ క్షణముల మీద జరిగిపోయినది.

నాగన్న సేనాని ముద్గల్లు తన వశమైన వెంటనే నగర రక్షణకు కావలసిన సైన్యమును విడచి, తక్కిన సైన్యముతో పార్వతిని చెరబట్టి తెచ్చుటకై తానే స్వయముగా వెళ్ళినాడు. అతడు తిమ్మోజీ యింటి ముంగిట ఆయుధ ప్రాణులైనభటులనుకావలియుంచి,పార్వతిని బంధించి తెచ్చుటకై వారి గృహమును ప్రవేశించినాడు. పరిస్థితి విషమించవచ్చని అతనివెంట దీక్షితులుకూడా వచ్చినాడు.

హృదయములో హాలాహలమున్ననూ, పైకి కృతక విశ్వాసమును నటించుచూ తిమ్మోజీ వారికి స్వాగతము పలికినాడు. దీక్షితులవెంట వచ్చిన ఆగంతుకుని చూచి:

"దీక్షితులూ, వీరెవరో తెలియదు?" అన్నాడు.

"వీరే నాగన్న దండనాయకులు. బహుశః వీరి పేరును మీరు విని యుండవచ్చును."

"విని యున్నాను దీక్షితులూ, విజయనగర మహామాత్యులు.... మహా సైన్యాధిపతులు వీరేకదా?"

"ఔను."

"ఇప్పుడు నావలన మీకేమి పనికావలయునో, దయయుంచి శెల వివ్వుడు."

"అది చెప్పుటకొరకే వచ్చినాము. కూర్చొనుడు. సావకాశముగా చర్చించుకొందము."

"మీరు చెప్పదలచుకొనిన దేదియో దానిని ఒక్క మాటలో వివరించుడు. మీతో కూర్చొని మాటలాడుటకు నాకు సమయము లేదు" తిమ్మోజీ కొంత కటువుగా అనినాడు.

"మాకునూ అంత తీరికలేదు. మేముకూడా వెంటనే రాజధానికి వెనుదిరుగ దలసి యున్నది. దయ యుంచి మీ అమ్మాయిని మా కప్పగించ గలరా?"

"ఏమపరాధము చేసినదని మీరామెను తీసుకొని వెళ్ళుటకై వచ్చినారు?"

"ప్రభువుల ఆజ్ఞయున్నది."

"మేము మీ ప్రభువుల ప్రజలముకాము. మా మీద మీ ప్రభువుల అధికారము చెల్లనేరదు."

"అయినచో, మీరు మంచి మాటలతో పార్వతిని మా కప్పగించునట్లు లేదు?" నాగన్న దండనాయకుడు అధికార స్వరముతో అనినాడు.

"ఆ కామాంధునికి కుమార్తెను అప్పగించుటయా? వీలులేదు! తిమ్మోజీ ప్రాణములతో వున్నంతవరకూ ఈ హేయ కృత్యమునకు పూనుకొనడు."

"అయినచో మేము బలవంతముగా పార్వతిని చెరబట్టి తీసుకొని పోవలసి యుండును."

"మీ కంతటి శక్తియే యున్నచో పార్వతిని బంధించి తీసుకొని వెళ్ళుడు" అని చెప్పి అచ్చటినుండి లేవ ప్రయత్నించినాడు.

పరిస్థితి విషమించగలదని గ్రహించిన దీక్షితులు నడుమ కలుగజేసుకొన్నారు.

"శిల్పిగారూ, యిటువంటి పరిస్థితి యేర్పడగలదని నేను నిజముగా అనుకొనలేదు. అంతయూ దైవేచ్ఛ! దైవ సంకల్పము నెవరునూ మీరలేరు. సంతోషముగా జరుగవలసిన పెండ్లి నిర్బంధముగా జరుగునట్లు ఏర్పడుట మన దౌర్భాగ్యము" అని దీక్షితులు విషాదముగా అన్నారు.

"దీక్షితులూ, ఇంత జరిగిన పిమ్మటకూడా పార్వతిని చేపట్ట వలయునని మీ సామ్రాట్టులకు ఆశగా నున్నదా ?" తిరస్కార భావముతో అనినాడు తిమ్మోజీ.

"తిమ్మోజీగారూ, మీ అమ్మాయి చాల అదృష్టవంతురాలు! క్షత్రియ కన్యను వరించినట్టుగా ఆమెను వరించవలయునని ప్రభువులు నిశ్చయించినారు. మీ రామెను విజయ వధువుగా సమర్పించి, ప్రభువులను క్షమాపణ కోరుడు. మీ సర్వాపరాధములను మన్నించగలరు."

"పార్వతి యింటనున్నచో మనము అట్లేచేసి యుండవచ్చును కాని...."

"ఆమె ఎచ్చటికి వెళ్ళినది ?" దీక్షితులు ఆందోళనగా అడిగినారు.

"ఇంటినుండి తప్పించుకొని వెళ్ళిపోయినది."

"ఏమీ, తప్పించుకొని పారిపోయినదా ?"

"ఔను."

"యెప్పుడు ?"

"రాత్రి పడుకొన్నది.. ఉదయము లేచునప్పటికి లేదు!...."

"ఏమైనది? యెచ్చటికి పోయినది ?"

"మేమునూ ఆ విషయమునే ఆలోచించుచున్నాము. ఇంతలో మీరునూ వచ్చినారు."

"ఆశ్చర్యము! పార్వతి పారిపోయిన విషయము నిజమేనా ?" నాగన్న దండనాయకుడు ప్రశ్నించినాడు.

"దైవసాక్షిగా సత్యము."

"పార్వతిని దాచిపెట్టి మీ రీ నాటక మాడలేదుకదా?"

"అందువలన నాకు లాభమేమి?"

"అట్లయిన మేము మీ గృహమును శోధించవచ్చునా ?"

"మీ యిష్టప్రకార మాచరించుడు."

ఆపైన నాగన్న దండనాయకుడే స్వయముగా యిల్లంతయూ

శోధించినాడు. కాని పార్వతి జాడ యెచ్చటయునూ కనబడలేదు. నిజ ముగా ఆమె కనుమరుగైనదో లేక తిమ్మోజీయే రహస్యముగా దాచిపెట్టి తమను వంచింప బ్రియత్నించుచున్నాడో, దండనాయకునికి తెలియక పోయినది. యెందులకో అతని కిదంతయూ తిమ్మోజీ తమను మోస గించుటకయి ఆడిన నాటకమని తోచినది. అతడు ముఖము జేవురించు కొని అనినాడు:

"శిల్పిగారూ, మీ మాటను నమ్ముటకు సాధ్యము లేకున్నది. మీ కుమార్తె నిన్నటివరకూ యింటియందే యున్నట్లు మాకు సాక్ష్యమున్నది. ఒక్క రాత్రిలో ఆకస్మికముగా కనుమరుగైన దనిన యెవరు నమ్మ గలరు? శత్రువుల చేతికి చిక్కగలదని మీరే ఆమె నెచ్చటనో దాచి వున్నారు. ఇప్పుడు మమ్ములను మోసపుచ్చుట కీ నాటక మాడుచున్నారు. మీ యాటలు నాముందు సాగవు. మంచిమాటలతో మీరు పార్వతినెచ్చట దాచిపెట్టినారో తెలుపుట క్షేమకరము. లేనిచో దీని పరిణామము చాల ఘోరముగా నుండగలదు"

"నా మాటపై మీకు నమ్మిక లేనిచో, మీ యిష్టము వచ్చినట్టు చేసుకొనుడు దండనాయకులూ! నేను ఉన్నసంగతి తెలిపినాను. దానిని నమ్ముటయూ — నమ్మకపోవుటయూ మీ యిష్టం."

"అట్లయిన, మేము మిమ్ములను బంధించవలసి వుండును."

"యెందులకు? నేను ఏ మపరాధము చేసినాను?"

"విజయనగర సామ్రాట్టులకు చెందవలసిన వధువును మీ రెచ్చ టనో దాచిపెట్టినారు!"

ఈమాట విని తిమ్మోజీ పిచ్చివానివలె నవ్వినాడు.

"యెందుకు నవ్వుచున్నారు?" దీక్షితు లడిగినారు.

"నవ్వకేమి చేయమనెదరు దీక్షితులూ? పార్వతి నా కుమార్తె. ఆమెను మేము మీ సామ్రాట్టుకిచ్చి వివాహము చేసియుండలేదు. యిక నామె మీ సామ్రాట్టులకెట్లు చెందగలదు ? ఆమెమీద మీ సార్వభౌముల కేమి యధికారము గలదు? మేము వారి ప్రజలముకాము. బహమనీ సుల్తా నుల ప్రజలము. మామీద వారి యధికారమా?"

"అవును మీమీద సామ్రాట్టులకు అధికారముగలదు ?"

"యెట్లు?"

"ముద్గల్లు పూర్వమునుండియు విజయనగర సామ్రాజ్యమునకు చెందినదే."

"అయిననూ, యిప్పుడు వారిచేయి విడచిపోయినది కదా ?"

"దానిని మరల మేము గెల్చినాము। ఇప్పుడు మీరు మా సామ్రాట్టుల ప్రజలు। ప్రజలవద్ద నున్న అమూల్య-అపూర్వ వస్తువులు ప్రభువుల సొమ్ములు। మీ కుమార్తె పార్వతి అనుపమ అపూర్వ సౌందర్యరాశి యని తెలిసియే ప్రభువు లామెను కోరినారు। వారి కోరికను తిరస్కరించు హక్కు ఎవరికినీ లేదు।"

"మా బిడ్డను మేము, మా యిష్టము వచ్చినవారి కిచ్చి వివాహము చెయ్యలము. దీనికడ్డు తగులు హక్కు వారికి లేదు।"

"అయినచో, మీరు మంచి మాటలతో పార్వతి నెచ్చట దాచి యుంచినారో తెలుపరా ?"

"మాకు తెలిసిన కదా మీకు చెప్పుట ?"

"మీకు తెలియును, కాని, మాకు చెప్పుటకు వెరచు చున్నారు।"

మా మాటమీద నమ్మికలేనిచో ఆపైన తమ యిష్టము।"

"అట్లయిన, మిమ్ములను బంధించి చెఱసాలలో వేయవలసి యుండును."

"ఎందులకు ?"

"మీరు రాజద్రోహము చేసినారు।"

"నేనే రాజద్రోహమునూ చేయలేదు।"

"మీ కుమార్తెను మా కప్పగించిన మీకూ, మీ గ్రామమునకూ క్షేమము. లేనిచో, మేము కఠినచర్యకు పూనుకొన వలసి రాగలదు। మీరు ఆమె నెచ్చట దాచియుండిననూ మేము విడువము. ఈ మాటలు బాగుగా జ్ఞప్తియందుంచుకొనుడు !"

"మీ యిష్టము వచ్చినచోట వెదకి కొనుడు. మా అభ్యంతరము లేదు।" అనిచెప్పి త్రిమ్మోజీ దీక్షితుల ముఖమవలోకించినాడు.

"శిల్పిగారూ, మా వలన అపచారమేమైననూ జరిగియుండిన క్షమించ ప్రార్థన. మిమ్ములను చెఱలో నుంచుటకు మాకు మనస్కరించుట లేదు, కాని విధిలేకపోయినది. పార్వతి మాకు లభించిన వెంటనే మిమ్ములను విడుదల చేయగలము !" అని అన్నారు.

తిమ్మోజీ అర్థములేని నవ్వు నవ్వినాడు.

దండనాయకుడు నాగన్న ఆజ్ఞ ప్రకారము సైనికులు తిమ్మోజీని బంధించినారు. అతడు ప్రతిఘటించలేదు. ఇవేవియూ తనకు సంబంధించినవి కావన్నట్టు వారి వెనుక యాంత్రికముగా నడచినాడు.

కాని, దండనాయకుల ఆజ్ఞను గౌరాంబ ధిక్కరించినది. ఆమె ఏడ్చినది. ప్రతిఘటించినది. సైనికులను దొంగలు, అత్యాచారులని దూషించినది. ఆమె మాటల నెవరూ లెక్కించలేదు ! వారు తిమ్మోజీని బంధించి చెఱసాలలో వేసినారు. గౌరాంబ చేసిన ప్రతిఘటన లన్నియూ వ్యర్థములైనవి. ఇప్పుడామె దుఃఖావేశముతో పిచ్చిదానివలె యైనది. అటు కుమార్తె కనబడని దుఃఖము ! ఇటు భర్త ఖైదుచేయబడిన దుఃఖం ! ఈ రెండు విధములైన దుఃఖ భారముతో ఆమె కృంగిపోయినది.

నీల ఈవార్తతెలిపి గౌరాంబను సమాధాన పరచుటకై వచ్చినది.

"పిన్నీ, మీరు పార్వతికొరకై శోకించ నక్కరలేదు. ఆమెప్రాణమున కే గండమూ లేదు. నెమ్మదిగా నున్నది. మీరు నిశ్చింతగా నుండుడు ! గ్రామమున కేర్పడిన గండము తప్పిన వెంటనే ఆమె వెనుదిరిగి రాగలదు ! మీరు వ్యధ పడకుడు !" అని ధైర్యము చెప్పినది.

"అమ్మా, నీలా ! పార్వతి ఏమైనది ? ఎచ్చటికి వెళ్ళినది? అను విషయ మేమైననూ నీకు తెలియునా ?"

"లేదు పిన్నీ. కాని, ఆమె గ్రామమును వదలి వెళ్ళినది మాత్రము మేలునకేనని నాకు తెలియును ! తన కపాయము రాగల ఏ పనినీ ఆమె చేయలేదని చెప్పగలను !"

"ఎట్లు చెప్పగలవు ?"

"పార్వతి ఊరు విడచి వెళ్ళు విషయము నొకసారి నాతో ప్రస్తావించినది !"

"ఆమె యిప్పుడెచ్చటికి వెళ్ళియుండును ?"

"బహుశః మల్లన్న వద్దకు వెళ్ళియుండవచ్చును ! కాని, ఇది నా ఊహ మాత్రమే ! ఆమె ఎచ్చటికి వెళ్ళునదీ నాకు చెప్పలేదు ! 'నన్ను వెతికించకు, ఎచ్చటనున్ననూ సుఖముగా నుండగలనని అమ్మకు తెలుపుము' అని మాత్రమే చెప్పినది !"

"ఆమె సుఖముగా నున్న నా కదియే పదివేలు తల్లీ ! ఈ పరిస్థితిలో ఆమె యిచ్చట లేకపోవుటయే మంచిదైనది, ఉండియున్న ఈ ఘాతుకుల చేతికి పట్టుబడెడిది!" అని సమాధానపు నిట్టూర్పు విడచినది.

'అట్లయిన పార్వతి ఏమైనది ? ఎచ్చటికి పోయినది ?' ఈ ప్రశ్నలు అందరికంటే నాగన్న సేనాని ముందు బృహదాకారమును దాల్చి నిలబడి వేధించసాగినవి. అతడు పార్వతి గ్రామములోనే ఎచ్చటనో దాగి యుండవచ్చునని తలచి, ప్రతి గృహమునూ పరిశోధించినాడు. కాని, ఎంత వెతికిననూ ఆమె జాడ కనబడలేదు! అయినచో తాము వచ్చిన పని విఫలమైనట్లేనా ? సామ్రాట్ దేవరాయలకు యిక ముఖము చూపు టెట్లు ? ఒక సామాన్యస్త్రీని బంధించి తీసుకొని వెళ్ళలేని తామిక రాజ్యము నెట్లు రక్షించగలరు ? ఇవన్నియూ ఆలోచించిన కొలదిని నాగన్న సేనానులకు పూర్తిగా నిరాశ కలుగసాగినది! ఏమైననూ సరే, పార్వతిని పట్టి బంధించనిదే ప్రభువులకు ముఖము చూపరాదని నిశ్చయించి,ఆమె పరిశోధనకై ద్విగుణీ కృతోత్సాహముతో బయలుదేరినాడు.

కాని, పార్వతి ముద్గల్లులో నుండినకదా వారిచేతికి చిక్కుట ? శత్రుసైనికులు ముద్గల్లును ముట్టడించు విషయమెట్లో గ్రహించి, ఆమె ఆ క్రిందటి రాత్రే అచ్చటినుండి తప్పించుకొని పారిపోయినది. తానెచ్చటికి వెళ్ళుచున్నదీ ఆమె ప్రాణసఖి యైన నీలకు సైతము చెప్పలేదు. ఆమె తన ప్రయాణమునంత రహస్యముగా ఏర్పాటు చేసుకొన్నది. ఆమె కెవరిమీదనూ నమ్మిక లేకపోయినది. తన తల్లిదండ్రుల మీద కూడా నమ్మిక తప్పినది. కామాంధుడైన దేవరాయలవారినుండి తనను రక్షించుట కెవరి వల్లనూ సాధ్యము కాదు. ఇప్పుడు తనకు దైవమొక్కటే దిక్కు ! అను నిర్ణయమునకు వచ్చినది. వెంటనే తన దారిని తాను చూచుకొన నిశ్చయించినది.

తన నపహరించు ప్రయత్నము ముగిసిన పిమ్మట. అంతటితో తన విపత్తులు అంతము కాలేదనియూ దేవరాయ లెట్లయిననూ తన మీద పగదీర్చుకొనక మానడనియూ గ్రహించిన పార్వతి హతాశురాలై, మల్లన్నను శరణుకోరినది. మల్లన్నతో తన వివాహము జరుగునంత వరకూ తనకీ దుర్గతి తప్పదు. దేవరాయలు తనమీద అధికారము జూప ప్రయత్నించుటకు మునుపే తాను మల్లన్నభార్య కావలయునని కోరు కొన్నది.

ఆమెకు తన తలిదండ్రులు మల్లన్నలో తన వివాహము నిశ్చ యించిన విషయము తెలియదు. ఈమధ్య కలిగిన తన తల్లి గౌరాంబ యొక్క హృదయ పరివర్తనమును గురించి ఆమె కిసుమంతయునూ తెలి యదు. తన తల్లి యింకనూ తను మల్లన్నను వివాహ మాడుటకు సమ్మ తించుటలేదనియే యనుకొన్నది. కనుకనే ఆమె ముద్గల్లును విడిచి వెళ్ళి పోయినది—విజయనగర సైన్యము ముద్గల్లును ముట్టడించుటకు మునుపే అచ్చటి నుండి తప్పించుకొని వెళ్ళిపోయినది. శత్రువులు తనను బలా త్కారముగా చెరబట్టి తీసుకొని పోవుటకు సైన్యసమేతముగా రాగలరని ఆమె ముందుగనే ఊహించినది. అందువలననే ఒక నిర్ణయమునకు రాగలి గినది.

రాత్రి బడుకొని ఉదయము కాకమునుపే ఆమె తన మార్గమును నిశ్చయించుకొనినది— రాత్రింతయూ యీ చింతతోనే గడిపి, ఒక నిర్ణ యమునకు వచ్చి, వెంటనే దానిని కార్యరూపమునకు తీసుకొని రా నిశ్చ యించి—వేకువ ఝాముననే ఆమె చేతికి చిక్కిన నాలుగు బట్టలను తీసుకొని యింటి నుండి బయట పడినది. కోటను దాటు వరకూ ఆమెకు ప్రాణములో ప్రాణములేదు। కోటను దాటి మల్లన్న ఆలయ నిర్మాణము చేయుచున్న కోమలాపుర మార్గము పట్టిన తర్వాత ఆమెకు వెనుదిరిగి చూచుటకు ధైర్యము కలిగినది। తన నెవరూ వెన్నంటి రావడము లేదని దృఢ పరచుకొని ఆమె నెమ్మదిగా ఒక నిట్టూర్పు విడచినది. ఆ క్షణ మున నామె మనసు మున్దెన్నడో అనుభవించని స్వాతంత్ర్య సుఖము ననుభవించినది।

# గృహపరిత్యాగము

## 9

నాగన్న దండనాయకులకు పార్వతి ముద్గల్లునుండి హఠాత్తుగా మాయమైనదను మాటలో నమ్మిక కలుగలేదు. ఆ క్రిందటి రోజు పార్వతీని ముద్గల్లులో చూచిన వారనేకులున్నారు. కాని, యిప్పుడు ఆమె ఎచ్చటికి పోయినది ? తిమ్మోజీ యింటలేదు. కుమార్తె నతడు దాచిపెట్టి యుండవచ్చునని, బెదరించి చూచుటయునూ యైనది. కాని, ప్రయోజనము లేకపోయినది. భగవంతుని సాక్షిగా పార్వతి ఎచ్చటికి వెళ్ళినదీ తనకు తెలియదని అత డనుచున్నాడు. తరచి చూడ నాతని మాట యదార్థముగనే గన్పట్టు చున్నది.

పార్వతి తను ముద్గల్లును విడచి వెళ్ళుటకు ముందు ఈవిషయము నెవరికీ చెప్పలేదు. తిమ్మోజీకి అసలేమియునూ తెలియదు. అతడు కుమార్తె విషయమై యిప్పుడు అంతగా ఆందోళన పడలేదు. మల్లన్నా-పార్వతుల వివాహమునకు నడుమ నుండిన పెద్ద ప్రతిబంధకము — గౌరాంబ విరోధము — మంచు వలె విడిపోయినది. ఆమె మల్లన్నతో కుమార్తె వివాహమునకు సమ్మతించిన మీదట, యిక పార్వతి విషయమై చింతించ నవసరము లేదని తిమ్మోజీ నిశ్చింతుడైనాడు. దీనిని పార్వతి నిర్లక్ష్యమని భావించి, తన దారిని తాను చూచుకొన్నది. ఆశ్చర్య విషయ మేమనగా ఆమె కింత ధైర్య మెచ్చటినుండి వచ్చినదనునది! మునిగి పోతున్నవారు రెల్లుగడ్డిని పట్టుకొన్నట్టు ఆమె యిప్పుడు మల్లన్నను ఆశ్రయించింది. మల్లన్నయే యిప్పుడామెకు సర్వస్వమూ ! అతని వక్షస్థలము మీద విశ్రాంతి తీసుకొనుటకు కోమలాపురమునకు వెళ్ళినది ! ఊరిలో లేని పార్వతికొరకై నాగన్నసేనాని ఎంతవెదకిన నామె యతనికి లభించ గలదు ?

అయిననూ, నాగన్న దండనాయకుడు అంతటితో తన పరిశోధ నను ఆపలేదు. తిమ్మోజీ పార్వతి నెచ్చటనో రహస్యముగా దాచి యుంచినాడనియే అతని భావన।నవయౌవని యైన పార్వతి అర్ధరాత్రిలో తల్లిదండ్రులకే విషయమూ తెలుపక గృహపరిత్యాగము చేసినదని నమ్మ శక్యమా? అతడు పార్వతి వెళ్ళియుండవచ్చునని అనుమానముతోచిన ప్రదేశముల నంతయూ కూలంకషముగా పరిశోధించినాడు. ఆమె పరిచి తుల గృహముల కన్నింటికీ వెళ్ళివచ్చినాడు. కాని, ఎచ్చటనూ పార్వతి జాడ కనబడలేదు। సాయంకాల మగుచున్న కొలదిని నాగన్నసేనానికి సఖేదాశ్చము ఎక్కువ కాసాగినది. ఆలోచించుచూ నుండగా అతనికొక క్రొత్తవిషయము స్ఫురించినది. గౌరాంబ కీ వివాహము పట్ల ఆసక్తి గలదని దీక్షితులు చెప్పగా తను వినియున్నాడు. ఇప్పు డామెచేత పార్వతి గృహపరిత్యాగ రహస్యము నెట్లయిననూ చెప్పించ వలయును।తిమ్మోజీ పార్వతిని దాచి యుండినచో ఈ విషయ మెట్లయిననూ గౌరాంబకు తెలి సియే యుండును। ఈ కార్యమునకు తనకంటెనూ దీక్షితులే యోగ్యులని తలచి, వారినే గౌరాంబ వద్దకు పంపినాడు.

దీక్షితుల ముఖము చూడగనే గౌరాంబకు తన భర్త బంధనమును విడిపించ వలయునను ఆశ జనించినది. తన భర్త నిరపరాధి యైననూ అతనినిని నాగన్న దండనాయకుడు బంధించి చెఱసాలలో నుంచినది మొదలు ఆమెకు అన్న పానీయములు సహించలేక పోయినవి. ఆమె భర్తను విడిపించు దారి తెలియక విహ్వలయై దుఃఖించుచూ కూర్చున్నది. ఇప్పుడు దీక్షితులు కనబడగానే, పరుగున వచ్చి వారి పాదములను పట్టు కొనినది.

"స్వామీ, ఎట్లయిననూ నా భర్తను చెఱసాల నుండి విడిపించి కాపాడుడు। వారు నిరపరాధులు।" అనిచెప్పి, కన్నీరు కార్చినది.

తల్లీ, నే నందుకొరకే యిచ్చటికి వచ్చినాను. ఇప్పుడు నీవు చెప్ప బోవు ఒక్కమాట మీద వారి విడుదలను గురించిన ప్రశ్న ఆధారపడి యున్నది। నీవు యదార్థము నెరిగించిన, నీ భర్తను కాపాడవచ్చును। మీ కుమార్తె పార్వతిని ఎచ్చట దాచి యుంచినారో తెలిపిన, నీ భర్త

యొక్కయు-నీ కుమార్తె యొక్కయు సిగపూవుసైతము వాడకుండా చూచుకొను భారము నాయది।"

"స్వామీ, మీరు నిజము చెప్పిననూ,అబద్ధమాడిననూ వినగలరు। మీ సాక్షిగ మాకు పార్వతి ఏమైనదియునూ, ఎచ్చటికి వెళ్ళినదియునూ తెలియదు. ఆమె మాకెవరికినీ చెప్పకయే ఎచ్చటికో వెళ్ళిపోయినది। మేము ఆమెను గురించిన చింతనలోనే యున్నాము. మీరామెను వెదకి, మాకప్పగించి పుణ్యము కట్టుకొనుడు।" అని అంగలార్చినది.

"ఇది మరియును బాగున్నది. మీరు పార్వతినెచ్చట దాచిపెట్టినారు తల్లీ, అని మే మడుగ వచ్చిన, మీరు ఆమెను వెతికి పెట్టుడని మమ్మే కోరుచున్నారా ? మీ కపట వేషములను నమ్మునంతటి యవివేకి ననుకొన్నారా ?" అని దీక్షితులు నవ్వినారు.

"అట్లయినచో, మీకు మా మాటలలో నమ్మికలేదా ?"

"నిశ్చయముగా లేదు। నిన్నయుండిన పార్వతి ఈరోజు లేదనిన ఎవరు నమ్మగలరు ? మేము ఈరోజు ముద్గలును ముట్టడించగలమని ఆమె యేమైననూ ముందే కలగన్నదా ? ఇచ్చటినుండి తప్పించుకొనుటకు। మీ మాటలకు మేము మోసపోగలమని భావించినారా ?"

గౌరాంబ కేమిచెప్పుటకునూ తోచలేదు.

"స్వామీ। మీవలననే మాకిన్ని కష్టములు కలిగినవి. మిమ్మాహ్వానించి అన్నము పెట్టినందుకు మాకు సరియైన శిక్ష లభించినది. మీరు మా యింటికి వచ్చినది భూతప్రవేశమువలె అయినది"అని ఆమె దీక్షితులను చురచుర చూచినది. ఆ దృష్టిలో తిరస్కారభావ మిమిడి యున్నది।

"తల్లీ, మీరు నన్నపార్థము చేసుకొన్నారు. ఎప్పటికీ నేను మీ కపకారము చేయువాడనుకాను. మీ కుపకారము చేయుదలచి వచ్చినాను. కాని మీ భర్తగారి ప్రవర్తనా ఫలమిది। వారు తొందరపడి తమకుతామై యిక్కట్టులు కొనితెచ్చుకొన్నారు. దీనికి నేను బాధ్యుడనా ?"

"ఔను, మీరే బాధ్యులు. మీరు మా కుమార్తెను సార్వభౌముల

కిమ్మని ఎందుకు కోరినారు ? సామాస్త్రులకు మీరు మా కుమార్తె విష యము చెప్పకయుండినచో వారు పార్వతిని చేపట్టుటకు ఒత్తిడి చేసి యుండరు. ఈ అనర్థ పరంపరల కన్నింటికి మీరే మూలపురుషులు"

"తల్లీ ! వృత్తిలో నేను పురోహితుడను. సర్వులూ సౌఖ్యముగా నుండవలయునను వారి వర్గములోనికి చేరినవాడను. మీ కుమార్తె రూప గుణ లావణ్యాదులను చూచిన మీదట ఆమె ప్రభువుల అనుగ్రహము నకు, పాత్రురాలగుటకు అర్హురాలని తీర్మానించినాను. సార్వభౌములు నా తీర్మానము నామోదించినారు. ఈ వివాహమువలన మీకుమార్తె తన కను రూపుడైన భర్తను పొంది సుఖముగా నుండగలదని భావించినాను. కాని మా దురదృష్టము మేమొకటి తలచిన దైవమొకటి తలచినది ! ఈ విధ ముగా జరుగగలదని ఎవరనుకొన్నారు ? మీరు మాత్రము నిరీక్షించి నారా ? తిమ్మోజీగారు పార్వతి పక్షం వహించక మీవలెనే యుండిన ఆమె ప్రభువుల అంతఃపురం చేరి యిప్పటికి చాలాకాలమై యుండెడిది. కాని మీ పతి తొందరపాటు ఫలితమును మీరందరూ యిప్పుడు అనుభ వించవలసి వచ్చినది. ఇప్పుడైననూ కార్యము మించిపోలేదు. నా మాట ప్రకారము నడచిన మీరూ మీ కుమార్తెయూ సౌఖ్యముగా నుండగలరు"

"ఏమిటో సెలవిండు !"

"మీభర్త పార్వతి నెచ్చట దాచినదీ బహుశా మీకు తెలిసియే యుండును. ఆ రహస్యము నెరిగించిన మేము మీపేరు ముందుకు రాకుండా ఆమెను వెతుకగలము. ఆమె సిగపూవు వాడకుండా రాజధానికి తీసుకువెళ్ళి సార్వభౌములకు విజయవధువుగా సమర్పించగలము. దీనితో మీ అదృష్టము పండగలదు"

"అటువంటి ఆశాసౌధములను కట్టిన కాలముకూడా ఒకానొకప్పు డుండినది దీక్షితులూ ! కానీ యిప్పుడా కోర్కెలకన్నింటికీ తిలాంజలి నిచ్చినాను. పార్వతికి బాధకలుగునంతటి ఏ కార్యమును చేయుటకూ నేనిప్పుడు సమ్మతించుటలేదు. ఆమె అతి-గతులు నిజముగా నాకు తెలి యవు-ఒకవేళ తెలిసిననూ నేను మీకు చెప్పను. ఇక మీరూ, మీ సామాస్త్రులూ ఆమె యాశను వదలుకొనుట మంచిది" అనినది గౌరాంబ కటువుగా.

ఆమె మాటలు దీక్షితులను చకితపరచినవి. ఇదివరకూ ఎప్పుడూ ఆమె ఈ విధముగా మాట్లాడి వుండలేదు.

"అన్నియూ తెలిసిన మీరే ఈ విధముగా చెప్పినమీదట యిక మేముమాత్రమేమి చేయగలము తల్లీ ? ఈ వివాహమునకు తిమ్మోజీ వ్యతిరేకులైనా, మీరు ప్రభువుల పక్షమేనని యనుకొన్నాము;కాని....మీ యంతటి వివేకవతులు సైతము తిమ్మోజీగారి మాటలకు వశులుకాగలరని నేను కలలోకూడా భావించలేదు"

"నే నెవరి మాటలకూ మోసపోయి నా అభిప్రాయమును మార్చుకోలేదు. స్వప్రేరణవల్లనే మార్చుకొన్నాను"

"ఎందుకు తల్లీ! అంతటి యపచారము.మావలన నేమిజరిగినది?"

"సంబంధము చేసుకొన గోరేవారు నడచుకొను ప్రవర్తనయేనా యిది ? మేము పేదలము కావచ్చును. కాని మానవంతులము. మాకునూ ఆత్మగౌరవమున్నది ! దానికి దూరమై కుక్కనక్కలవలె జీవించుట కంటెనూ ప్రాణములు విడచుటమేలు !"

"అంతటి హేయ కృత్యము మావలన ఏమి జరిగినది తల్లీ ?"

"ఇంకేమి కావలయును స్వామీ ! మేము మీ సార్వభౌముల కోర్కెను నిరాకరించినంత మాత్రమున మోసముతో మా కుమార్తె నపహరించుటకు ప్రయత్నించుటయా ? మీదృష్టి కామె ఒక నిర్జీవ ప్రతిమవలె గోచరించుచున్నదా ? మీకామె ఆటవస్తువైనదా ? ఆమెను బలాత్కారముగా ఎత్తుకొనివెళ్ళి యిష్టములేని వివాహముచేసి, ఆమె జీవితమునకు చిచ్చుపెట్టిననూ చూచుకొని వుండునంతటి అభిమానశూన్యులు, పిరికి పందలునని మమ్ములను భావించినారా ? మీ దేవరాయలు మహారాజాధిరాజులై వుండవచ్చును—మేము బికారులమే కావచ్చును. కాని మా అమ్మాయిమీద, ఆమె.యిష్టమునకు విరుద్ధముగ అత్యాచారమును జరుపు నధికారము వారికిలేదు. మీరీ అన్యాయమునకు కనులుమూసి వూరుకొన్నంత మాత్రమున సర్వాంతర్యామియైన భగవంతుడు చూడడనియా మీ భావన ?"

"తల్లీ ! మా విషయములో మీరు పూర్వాగ్రహ పీడితులై

వున్నారు. పంపాపతి సాక్షిగా చెప్పుచున్నాను-వినుడు. మేముకాని, మా సామ్రాట్టులుకాని మీ కుమార్తెమీద అత్యాచారము సలుపవలెనని స్వప్న మున నైతము భావింపలేదు. మీకు నేనెన్నడూ ద్రోహము దలచలేదు– ఇప్పుడూ తలచుటలేదు. సర్వలక్షణ సంపన్నయైన మీ కుమార్తెను ప్రభు వుల కర్పించవలయునన్న స్వార్థమునకంటే వేరే స్వార్థము నాలోలేదు. ఆమెవంటి రూపవతి, గుణవతి సరియైన స్థానమునకు చేరవలయుననియే మా ఆశ! ఆమె రూప-యౌవనములు అడవిగాచిన వెన్నెలవలె వ్యర్థము కాగూడదని నే నాశించినాను. ఇంతకంటెనూ ఏ దురుద్దేశమూ నాకా నాడునూ ఈనాడునూ లేదు. ఇప్పుడు పార్వతిని మేము బలవంతముగా విజయనగరమునకు తోడ్కొని పోవుటకు ప్రయత్నించుటలోని వుద్దే శ్యము కూడా నిదియే. మీకుమార్తె చక్రవర్తులను చేబట్టి నెమ్మదిగా జీవించవలయునన్న దే మా కోర్కె!"

"పార్వతి విషయములో మీకంతటి సద్భావన వుండిన, ఆమె కోరికకు వ్యతిరేకముగా నామెను విజయనగరమునకు దొడ్కొని పోవుట కెందుకు ప్రయత్నించుచున్నారు? ఆమె మల్లన్నను ప్రేమించుచున్నది. ఈ సంగతి మీకునూ తెలియును; మీ సామ్రాట్టులకునూ తెలియును. అయిననూ ఒల్లని స్త్రీని ఒత్తిడిచేసి నిర్బంధముగా వివాహమాడుటవలన మీరు సాధించునదేమి? దీనివలన మీ సార్వభౌములకుగాని, పార్వతికి గాని సుఖము లభించదు. ఆమె జీవితమునెందుకు నాశనము చేసెదరు?" అని గౌరాంబ హతాశురాలై అన్నది.

"సామ్రాట్టులపట్ల మీరు దురభిప్రాయులై వున్నారు. వారు మహానుభావులు. మీకుమార్తె నుద్ధరించుటకై ఆమెను చేపట్టదలచిరేకాని ఆమె జీవితమును పాడొనరించవలయునని కాదు. మహారాజుల అనుగ్ర హమునకు పాత్రులగుటకు కూడా పుణ్యముచేసి వుండవలె తల్లీ!"

"ఆ పుణ్యము మా కుమార్తె అడిగి రాలేదు స్వామీ!"

"అట్లని మీరెందుకు భావించవలయునమ్మా!"

"ప్రభువులను చేబట్టవలెనని ఆమె నుదుట వ్రాసియున్న ఆమె గృహత్యాగ మెందుకు చేసినది?" అని గౌరాంబ కన్నీరు కార్చినది.

ఆమె అశ్రుప్రవాహమును జూచి దీక్షితుల హృదయముకూడా కరగినది.

"అయినచో, పార్వతి నిజముగనే గృహ పరిత్యాగ మొనరించి నదా ?"

"మీ కబద్ధముచెప్పి నేను సాధించున దేమున్నది—దీక్షితులూ?"

"బలవంతముగా మే మామెను పట్టి తీసుకొని పోగలమను భీతి చేత...."

"ఆ భయము నాకు లేదు. ఆమె నుదుట ఎవరిని వివాహ మాడ వలయునని వ్రాసియున్నదో వారిని వివాహ మాడగలదు ! కాని ఆమె ఎవరికీ చెప్పక యిల్లువదలి పోయినది తలచుకొనిన యెందుకో నాకు భీతి కలుగుచున్నది."

"ఎచ్చటనైనా ఆత్మహత్య చేసికొని వుండుననియా ?"

"అవును."

"ఆమె ఆత్మహత్య చేసుకొనదలచిన ఏనాడో చేసుకొని వుండె డిది ! కాని ఆమె అబలకాదు, సబల. కానిచో సామ్రాజ్ఞుల కోరికను తిరస్కరించగలదా ?"

"మీ మాటలు సత్యము లగుగాక, దీక్షితులూ ! పార్వతి ఎచ్చట నైనా సుఖముగా నుండనీ" అని క్షణకాలము మౌనముగా కూర్చొని, తర్వాత గౌరాంబ అనినది :

"దీక్షితులూ ! నాదొక కోర్కె గలదు, దానిని నెరవేర్చగలరా?"

"ఏమికోర్కె తల్లి ?"

"నిరపరాధులైన నా పతి నెందుకు నిష్కారణముగా చెఱలో పెట్టినారు ? వారిని విడుదల చేయలేరా ?"

"వారిని చెఱసాలలోనే వుంచునదీ, లేక బంధవిముక్తుని చేయు నదీ నీమీదనే ఆధారపడి వున్నది తల్లి ! నీవు పార్వతిని మాకప్పగించిన లేదా ఆమె తప్పించుకొని యెచ్చటికి వెళ్ళినదీ తెలిసినచో తిమ్మోజీగారిని బంధవిముక్తులను చేయగలము."

"మీ మాటలు సత్యములా ?"

"పంపావతి సాక్షిగా సత్యములు!" అని గౌరాంబ హృదయములో ఆశాబీజమును నాటి, దీక్షితులు వెనుదిరిగినారు.

వారి రాకనే ఎదురు చూచున్న నాగన్న దండనాయకుడు "దీక్షితులూ, వెళ్ళిన పని పండా-కాయయా?" అని యడిగినాడు.

"దొరగాయి, దండనాయకులూ!"

"అనగా....?"

"సగము పనిమాత్రమైనది!"

"పార్వతి పలాయనమును గురించి ఏమైననూ తెలిసినదా?"

"లేదు దండనాయకులూ, బహుశః తిమ్మోజీ చెప్పిన మాటలు సత్యము అనియే తోచుచున్నది!"

"అనగా పార్వతి ఎవరికీచెప్పక స్వయిచ్ఛగానే వెళ్ళినదనియా?"

"అవును!"

"ఆ భార్యాభర్త లిరువురూ కలసి, ఈ కపటనాటకంతో మనలను వంచించుటలేదు కదా?"

"లేదు దండనాయకులూ! పార్వతి యిచ్చట దాగియున్న ఖండితముగా మనకు పట్టుబడి యుండును. ఆమె యింకనూ పట్టుబడక పోవుటను గమనించిన, యీ వార్త నిజమనియే తోచుచున్నది!"

"మీరునూ అదేవిధముగా అనుచున్నారా?" నాగన్న రాగముతీసినాడు. అతని కంఠములో నిరాశ ధ్వనించుచున్నది.

"ఎందులకో నా కా విధముగా తోచుచున్నది!"

"మీ రెన్ని చెప్పిననూ, వారి మాటలలో నాకు నమ్మికలేదు దీక్షితులూ! కుమారైన వూరిలో రహస్యముగా నుంచకపోయిననూ—వేరే ఎచ్చటనైనా దాచియే యుందురు. ఈ విషయము మాత్రము నాకు సంశయముగనే యున్నది. ఆమె నెచ్చట దాచియున్నదీ జాడ తెలిసిన, సులభముగా బంధించవచ్చును! తిమ్మోజీ చేత యీ విషయమును చెప్పించుటకు నేను కొంత కఠినముగా ప్రవర్తించ వలసి వచ్చినట్టున్నది. అతడు మంచిమాటలతో ఏమియూ చెప్పునట్టు లేదు!"

"వారిచేత చెప్పించుటకై, అనవసరమైన హింస కతనిని గురి చేయరాదని దండనాయకులతో నా విన్నపము!"

"ఈ విషయమై మీరు చింతించ బనిలేదు. మన కర్తవ్య నిర్వహణకు కావలసినంత కంటే నెక్కుడుగా నేను వారిని హింసించను" అని చెప్పి దీక్షితులకు సెలవిచ్చి, తిమ్మోజీని విచారించుటకై అతనిని బంధించియున్న ప్రదేశమునకు వెళ్ళినాడు.

తిమ్మోజీని కోటయందలి చెఱసాలలో నుంచి, దానిచుట్టునూ ఆయుధపాణులైన భటులు పహరా నిచ్చుచున్నారు. దండనాయకుల రాకను చూచి వారు వంగి నమస్కరించినారు. నాగన్నకు వారి వందనములను గమనించు నంతటి వ్యవధిలేదు. అతడు చెఱసాల వద్దకు రాగానే తిమ్మోజీని దోడ్కొని రావలసినదని భటుల కాజ్ఞాపించినాడు.

ఇద్దరు భటులు తిమ్మోజీని దోడ్కొని వచ్చి దండనాయకుల ముందు నిలబెట్టినారు.

"శిల్పిగారూ, మంచి మాటలతో జరిగిన సంగతిని ఒప్పుకొనుడు. ఇదివరకు మోసగించినట్టుగా యిప్పుడు మీరు మమ్ములను మోసగించలేరు. మీ గోముఖ వ్యాఘ్రత్వము మాకు బాగుగా అర్థమైనది. పార్వతి నెచ్చట దాచియున్నారో తెలుపుడు." అని గద్దించి పలికినాడు.

"మహా దండనాయకులకు అబద్ధముచెప్పి వంచించి, నేనేకార్యము సాధించ వలయును ? కనుమరుగైన మా కుమార్తెను మీరు వెదకితెచ్చి అప్పగించిన, మీకంటెనూ, ఎక్కుడుగా నేను సంతోషించగలను !" తిమ్మోజీ గంభీరముగనే అనినాడు.

"మీ కుమార్తె ఎచ్చటికి వెళ్ళినదియునూ మీకు తెలియదా ?"

"తెలిసిన మిమ్ములనెందుకు అడిగెదను ?"

"అట్లయినచో, మంచిమాటలతో మీరు దారికి వచ్చునట్టులేదు ?" నాగన్న దండనాయకుడు హుంకరించినాడు.

"ఈ మాటకు నే నేమని జవాబు చెప్పగలను ?...."

"కానిమ్ము, మిమ్ములను దారికి తీసుకొని రాగల మార్గము నాకు తెలియును !...."

తిమ్మోజీ మారు పలుకలేదు.

"నాలుగు కమ్చీ దెబ్బలు తగిలించినచో అప్పుడు మీకు బుద్ధి రాగలదు...."

"కొరడా దెబ్బలను కొట్టిననే కాదు....గొంతు కోసిననూ నేను చెప్పున దింతియే !"

"అట్లే కానిమ్ము!" అని అచ్చట నున్న భటునితో తిమ్మోజీని కంబమునకు బిగించికట్టి, కమ్చీతో కొట్టమని ఆజ్ఞాపించినాడు. భటుడు తిమ్మోజీని వస్త్రవిహీనునిగా చేసి, కంబమునకు బిగించి కట్టి, కమ్చీచేతికి తీసుకొన్నాడు.

"ఇప్పుడైననూ యదార్థ విషయము నెరిగించుడు ! అన్యాయముగా ప్రాణములను పోగొట్టుకొనకుడు !" మరల అనినాడు దండనాయకులు.

"ఎప్పటికైననూ నశించిపోవు ఈ శరీరము కొఱకై నే నెందుకు అబద్ధ మాడవలయును ?"

"అయినచో, మీరు మీ మొండిపట్టుదలను విడువరా ?" అని కోపముతో తిమ్మోజీని నఖశిఖ పర్యంత మవలోకించినాడు. ఇక అతనికి దెబ్బలు పడబోవునంతలో—

"దండనాయకులూ, నిరపరాధిని అన్యాయముగా శిక్షించకుడు ! పార్వతి ఎచ్చట దాగివున్నదీ వారికి తెలియదు, నేను చెప్పెదను!" అని ఎవరో బిగ్గరగాఅరచుచూఅచ్చటికి పరుగునవచ్చుచున్నట్లు గోచరించినది.

తిమ్మోజీ—దండనాయకు లిరువురూ ఆ వచ్చుచున్న వ్యక్తివైపు చూచినారు. నీల ఎదుట వచ్చి నిలబడినది. పరుగున వచ్చుటచే ఆమె ముఖము చెమట గ్రమ్మినది. గుండెలు వేగముగా కొట్టుకొనుచున్నవి"

"ఎవరమ్మా నీవు, ఇచ్చటి కెందులకు వచ్చినావు?" దండనాయకుడు ప్రశ్నించినాడు.

"నాపేరు 'నీల' ప్రభూ ! శంకర మంత్రి కుమార్తెను ! విజయనగర సామ్రాట్టుల కొలువులో నున్న ఈరన్న దండనాయకుల కోడలను ! వీరన్న నాయకుల కాబోవు పత్నిని !"

ఈ వర్ణనను విని దండనాయకుడు అధీరుడైనాడు. అతనికి ఈరన్న దండనాయకుడు ఆప్తమిత్రుడు. ఈమె తన మిత్రుని కోడలు ! ఇచ్చటి కెందులకు వచ్చినది ? అని తెలుసుకొన కుతూహలుడైనాడు.

"నిరపరాధులగు తిమ్మోజీగారికి జరుగు శిక్షను తప్పించుటకై నే నిచ్చటకు వచ్చినాను!"

అతని మనోభావమును గ్రహించినట్టుగా సీల చెప్పినది. ఆమెకు తిమ్మోజీని శిక్షకు గురిచేసిన విషయమెట్లో తెలిసి. మెఱపువలె అచ్చటికి వచ్చినది!

"తిమ్మోజీ నిరపరాధియా?"

"అవును!"

"నీ కెట్లు తెలియును?"

"పార్వతి నా స్నేహితురాలు.ఆమె గృహపరిత్యాగ విషయమును గురించి తిమ్మోజీగారి కేమియూ తెలియదు."

"అట్లయినచో, ఆమె నెవరు రహస్యముగా దాచి యుంచినారు?"

"ఎవరునూ దాచి యుంచలేదు."

"అయినచో, ఆమె ఎచ్చటికి పోయినది?"

"ముద్గల్లునుండి పారిపోయినది."

"ఎప్పుడు పోయినది?"

"నిన్నటిరాత్రి"

"ఇప్పుడెచ్చట దాగియున్నది?"

"బహుశః సోమలాపురమునకు వెళ్ళి వుండవచ్చును"

"అచ్చట యెవరున్నారు?"

"మల్లన్న అచ్చట ఆలయ నిర్మాణములో వున్నాడు."

"నీ మాటలు నిజమనుట కే మాధారము?"

"విజయనగర సామ్రాట్టుల ఉప్పుతిన్న ఈరన్న సేనాని కోడలు, ఎప్పుడునూ అసత్య మాడదు!"

"అట్లయిన నీవు విజయనగరపు కోడలువా?"

"ఔను. అందువలననే నాకు తెలిసిన యధార్థము నెరింగించుటకై పరుగున వచ్చినాను."

"ఆ యధార్థమేదియో నెరిగింపుము!"

"ఏ కారణముచే నైననూ సరియే, ధర్మప్రభువులైన సామ్రాట్టుల వలన నిరపరాధుల శిక్ష జరుగరాదు."

"నీ సత్య సంధత, రాజనిష్ఠలకు నేను సుప్రీతుడనైనాను. నీ కోరిక నీడేర్చు చున్నాను." అని చెప్పి, తిమ్మోజీని కంబమునుండి విప్పి మరల చెరసాలలో నుంచుమని ఆజ్ఞాపించి అచ్చటినుండి వెళ్ళిపోయినాడు. నీల అతనినే చూచుచూ విగ్రహమువలె అచ్చటనే నిలబడిపోయినది—

నాగన్న సేనాని తన శిబిరమునకు తిరిగివచ్చి,ఏమి చేయుటకునూ తోచక తలమీద చేతులుంచుకొని కూర్చున్నాడు. మొత్తముమీద సాయంకాల మగునప్పటికి పార్వతి యెచ్చటికి వెళ్ళి వుండవచ్చునను విషయము పట్ల ఒక అస్పష్టమైన జాడ తెలిసినది. నీల చెప్పిన మాట నిజమైనచో, పార్వతి సోమలాపురమునకు వెళ్ళి వుండవలయును. తను ముద్దల్లులో నిలచిన ప్రాణాపాయము కలుగ గలదని గ్రహించి, యెవ్వరికీ తెలియక గృహమును వదలివెళ్ళి వుండును. వెంటనే భటులను సోమలాపురమునకు పంపిన, పార్వతిని చెరబట్టవచ్చును. ఈ పనికి తానే స్వయముగా వెళ్ళవలెనా ? లేక భటులను పంపవలెనా ? అను ద్వైధీభావముతో ఏదియూ నిర్ణయించలేక క్షణకాలము అట్లే కూర్చున్నాడు.

ఇంతలో ఒక సైనికుడు ప్రవేశించి—

"ప్రభూ ! తమ దర్శనార్థమై యెవరో వచ్చియున్నారు !" అన్నాడు.

"యెవరు వారు ? లోనికి ప్రవేశపెట్టు !" అనినాడు దళపతి.

భటులు సుమా రిరువదిఐదు, ముప్పది ఏండ్ల ప్రాయముగల ఒక సుందర యువకుని తీసుకొనివచ్చి, దళపతి ముందు నిలబెట్టినారు. అతని వదనము గంభీరముగా నున్నది. అంగాంగములలో యువకరక్తము పొంగు చున్నది. చూచుచుట కతడు మల్లయోధునివలె కనబడు చున్నాడు.

"యెవరునీవు ? యిచ్చటి కెందులకు వచ్చినావు ?"

"నేను నాగన్న దళపతులను చూడవలయును"

"నేనే నాగన్న దళపతిని !"
"నేను మల్లన్నను."
"ఏమి. నీవు మల్లన్నవా ?"
"అవును"
"తిమ్మోజీ మేనల్లుడైన మల్లన్నవా?"
"అవును"
"పార్వతీ వల్లభుడైన మల్లన్నవా?"
"అవును, ఆ మల్లన్ననే నేను !"
"నీవు సోమలాపురములో నున్నట్టు విన్నామే !"
"అచ్చటినుండి యిప్పుడే యిచ్చటికి వచ్చుచున్నాను."
"ఎందులకు వచ్చినావు?"

"అది చాలా పెద్ద కథ !" అని తానచ్చటికి వచ్చినవిషయము వివరించినాడు మల్లన్న.

కొన్ని రోజుల క్రిందట పార్వతి నెవరో దుష్టులు యెత్తుకొని వెళ్ళుటకయి ప్రియత్నించిన విషయము కర్ణాకర్ణికగవెళ్ళి, సోమలాపురములో ఆలయ నిర్మాణ మొనరించుచున్న మల్లన్న చెవినికూడా పడినది. ఈ సంగతి విని మల్లన్న ఔడుగరచినాడు. ఆలయ నిర్మాణము పూర్తి కానిదే ముద్గల్లుకు వెళ్ళరాదని ప్రతిన బూనిన మల్లన్న ఈ విషయము చెవిని పడగానే ఆందోళన జెందినాడు. యదార్థము నరయుటకయి ముద్గల్లుకు బయలుదేరినాడు. కాని అతడు అచ్చటికి రాగానే శత్రు సైన్యము ముద్గల్లును వశపరచుకొనియున్న విషయము, పార్వతి హఠాత్తుగా మాయమైన విషయము తెలిసినవి. అతడు నేరుగా యింటికి వెళ్ళినాడు. అచ్చట గౌరాంబ వలన అతని కిదివరకునూ జరిగిన విషయములన్నీ వివరముగా తెలిసినవి. నిరపరాధియైన తిమ్మోజీని నాగన్న దండనాయకుడు చెరలో నుంచివున్న సంగతి విని అతని రక్తము సల సల కాగిపోయినది. గౌరాంబ మాటను సైతం పాలించక, అతనిని విడిపించుకొని పోవుటకయి భావోన్మాదములో అచ్చటికి వచ్చినాడు.

"పార్వతిని నీవు ఎచ్చట దాచి వచ్చినావు ?"

అతని కథనంతయూ విన్నతర్వాత నాగన్న దండనాయకుడు ప్రశ్నించినాడు.

"పార్వతిని నేను చూడనే లేదు."

"అబద్ధము !"

"మీ సాక్షిగా నా మాట సత్యము ! నేను పార్వతిని చూచి మూడు మాసములైనది. ఆమె పలాయితురాలైన విషయము నాకు ఇచ్చటికి వచ్చిన తర్వాతనే తెలిసినది."

"ఆ విషయమును తెలుపుటకే నీవు యిచ్చటికి వచ్చినావా ?"

"అవును. యదార్థము నెరిగించి, నిరపరాథులైన తిమ్మోజీగారిని విడిపించవలయునని వచ్చినాను."

"అయినచో యదార్థము నెరిగింపుము ! తిమ్మోజీని విడుదల చేయగలను."

"పార్వతి యెచ్చటికి వెళ్ళినదీ మా కెవరికీ తెలియదు. ఆమె ఆకస్మికపు అదృశ్యమునకు మే మెవరూ కారకులము కాము"

"అయిన ఆమె సోమలాపురమునకు వెళ్ళినదనువార్త అబద్ధమా?"

"అవును."

"అందుకాధారము ?"

"పార్వతి సోమలాపురమునకు వచ్చియుండిన, ఆమెను నేను చూడకుందునా ?"

"నీవూ, మీ మామగారూ కలసి ఆమెను సోమలాపురములో రహస్యముగా దాచిపెట్టి నట్లు మాకు వార్త వచ్చినది"

"ఎవరో మీకు అబద్ధపు వార్త నందజేసినారు. దీనిని మీరు నమ్మవలదు."

"కాదు, ఈ వార్త తెలిపినవారు పార్వతికి చాలా కావలసినవారు"

"ఆమె నీలయే ననుకొందును"

"ఔను"

"ఆమెకు పార్వతి అదృశ్యమును గురించి ఏమియూ తెలియదు"

"అయినచో ఆమె పార్వతి సోమలాపురమునకు వెళ్ళినదని ఎట్లు చెప్పినది ?"

"బహుశా ఆ విధముగా ఊహించి యుండవచ్చును"

"అట్లూహించుటకు కారణము ?"

"నేనచ్చట ఆలయనిర్మాణ మొనరించుచున్నాను. ఈ ప్రపంచ మున తల్లిదండ్రులను విడచిన పార్వతికి నేను తప్ప వేరు బంధువులెవ రునూ లేరు"

"నీవు చెప్పు మాటలకు ప్రమాణమేమి ?"

"పార్వతి సోమలాపురమునకు రాలేదు. వచ్చివుండిన ఆమె నన్ను తప్పక కలుసుకొనెగిది"

"మీ మాటలు నిజమని నమ్ముట కేమాధారము ?"

"నేనే ఆధారము. పార్వతి అచ్చటికి వచ్చివుండిన నే నిచ్చటి కెందుకు రాగలను ?"

ఈమాట నాగన్న దండనాయకులను ఆశ్చర్యపరచినది. అవును. ఆమె సోమలాపురము వెళ్ళివుండిన మల్లన్న ఆమెను వెదకుచూ ముద్గల్లు కెందుకు రాగలడు ? అయినచో పార్వతి సోమలాపురమునకు వెళ్ళినదను మాట అబద్ధమా ? కావచ్చును. మల్లన్నమాట నిజమైనచో తను నిరప రాధియైన తిమ్మోజీని వ్యర్థముగా చెఱలో పెట్టినట్టుకాగలదు. ఇప్పుడు తిమ్మోజీని విడుదల చేయుటయా ?

వద్దు. మల్లన్న చెప్పుచున్న సంగతులను కూలంకషముగా పరీ క్షించనిదే తిమ్మోజీని విడుదలచేయుట మంచిదికాదు. అంతవరకూ సులభముగాపట్టుబడినమల్లన్ననుకూడా చెఱసాలలో వుండనిమ్ము-పార్వతి అదృశ్యమునకు బాధ్యులుగా. రేపు సార్వభౌములు తమమీద కోపగించు కొన్నప్పుడు వారిని సమాధానపరచుటకు వీరినైనా చూపించవచ్చును.... అని ఆలోచించి మల్లన్నను మరల ప్రశ్నించినాడు :

"పార్వతి ఎందుల కిచ్చటినుండి పారిపోయినది ? ఆమె అదృశ్య మునకు కారణమేమి ?"

"దీనికి మీరే కారణభూతులు. ఆమె మీ అత్యాచారములకు భీతిల్లి యిచ్చటినుండి తప్పించుకొని పారిపోయినది. ఆమె తన ప్రాణమున కేమైననూ అపాయము తెచ్చికొనిన మీరు అపరాధులుగా పరిగణింప బడుదురు"

"ఆమెను మీరే ఎచ్చటనో దాచిపెట్టి. యిప్పుడు నిరపరాధుల ముసుగు ధరించుచున్నారు!"

"మే మామెను ఎచ్చటనూ దాచిపెట్టలేదు. అంతటి హేయకార్య మెందుకు చేయవలయును ?"

"ఆమెను నీవే వివాహమాడుటకు !"

"పార్వతిని నేను కొ్రత్తగా పరిణయ మాడవలయునా ? ఆమె ఏనాడో మనోవాక్కాయ కర్మలా నా భార్యయైనది !"

"ఆమె సామ్రాట్టుల విజయ వధువు !"

"కాదు, ఆమె మీ సార్వభౌముల పాలిటి మృత్యువు !"

"నీవు ఎవరితో మాటలాడు చున్నావో తెలియునా ?"

"బాగుగా తెలియును ! కామాంధుడైన ప్రభువుయొక్క పిరికి పంద కింకరునితో!"

"ప్రభువులను నిందించుచున్న నీ నాలుక తెగిపడగలదు.జాగ్రత్త!"

"మల్లన్న అందుకు బెదరునట్టి వ్యక్తికాదు ! అతడు ప్రాణము నకు భయపడువాడు కాడు. మానమునకు భయపడువాడు !"

"అట్లయినచో, నీకు తల భారమైనది కాబోలును !"

"నా తల ఎగిరిపోవు కాలమునకు మీ తలను కానుకగా తీసుకొన నిదే యీ మల్లన్న మరణించడు ! దండనాయకు లీ మాటను బాగుగా జ్ఞప్తియం దుంచుకొన గలరు ! మల్లన్నను అన్యాయమునకు లోబడచేయ జాలరు ! మంచి మాటలతో నిరపరాధులైన తిమ్మోజీ గారిని విడచిపుచ్చి వెనుకకు మరలుట శ్రేయస్కరము. అట్లు చేయుట వలన మీకునూ, మీ ప్రభువులకునూ క్షేమకరముగా నుండగలదు. మీరు మరల పార్వతిజోలికి వచ్చిన, ఈ వార్తను మీ ప్రభువులకు చెప్పుట కీ మారు మీలో ఒక్కరు గూడా మిగులరు! మీ ప్రభువు కూడా తన అవివేకమునకై పశ్చాత్తాప పడు రోజు త్వరలోనే రాగలదు !" అని అచ్చటినుండి వెళ్ళనుద్యుక్తు డైనాడు. దండనాయకుడు సైనికుల వైపు చూచినాడు. వారు ఆ చూపు లోని అర్థము గ్రహించి,హఠాత్తుగా మల్లన్నమీద పడి అతనిని బంధించి చెఱసాలలో వేసినారు !"

తిమ్మోజీని విడిపించుటకై వెళ్ళి, మల్లన్న తానే చెఱసాలను చూడవలసి వచ్చు టతని దౌర్భాగ్యం !

# ఆ శా భం గ ము

## 10

ఊరు వదలి వచ్చిననూ పార్వతి దురదృష్ట మింకా ఆమెను వెన్నాడుచునే యున్నది. ఆమె మల్లన్న ఆలయనిర్మాణ మొనరించుచున్న కోమలాపురమునకని బయలు దేరి, సరియైన దారి తెలియక అటుతిరిగి, ఇటుతిరిగి కోమలాపురము చేరునప్పటికి మల్లన్న ముద్గల్లుకు వెళ్ళినట్లు తెలిసినది. కోమలాపురమున మల్లన్న యున్నాడు. అతడు తన కాశ్రియ మివ్వగలడు. అచ్చటికి చేరుకొనిన తన కష్టములన్నియూ పరిహారము కాగలవు, అను ఆశతో ఆమె వచ్చినది. కాని, మల్లన్న పార్వతి నెవరో దుష్టు లపహరింప జూచినారను వార్తవిని, ఆమె క్షేమ మారసి వచ్చుటకై సరిగా ఆనటి ఉదయమే ముద్గల్లుకు ప్రయాణించినాడు. ఈ సంగతి తెలిసినప్పుడు పార్వతికి కలిగిన నిరాశ చెప్పశక్యము కానిది. దైవము తన కిచ్చుటగూడా ద్రోహము తలచినదని వ్యాకుల పడినది.ఆమె కిప్పుడు ఎచ్చటికి వెళ్ళవలయును, ఏమి చేయవలయును ? అనునది తెలియక పోయినది. కర్తవ్యతా మూఢురాలై దేవాలయము చుట్టును ప్రేతమువలె తిరుగుటను చూచి, ఆలయనిర్మాణ మెంతవరకు వచ్చినదో చూచివెళ్ళు టకై వచ్చిన గ్రామపెద్ద— శరభన మంత్రి, కుతూహలము హెచ్చి "తల్లీ, నీ వెవరు ? ఎవరికొరకై యిచ్చట నిరీక్షించుచున్నావు ?" అని ప్రశ్నించినాడు.

"శిల్పి మల్లన్నగారి కొరకై నిరీక్షించుచున్నాను !"

"వారు ఈ ఉదయమే ముద్గల్లుకు వెళ్ళరే !"

"తిరిగి ఎప్పుడు రాగలరు ?"

"ఆ విషయం వారేమియూ చెప్పలేదు. బహుశః ఒకటి రెండు రోజులలో రాగలరు !"

"ఉన్నట్టుండి వారు ముద్గల్లుకు ఎందుకు వెళ్ళినా రనునది మీకేమై ననూ తెలియునా ?"

"అచ్చట వారి మేనత్త కుమార్తె నెవరో దురాత్ములు అపహ రింప బ్రియత్నించినారట. అది ఏమి విషయమో తెలుసుకొని వచ్చు టకై వెళ్ళినారు !"

"ఈ సంగతిని వారికెవరు తెలిపినారు ?"

"ముద్గల్లు ప్రాంతము వారు చాలమంది యిచ్చట పనిచేయు చున్నారు. వారిలో నెవరో ఒకరు చెప్పియుందురు !"

తర్వాత పార్వతి వారి నేమియూ ప్రశ్నించలేదు. కొంతసేపుమౌన ముగా కూర్చొని ముందేమి చేయవలెనని ఆలోచించినది.

"తల్లీ. నీ వెవరవో తెలుసుకొన వచ్చునా ?"

"నే నొక హతభాగ్యురాలను, మంత్రిగారూ !"

"మీ ఊరు - నాడు ఏమి తల్లీ ?"

పార్వతి తన యదార్ధ పరిచయము చేసుకొనుటకు వెనుకంజ వేసి నది. ఆమె మనోభావమును గ్రహించిన మంత్రి "తల్లీ, నేను నీ తండ్రి సమానుడను. నాతో ఏ విషయము చెప్పుటకును సందేహ పడనక్కర లేదు ! అని మాటయిచ్చిన తర్వాత పార్వతి "మావూరు ముద్గల్లు," అనినది.

"ముద్గల్లులో నీ వెవరి కుమార్తె వమ్మా ?"

"మీకు శిల్పి సిద్ధాంతి తిమ్మోజీ యనువారు తెలియునా ?"

"బాగుగా తెలియును తల్లీ ! గడచిన ముప్పదేండ్లుగా వారిని నే నెరుగుదును. మా చిన్నశిల్పి మల్లన్నగారి గురువులుకదా వారు ! వారు నీ కేమౌతారమ్మా ?"

"వారే మా తండ్రిగారు !"

"అయినచో, నీపేరు పార్వతియా తల్లీ ?"

"నాపేరు మీకెట్లు తెలిసినది?"

"శిల్పిసిద్ధాంతులకు ఒక్కతే కుమార్తెయని వినియున్నాను.ఆమెను మా మల్లన్నకిచ్చి వివాహము చేయవలెనని యున్నట్టుగూడా వారు-పీరు చెప్పగా విన్నాను. మల్లన్నశిల్పిగా రీ వివాహ విషయమెత్తినప్పుడం తయూ ముఖమును ఒక విధముగా పెట్టుకొనువారు. మొదట మొదట దానికి కారణమేమియో తెలియకుండినది. వారితో నా స్నేహమెక్కు వైన తర్వాత ఒకరోజు వారు నీ విషయమునంతయూ చెప్పినారు. మీ వివాహమునకు మీ తండ్రిగారు సమ్మతించిననూ, మీ తల్లిగారు సమ్మ తించలేదనికూడా చెప్పినారు. ఎప్పుడో ఒకరోజు మీతల్లి మనస్సు పరి వర్తన జెంది తనకే కుమార్తె నివ్వగలదను ఆశతో వారున్నారు. వివా హము నిశ్చయమైనచో నన్ను మరచిపోకమ్మా" అని ఆయన హాస్య మాడినారు.

ఈ మాట విని పార్వతి విషాదముగా నవ్వినది.

"అమ్మా. నీవు అన్యథా భావించనిచో ఒక విషయ మడుగ దలచినాను. నిన్నెవరో దురాత్ము లపహరింప జూచిరట నిజమేనా?"

ఈ ప్రశ్నవిని పార్వతికి ఆ రోజు జరిగిన సంఘటన లన్నియూ మరల ఒకసారి కనులముందు కదలిపోయినట్టుగా దోచినవి. ఆమె వాటి నన్నింటినీ తలచుకొని దుఃఖించసాగినది.

"దుఃఖించకు తల్లీ! ఆ విషయములన్నియూ అడుగకుండ వలసి నది. ఏదో కుతూహలము కలిగి, అడిగినాను. ఈ వార్తవిని మల్లన్న శిల్పిగారు శిలా విగ్రహమువలె అయినారు. చివరకు మా యింటికివచ్చి అన్ని విషయములను చెప్పి, 'మంత్రిగారూ, నా కెందులకో మనసున మనసు లేదు.ఆ వార్త విన్నది మొదలు నాలో ఒకవిధమైన భీతి జనించి నది. విషయ మారసి వచ్చుటకై ఉదయము ముగ్గల్లుకు వెళ్ళుచున్నాను. నేను తిరిగి వచ్చువరకు ఇంటివైపు చూచుకొనుడు' అని చెప్పి, ఈరోజు ఉదయమే వెళ్ళినారు. నీవు ముగ్గల్లునుంచి వచ్చుచున్నచో వారు దారిలో అడ్డుతగిలి యుండవలయునుకదా!" ఆశ్చర్యమును వ్యక్త పరచుచూ అనినాడు.

"మంత్రిగారూ, నేను మీ గ్రామమునకు చాలా రోజుల క్రిందట ఒకనాడు ఎద్దుల బండిమీద వచ్చియుంటిని. ఇప్పుడు నడచి వచ్చినాను. నడుమ దారితప్పి, యెచ్చటెచ్చటనో తిరిగి యిచ్చటికి వచ్చునప్పటికి ఈ వేళ యైనది. నా దురదృష్టమునకు వారునూ యీ రోజే ముద్దల్లుకు పోవలయునా ?"

"తల్లీ ! ఇంత ఆతురితగా నీవు యిచ్చటికి వచ్చినది యెందుల కమ్మా ?"

"మంత్రిగారూ, అదొక పెద్ద గాథ! సావకాశముగ చెప్పగలను. ప్రస్తుతము నాకు చాలా దప్పికగ నున్నది. ఒక పుడిసెడు మంచినీరు యివ్వగలరా ?"

"పాపము ! ఎండలో నడచి ఎంత ఆయాస పడియున్నావో ఏమో ? రమ్మా తల్లీ. మల్లన్న వచ్చువరకూ నీవు మా యింట సంకోచ పడక యుండవచ్చును. నీకు అచ్చట చిన్న చెల్లి, తల్లి, అవ్వ, అన్న అందరునూ గలరు. నీవు సంకోచపడ పనిలేదు. నన్నన్యునిగా భావిం చకుము. మీ తండ్రి ననుకొనుము"

అని చెప్పిననూ పార్వతి కూర్చున్న చోటునుండి లేవలేదు.

"మంత్రిగారూ, మీ నిర్మలాంతఃకరణకు నా కృతజ్ఞతలు. నేను మీ యింటికి రారాదనికాదు కాని—నేను హతభాగ్యురాలను. నేను కాలిడిన చోటు విపత్తు కాచియున్నది. మీ యింట నే నుండినచో, నా మూలముగా మున్ముందు మీకు తొందరలు కలుగు నవకాశమున్నది. మీ ఆదరాతిథ్య మును స్వీకరించి, మీకు కష్టములు కలిగించుట మంచిదికాదు ! నా విధి వ్రాతను నే ననుభవించెదను. దానిని మీకు పంచిపెట్టు టెందులకు?" అని నది.

"తల్లీ, ఏమి నీ మాటలు ! ఇ గ్రామమా? లేక అరణ్యమా? నీ వంటి ఆడబిడ్డలకు మేము ఆశ్రియ్రియక పోయిన, యిక మేము మనుష్యులమా? అందుననూ నీవు శిల్పిసిద్ధాంతులవారి పుత్రికవు—మా మల్లన్నగారి కాబోవు పత్నివి. నిన్ను మేము సరిగా విచారించనిచో, మాకు మర్యాదయా? రేపు మల్లన్నగారు వచ్చి చూచిన మమ్ములను

ఏమని భావించగలరు? నీవు ఎచ్చటికీ వెళ్ళరాదు! మల్లన్నగారు వచ్చు వరకు మా యింటనే—మా కుమారెవలె నుండుము" అనిచెప్పి, బలవంత ముగా ఆమెను తనయింటికి తీసుకొని వెళ్ళినాడు.

మంత్రిగారి యింటికి వెళ్ళిననేమో—ఏట్లోనని అనుమానించుచూ నుండిన పార్వతి యిప్పుడు ఆయింటివారి ఆదరమును, అంతఃకరణము లను చూచి, తను పరకీయురాలను భావమును మరచినది. తన గోడును వారితో వివరముగా చెప్పుకొని. వారి సహానుభూతికి పాత్రురాలైనది. వారామెను చూచినది ఆదే తొలిసారి యైనన్నూ — వారిపాలిటి కామె ఆ యింటి బిడ్డవలెనే తోచినది

పార్వతికి కలిగిన దుస్థితికి ఆ యింటివారందరూ చింతించినారు. కాని,వారెవరునూ ఆమె కే సహాయమూ చేయకలేకపోయినారు. తన దీన గాథను చెప్పి, ఆపై తన భీతికి కారణము తెలిపినది పార్వతి.

"మీకు తెలియదు మంత్రిగారూ! ఆ కామాంధుడు నన్ను బలా త్కారముగా పెండ్లాడదలచినాడు. ఈసారి నన్నపహరింప జూచిన ప్రయ త్నము విఫలమైనది! దీనితో అతడు హతాశుడై సైన్య సమేతముగా ముద్గల్లు మీద దండయాత్ర సాగించి, నన్ను చెఱబట్టుకొని వెళ్ళుటకు కూడా వెనుకాడడు! విజయనగర సామ్రాట్టు విషయము నాకు బాగుగా తెలియును. పట్టుబట్టిన అత దేమి చేయుటకైననూ వెనుకంజ వేయడు. ఇట్లుండగా నేను మీ యింట ఆశ్రియము పొందినచో, ఈ వార్త గూఢ చారులు గ్రహించి, మీకు ఏదియో ఒక విధమైన తొందరలు కలిగించ వచ్చును. నా మూలముగా సుఖ శాంతులతో కూడిన మీ కుటుంబమున కెందుకు హాని కలుగవలయును? మీరు నన్నడ్డుకొన వలదు! నేనెచ్చట నైననూ తలదాచు కొనెదను. నన్ను విడువుడు!" అని దైన్యముగా ప్రార్థించినది పార్వతి.

"అయినచో, నీవు యిప్పుడెచ్చటికి పోవలయునని నిశ్చయించినా వమ్మా?"

"ఇప్పుడు నాకు—దేవరాయలకు విరుద్ధముగ—ఆశ్రియ మివ్వగల వ్యక్తి ఒకే ఒక్క సుల్తాను ఫిరోజ్‌షా మాత్రమున్నాడు. అతని యాస్థా

నమునకు మల్లన్నతో కలసి వెళ్ళవలయు ననుకొన్నాను. వారు ఆశ్రియ మిచ్చుటకు నిరాకరించిన, మేమిరువురమూ దేశాంతరము వెళ్ళెదము. లేదా బావియో-చెఱువో చూచుకొనెదము!"

"కానిమ్మా, ఆ విషయమును తర్వాత నిర్ణయించుదము. ముందు ముద్గల్లుకు వెళ్ళిన మల్లన్న తిరిగి రానిమ్మా. అతడు వచ్చిన వెంటనే నేనే ముందు నిలచి, మీ యిరువురికీ వివాహము చేసెదను. ఆ తర్వాత మీ కెచ్చట రక్షణ లభించగలదో అచ్చటికి వెళ్ళి సుఖముగా నుండుడు!" అని ఆయన పార్వతిని సమాధాన పరచినాడు.

ఈ మాటలు పార్వతి మోడువారిన హృదయమునకు అమృత సేచనము లైనవి!"

శరభన మంత్రి పార్వతికి యిచ్చిన మాట ప్రకారము ముద్గల్లుకు వెళ్ళిన మల్లన్నకు, పార్వతి సోమలాపురమునకు వచ్చియున్న సంగతిని తెలుపుచూ, అతనిని వెంటనే బయలుదేరి రావలసినదని, ఒక లేఖవ్రాసి తలవరి లింగప్పచేత పంపినాడు.

తలవరి లింగప్ప (నింగప్ప?) అప్పుడే ప్రయాణమై వెళ్ళి, మర్నాడు వేకువ ఝాము వేళకు ముద్గల్లును చేరినాడు. అతడు తను సోమలాపురమునుండి వచ్చుచున్న విషయ మెవరికీ తెలియనివ్వక.తిన్నగా తిమ్మోజీగారి యింటికి వెళ్ళి, మల్లన్నను గురించి విచారించినాడు. అత డిచ్చిన లేఖ చదువుకొని, పార్వతి క్షేమముగా నున్నందులకు గౌరాంబ సంతసించినది! ఆ లేఖ శత్రువుల చేతికి చిక్కిన అనాహుతము కాగల దని భీతిల్లి దానిని తగులబెట్టి, అనంతరము లింగప్పతో జరిగిన విషయ ముల నన్నింటినీ ఆద్యంతముగా వివరించినది. తర్వాత—"లింగన్నా, సరియైన సమయమునకు నీ విచ్చటకు వచ్చినావు. నీవలన ఒక ఉపకా రము కావలసి యున్నది. నీవు వెళ్ళి యిచ్చటి విషయముల నన్నింటినీ పార్వతికి చెప్పి, ఆమె నెచ్చటనైననూ తలదాచుకో మనుము.ఆమె నెమ్మ దిగా నుండిన, మా యీ కష్టము లన్నియూ సార్థకములు కాగలవు!" అని చెప్పినది. లింగప్ప ముద్గల్లును విడచి వెళ్ళుచూ,

"తల్లీ, తమతో నాదొక విన్నపము. ఇచ్చటి పరిస్థితి చాల విష

మించినది. ఇప్పుడు నగరమంతటా సైనికులు గస్తీ తిరుగుచున్నారు. ఏ ప్రాణి కే అపాయము జరుగనున్నదో చెప్పుట కెవరికినీ సాధ్యముకాదు. శత్రువులు తిమ్మోజీ, మల్లన్న గార్లను చెఱసాలలో వేసి యున్నారు. ఇటువంటి పరిస్థితిలో మీరిచ్చట నిలచి చేయున దేమున్నది ? నా వెంట వచ్చిన తమరిని సురక్షితముగా కోమలాపురమునకు చేర్చగలను !" అన్నాడు.

"లింగప్పా ! భర్తనూ, మల్లన్ననూ యీ స్థితిలో విడచిపెట్టి నే నెట్లు రాగలను ? వారనుభవించు చున్నదే నేనూ అనుభవించెదను ! మా వంశలత, ఆ పార్వతి ఎచ్చటనైననూ సుఖముగా నుండిన మా కదియే చాలును" అనినది గౌరాంబ.

"మీ రిచ్చట యుండి చేయునదేమి గలదు ? శత్రు సైనికులు ఏ ఘడియలో నైననూ మీ కాపద కలిగించ వచ్చును ! మీ ప్రాణమునకు గండము సంభవింప వచ్చును ! నామాట వినుము తల్లీ ! ఊరక మొండి పట్టు పట్టకుడు !"

"లేదు లింగన్నా! నేను వచ్చుటకు సాధ్యముకాదు. వీధి యంతటా సైనికులు నిండి యున్నారు. శత్రుసైనికులు యింటిని పహరా కాయు చున్నారు. నేను వెలుపలికి వచ్చిన, నేనే గండము తెచ్చుకొనినట్లు కాగ లదు ! ఎట్లునూ ఒక ఆశాదాయకమైన వార్త తెలిసినది. ముద్గల్లురక్షణకు సైన్యములను పంపుమని సుల్తానులను వేడుటకు ప్రజలు వెళ్ళియున్నా రట. ఈ రోజో, రేపో వారు మన సాయమునకు రావచ్చును. అప్పుడు మావారి యొక్కయు, మల్లన్న యొక్కయు విడుదల కాగలదు. అంత వరకూ నే నిచ్చటనే వుండవలసి యున్నది...." అనిచెప్పి, లింగన్నను చాల కష్టము మీద పంపినది గౌరాంబ.

తలారి లింగప్ప కోమలాపురమునకు వెనుదిరిగివచ్చి ముద్గల్లు నందలి విషయముల నన్నింటిని సవివరముగా చెప్పి, గౌరాంబ సందేశ మునూ, లేఖనూ పార్వతి కందజేసినాడు.

"చూడుడు మంత్రిగారూ ! నేను చెప్పినమాట చివరకు నిజమై నది! సైన్య సమేతముగా వచ్చి ఆ దుష్టులు ముద్గల్లును ముట్టడించి వశ

పరచుకొన్నారు. అచ్చటనే యుండినచో నేను సులభముగా వారికి పట్టు బడి యుందును ! భగవంతుడే నన్ను కాపాడినాడు. ఇప్పుడు వారు నా కొరకై అన్వేషించు చున్నారట! నాకొరకై మా తండ్రిని, మల్లన్నను బంధించి చెఱసాలలో వేసియున్నారట! ఈ సమయమున నే నిచ్చట నున్నచో, అపాయము నిశ్చయము. ఖండితముగా వారు నన్ను వెతుకు కొనుచూ రాగలరు. అప్పుడు నాకు మాత్రమేకాదు—మీకు కూడా అపాయము సంభవించగలదు. కాబట్టి నాకు యిచ్చటినుండి వెళ్ళుటకు అనుమతి నివ్వుడు! నా క్షేమము పట్ల చింతించనక్కరలేదు! ఇప్పుడు నాకు దేవుడే దిక్కు ! అతని యిచ్ఛప్రకారము జరుగనిమ్ము ! నేను మీకు చెప్పిన విధముగా బహమనీ సుల్తానులైన ఫిరోజ్‌షా వారి ఆశ్రయమునకు వెళ్ళుటకై యిప్పుడే పురుష వేషములో ప్రయాణము సాగించు చున్నాను. అచ్చటినుండి ముద్గల్లు సాయమునకు సైన్యమును పంప బ్రయత్నించెదను. సాధ్యమైనంత త్వరలో తండ్రిగారిని చెఱసాలనుండి విడిపించుప్రయత్న మొనరింతును. మీ రధైర్య పడకుడు! ఎట్లుమానీటిలో మునిగి యున్నాను. ఇక చలి-గాలి అంతయూ ఒకటే! నేను తల్లిదండ్రులనుత్వరలో కలుసుకొనునట్లు అవకాశ మివ్వవలసినదని భగవంతుని ప్రార్థించుడు! మీ ఆశీర్వాదము వలన నైననూ నాకు మేలు కలుగగలదు!" అనిచెప్పి కన్నీరు కార్చుచూ, మౌనముగా కూర్చొనియున్న మంత్రిని, అతని భార్యనూ, బిడ్డలనూ సమాధాన పరచి, అతికష్టము మీద వారిని విడచి వచ్చినది. వారిని విడచి వచ్చునపుడు, తొలిసారిగా తనవారి నుండి దూరమగు చున్నానను భావన ఆమెకు కలిగినది. నిజముగా నామె తన తల్లి, తండ్రి, బంధు బలగమును, తన వూరు-నాడును అన్నింటినీ విడచి దూరముగ-చాల దూరముగా వెళ్ళుచున్నది !

ఆమె చెప్పినమాట లబద్ధములు కాలేదు. మల్లన్నను బంధించిన పిమ్మట పార్వతి ఎచ్చటవున్ననూ ఎప్పుడో ఒకరోజు తప్పక తనచేతికి చిక్కగలదను ధైర్యము నాగన్న దండనాయకునికి కలిగినది. తండ్రి కొరకు, మల్లన్నకొరకు ఎచ్చట దాగివున్నను మరల ఆమె కనబడగలదని అత డూహించినాడు. కాని అతని ఊహ ప్రకారము పార్వతి తనకు తానై శరణాగతురాలు కాలేదు.

నాగన్న సేనానికప్పుడు ఎక్కువ వ్యవధిలేదు. సాధ్యమైనంత తొందరగా అతడు పార్వతితో విజయనగరమునకు వెనుదిరుగవలసి వున్నది. కనుక పార్వతిని అన్వేషించుటను అతడు మానలేదు. పార్వతి ఎచ్చట దాగివున్నదను విషయముపట్ల అతనికి జాడ తెలిసినది. సోమలా పురములో శోధించిన బహుశా ఆమె తమకు లభించవచ్చునని ఊహించి, అతడీ కార్యమునకు దీక్షితులను నియోగించినాడు. దీక్షితుల సాయము నకు యిరువది మంది సశస్త్ర సైనికులు వెళ్ళినారు.

దీక్షితులు తమ పరివారముతో సోమలాపురమునకు మెఱపువలె వచ్చి చేరినారు. గ్రామమును సమీపించినకొలదీ వారి హృదయము వేగ ముగా కొట్టుకొనసాగినది. మార్గమధ్యమందే వారికి పార్వతి గ్రామపెద్ద యైన శరభన (భరమన్న) మంత్రిగారి యింట నున్నదని తెలిసినది. వారు ఆమెను హఠాత్తుగా బంధించుటకు సూటిగా మంత్రిగారి యింటికి వచ్చినారు. దీక్షితుల సూచనమేరకు సైనికులు శరభన యింటిని పహరా కాస్తూ నిలబడినారు.

శరభన మంత్రి దీక్షితులను చూడగానే వారెందుకు వచ్చినదీ పసిగట్టినాడు. అయిననూ అతడు తన ఆంతర్యమును వెలిబుచ్చక, ఆదర ముగా వారి నాహ్వానించి, ఉచితరీతిని సత్కరించినాడు. కుశలప్రశ్నలు ముగిసిన తర్వాత శరభన దీక్షితులను కుతూహలముగా పరికించుచూ కూర్చున్నాడు.

"శరభనగారూ, మీకు తొందర కలిగించివుండిన క్షమించ ప్రార్థన. మీయింట శిల్పి తిమ్మోజీగారి కుమార్తె పార్వతి వున్నదని విన్నాము. ఆమెను ముద్దలుకు పిలుచుకొని వెళ్ళుటకై తిమ్మోజీగారి ఆజ్ఞ మేరకు వచ్చినాము" అని అన్నారు.

"కుమార్తెను పిలుచుకొని వెళ్ళుటకు తండ్రియే రాక మిమ్ముల నెందుకు పంపినారు?" ఆశ్చర్యమును వ్యక్తపరచుచూ అన్నాడు శరభన.

"తిమ్మోజీగారే రావలయుననుకొన్నారు. కాని సాధ్యముకాక మమ్ములను పంపినారు"

"చాల సంతోషము ! పార్వతి మాయింటనున్న సంతోషముగ పంపెడివాడను. కాని ఆమె యిచ్చట నుండినకదా !"

విషాదమును సూచించినారు శరభన.

"పార్వతి మీయింట నిన్నటివరకూ వున్నట్టు మాకు వార్త వచ్చినది"

"నిన్నటివరకూ నుండినమాట నిజమే. కాని నిన్న ఆమె యిచ్చట కూడా తన కపాయము రాగలదని భావించి, వెళ్ళిపోయినది"

"ఎచ్చటికి వెళ్ళినది ?"

"అది నాకు తెలియదు దీక్షితులూ !"

"మీరబద్ధమాడుచున్నారు"

"ఇంతవరకూ మాతండ్రి వంశములోనైననూ, మాతల్లి వంశములోనైననూ అబద్ధమాడు వారు ఎవరూ పుట్టివుండలేదు దీక్షితులూ! మీరు మాకు దానిని ఆరోపించుచున్నారు"

"అట్లయినచో ఆమె యిచ్చటినుండి ఎందుకు వెళ్ళిపోయినది ?"

"నాకేమి తెలియును ?"

"మీకు తెలియును. కాని దాచిపెట్టుచున్నారు-అంతియే."

"మా మాటలపై మీకు నమ్మిక లేనిచో, మా యింటిని పరిశోధించవచ్చును. అందుకు నా ఆక్షేపణలేదు" అని శరభన నిశ్చయ కంఠముతో అనినాడు.

ఈ మాటకు దీక్షితులు నిరుత్తరులైనారు. వారికిప్పుడేమి చేయవలయుననునది తెలియకపోయినది. 'పార్వతి వారియింట నుండిన శరభన గృహమును పరిశోధించుకొమ్మని చెప్పువాడు కాడు. అయినచో పార్వతి యిక యెచ్చటికి వెళ్ళినట్లు? ముద్దల్లునుండి తప్పించుకొనినదా ?'

ఏమైననూ సరియే, ఇంతదూరము వచ్చిన తర్వాత పార్వతి విషయము తెలుసుకోనిదే వెనుదిరిగి వెళ్ళుటకు వీలులేదు. కనుకనే దీక్షితులు :

"మీకు తొందర కలిగించుచున్న క్షమించవలయును" అని చెప్పి, తమ సైనికులకు శరభనగారి గృహమును పరిశోధించవలసినదని ఆజ్ఞాపించినాడు. భటులు వారి యాజ్ఞను నిర్వర్తించినారు. కాని పార్వతి జాడ

కనబడలేదు. గ్రామములోకూడా వెదకినారు. అయిననూ ప్రయోజనము లేకపోయినది. చివరకు దీక్షితులు హతాశులైనారు. వారికిప్పుడేమి చేయుటకునూ తోచలేదు. శరభనగారి ప్రవర్తననుబట్టి పార్వతి అచ్చట లేదని ఋచ్చితపడినది. తాము ఆమెను బంధించి తీసుకొని పోవుటకై యిచ్చటికి రాగలమని ఆమె ముందుగనే ఎట్లు తెలుసుకొనినది ? ఈ విషయము ఎంత ఆలోచించినను వారికి తోచలేదు. అందరి ప్రశ్నలనూ, సమస్యలనూ లీలాజాలముగా పరిష్కరించుచున్నట్టి దీక్షితులకు పార్వతి పలాయనము విడివడని సమస్యయైనది.

పార్వతికొరకై వారు వెతుకవలసినంత వెతికి, విసిగిపోయి ఎచ్చటను కనుగొనలేక చివరకు వట్టిచేతులతో ముద్గల్లుకు వెనుదిరిగినారు.

జరిగిన సంగతులన్నియూ దీక్షితులు నాగన్న దళపతికి చెప్పగా అత డాశ్చర్యపోయినాడు.

"భళా ! అబలా ! !" అని వూర్పు వుచ్చినాడు దళపతి.

మరొక సమయములో నైనచో తమ కనులలో దుమ్ముకొట్టి రెండు పర్యాయములుగా తప్పించుకొనిన పార్వతిని శ్లాఘించి, గౌరవించెడివాడేమో ! కాని ప్రస్తుత పరిస్థితి అతని కవమానకరముగానున్నది. ఏ ముఖముపెట్టుకొని ఈ విషయములను ప్రభువులకు నివేదించుటయో ! ఈ సంగతులను విని వారు తమను పిరికి పందలని పిలిచినచో తల లొంచుకొన వలయును కదా ! అని నాగన్న దండనాయకుడు లోలోపలనే వ్యధజెందసాగినాడు. యెంతటి యుద్ధములలో సైతము పరాజయము నొందని మహా సేనాపతిని యిప్పుడు ముద్గల్లుయొక్క ఒక సామాన్యస్త్రీ: రెండుసార్లు పరాజితుని చేసినది. అదియును యెంతటి పరాజయము?

నాగన్న దళపతికి యిప్పుడొక విషయము దృఢపడినది. పార్వతి తామనుకొన్నట్టు సామాన్య స్త్రీ కాదు. అసాధారణ యువతి ! ఏదో మహత్కార్య సాధనకై పుట్టియున్న స్త్రీ ! ఈమెను తా ముపేక్షించి, సరళ మార్గములో బంధించుటకు బయలుదేరుటయే తప్పు. నేరుగా ముద్గల్లుమీద దండెత్తివెళ్ళి, ఆమె తప్పించుకొనుటకు మునుపే బంధించి

యుండవలసినది. అని అనుకొన్నాడు. కాని యిప్పుడు కార్యము మించి పోయినది. పార్వతి యిప్పుడు వారిచేతికి చిక్కనంతటి దూరము వెళ్ళి పోయినది. పరిజలనుకొను మాటలనుబట్టి చూచిన, ఆమె యిప్పుడు బహమనీ సుల్తాను ఫిరోజ్‌షా ఆశ్రియమునకు పోయి వుండవలయును. ఒకవేళ అట్లుజరిగియుండిన ఆమె ఖండితముగ తమకిక పట్టుబడదు. ఆమెను లభింపజేసుకొనుటకు యుద్ధమొక్కటే మిగిలిన మార్గం — కాని కేవలమొక స్త్రీ కొరకై బహమనీ రాజ్యముమీద దండెత్తి వెళ్ళుట దీక్షితులకు యిష్టములేదు. కాని భగవదేచ్ఛ వేరుగా నున్నది.

నాగన్న దండనాయకునికి ముద్గల్లున ఒకరోజు గడచుటొక గండముగా నున్నది. అతడెన్నడూ ఈ విధముగా పనిలేక కూర్చొని వుండలేదు. ఇప్పుడు కార్యము ఫలించలేదని రాజధానికి తిరిగి వెళ్ళవలసి యున్నది. కాని వట్టిచేతులతో వెళ్ళుటకు అవమానముగా వున్నది. ఎట్లయిననూ సరియే, పార్వతిని పట్టి తీసుకొనియే పోవలయునని అతడు తన అన్వేషణను కొనసాగించినాడు. ఇట్లుండగా ఒకరోజు రాజధానినుండి మహత్వపు లేఖ నెత్తుకొని ఒక భటుడు వచ్చినాడు. సామ్రాట్టులే స్వయముగా ఒక లేఖ వ్రాసి, నాగన్న దండనాయకులను వెంటనే రాజధానికి తిరిగి రావలసినదిగా ఆజ్ఞాపించినారు.

ఈ మధ్య గుల్బర్గానుండి వచ్చిన గూఢచారులు ఫిరోజ్‌షావిజయనగరముమీద దండెత్తి వచ్చుటకు యుద్ధప్రయత్నములు చేసుకొనుచున్నాడను వార్తను తెచ్చినారు. ఇటువంటి సమయములో మహాసైన్యాధిపతీ, మహామాత్యుడూ అయిన నాగన్న దళపతి రాజధానిలో లేకుండుటపాయకరమని భావించి, పార్వతిని అన్వేషించి పట్టితెచ్చు బాధ్యతను తన చేతిక్రిందపని చేయువారి కప్పగించి, వెంటనే బయలుదేరి రావలసినదని నాగన్న దండనాయకునికి లేఖామూలముగా ఆజ్ఞచేసినాడు. ప్రభువుల ఆజ్ఞ నందుకొని అతడు వెంటనే తక్కినవారి కాపని నప్పగించి, విజయనగరమునకు వెనుదిరుగుటకు నిశ్చయించినాడు.

వెళ్ళునప్పుడు తనతో బంధీకృతులైన తిమ్మోజీ — మల్లన్నలను తీసుకొని వెళ్ళవలయు ననుకొన్నాడు. తమ పరాభవమునకు కారణ

భూతులైన ఆ యిరువురినీ ప్రభువుల సముఖమున కప్పగించి, తేజో వధను తప్పించుకొన వలయునను కొన్నాడు. కాని ఆ పరాభవమున కంటెనూ వారికి వేరుశిక్ష అక్కరలేదు. అతని మనస్సాక్షియే యతనిని వెక్కిరించుచున్నది.

నాగన్న దండనాయకుడు బంధితుల రక్షణకై అవసరమగు భటులను వెంటబెట్టుకొని, దీక్షితులతో రాజధానికి ఆనాడే ప్రయాణించినాడు. తనచేతిక్రింద గల దళపతులకు ముద్గల్లును సాధ్యమైనంత కాలము స్వాధీనపరచుకొని యుండవలసినదనియూ, తమకంటెనూ ప్రబలమైన శత్రుసైన్యము ముద్గల్లు రక్షణకు వచ్చినచో మాత్రము దానిని విడచి పెట్టి రావలసినదనియూ ఆజ్ఞాపించి వెళ్ళినాడు.

అతడు ముద్గల్లును విడచివెళ్ళిన పక్షమురోజులలోనే బహమనీ సైన్యము ప్రజల నిరీక్షప్రకారము ముద్గల్లు రక్షణకై వచ్చినది. ఈవార్త గూఢచారులద్వారా విని విజయనగర సైనికు లాందోళన జెందినారు. వారితో పోరాడి ముద్గల్లును రక్షించుటకు సాధ్యపడదని తెలియగా, దళపతి ఆజ్ఞమేరకు నగరమును విడచి వెళ్ళుటకు నిశ్చయించినారు. కాని తమకిన్ని యిబ్బందులను, తొందరలను కలిగించిన ముద్గల్లును వూరక వదలి వెళ్ళుటకు వారికి మనస్కరించలేదు. తమకు జరిగిన పరాభవావమానములకు ముద్గల్లు వాసులమీద పగదీర్చుకొన నిశ్చయించినారు.

వెళ్ళుటకు ముందు నగరమందలి ప్రతి గృహమును ప్రవేశించి, చేతికందిన అమూల్య పదార్థములనూ, ఆభరణములనూ దోచుకొన్నారు. ప్రతిఘటించిన వారిని నిర్దయతో సంహరించినారు. గృహములను తగులబెట్టినారు. స్త్రీలను, శిశువులను దయాశూన్యులై కత్తులకు బలియిచ్చినారు. హిందూ సైనికులే హిందువులమీద అమానుషరీతిని పగ దీర్చుకొనినారు.

అందరికంటెనూ హెచ్చుగా సైనికుల కోపమునకు తిమ్మోజీ యింటివారు గురియైనారు. అతని కుమార్తె వలననే యీ కష్ట పరంపరలన్నీ తమకు కలిగినవని అతని గృహమును దోచుకొన్నారు. అన్ని వస్తువులను అప్పగించుటకు గౌరాంబ తనకుతానై సిద్ధపడిననూ, తను పూజించుచూవచ్చిన సర్వమంగళ స్వర్ణవిగ్రహము మాత్రము దక్కించు

కొనుట కెంతయో ప్రయత్నించినది. కాని ప్రయోజనము లేకపోయినది. సైనికులు పార్వతి పెండ్లికై గౌరాంబ దాచిపెట్టిన సొమ్ములనూ, అతి కష్టముమీద కాపాడుకొనుచూ వచ్చిన గుప్తనిధినీ లాగుకొని, తమ పాదములమీద పడవచ్చిన యామెను తన్ని త్రోసినారు. ముందటి ప్రకరణములో ముద్గల్లువాసుల చేతికి చిక్కి అవమానితుడైన సైనికుడు ఆమెను ఒకగదిలో వేసి, ఆ గృహమునకు నిప్పంటించి వెళ్ళిపోయినాడు. అతడు పెట్టిన చిచ్చునుండి గౌరాంబను విడిపించుటకు ముందే ఆమె పూర్తిగా కాలిపోయినది. చివరకీ విధముగా గౌరాంబ తన కుమార్తెకొరకై హుతాత్మురాలైనది.

# మంత్రాలోచనము

## 11

"నాగన్న దండనాయకులూ, వెళ్ళినపని ఏమైనది? పార్వతి దొరికినదా?" విజయనగరమును చేరుకోగానే నాగన్న దండనాయకుడు దేవరాయల ఈ ప్రశ్నను ఎదుర్కొనవలసి వచ్చినది.

దేవరాయలు దండనాయకుని రాకను ఎదురు చూచుచూ కూర్చొన్నాడు. దీక్షితులు పార్వతి విషయము చెప్పినప్పుడు ఆమెను సామాన్య స్త్రీనిగా భావించినాడు. కాని, ఆమె అతని కోర్కెను నిరాకరించి, అతడు పంపిన మంగళ ద్రవ్యములను, తదితర విలువగల వస్తువులను త్రిప్పి పంపినప్పు డామె అసాధారణ యువతి యని అనుభవమైనది. జయించిన అంతటి ధీమంతురాలి హృదయమును జయించవలయును, చేపట్టిన ఆమె వంటి స్వాభిమానవతి యైన స్త్రీని చేబట్టవలయును - అని నిశ్చయించినాడు. అతని అభిమానము, అంతరంగములో అనురాగముగా మార్పు జెందుటకు ఎంతోకాలము పట్టలేదు. పార్వతి విషయములో అత డిప్పుడు

ఆతుర్రతను కనబరచినాడు. పురుషుడు ఎంతవయసు వాడైననూ, స్త్రీకి వశుడైనచో అతడామె కొరకై ఏ పని చేయుట కైననూ వెనుకాడడు. సకలవిద్యా పారంగతుడూ, వివేకశాలి, ధర్మాధర్మ సూక్ష్మ మెరిగిన వాడు అయిన సామ్రాట్ దేవరాయలు కూడా దీనికి దూరము కాలేదు. అతడు పార్వతిని తనదానినిగా చేసుకొనుటకు ఏ సాహసమున కైననూ సిద్ధపడినాడు. నాగన్న దండనాయకుని విచార వదనము చూడగానే అతనికి జరిగిన సంగతులు అర్ధమైనవి. అయిననూ తన సందేహమును నివారించు కొనుటకై ఆ విధముగా ప్రశ్నించినాడు.

దానికేమి జవాబు చెప్పుటకునూ తోచక దండనాయకుడు క్షణ కాలము మౌనముగా నుండి, అనంతరము :

"సామ్రాట్టులు మామీద నుంచిన నమ్మికకు మేము తొలిసారిగా అపాత్రుల మైనాము ప్రభూ !" అని విషాదముగా అనినాడు.

"ఎందులకు ? పార్వతి పట్టుబడలేదా ?"

"చేతికందిన అన్నము నోటి కందలేదు ప్రభూ !"

"వివరముగా చెప్పుడు !"....

"మేము చేసిన ప్రయత్నము లన్నియూ విఫలములైనవి ప్రభూ," అని పార్వతిని పట్టుకొనుటకై తాము చేసిన ప్రయత్నములన్నీ సవిస్తరముగా వివరించినాడు.

"మీవంటి దండనాయకుల కంటగూడా దుమ్ముకొట్టి తప్పించుకొన్నదా ? ఆశ్చర్యం ! అయినచో పార్వతి సామాన్యస్త్రీ కాదు !" దేవరాయులు నిట్టూర్చినాడు.

నాగన్న దండనాయకుడు ఏమియూ మాట్లాడలేదు.

"మీరు కేవల మొక ఆడదానిని పట్టి తీసుకొని రా నశక్తులైన పిమ్మట యిక యీ సామ్రాజ్యమును శత్రువుల బారి నుండి రక్షించ గలరా?" అని తనకుతానే చెప్పుకొనునట్టుగా దేవరాయలు పలికి,

"ఇప్పుడు బహమనీ సుల్తాను మనమీద పడవలయునని యున్నాడు. అతనికీ విషయము తెలిసిన, మనలను ఎంత అపహాస్యము చేయగలడు ?" అని ఆత్మగతముగా ప్రశ్నించుకొన్నారు.

దీనికి నాగన్న దండనాయకుడు ఏ సమాధానము చెప్పుటకునూ సమర్థుడు కాలేక పోయినాడు. అత డవమాన మూర్తియై నిలబడినాడు. అప్పుడు దీక్షితులు :

"ప్రభూ ! ముఖ్యముగా తమను చేపట్టుటకు ఆ చిన్నదానికి ఋణములేదని తెలియుచున్నది. దీనికి దైవ సంకల్పము లేదు. ఈచిన్న విషయమును ప్రభువులు అంతగా మనసుకు పట్టించుకొని కృశించరాదు!" అని అన్నాడు.

మునుపే క్రోధమానసుడై యున్న దేవరాయలీ మాట విని తోక త్రొక్కిన త్రాచువలె బుస గొట్టినాడు. దీక్షితుల మాట అతని ఆత్మాభిమానమును వెక్కిరించి నట్టయినది.

"ఔను, దీక్షితులూ! ఇది చిన్నవిషయమే! కాని, ఇంత అల్ప కార్యమును సాధించుటకు మీవలన సాధ్యము కాకపోయినది కదా!మరల, ఋణాను బంధము లేదని చెప్పుటకు వచ్చినారు. ఋణాను బంధ మున్నదీ-లేనిదీ అన్నియూ మీ చేతియందే యున్నవని మీరు భావించినట్లుతెలియు చున్నది ! మొదట పార్వతి విషయమును ప్రస్తావించినవారు మీరే ! ఆ విషయములో నా మనస్సును బలవంతముగా జొనిపి,యిప్పుడు ఋణాను బంధము లేదని చెప్పి జారుకొన జూచు చున్నారు! మీరంత సులభముగా తప్పించుకొనలేరు !"

"ప్రభూ! సన్నిధానమునకు నావలన అపచారము జరిగి యుండిన క్షమించ ప్రార్థన ! నేను సదుద్దేశముతో పార్వతి విషయమును తమ ముందు విన్నవించుకొన్నాను. కాని, దైవగతి ముందు...."

"చాలించుడు. మీ ప్రవచనము ! దైవగతి యట దైవగతి ! మీ యిష్టము వచ్చినట్టు సామ్రాట్టుల నుపయోగించుకొనవచ్చు నని భావించి నారా ?...."

"ప్రభూ !...."

"మీరు మా హితైషులు, పైగా మా పురోహిత వర్గమువారు నను అభిమానముతో నే నిదిరివరకూ సహించుకొన్నాను. మిమ్ములను మిత్రులని భావించినాను. నాప్రీతి విశ్వాసములకు తగిన ప్రతిఫల మిప్పుడు

మీనుండి లభించినది. మీ వలన సింహాసనపు ఘనత – గౌరవములకు అపచారము జరుగ గలదని నేను కలలోనైన తమనుకొనలేదు."

"మహాప్రభూ! నేను తమ కపచారము చేసినాను. పార్వతి విషయమును నేను తమతో చెప్పక యుండవలసినది. కాని వృత్తి సహజమైన అభిలాషతో తమవద్ద విన్నవించుకొన్నాను. సుందర వస్తువు సరియైన చోట నుండిన దాని శోభ యినుమడించ గలదని నేను తొందరపడినాను. నావలన జరిగిన ఈ యపరాధము ను మన్నించవలయును. నే నెన్నడునూ తమ విషయములో తేలిక భావము వహించలేను. తమ ప్రీతి విశ్వాసములను దుర్వినియోగము చేయలేదు. కాని ఒక స్త్రీ కొరకై సామ్రాట్టులు మనస్సునకింత వ్యసనము తెచ్చుకోగలరని నే ననుకొనలేను....ప్రభువులు కోరిన పార్వతివంటి పడతులను వేయిమందిని తెచ్చి అంతఃపురమును నింపగలను" అని కృతక దరహాసమును చిందించినారు.

"మీ రనుకొన్నంత స్త్రీ వ్యసనిని కాను నేను, దీక్షితులూ! అంతఃపురములో సుందరీ మణులకేమియునూ కొదువలేదు. కాని పార్వతి విషయము వేరు. ఆమె నా కోరికను తిరస్కరించి, అవమానపరచినదే కాక, సామ్రాజ్యపు ఘనత-గౌరవములకు అపచారము తలచినది. ఆమె గర్వభంగము చేయుటకొరకైననూ నే నామెను వివాహమాడక తప్పదు. ఇంత వరకూ ఆమెను పొందుటకయి చేసిన సామ, దానములను ఉపాయములు రెండును విఫలములైనవి. ఇప్పుడిక భేదోపాయమైన యుద్ధమొకటే మిగిలియున్నది" గంభీర స్వరముతో అన్నాడు.

"ప్రభూ! ఎవరిమీద యుద్ధము."

"ఫిరోజ్‌షా మీద!"

"వారు మనకే మపచారము చేసినారు?"

"పార్వతి అతని ఆశ్రయమునకు వెళ్ళియుండునని నా ఊహ. ఇది నిజమైనచో, ఆమెను పొందుటకు యుద్ధమొక్కటే మార్గము."

"ప్రభూ! నాదొక విన్నపము. చింతగించవలెను. పూర్వము స్త్రీ కొరకయి అనేకమంది సామ్రాట్టులు దేశకోశములనుపోగొట్టుకొన్నారు. స్త్రీ కొరకయి రావణుడు చెడినాడు. స్త్రీ నవమానపరచి సుయోధనుడు

చెడినాడు. వనిత కారణముగా భారతము మునల్మానుల వశమైనది. పృధ్వీ రాజ–జయచంద్రుల పోరాటము మహమద్ ఘోరికి భారత దేశమునకు వచ్చుటకు ఆహ్వానమిచ్చినది. ఇప్పుడు మరల స్త్రీ కొరకయి బహమనీ రాజ్యముతో యుద్ధమా ?"

"పార్వతి కొరకయి యుద్ధమొనరించుట నాకును యిష్టములేదు. కాని విధిలేనిచో దండప్రయోగమునకు శరణాగతులము కావలసి యుండును."

"అంతటి పరిస్థితి సంభవించినప్పుడు చూచుకొందము ! పార్వతి యిప్పుడెచ్చట నున్ననూ ఉపాయముగా పట్టుకొనుటకు మనకొక మార్గం గలదు. ఎట్లును పార్వతి తండ్రి-మల్లన్న యిరువురూ మనకు బంధీలై యున్నారు. వారిమూలముగా మనము ఉపాయముగా కార్యమును సాధించ వచ్చును."

"తిమ్మోజీ, మల్లన్నలు పట్టుబడినారేమి ?"

"ఔను ప్రభూ !"

"ఆమాట యింతకు మునుపే ఎందుకు చెప్పరాదు ?"

"చెప్పుట కవకాశము రాలేదు"

"వారి నెచ్చట వుంచినారు ?"

"మా వెంట తెచ్చినాము. అనుజ్ఞ యైనచో సముఖమునకు పిలిపించెదము !"

"వారిని వెంటనే ఇచ్చటికి పిలిపించుడు !"

తిమ్మోజీ, మల్లన్నలను సామ్రాట్ దేవరాయలముందు తీసుకొని వచ్చి నిలుపడమైనది.

దేవరాయలు వారిని చురచుర చూసినాడు.

"శిల్పి సిద్ధాంతి తిమ్మోజీ యనిన మీరే కదా ?"

ఈ మాటకు తిమ్మోజీ నోటితో జవాబివ్వక; తిరస్కార దృష్టితో జవాబిచ్చినాడు.

"ఆ మానము చెడిన స్త్రీ తండ్రివి నీవేకదా ?"

దేవరాయలు మరొక వాగ్బాణమును వదలినాడు. ఇది తిమ్మోజీ

అభిమానమునకు వాతపెట్టినట్టయినది—అయిననూ అటదేమియూ పలుకక శిలావిగ్రహమువలె నిలబడినాడు—అసహనముతో శరీరము మండిపోవుచున్ననూ కూడా.

"నీవు, మల్లన్నా? ఆ గడుసరి స్త్రీ ప్రణయాపేక్షకుడవు." మల్లన్నను సూటిమాటలతో పొడిచినాడు.

"తమవంటి ఘనతవహించిన సామ్రాట్టుల నోటివెంట యింతటి మాటలు రాగలవని నేననుకొనలేదు. కులమును నాలుక చెప్పగలదను మాటకు ఈనాడు నిదర్శనము లభించినది. పైగా పార్వతి మిమ్ములను ధిక్కరించినదా?" తిమ్మోజీ మల్లన్న నిందను సహించలేక అన్నాడు.

"శిల్పులకు ఎంత త్వరలో కోపము వచ్చినది?"

"సర్వమును కోపింపజేసిన బుస్సుమనుటయే కాదు; తొక్కిన వానిని ఆహుతికూడా తీసుకొనగలదను విషయము సామ్రాట్టులకు సైతము తెలిసినదే!"

"సామాన్యులకే యింతటి రోషము, కోపము నున్నచో యిక సామ్రాట్టులకెంత వుండవలయుననునది మీకు తెలియుటకొరకే మిమ్ములను తృణీకరించి మాటాడవలసి వచ్చినది. మీ రొనరించిన అవమానము వలన మాకెంతటి కోపము వచ్చినదనునది మీకిప్పుడైనను తెలిసినదా?" అని దేవరాయలు బొదుగరచినాడు.

"మేము మీకే మపరాధము చేసినాము ప్రభూ! మాచే మీకు కలిగిన అపచారమేమి?"

"మీ కుమార్తె మా కోరికను తిరస్కరించడము సామాన్యమైన యపరాధమని భావించినారా?"

"మా కుమార్తెను చేబట్టుటకు తామెందుకు యిచ్చగించినారు ప్రభూ! ఆమె హీనకులజయని తమరే సెలవిచ్చినారు"

"మేము ఆమెను రత్నమని భావించి మోసపోయినాము. కాని అది రత్నమును బోలిన గాజుపెంకని యిప్పుడు తెలిసినది"

"సామ్రాట్టులు ఉదారచరితులని విన్నాము. మా కుమార్తె చేసిన

ళపరాధమును మన్నించవలయును" తిమ్మోజీ దైన్యముగా ప్రార్థించినాడు

"పార్వతికి క్షమాపణయా ? ఈ జన్మలో లభించదు"

"అనుగ్రహించి కాపాడవలసిన ధర్మావతారులే కోపగించుకొని నచో నిక మమ్మలను రక్షించగలవారెవరు ప్రభూ !"

తిమ్మోజీ పొగడ్త దేవరాయలమీద పరిణామమును కలుగజేసినది

"పార్వతికి క్షమ లభించవలయుననిన ఆమెవచ్చి మావద్ద క్షమా పణ కోరవలయును"

"ప్రభువు ఉదారులై క్షమించునట్లయిన ఆమె ఎచ్చటనున్నను వెతికితెచ్చి తమ పాదములమీద పడవేయగలను" అని తిమ్మోజీ మాట యిచ్చినాడు.

"మీ కుమార్తె మీద మాకు కోపములేదు. ఆమె భావోన్మాద ములో వివేక శూన్యురాలై మా విషయములో అపచారము చేసినది. ఇప్పుడైనను కార్యము మించిపోలేదు. ఆమె ఎచ్చటనున్నను వచ్చి మా వద్ద క్షమాణ కోరిన ఆమెను క్షమించి, ఉద్ధరించ గలము."

"ప్రభూ ! నాదొక విన్నపము. తమను మేము చూచు టిదియే తొలిసారి యైనను. తమ కీర్తిని యిదివరకే చాలా వినియున్నాము. నేను పూర్వమునుండియూ విజయనగర సామ్రాట్టుల అభిమానిని. ప్రభువుల కృపాశ్రియముతో ఈ శరీరము కొంతకాలమైనను పెరిగినది. ఇప్పుడు ముద్గల్లు బహమనీ సుల్తానుల కైవశమై, వారి పరిపాలనలో నున్నను నేనింకా విజయనగర సామ్రాజ్యాభిమానిగనే యున్నాను. తమ సన్ని ధిని నా విన్నపమేమనగా, తమరు పరమ పూజ్యమైన సంగమ వంశము నకు చెందినవారు. మేము అజ్ఞాత కులగోత్రజులము. మాతో తమరు బాంధవ్యమును గోరుటయా? మాకుమార్తె కంతటి యోగ్యత గలదా ? మీరు గాజుపెంకును వజ్రమని భావించినారు. ఇది తమ ఔదార్యం. కాని అల్పమానవులమైన మేము దైవాంశ సంభూతులైన తమతో దేహసం బంధమును కోరిన అది దార్ష్యతనము కాగలదు! మా యోగ్యత ఎచ్చట? మీ యోగ్యత ఎచ్చట? తమరు సర్వజ్ఞులు. అన్నియూ తెలిసినవారగు తమతొ నా ప్రార్థన యేమనిన, తమరు పార్వతి విషయమును పరిత్య

జించవలయును. తమ సన్నిధికి వచ్చు యోగ్యత ఆమెకు లేదు. యిక తమ అర్ధాంగి యగుటయా? తన యోగ్యతకు తగినట్లు ఆమె మల్లన్న మీద అనురక్తురాలైనది. తమ కుమార్తెతో సమానమని ఆమెను క్షమించి మల్లన్నకిచ్చి వివాహము చేసి, ఆ మూలముగా నామెకు బుద్ధి జెప్పుడు" అని దైన్యముగా ప్రార్థించినాడు.

తిమ్మోజీ మాటల సరణి దేవరాయలమీద విలక్షణ పరిణామమును కలుగజేసినది. అతడు తిమ్మోజీ చెప్పిన మాటల నన్నింటినీ కూలంకష ముగా విచారించినాడు. తిమ్మోజీ సలహా అతనికి యోగ్యమని దోచినది. కాని బిగుమానము! పార్వతిని తను కోరినది తప్పని యిదివరకే అతనికి ఒకటి రెండు పర్యాయము లనిపించినది. వయస్సులో తండ్రివలె నున్న తన నామె తిరస్కరించుట తప్పుకాదు. కాని సామ్రాట్టుగా నుండి తను కోరిన స్త్రీ యింత సులభముగా అన్యుల పాలగుట అతని కిష్టములేదు. అందువలననే అతడన్నాడు:

"తిమ్మోజీగారూ, మీ మాటలలోని అర్థమును గ్రహించినాము. మీ కుమార్తె మమ్ములను చేపట్టుట కనర్హురాలని చెప్పినారు. కాని ఆమె మా కోరిక మేరకు, మా సముఖమునకు వచ్చి తను మల్లన్నను వివాహ మాడగోరినట్లు చెప్పి, మా మనస్సును శాంతింపజేసిన, మేమే మల్లన్న తో ఆమె వివాహమును జరిపి, వారిరువురినీ మా సేవలో నిలుపుకొన గలము. కాని మీ కుమార్తె మే మిచ్చి పంపిన మంగళద్రవ్యములను త్రిప్పిపంపి మా కపచారము చేసినది. రెండు పర్యాయము లామెను బంధించ బ్రయత్నించగా, తప్పించుకొనినది. ఇప్పుడామె సిగ్గుచెడి, అభి మాన శూన్యురాలై అమ్లేచ్ఛ సుల్తానుని వద్దకు వెళ్ళినట్లు తెలిసినది. ఈ వార్త నిజమైనచో మనము తలొంచవలసి యుండును. ఒక హిందూ యువతి, హిందూ సామ్రాట్టులపై పగబూని, మ్లేచ్ఛుని ఆశ్రయించిన దనిన, స్వాభిమానులైన హిందువు లందరూ తలలు వంచవలసి రాగలదు."

తమ మాటలు నిజమైనచో ఆ తెలివి తక్కువ స్త్రీ వలన మన కందరకునూ అవమానము! ఆమె తెలియక చేసిన తప్పును క్షమించ వలయును. అట్లు చేయునట్టయినచో ఆమె ఎచ్చట నున్ననూ పట్టి తెచ్చి

మీ పాదములమీద పడవేయుదును. నా యీ ప్రార్థనమును మహాప్రభువులు మన్నించ వలయును।"

"కానిమ్ము, ఆలోచించి తెలుపగలము," అనిచెప్పి అతనిని పంపివేసిననూ, దీనిచే దేవరాయల ఉద్విగ్న మానసమునకు మాత్రము శాంతి కలుగలేదు. అత డూహించినట్టు పార్వతి బహమనీ సుల్తాను వద్దకు ఆశ్రియ మర్థించుటకై వెళ్ళియుండిన, ఇంతకంటెనూ అగౌరవ మింకొకటి లేదు. ఒక హిందూస్త్రీ, హిందూ సామ్రాట్టుకు వ్యతిరేకముగా రక్షణ పొందుటకు ముస్లిం సుల్తాను వద్దకు వెళ్ళినది. చరిత్రలో యిదియే మొదటిసారి. ఇంతటి విలక్షణ సంఘటనకు తాను కారణ పురుషు డగుటకు దేవరాయల కిష్టము లేకపోయినది. అతడు తన ఊహను ఖచిత పరచుకొనుటకై ఆనాడే గూఢచారులను గుల్బర్గునకు పంప నిశ్చయించి, విశ్రమించు కొనగోరి చంద్రశాలకు వచ్చినాడు. అచ్చట అతడు నిరీక్షించిన సంగతి, అనిరీక్షితమైన రీతిని అతని కడ్డుతగిలినది.

ఒక భటుడు వచ్చి, గుల్బర్గు నుండి ఒక వార్తాహరుడు వచ్చి సామ్రాట్టులను చూడగోరుతున్నట్టూ, అత దేదోయొక గొప్ప రాయబారమును మోసుకొని వచ్చి యున్నట్టూ విన్నవించుకొన్నాడు.

దేవరాయలు ఆశ్చర్య చకితుడై, గుల్బర్గు నుండి వచ్చిన రాయబారి ఏ గొప్పవార్తను తెచ్చినాడో తెలుసుకొనుటకై వెంటనే అతనిని సముఖమునకు తీసికొని రావలసినదని ఆజ్ఞాపించినాడు.

భటులు వెంటనే వెళ్ళి రాయబారిని తీసుకొని వచ్చినారు. రాయబారి దేవరాయలకు సాష్టాంగ నమస్కారము చేసి, తన ప్రభువైన ఫిరోజ్‌షా యిచ్చిన ఖరీతము (రాయబారపులేఖ) నప్పగించినాడు.

దేవరాయలు ఆతురతగా, నగిషీపని చేసిన వెండిగొట్టములో— మొహరు నద్ది, పట్టుగుడ్డపై వ్రాయబడి యున్న—లేఖను తీసి చదువుకొన్నాడు.

ఆ లేఖలో ఫిరోజ్‌షా యీ విధముగా వ్రాసియున్నాడు:

"స్వస్తి॥ శ్రీ మన్మహా రాజాధిరాజ, రాజపరమేశ్వరేత్యాది బిరుదాంకితులైన విజయనగర సామ్రాట్ దేవరాయ భూపాలులకు బహమనీ సుల్తాను ఫిరోజ్‌షా వ్రాయు నిరూపణా లేఖ :—

"మీరు యితఃపూర్వము మాతో చేసుకొనిన ఒడంబడిక నుల్లంఘించి, మా రాజ్యమునకు చేరిన ముద్గల్లుమీద దాడి జరిపి, దానిని వశపరచుకొని యున్నట్లుగా మాకు తెలిసినది. పైగా మీరు మారాజ్యపు (ముద్గల్లు) నివాసియగు, శిల్పిసిద్ధాంతి కుమార్తె పార్వతి యను కన్యను బలాత్కారముగా అపహరించి, వివాహము చేసుకొనుటకై ప్రయత్నములు సలిపి యున్నట్లు కూడా తెలిసినది. మీరు పార్వతి తండ్రినీ, ఆమె మనోధవుడైన మల్లన్ననూ చెఱసాలలో వేసియున్నారు. మీ సైన్యములు నిరపరాధులైన ముద్గల్లు వాసుల మీద అత్యాచారము లొనరించినవి. మా వద్ద ఆశ్రయము పొందియున్న పార్వతి మూలమున మాకీ విషయము లన్నియూ తెలిసినవి ఇదంతయూ గమనించి చూచిన, మీరు ఉద్దేశపూర్వకముగనే మాతోచేసుకున్న ఒప్పందము నుల్లంఘించుటకు నిశ్చయించినట్లు తెలియుచున్నది.

"ఉభయ రాష్ట్రముల క్షేమ దృష్ట్యా యిప్పుడు సైతము మేము చెప్పున దేమనగా, మీరు చెఱసాలలో వేసియున్న మల్లన్న-తిమ్మోజీ అను విడుదల చేయుచూ, పార్వతికి మీవలన జరిగిన కష్టములకు పరిహారముగ అయిదు లక్షల స్వర్ణ వరహాలను, ముద్గల్లు వాసులకు జరిగిన అన్యాయమునకు పరిహారముగ అయిదు లక్షల వరహాలను వెంటనేమాకు చెల్లించ వలయును. అట్లుచేసిన మాత్రము మీ తప్పును క్షమించుటకు సిద్ధముగా నుందుము. లేనిచో, దీని పరిణామము చాల ఘోరముగా నుండగలదు।

"మీరు మాపై యుద్ధమునకు తగిన సన్నాహములతో సిద్ధముగా నుండవచ్చును. కాని, ఇదివరలో ఒకసారి మామీద యుద్ధమునకు వచ్చి ఏ దురవస్థకు గురియైనా రనునది మీరు మరచియుందు రనుకొందుము. ఇప్పుడుసైతము, తొందరపడి మామీద యుద్ధమునకు వచ్చిన,మున్ముందు అందుకై పశ్చాత్తాప పడవలసి యుండును। జాగ్రత్త ॥

ఇట్లు,

మీ స్నేహాకాంక్షి.

ఫిరోజ్‌షా బహమనీ."

ఉత్తరమును చదువుకోగానే దేవరాయల ముఖము క్రోధముతో ఎరుపెక్కినది. అతడా లేఖను నేలమీదికి విసరికొట్టి, తన అసమ్మతిని వ్యక్తపరచినాడు. ఆ క్షణములో అతనికి సుమా రేబది యేండ్ల క్రిందట బుక్కరాయన కాలములో జరిగిన 'హుండీలేఖ' సంఘటన జ్ఞప్తికి వచ్చి, ఆ దృశ్యము లన్నియు మనోనేత్రము ముందు ఒకసారి కనబడినవి. ఇప్పుడు అంతటిదే మరొక సంఘటన సంభవించినదని అతనికి దోచినది. అనాడు మహమద్‌షా మద్యపు మైకములో లేఖవ్రాసిన, ఈనాడు ఫిరోజ్‌షా అధికారములో నుండి లేఖ వ్రాసినాడు. రెండు లేఖల ధోరణి మాత్రము ఒకే విధముగా నున్నది. విజయనగర రాజులకీన వారి కెంత తిరస్కార భావము ? దీనికి తానే కారకుడు. ఇయ్యది కృష్ణా తీరమున తను శత్రువుకు వెన్నుచూపి పారిపోయి వచ్చినదాని ఫలితము। అప్పుడు ధైర్యముగా యుద్ధ మొనరించి యుండిన, శత్రువుతో అవమానమని దోచునంతటి ఒప్పందము చేసుకొన వలసిన ప్రమేయమే లేకుండెడిది. కాని, ఆ ఖాజీ చేసిన పితూరీ వలన, తన ఆలోచన లన్నియూ విఫలము లైనవి. సుఖముగా విజయ మంద దగిన తను, మహమ్మదీయ సేనలకు ఓడిపోయి వచ్చినాడు. పైగా ఆ యుద్ధములో తను ఒక కుమారుని కూడా పోగొట్టు కొన్నాడు.

ఇప్పుడు అటువంటి సందర్భమే పార్వతికొకకై మరల ఏర్పడు నట్లుగా తెలుపుచూ ఫిరోజ్‌షా లేఖవ్రాసి పంపినాడు.

అయినచో, పార్వతి ఫిరోజ్‌షా ఆశ్రయమునకు వెళ్ళియున్న మాట యదార్థమే. ఆమెయే ఫిరోజ్‌షాను పురికొల్పి ఈ లేఖ వ్రాయించి యుండుననుటలో సందియములేదు. ఎందుకనగా ఫిరోజ్‌షా పార్వతి పక్షం వహించి యుద్ధపు బెదరింపు బెదరించినాడు. చెఱసాలలో నున్న తిమ్మోజీ-మల్లన్నలను విడుదల చేయవలసినదిగా కోరినాడు. దేవరాయలవలన పార్వతికిని, ముద్గల్లు నివాసులకు కలిగిన తొందరలకు, పది లక్షల స్వర్ణవరహాలను పరిహార ద్రవ్యముగ చెల్లింపగోరినాడు ।

ఇప్పుడు దేవరాయల ముందు రెండు ప్రశ్నలు నిలచినవి : యుద్ధమా ? లేక సంధియా ?

వీటిలో దేనినీ నిర్ణయించలేక, ఆ లేఖకు తగిన ప్రత్యుత్తరము మరునాడొసగు నట్లుగా చెప్పి, రాయబారిని పంపి, నాగన్న దండనాయకులను తదితర ప్రధానులను వెంటనే సముఖమునకు పిలిపించినాడు.

సామ్రాజ్య నిష్ఠాసేవకు లందరూ ఈ వార్త తెలిసి సభా స్థానమునకు పరుగున వచ్చినారు.

సామ్రాట్ దేవరాయలు సుల్తాను లేఖాంశములు వారందరికినీ తెలిపి, యిప్పుడు చేబూనవలసిన నిర్ణయమేమియని కోరినాడు. ఒక్కొక్క దండనాయకుడూ మోమోటము లేక ఈ విషయమై తమతమ యభిప్రాయములను వెల్లడించవలసినదిగా సూచించినాడు.

మొదట పురోహిత వర్గమువారి అభిప్రాయమును సభకు తెలుపుచూ దీక్షితులు ఈవిధముగా చెప్పినాడు:

"ప్రభూ! కేవలమొక ఆడుదానికొరకయి ఉభయ రాజ్యముల నడుమగల స్నేహపు టొడంబడిక నుల్లంఘించి, ప్రజా సౌఖ్యమును యుద్ధదేవతకు బలియిచ్చుటంత వివేకయుతమైన కార్యము కాదు. ఫిరోజ్‌షా లేఖయందు ఔద్ధత్యమున్నది, నిజమే! కాని ముద్గల్లు వాసులపట్ల ప్రవర్తించిన విధానములో మనతప్పుయునూ గలదు. మనము చెఱసాలలో నుంచిన వ్యక్తులకును, పార్వతి సుల్తాను ఆశ్రయమునకు పోయిన దానికినీ ఏ సంబంధమును లేదు. అవి విభిన్న విషయాలు. వారిని విడచిపుచ్చి, సుల్తాను తెలిపిన పరిహార ద్రవ్యపు విషయమై ఉభయ పక్షముల వారూ చర్చించి. ఒక తీర్మానమునకు వచ్చిన మంచిదని నాఅభిప్రాయము. ఆపైన తమ చిత్తము!"

"ప్రభూ! బహమనీ సుల్తాను ఫిరోజ్‌షా లేఖయందు విజయనగర సామ్రాట్‌ల స్థాన మానముల కగౌరవము తెచ్చు రీతిని ప్రవర్తించినాడు. యింతటి దర్పోక్తులను సహించుట మనరాజ్యపు ఘనత, గౌరవమునకు మాత్రమే కలిగిన అవమానముకాదు. స్వాభిమానియగు వాడెవడూ అతడు సూచించిన షరతులకు సమ్మతించడు! ఇప్పుడు మనమతని ఉత్తరమునకు విలువనిచ్చి, ఆ షరతుల ప్రకారము నడచుకొనిన, మనము శత్రువుల దృష్టికి చులకనగాను, పిరికిపందలవలెను కనబడ

గలము. ఈనాడు పదిలక్షల వరహాల నడిగినవారు రేపు మరొక చిన్న కారణమునకు యిరువదిలక్షలు అడుగగలరు. ఇంకొకరోజు మన రాజ్యమునే దివాలా తీయించగలరు. మనము యిటువంటి కోర్కెలను నెరవేర్చుటకు సాధ్యములేదు. మనలను చులకనగా చూచిన సుల్తానుకు మన మెంతటి వారైనదీ చూపి, ఈసారి బుద్ధి చెప్పవలయును." అని చెప్పి ప్రధానామాత్యుడూ, మహా సైన్యాధిపతియూ అయిన నాగన్న దండనాయకుడు మీసములను మెలిబెట్టినాడు.

"ప్రభూ, క్రితము ఒకటి రెండుసార్లు మన అశక్తతవలనకాదు–శత్రువుల మోసము, వంచన, పితూరీలవలన మనము ఓటమి నందినది నిజమే ! కాని ఆ ఓటమి కిప్పుడు పగదీర్చుకొను నవకాశము లభించినది. మదించిన ముసల్మానుల గర్వమణచకపోయిన, మున్ముందు మన బిడ్డలు-వారి బిడ్డలు వారికి బానిసలు కాగల కాలము సంభవించవచ్చును" అని బొమ్మానాయకుడు వీరావేశములో అనినాడు.

"ఇంతఃపూర్వము మనము చేసికొనిన ఒప్పందము, మన సామ్రాజ్యపు ఘనత గౌరవములకు న్యూనతను కలిగించునంతటిది. మనము శాంతిప్రియులమగుటచే యింతవరకును ఆ యవమానకరమగు ఒప్పందమును సైతము పాలించుకొనుచూ వచ్చినాము. దీనిని వీరు పిరికితనమని భావించినట్టున్నది. ఈసారి మనము వారికి తగిన పాఠము నేర్పవలయును. ఇకముందెన్నడూ మనజోలికి రాని విధముగా చేయవలయును" అని బన్నేరుఘట్టపు మాండలీకుడు ఈరన్న దండనాయకు డనినాడు.

కాని పెనుగొండసీమ నరసింగ నాయకుడు మాత్రము "ప్రభూ ! యుద్ధమున జయాపజయము లెట్లుండగలవో చెప్పుట కెవరికిని సాధ్యము కాదు. పూర్వము మనవద్ద అధికసైన్యము లుండియూ దురదృష్టవశమున మన కపజయము కలుగలేదా ? ఈసారి సరియైన ప్రయత్నములు చేసుకొను నంతవరకూ యుద్ధమును ఘోషించుట మంచిదికాదు. దీనివలన మనకే హానికరము. ఇప్పుడు సంధిచేసుకొని, సమయము వచ్చినపుడు శత్రువులను పరాజితులను గావించుట శ్రేయస్కరము" అని సెలవిచ్చినాడు.

"ప్రభూ! నరసింగ నాయకుల మాట సత్యము. ఇప్పుడు యుద్ధమునకు మనము శత్రువులతో సమానమైన బలయుతులుగా లేము. ఇటువంటి సమయమున యుద్ధమును కొనితెచ్చుకొనుట క్షేమకరముకాదు. ఇప్పుడు ఉపాయముతో యుద్ధమును తప్పించి, రేపు మనము బలయుతుల మైనప్పుడు వారిని పరాజితుల నొనరింపవచ్చును. మనమిపు డుద్రేక పూరితులమై తొందరపడి ఏ కార్య మాచరించినను ముమ్ముందు అందుకై పశ్చాత్తాపపడవలసిన సందర్భ మేర్పడగలదు" అని ఎలహంక సీమ వీరన్న నాయకుడు చెప్పినాడు.

అంగరాజ్యపు నిశ్చలనాయకుడు మాటాడుచూ - "శత్రువులమీద యుద్ధమాడి ఆ పదిలక్షల స్వర్ణవరహాలనే వారినుండి అపరాధపు కానుకగా పొందవలయును" అని అన్నాడు.

అందరి మాటలను మౌనముగా కూర్చొని వినుచూయుండిన లక్ష్మీధరామాత్యులు కడపట లేచి యీ విధముగా చెప్పినారు.

"ప్రభూ! విజయనగరమును పూజ్యులైన విద్యారణ్య మునీంద్రులు ఒక ఘనోద్దేశసాధనకై స్థాపించినారు. ఆ ఉద్దేశము మహమ్మదీయులనుండి హిందూ ధర్మ; సంస్కృతులను రక్షించుట. కాని, ఎంత వరకూ ముసల్మానులవలన మన ధర్మమునకు బాధకము లేదో అంత వరకునూ వారిని మనము గౌరవముగనే చూడవలయును. లేనిచో ప్రక్క రాష్ట్రమైన బహమని రాజ్యముతో మనము సదా విరోధాగ్నిని కొంగున కట్టుకొనినట్టు కాగలదు! కాని, మన శాంతిప్రియత్వమును వారు పిరికితనముగా భావించుట కవకాశ మివ్వరాదు. పూర్వము హక్క-బుక్క రాయల కాలమున వారి శాంతిప్రియత్వమును సుల్తానులు పిరికితనముగా భావించి, మనకు హుంకీలేఖ వ్రాసి, మనరాజ్యము తమ ఆశ్రితరాజ్యమని పరిగణించినారు. మనము దానిని మాపివేయుటకై వెళ్ళి మరల వారిచే అవమానము పొందవలసి వచ్చినది. కృష్ణాతీర యుద్ధములో ఆనాడు మనకు అపజయము కలుగకయుండిన, మ్లేచ్ఛులకు మనము తగిన పాఠము చెప్పియుండవచ్చును! కాని, ద్రోహాల మూలమున

మన కపజయము కలిగినది. తగిలినకాలికే మరల దెబ్బ తగిలినది. కనుక మనము యిప్పుడతి జాగ్రత్తగా అడుగిడవలసి యున్నది. ఈసారి తగిలినచో మన సర్వనాశనము కాగలదు. శత్రువులవలె మన మిప్పుడు యుద్ధ ప్రయత్నములన్నియు సిద్ధపరచుకొని యుండలేదు. వారు ఒక దానిమీద నొకటిగా లభించిన విజయములతో ఉన్మత్తులై యున్నారు. లేనిచో ఈ విధమైన ఔద్ధత్యపులేఖను వ్రాసి యుండజాలరు. ఇప్పుడు మనము ఉపాయముగా రాజ్యమునకు సంభవించిన గండమును తప్పించ వలయును. అందుల కొకటే మార్గము. బంధనలోవున్న ఖైదీలను విడచిపుచ్చి, వారి మూలముగనే శత్రువులతో సంధిచేసుకొనుట శ్రేయ స్కరము ! ఒకరిద్దరి కొరకుగాని, ఒకటి రెండులక్షల వరహాలకుగాని తొందరపడి, రాజ్యక్షేమమును మనము మరువరాదు. ఇప్పుడు మనము చేబూను నిర్ణయముమీద రాష్ట్రక్షేమ మాధారపడియున్నది! ప్రాజ్ఞులైన ప్రభువులు దేశమును ఏదారిలో నడిపిన, ఆపదలనుండి రక్షించు టకు సాధ్యము కాగలదనునది నిర్ణయించవలయును" అని తన ఆసన ములో కూర్చొనినారు.

అన్నియూ సావధానముగా వినిన దేవరాయలుకు ప్రస్తుత పరిస్థి తిలో లక్ష్మీధరామాత్యులు సూచించిన దారియే సరియైనదిగా తోచినది. అతడు ప్రస్తుతము సంభవించిన గండమును ఉపాయముగా తప్పించి, తాము బలవంతులైనప్పుడు శత్రువులకు తగిన బుద్ధిచెప్పుట యను లక్ష్మీ ధరామాత్యుల సూచననామోదించి, తీర్మానించినాడు.

# సంధికార్యము

## 12

సామ్రాట్టు దేవరాయలకు వైయుక్తికంగా ఫిరోజ్‌షాతో యుద్ధం కావలయునని వున్ననూ అతని అమాత్యుల కనేకులకు యుద్ధమక్కరలేదని వున్నది. దేశమునందలి ప్రస్తుత పరిస్థితిని బట్టిచూచిన యుద్ధము హానికరము. దేవరాయలు సింహాసనమధిష్ఠించి కొంతకాలమే అయినది. ఈకాలవ్యవధి రాజపుత్రులను చేతిలోనుంచుకొనుటకే సరిపోయినది. కొన్ని సంవత్సరముల క్రిందట సింహాసనమునకై జరిగిన యాదవకలహమువలన పరిపాలనావ్యవస్థ బిగి తప్పినది. రాజ భాండాగారము కాళీయైనది. నిపుణతగల సైన్యమును తయారించుటకు రాజ్యాదాయ ధనము చాలకపోయినది. యుద్ధపుఏర్పాటులను సరిగా చేసుకొననిదే శత్రువుల దండయాత్రను నెదిరించుటకు రాజధానిలోని సైన్యము చాలదు. అందువలన దేవరాయలు తొందరపడక, యుద్ధమునకు బదులు సంధినే యపేక్షించెను.

పార్వతి ఫిరోజ్‌షా ఆశ్రయమునకు వెళ్ళివున్న విషయము సర్వవాదమైనది. యుద్ధములేనిదే యిప్పుడామెను చెరబట్టుట కాని పని. ఆమె పట్టుబడినకాని దేవరాయల ప్రతిజ్ఞ నెరవేరదు. అతనికి తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొననిచో బ్రతికియూ వ్యర్థమేనని తోచినది. పార్వతి వచ్చి తనను క్షమాపణవేడిన, ఆమెను ఉదారుడై మన్నించుటకు సిద్ధముగా నున్నాడు. ఇప్పుడతనికి కావలసినది తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుటయేకాని, పార్వతిని బలవద్వివాహము చేసుకొనుట కాదు. ఇంతటి బలవద్వివాహమువలన ఎవరికీ సుఖము కలుగదని అతనికి తెలియును. ఆమె తన పాదములుపట్టుకొని క్షమాపణకోరిన, మల్లన్నకే యామె నిచ్చి వివాహమొనరించుటకు సిద్ధముగా నున్నాడు. కాని, పార్వతి తన వద్దకు వచ్చు విధమెట్లు...... ...?

తిమ్మోజీ ఆమె ఎచ్చటనున్ననూ తీసుకొనివచ్చి క్షమాపణ కోరునట్లు చేయగలనని చెప్పినాడు.........ఆతనినే యీ కార్యమునకు నియోగించినచో.........?

దేవరాయలు తిమ్మోజీని వెంటనే తన సముఖమునకు పిలిపించినాడు....అతడు రాగానే,

"శిల్పిగారూ, మేము మీ కోరికను నెరవేర్చుటకు సిద్ధముగా నున్నాము. పార్వతి వచ్చి మమ్ములను క్షమాపణకోరిన, ఆమెను మల్లన్నకు వివాహముచేసి యిచ్చుటకు మా యభ్యంతరమేమియును లేదు. కాని, ఆమె నిచ్చటికి పిలుచుకొనివచ్చు భారము మీయది!"

"ఈ కార్యమును సంతోషముగా చేయగలను ప్రభూ!"

"అది మీరు చెప్పునంతటి సులభసాధ్యమైనది కాదు. ఆమె మా ఊహ ప్రకారము బహమనీ సుల్తాను ఫిరోజ్‌షా ఆశ్రయమునకు వెళ్ళి వున్నది. ఫిరోజ్‌షానుండి మాకీ విషయమై ఉత్తరము వచ్చి వున్నది"

"ఏమీ? పార్వతి బహమనీ సుల్తానువద్ద ఆశ్రయమర్థించినదా?"

"ఔను?"

ఈ మాటవిని తిమ్మోజీ ముఖము వివర్ణమైనది.

"అంతియే కాదు ఆమె మామీద మా గర్భశత్రువులైన సుల్తానులను పురికొల్పినది. మేమామెను క్షమించుటకు సిద్ధముగానున్ననూ ఆమెకు క్షమాపణకోరుట యిష్టము లేనట్టున్నది. ఆమె మామీద పగ తీర్చుకొనుటకు తలపెట్టినది. అందువలననే ఫిరోజ్‌షా మూలముగా మాకు యుద్ధపు బెదరింపు నందజేసినది.........!"

ఈ మాటలను విని తిమ్మోజీకి పెదవులు తడబడినవి. ముఖము చెమ్మటలు పోసినది అతడు ధైర్యమును నిలద్రొక్కు కొనుచూ అనినాడు ;

"ప్రభూ! తెలియక ఆమెచేసిన తప్పును తమరు క్షమించవలయును. నాకొరకై పార్వతిని మీరు మన్నించవలయును"

"మీ ముఖము చూచి ఆమెను క్షమించుచున్నాను శిల్పిగారూ! ఆమె మీ కుమార్తెగా పుట్టవలసినదికాదు; సామ్రాజ్యముపట్ల మీకుగల

అభిమానములో వేయింట ఒకపాలు ఆమెకున్నచో ఈ పరిస్థితి యింత విషమించెడిదికాదు. ఇప్పుడు మీరొక కార్యమును సాధించవలయును. పార్వతికి బుద్ధిచెప్పి, ఫిరోజ్‌షా ఆశ్రియమునుండి ఆమెను ఉపాయముగా తీసుకొని రావలయును"

"మీరు చెప్పుటకు పూర్వమే నేనీ పనికి సిద్ధముగానున్నాను ప్రభూ! పార్వతి తమను సరిగా అర్థముచేసుకొనలేక అడ్డుదారి తొక్కినది. ఆమెకు బుద్ధిజెప్పి, సరియైన దారికి తీసుకొని రావలసిన బాధ్యత తండ్రియగు నా భుజస్కంధములమీద గలదు. ఆమె కారణముతో ఉభయరాజ్యములకు యిదివరకే జరిగిన నిరపరాధుల రక్తప్రవాహమే చాలు. ఆమెను అగ్నికన్యనుగా చేయుట నా కిష్టములేదు"

"మీ వివేకములో సహస్రాంశము పార్వతికి వుండివున్నను ఆమె ఈ విధముగా చేసెడిదికాదు. మాకు ఆమెమీద ఆగ్రహములేదు- అనుగ్రహమే గలదు. దారితప్పిన ఆ హతభాగ్యురాలను దారికితెచ్చి, ఆ మూలముగా మా అనుగ్రహమునందలి సత్యము నామెకు ఎరుక పరచవలయు ననుకొన్నాము. కాని ఆమె మీమాట లాలించి యిచ్చటికి వచ్చుటకు సమ్మతించునని నేను నమ్మను"

"ఎందులకు ప్రభూ!"

"పార్వతి కొన్ని విషయములలో తెలివిలేక ప్రవర్తించిననూ, మరికొన్ని విషయములలో అత్యంత చతుర. ఆమె మాచేతినుండి రెండు పర్యాయములు తప్పించుకొని వెళ్ళుటను చూచిన మీమాటకు విలువనిచ్చి, తనకుతానై మా వద్దకు వచ్చుటకు సిద్ధపడగలదాయని మాకు సందేహము"

"కానిమ్ము ప్రభూ! నా శక్తికొలదిని ప్రయత్నించగలను, రాని యెడల 'నీవు నా కుమార్తెవే కాద'ని చెప్పిరాగలను"

"అందువలన మా ఉద్దేశ సాధనకాజాలదు శిల్పిగారూ! మీరు ఉపాయముగా పని సాధించవలయును. ఉపాయముతో సాధ్యముకానిచో బలవంతముగానైనను యిచ్చటికి తీసుకొని రమ్ము. అదియును సాధ్యము కానిచో సుల్తానుని ఆశ్రియమునైనను వదలుమని ఆమెకు బుద్ధిచెప్పి రమ్ము!"

"అశ్లీకానిమ్ము ప్రభూ ! ఆమె కారణముగా ఉభయరాజ్యములకు యుద్ధము జరుగకుండునట్లు సాధ్యమైనంతవరకును ప్రయత్నించెదను. ఒకవేళ యుద్ధ మనివార్యమేయైన నేనే బలికాగలను. ఈమాట పంపా పతి సాక్షిగా సత్యము" అని చెప్పి దేవరాయల అనుజ్ఞబడసి, తగిన పరివారముతో గుల్బర్గునకు ప్రయాణించినాడు. పార్వతి ఫిరోజ్‌షా ఆశ్రయమునకు వెళ్ళిన విషయము అతని ఊహకుకూడా అందరానిదైనది. సామ్రాట్ దేవరాయలే స్వయముగా ఈ విషయమును చెప్పక, వేరెవరైనను చెప్పివుండిన అతడు నమ్మెడివాడుకాడు. పల్లెపడుచైన తన కుమార్తె సుల్తాను ఆశ్రయమునకు పోవుటయనిననేమి ? అతనిని విజయనగర సామ్రాట్టులమీది యుద్ధమునకు ప్రోద్బలము చేయుటనినఏమి ? ఇవన్నియూ తిమ్మోజీ పాలిటికి ఆశ్చర్యకర విషయములైనవి.

కాని, పార్వతి పాలిటి కివియన్నియూ గురించుకొనిన కార్య క్రమములవలె సహజముగా జరిగినవి. ఆమె సోమలాపురమునుండి బయలుదేరి దారిలో ఎచ్చటయును ఆగక, పురుషవేషములో గుల్బర్గాను చేరినది. దేవరాయలమీది కోపముతో ఆమె పిచ్చిదానివలెయైనది. ఎట్లయినను ఫిరోజ్‌షా ఆశ్రయము నర్థించి, అతని మూలమున తనకు జరిగిన అన్యాయమునకు దేవరాయలుమీద పగదీర్చుకొనుటకై నిశ్చయించినది. కాని పల్లెపడుచైన తనకు సుల్తాను ఫిరోజ్‌షా దర్శనమెట్లు లభించగలదు? ఎంత ఆలోచించినను ఆమెకు మార్గము గోచరించలేదు. ఆమె దీనగాథ నాలించి అనుకంపనుజెంది, ఎవరో ఆమెకు ఫిరోజ్‌షాను దర్శించుటకు సులభమైన దారి నెరిగించినారు.

ఫిరోజ్‌షా తనను 'దక్కను విలాసదొర'యని పిలిపించుకొనుటలో అతిశయోక్తిలేదు. ప్రజలతనికి ఆబిరుదును ప్రదానము చేసినారు. ఫిరోజ్‌షా కష్టపడునపుడు వృషభమువలె కష్టపడుచు, భోగించునపుడు విలాసివలె భోగించుచు నుండెడివాడు. అతడు ప్రతిదినము సాయంకాలము తన మిత్రులకొరకై ఏదియోయొక మనోల్లాసకర కార్యము నేర్పాటు చేయించుచూ నుండెడివాడు. పానకూటము, నృత్యము, సంగీతము, చంద్రికావిహారము, మధుయాత్ర మొదలగు వినోదకర కృత్య

ములతో సదా మునిగి వుండెడివాడు. ఈ సభలకు అన్నివర్గముల వారినీ ఆహ్వానించువాడు. ఈ సమారంభములో ఎవరైననూ అతనిని శిష్టాచారపు కట్టుదిట్టములు లేక చూడవీలయ్యేడిది.

సమయము చూచి పార్వతి ఒకనాడు యిటువంటి సమారంభములో ఫిరోజ్‌షా పరిచయము సంపాదించి, అతనికి తన కరుణగాథ - దేవ రాయల వలన తనకు జరిగిన అన్యాయపుకథను వర్ణించి చెప్పినది. అంతయూ వినినపిమ్మట ఫిరోజ్‌షా "ఆ కాఫర్ రాజు హిందూ రమణుల మీద అత్యాచారమునకు పూనుకొన్నాడా ?" అని ఆశ్చర్యపడినాడు.

అనంతరము "కుమారీ, నీవధైర్యపడవలదు. నీవు మా రాజ్యపు రమణివి గనుక నిన్ను రక్షించుభారము మాయది. నీవు మా కుమార్తె సమానురాలవు. మా అంతఃపురములో నిశ్చింతురాలవై వుండుము. ఆ దుర్మార్గ ప్రభువువలన నీకు కలిగిన అన్యాయమును సవరించగలను. అతని చెఱసాలలోనున్న మీ తండ్రిని, మల్లన్ననూ విడుదల చేయించ గలను. నీవు చింతించవలదు. ఇచ్చట నీకే కొరతయూ కలుగదు. నీవు మా రాణివాసపు వారి మోహంపు బొమ్మగా యిష్టము వచ్చినచోట నుండుము. ఎవరునూ నీకడ్డు చెప్పరు. ఈ ఘడియనుండి నీవు నా కుమా ర్తెవు-నా పెంపుడు పుత్రికవు" అని చెప్పి పార్వతిని తన ఆశ్రియమునకు తీసుకొని వెళ్ళి కుమార్తెవలె చూసినాడు. పార్వతి యిప్పుడు ఫిరోజ్‌షా అంతఃపురములో చిలుకవలె స్వేచ్ఛగా విహరించుచూ, అందరి ప్రీతి-విశ్వాసములకు పాత్రురాలై ఫిరోజ్‌షా నిజమైన పుత్రివలె మెలగసాగి నది. ఎప్పటనూ, ఎవరునూ ఆమె నడ్డువారులేరు. ఆమె ఎవరిని కావ లయుననిననూ చూడవచ్చును. హిందూరమణి యగుటచే ఆమెకు ఘోషా ప్రతిబంధకము లేకపోయినది. సుల్తాను జనానాలో ఆమె చిలుకవలె రాణించసాగినది. ఇంతటి దానిని దేవరాయలు 'పంజరపు పక్షి'గా చేయుట కాశించినాడు.

తిమ్మోజీ దేవరాయల రాయబారిగా ఫిరోజ్‌షా వద్దకు వచ్చివున్నా డను వార్త విని పార్వతి తన చెవులను తానే నమ్మలేకపోయినది. ఈవార్త అబద్ధము ! ఎవరో వినోదమునకై యీ వార్తను పుట్టించినారు. విజయ

నగర చెఱసాలలో కృంగుచున్న తన తండ్రి అంత సులభముగా విముక్తిని పొందినాడా ? ఒకవేళ విడుదల పొందినను దేవరాయల రాయబారిగా వచ్చుటకు సాధ్యమా? అనుకొన్నది. కాని తన ఎదుట తండ్రియే వచ్చి నిలబడినప్పుడు ఆమెకు కలిగిన ఆశ్చర్యమునకు మేరలేదు. ఆమె పరుగున వచ్చి తండ్రిని కౌగిలించుకొనినది. అతనిని చూచి ఎన్నియో యుగములు గడచినట్టుగా దోచినది. తండ్రి వక్షస్థలముమీద తలనుంచి, ఆమె పసిపాపవలె ఏడ్చినది.

తండ్రి-బిడ్డల యీ అపూర్వ సమాగమమును చూచి ఫిరోజ్‌షా మూగవాడైనాడు. తండ్రిబిడ్డల నడుమ తానెందుకు అడ్డము రావలయునని అతడు మరలవచ్చి చూచునట్టుగా చెప్పి.అచ్చటినుండి కాలు కదిపినాడు.

తిమ్మోజీ-పార్వతులు పరస్పరము చాల విషయాలను గురించి చర్చించుకొన్నారు. ఆ సంభాషణలో ఆత్మీయ విషయములెన్నియో దొర్లినవి. పార్వతి తను ముద్గల్లు విడచివచ్చిన దాదిగా యింతవరకూ జరిగిన సంగతులన్నియూ వివరముగా చెప్పినది. తిమ్మోజీ ఆమె వచ్చినప్పటి నుండి యింతవరకునూ జరిగిన సంఘటనలను వర్ణించినాడు. అనంతరం తాను గుల్బర్గనకు వచ్చిన కారణమును కూడా తెలిపినాడు.

అన్నియును శాంతముగా విన్న పిమ్మట పార్వతి అనినది : "అప్పాజీ, మీరన్యథా భావించకుడు. మీరు చెప్పునది చూచిన ఆదుష్ట దేవరాయలు నిజముగా మిమ్ములను మోసగించినాడు. లేనిచో నన్ను వివాహమాడగోరిన అతడు యిప్పుడు క్షమించి, మల్లన్నకు యిచ్చి చేయుటకు ఒప్పుకొనుటనిన ఏమి ? ఈ విషయమును చెప్పి నన్ను పిలుచుకొని వచ్చుటకై మిమ్ములను సుల్తానువద్దకు రాయబారిగా పంపుటయనిననేమి ? ఆలోచించిన కొలదిని యిందులో ఏదియో మోసమున్నట్టు తెలియుచున్నది.ఆధూర్త ప్రభువు మాటను మీరు నమ్మకుడు అప్పాజీ!"

"అమ్మా, పార్వతీ ! సామ్రాట్టులు నీవు భావించినంత హృదయ శూన్యులుకారు. మానవతలేని రాక్షసులునూకారు. వారు మహానుభావులు. ఉదారచరితులు. ఆశ్రితవత్సలులు. వారు నా ప్రార్థనను నంగీకరించి, నీ తప్పును క్షమించుటకు ఒప్పుకొనినారు. నామాటను నమ్ముము. ఇందున

ఏ మోసమును లేదు. వారు జీవితములో నిష్కారణముగా బాధలు జెందిన నీకు సాయపడవలయునని వున్నారు. నీకు జరిగిన అన్యాయమునకై వారు చాలా పశ్చాత్తాపపడినారు. మల్లన్నతో నీ వివాహమే దానికి తగిన ప్రాయశ్చిత్తమని భావించినారు. వారిని నీవు సంశయదృష్టితో చూడవలదు. నామాట వినుము; నాతో విజయనగరమునకు తిరిగి రమ్ము. ఇందు వలన నీకు కళ్యాణము కాగలదు" అని చెప్పినాడు.

కాని, పార్వతి తన పూర్వాగ్రహమును వదలలేదు. ఆమె తన అనుమానమును విడువక మరల ప్రశ్నించినది :

"అప్పాజీ, మీరు సెలవిచ్చినట్టు ఆ దేవరాయలు ఉదారచరితుడూ, నిష్కపటియూ నైనచో అతడెందుకు యింకను మల్లన్నను చెఱసాల యందేవుంచి, మిమ్ములను మాత్రము విడుదలచేసి రాయబారిగా పంపినాడు ?"

"నేను నిన్ను పిలుచుకొని విజయనగరమునకు వెళ్ళినవెంటనే వారు అతనిని బంధవిముక్తునిగా జేయగలరు. అట్లని మాటయిచ్చినారు. ఇక ఈ రాయబారమునకు నన్నే పంపుటకు కారణం: నీకు నా మీద తప్ప యింకెవరిమీదను నమ్మిక కలుగదని. పైగా నిన్ను తీసుకొనివచ్చి సామ్రాట్ల వద్ద క్షమాపణ కోరునట్లు చేయగలనని వారికి నేను వాగ్దాన మిచ్చినాను."

"మీ సామ్రాట్ అంతటి సముద్దేశ పూరితులైనచో నా తల్లి గౌరాంబ నెందుకు వారు హత్య చేయించెడివారు? నా జీవితమును నాశము చేసిన వారే యిప్పుడు దానిని చక్కదిద్దుటకై వచ్చి యున్నారనిన యిందులో ఏదియో మోసముండియే తీరవలయును."

"ఏమీ ? గౌరాంబను హత్య చేయించినారా ? ఎవరు చేయించినారు? ఎప్పుడు చేయించినారు?" ఒకేసారి నాలుగైదు ప్రశ్నలు వేసినాడు తిమ్మాజీ. అతని కింతవరకును గౌరాంబ అగ్నిలో చిక్కుకొని కాలిపోయిన ఉదంతము తెలియదు. దీని నతనికి దేవరాయలుగాని, ఇతరులెవరుగాని చెప్పలేదు. పార్వతి ముఖతః ఈ వార్త విన్నప్పుడు అతనికి

వేయిపిడుగు లొక్కసారిగా పడినట్లు తోచినది. అతడట్లే కూలిపోయి నాడు. అతి కష్టముమీద శ్వాస విడచుచూ అడిగినాడు: "గౌరాంబ మరణించినదా?—ఆమె నెవరు హత్య చేసినారు ? ఈ వార్త నీ కెట్లు తెలిసినది ?"

ముద్గలునుండి వచ్చిన గూఢచారులవలన తను వినిన గౌరాంబ అంత్యపు—హృదయ విదారక—కథను, పార్వతి సవిస్తరముగా తండ్రి కెరిగించినది. ఆమె చెప్పిన వివరములను బట్టి ఈ హత్య తమను విజయ నగరమునకు తీసుకొని వెళ్ళిన తర్వాత సైనికులచే జరుపబడినదని తిమ్మోజీ గ్రహించినాడు. అతనికి ఈ దురంతములో దేవరాయల పాత్ర యున్నట్లు తోచలేదు. సైనికులెవరో ధనాశచే ఈ హేయ కృత్యమును చేసి యుండవచ్చునని భావించినాడు. పత్నీ వియోగముచే హృదయము జర్ఝరిత మైనను, అతడు తనువచ్చిన కార్యభారమును మరువలేదు. అతని కర్తవ్య ప్రజ్ఞాజ్వాల యింకనూ ప్రజ్వలించుచునే యున్నది. భావావేశ మును ప్రక్కకునెట్టి అనినాడు:

"ఈ వార్త నిజమేయైన అది మన దౌర్భాగ్య మనవచ్చును. గౌరాంబ నీకొరకై హుతాత్మురాలైనది. అయినను నీవు చెప్పుమాటలను బట్టి చూచిన సైనికులవలన జరిగిన ఈ హత్యాకాండలో సామ్రాట్లు పాత్రవహించి యుండలేదని తెలియుచున్నది. ఈ పాపమునకు వారు బాధ్యులని నే ననుకొనుటలేదు."

"వారు నిరపరాధులే యైనచో, యింతవరకూ మీకీ విషయము నెందుకు చెప్పలేదు ?"

"బహూశః వారి కీ వార్త తెలియదేమో?"

"వారి సైనికులు జరిపిన అత్యాచారము వారికే తెలియక పోవుటయా ? అసంభవము ! వారు కావలయుననియే ఈ విషయము మీతో చెప్పక దాచినారు !"

"అట్లు జరిగి యుండదని నా అభిప్రాయము ! బహూశః వారి కీ విషయము తెలిసి యుండదు ! ఒకవేళ తెలిసి వున్ననూ దానిని నాకు చెప్పుట కవకాశ మేర్పడి వుండదు. వారి కీ విషయము తెలిసియేయున్న తప్పక పశ్చాత్తాప పడువారు ! ఇది సత్యము !"

"అయినచో, సామ్రాట్టులు మీమీద మంచి మచ్చుమందునే చల్లినారు। నామాట కంటెనూ, మీకు వారి మాటపై అంత నమ్మికయా।"

"ఇది నమ్మికను గురించిన ప్రశ్న కాదమ్మా। సామ్రాట్టులు విషయము నీకు తెలిసియుండిన నీవు నిష్కారణముగా వారిని దోషారోపణకు గురిచేయుదానవు కావు।"

"ఆ ధూర్త ప్రభువు సంగతి, మీకంటెనూ నాకు బాగుగా తెలియును।" వ్యంగ్యముగా అనినది పార్వతి.

"నీవు పూర్వగ్రహ పీడితురాలవుగా నున్నావు. గనుకనే సామ్రాట్టుల విషయములో నీ మనసు చెడినది। ఎవరెంత చెప్పిననూ వారి మంచితనము నీ కర్థమగుటలేదు...."

"వారి విషయములో నా మనస్సు చెడినది మాత్రమే కాదు. అది ప్రతీకారమును కూడా కోరుచున్నది। వారు నాకును-మీకును-మా తల్లిగారికిని చేసిన అన్యాయమును తలచుకొనిన రక్తము గడ్డకట్ట గలదు। ఇంకనూ మీకు వారిపట్ల అభిమానమా?"

"నీవు కోపముచే పిచ్చిదాన వైనావు। పగ దీర్చుకొనుటకై ప్రతీక్షించుచున్న నీవు వివేకమును భావోద్రేకమునకు బలి యిచ్చినావు। నా మాటను వినుము, నీకు మేలు కలుగ గలదు।"

"నాకు మేలుకలుగ వలయునని మీకు కోరికగా నున్నచో మీరు నా యీ ప్రార్థనము నంగీకరించుడు।"

"ఆ ప్రార్థన ఏది తల్లీ?"

"మీరు ఎట్లునూ యిచ్చటికి రాయబారులుగా వచ్చియున్నారు. ఇక విజయనగరమునకు తిరిగివెళ్ళక-ఇచ్చటనే నిలువుడు।"

"ఆ పని మాత్రము సాధ్యముకాదు, తల్లీ।"

"ఎందులకు?"

"నేను ప్రభు కర్మాచారినై వచ్చియున్నాను. నీతోబాటుగా వెనుదిరిగి వచ్చునట్టుగా వారికి మాట యిచ్చినాను।...."

"మాట యిచ్చిన నేమి? వారు మనలను మోసగించి తమ యభీష్టమును నెరవేర్చు కొనవలయునని పొంచియున్నారు. మన మిప్పుడు వారిని మోసగించి, బుద్ధి జెప్పవలయును।"

"అట్లు చేసిన మనము వచన భ్రిష్టులము కాగలము. తిమ్మాజీ ప్రాణము పోయిననూ యిచ్చిన మాటను పుచ్చుకొనడు."

"మీరు విజయనగరమునకు తిరిగి వెళ్ళిన,మీయంతట మీరే మరల తొందరలకు లోను కాగలరు. ఈ మాట సత్యము !"

"ఇది నీ దురభిప్రాయము. నేను విజయనగరమునకు తిరిగి వెళ్ళనిచో, వచన భ్రిష్టుడ నగుటయేగాక, నా ద్రోహము వలన మల్లన్న జీవమునకు గండము సంభవించ వచ్చును. నేను అందుకొరకైననూ విజయనగరమునకు వెళ్ళక తప్పదు."

"లేని ఆదర్శమునకై పాటుపడి, మీ విముక్తికి గల సదవకాశమును వ్యర్థపరచుకో గలరా ? బాగుగా ఆలోచించి తీర్మానించుకొనుడు, అప్పాజీ !"

"బాగుగనే ఆలోచించినా నమ్మా. స్వాతంత్ర్యము కొరకై నేను సామ్రాట్టులకు ద్రోహం తలపెట్టలేను. ఆత్మవంచన చేసుకొనలేను! అంతటి హేయజీవితమున కన్ననూ, బంధనమే వేయిరెట్లు సుఖకరము!"

కొంతసేపు మౌనమును దాల్చి మరల అనినాడు :

"అట్లయినచో, నీవు నావెంట విజయనగరమునకు రానందువా !"

"ఔను, అప్పాజీ !...."

"ఏమి, నా మాటలలో నీకు నమ్మిక కలుగలేదా ?"

"మీ మాటలలో నమ్మికలేదని కాదు. కాని, మిమ్ములను రాయబారిగా పంపుటలో ఏదియో దురుద్దేశ మున్నదని నా అంతరాత్మ ఘోషించు చున్నది దానికి విరుద్ధముగ నేను నడువలేను !"

"అట్లయినచో, నిన్ను నేను బలవంత పెట్టుటలేదు. ఇది తొందర పడు విషయము కాదు. బాగుగా ఆలోచించి చెప్పుము ! సుల్తాను గారికి దేవరాయ ప్రభువులు ఒకలేఖ వ్రాసి యిచ్చియున్నారు. దానిని వారికి అందజేసి వచ్చెదను !...." అని తిమ్మాజీ కునూర్తెవద్ద సెలవు పుచ్చుకొని, సుల్తానుకు తను తెచ్చిన లేఖ నందజేసినాడు.

సుల్తాను ఆ లేఖను చదువుకొన్నాడు.

అందులో దేవరాయ లీ క్రింది విధముగ వ్రాసియున్నాడు :

"స్వస్తి॥ బహమనీ సుల్తానులైన ఫిరోజ్‌షాగారి సమక్షమునకు.

"విజయనగర సామ్రాట్ దేవరాయలు చేయు విజ్ఞాపన మేమనగా :

"మీ లేఖలో మీ రాజ్యపు సరిహద్దు ప్రదేశములో నున్న ముద్గల్లుమీద దురాక్రమణ చేసియున్నట్టుగా మమ్ముల నాక్షేపించినారు. కాని ముద్గలుమీద దండెత్తవలయునను ఏ దురుద్దేశమును మాకు లేదు. వాస్తవముగా జరిగిన విషయమేమనగా, ముద్గల్లు నివాసియగు శిల్పి సిద్ధాంతి తిమ్మోజీగారి పుత్రికను మేము పుచ్చుకొని దేహసంబంధమును పెంచవలయునని యనుకొనినాము. ఈ వివాహమునకు వధువు తలిదండ్రులు సమ్మతించినారు.కాని వధువైన పార్వతి మమ్ములను తిరస్కరించి, మీ ఆశ్రయమునకు వచ్చి, రక్షణ పొంది యున్నది. తల్లిదండ్రుల యిష్టమునకు విరుద్ధముగ,స్వతంత్రించి ఏదియును నిర్ణయించలేని అప్రబుద్ధ వయస్సుగల కన్యకు మీరు ఆశ్రియ మిచ్చినారు. మే మామెకు ఏ అన్యాయమునూ చేసివుండలేదు. మీరు మామీద ఆరోపించిన యే యపచారమును మావలన జరిగి యుండలేదు. ముద్గల్లు నివాసుల విషయములో సైనికులు మితిమీరి ప్రవర్తించి, చాలమందికి కష్ట-నష్టములను కలిగించినారు. ఇందుకు మేము మిక్కిలిగా విషాద పడుచున్నాము. అచ్చట జరిగినట్టి అత్యాచారములకు మేము బాధ్యులముకాము. అందులో మా కెంతమాత్రమును సంబంధము లేదు. సైనికుల వలన కలిగిన ఈ దుండగములకు మేమును వ్యథజెందుచున్నాము. మితిమీరి ప్రవర్తించిన సైనికులను విచారణకు గురిచేసి కఠినముగా శిక్షించినాము. గ్రామవాసుల నుండి లాగుకొనిన వస్తువులన్నింటినీ తిరిగి యిచ్చివేయుటకు ఆజ్ఞాపించినాము. బాధితులైన ప్రజలకు న్యాయమైన పరిహార ద్రవ్యము నిచ్చుటకు సిద్ధముగా నున్నాము. ముఖ్యముగ మాకు కావలసినది మన ఉభయరాష్ట్రముల నిజమైన మైత్రి. మేము మీతో చేసుకొనియున్న శాంతి ఒప్పందపు షరతుల నుల్లంఘించి, నడచుకొని యుండలేము.మీరు మాకు చెందవలసిన పార్వతిని అప్పగించిన తిమ్మోజీగారి కోరిక ప్రకార మామెను ఆమె ప్రేమించుచున్న మల్లన్న కొసగి వివాహము చేయబడును.ముద్గల్లు నివాసులకు మీరు నిర్ణయించిన పరిహార ద్రవ్యమును వెంటనే చెల్లించ

గలము. మాకు కావలసినది మీ స్నేహ సౌహార్ద్రతలేగాని, పగ, ద్వేషము అసూయలు కావు!

ఇట్లు,
మీ స్నేహాకాంక్షి
దేవరాయలు"

ఈ లేఖను చదువుకొని సుల్తాను బిగ్గరగా నవ్వినాడు.

"ఎందులకు నవ్వుచున్నారు హుజూర్"!" తిమ్మోజీ కుతూహలముతో అడిగినాడు.

"నవ్వక మరేమిచేయుదును శిల్పిగారూ!" అని చెప్పి, కొంతసేపు మౌనము ధరించి, మరల అనినాడు :

"నేను యింత త్వరలో విజయనగర సామ్రాట్టులు దారికి రాగలరని యనుకొనలేదు. పాపము, వారు మా లేఖను చూచియే బెదరినారు"

సుల్తాను బిగ్గరగా నవ్వుటనువిని, అప్పటికి వచ్చిన పార్వతి కుతూహలము రెచ్చి అడిగినది :

"హుజూర్! ఎందుకట్లు నవ్వుచున్నారు? మాకునూ తెల్పినచో మీ ఆనందములో మేమూ పాలు పంచుకొందుము"

"చూడుము కుమారీ! ఈ లేఖను విజయనగరరాజు వ్రాసినాడు" అని చెప్పి లేఖను పార్వతిచేతి కిచ్చినాడు.

దానిని చదువుకొని పార్వతి మౌనము దాల్చినది.

"నీకు ఈ లేఖను చూచి ఏమని తోచుచున్నదమ్మా?"

"ఇందులో ఏదో మోసమున్నది జహాపనా!"

"నీవు సరిగా ఊహించినావు కుమారీ!"

"మా తండ్రిగారికి కూడా ఈమాటనే చెప్పినాను హుజూర్!"

"అట్లయిన నీవు విజయనగరమునకు వెళ్ళవా?"

"వారి దురుద్దేశమును పూర్తిగా తెలిసియూ, వారివద్దకు వెళ్ళుటయా? అంత అవివేకిని కాను నేను. అప్పాజీగారిని వంచించినట్లు వారు నన్నంత సులభముగా వంచించలేరు"

"ఔను కుమారీ! నీవు సరిగా చెప్పితివి. ఏమీ? మీ తండ్రి

గారు మరల విజయనగరమునకు వెళ్ళవలయు నని వున్నారా ?" అని చెప్పి, తిమ్మోజీ ముఖము చూచినారు.

"ఔను హుజూర్ !"

"మీకు పిచ్చి పట్టలేదుకదా ?"

"ఎందులకు హుజూర్ ?"

"బుద్ధివున్న వారెవరైననూ బంధనమునుండి తప్పించుకొనివచ్చిన తర్వాత మరల చెఱసాలలో ప్రవేశించ వలెననుకొందురా ?"

"విముక్తి లోభముతో సామ్రాట్టులకు ద్రోహము దలచి ఆత్మ వంచన చేసుకోలేను హుజూర్ ?"

"ఎవరు సామ్రాట్టులు ? ఎవరికి సామ్రాట్టులు ? మీరు మా రాజ్యములోని ప్రజలనునది మరచినట్టున్నారు. విజయనగర రాజుల చెఱసాలలో కొంతకాల మున్నంత మాత్రమున వారు మీ సామ్రాట్టు లైనారా ?" సుల్తాను విస్మయముతో ప్రశ్నించినాడు.

"నేను ముద్గల్లు నివాసిని. తమ రాజ్యమునందలి వ్యక్తియను విష యమును మరువలేదు హుజూర్ !"

"అది తెలిసివున్నచో మీరు స్వాతంత్ర్యము పొందుటకు లభించి వున్న సదవకాశమును జారవిడచుకొని మరల విజయనగరపు చెఱసాలకు వెళ్ళుటకు యింత ఆతురత పడువారు కారు" తిరస్కారభావముతో అని నాడు సుల్తాను.

"నేను వారి ఖైదీని కావచ్చును హుజూర్ ! కాని వారు నన్ను గౌరవముగా చూచుకొనుటయేకాదు. నామీద నమ్మకముంచి ఈ రాయ బారమునకు పంపినారు. నన్ను నమ్మినవారు శత్రువులైననూ, మిత్రు లైననూ. ప్రాణంపోయిననూ వారికి నేను ద్రోహము తలపెట్టలేను. తిమ్మోజీ యింతవరకూ ఋజుమార్గములో జీవించి, యిప్పుడు కేవలము విముక్తికొరకై ఆత్మద్రోహి కానేరడు"

"ఆ కాఫర్ రాజు చెఱసాలలోపడి కృంగవలయుననునదే మీనుదుటి వ్రాతయైనచో అందులకు నేనేమి చేయగలను? మీ ఖర్మ ననుభవింపుడు! మీవంటి శతమూర్ఖులకు బుద్ధి జెప్పునంతటి వ్యవధి నాకులేదు"

"అయినచో, నేను ఎప్పుడు వెళ్ళను హుజూర్ ?"

"మీ యిష్టమువచ్చినప్పుడు వెళ్ళుడు. నా అభ్యంతరమేమియును లేదు"

"వట్టిచేతులతో నేను తిరిగి వెళ్ళలేను హుజూర్ ।"

"పార్వతినికూడా వెంటతీసుకు వెళ్ళవలయుననిచెప్పుచున్నారా?"

"ఔను హుజూర్ ।"

"మీవెంట వచ్చుట కామె యిచ్ఛగించునట్టయిన తీసుకొని వెళ్ళుడు; నా అభ్యంతరములేదు"

"అవివేకురాలై, ఆమె యిచ్చటనే వుండవలయునని హఠము చేయుచున్నది. ఖామందులు ఆమెకు బుద్ధిజెప్పి, నావెంట పంపి, ఉపకారము చేయవలయును ।"

"తండ్రి-కూతుళ్ళ వ్యవహారములో తలదూర్చుటకు నా కిష్టము లేదు. నేను పార్వతి కాశ్రియమిచ్చినది నిజమే । కాని, ఆమె స్వేచ్ఛ నరికట్టక, ఎచ్చట నుండదలచిన అచ్చట నుండుటకు అనకాశ-మిచ్చి నాను. ఆమె మీవెంట విజయనగరమునకు వచ్చునట్టయిన సంతోషముగా పిలుచుకొని వెళ్ళుడు ।" అని చెప్పి, పార్వతివైపు చూచినాడు.

"అప్పాజీ, నే నప్పుడే స్పష్టముగా చెప్పినాను. మీరింకనూ నిర్బంధపరచు చున్నారు. మిమ్ములమ రాయబారిగా పంపి, నన్ను పిలుచుకొని రమ్మనుటలో ఏదియో మోసమున్నది. మిమ్ములను మోసగించినట్లుగా ఆ ధూర్త ప్రభువు నన్ను మోసగించలేరు । అంత సులభముగా నేను వారి తంత్రమునకు లోబడను. నే నచ్చటికి వచ్చిన, నన్ను ఆ కామాంధ ప్రభువు బలవంతముగా పెండ్లాడి, తన యభీష్టము నెరవేర్చుకొన గలడు, ఇది నిజము । ఇచ్చట నేను స్వతంత్రురాలనుగా నున్నాను-నెమ్మదిగా నున్నాను. నాకే అపాయమునూ లేదు. ఇప్పుడు నా యంతట నేనుగా మీతో వచ్చి చిక్కులపాలు కాలేను ।మీపై నాకు గౌరవ భావము లేదని తలచకుడు । కాని, ప్రస్తుత పరిస్థితిలో నేను యిచ్చటనే యుండుట క్షేమకరము । మీరూ యిచ్చటనే వుండవలయునని నా యపేక్ష ।"

"నీవు యిచ్చట వుండి సాధించునది మాత్రమేమి ?"

"మీ ఉభయుల విడుదల ! — నాకు జరిగిన అన్యాయమునకు పగ దీర్చుకొనుట ! — మా తల్లిమీద జరిగిన అత్యాచారమునకు ప్రతీకారము చేయుట."

"నీవు తలచిన ఉద్దేశము నెరవేరదు !"

"ఎందులకు ?"

"సామ్రాట్టులకు విరోధిగా నీవు ఒక్కతెవు మాత్రము నిలబడి ఏమి చేయగలవు?"

"ఏమి చేయుదునో మీరే చూడుడు ! నన్నీ స్థితికి తెచ్చిన ఆ దుష్ట సామ్రాట్టులు నాక్రోధాగ్నిలో బూది యగుటను మీరే చూడగలరు. ముద్దులు నిరపరాధ ప్రజలమీద అత్యాచారమును జరిపిన విజయనగర సామ్రాజ్యము ధూళీ పటల మగుటను ఈ కనులతోనే చూడగలరు !" అగ్ని కన్యవలె నిప్పులను గ్రక్కినది పార్వతి.

"అటువంటి పరిస్థితి వచ్చినచో చూచుటకు నే నుండను."

"ఎందులకు ?"

"ఉభయ రాజ్యములకూ యుద్ధము సంభవించుటకు మునుపు నీవు నన్ను చంపి, అనంతరము విజయనగరముమీద దండెత్తి వెళ్ళవలసి యుండును."

ఈ మాట విని పార్వతి, సుల్తాను లిద్దరూ ఆశ్చర్యపడినారు. ఈ మాటలనినది తిమ్మాజీ కాదుకదా ? అనుకొనినారు.

"అయినచో, సామ్రాట్టులమీద నేను పగదీర్చుకొనుట మీ కిష్టము లేదా?"

"లేదు."

"ఎందులకు ?"

"మైత్రితోనున్న రెండు రాష్ట్రములకు నీ కొరకయి యుద్ధము సంభవించుట నా కిష్టములేదు."

"దీనివలన మీకు జరుగు నష్టమేమి ?" పార్వతి అసహనముగా అనినది.

"నాకును, నీకును నష్టము లేనిమాట నిజమే. కాని నీ మూలమున వేలాది సంఖ్యలో నిరపరాధుల రక్తము ప్రవహించుట నా కిష్టములేదు. చరిత్రలో నీ నామము రక్తాక్షరములతో లిఖించుటను నేను సహించను."

ఈ మాట విని పార్వతికేమి చెప్పుటకును తోచలేదు.

సుల్తానుయే మాటలాడినాడు:

"యుద్ధమును మీరు తప్పించలేరు శిల్పిగారూ ! పార్వతి పేరున జరుగక పోయిననూ, విజయనగర సైన్యము, మా రాజ్యమందలి ముద్గల్లు నివాసులమీద జరిపిన అత్యాచారములకయిననూ మేము విజయనగరము మీద దండెత్తునది శతస్సిద్ధము! అందుకనియే మీరీ యుద్ధమును తప్పించలేరు" అని వికటముగా నవ్వినాడు సుల్తాను.

"దైవేచ్ఛ ప్రకారము జరుగనిమ్ము ! కాని ఇందున నాయొక్క-కాని, పార్వతియొక్క-కాని పాత్ర వుండుట నాకు సమ్మతములేదు. మా కొరకయి జరుగు ఏ పోరాటమునకయిననూ, రక్తపాతమునకయిననూ నేను వ్యతిరేకినని తెలియుడు."

"మీరు మా రాష్ట్రప్రజలని మరువకుడు, శిల్పిగారూ !"

"ఆ విషయము నాకు తెలియును హుజూర్."

"మా రాష్ట్రప్రజ, ఏ సందర్భమునైనను రాష్ట్రఘాతుకమైన కార్యమునకు గడంగుటను ప్రభుత్వము సహించజాలదు! ఈ విషయము కూడా మీకు తెలిసి యుండవలయును కదా ?"

"నేను రాష్ట్రఘాతుకమైన ఏ కార్యమునకూ గడంగియుండలేదు. ఇంకనూ రాష్ట్ర రక్షణా కార్యములో నిమగ్నుడనై వున్నాను."

"అది నిర్ణయించవలసిన వారు మేము !"

"మీ నిర్ణయమునకు నేను బాధ్యుడను కాను ! నేను త్రికరణ శుద్ధిగా నమ్మినదానిని కార్యరూపమునకు తీసుకొని రాగల వ్యక్తి స్వాతంత్ర్యము నాకు గలదు. దాని నెవరూ కాదనజాలరు !"

"అట్లయినచో, మేము మీమీద కఠినచర్య తీసుకొనవలసి యుండును !"

"అన్యాయమైన చర్యకు నేను ప్రతిఘటించుమను !"

"మీ ప్రతిఘటన యిచ్చట సాగదు ! మీరీ ఘడియ నుండి మా ఖైదీలు. కఠిన శిక్షకు మిమ్ములను గురిచేయవలయు ననుకొన్నాను. కాని, మీ కుమార్తె ముఖము చూచి మీకు శిక్షను తప్పించు చున్నాను. మీరు విజయనగరము మీద జరుగు యుద్ధము పరిసమాప్తి జెందువరకును అంతఃపురములో నిర్బంధముగా నుండుడు !" అని చెప్పి, అచ్చటనే నిలబడిఉన్న పార్వతి వైపు చూచినాడు.

పార్వతి చిరునవ్వు నవ్వి, మౌనపు సమ్మతి నిచ్చినది. చివరకు తండ్రి నచ్చటనే నిలుపుకొనవలయునని వున్న ఆమె యభీష్టము నెర వేరినది.

# అ ప జ య ము

## 13

సుల్తాను వద్దకు సంధిరాయబారమునకై వెళ్ళిన తిమ్మోజీ నిరీక్షించిన వ్యవధిలో విజయనగరమునకు తిరిగి రాకపోవుటను చూచిసామ్రాట్ దేవరాయలకు ఆశ్చర్యమైనది. తిమ్మోజీ ఎందులకు రాలేదు ? తన రాయబారము సఫలమైననూ, విఫలమైననూ తిరిగి వచ్చునట్టుగా దేవరాయలకు మాటయిచ్చి వెళ్ళినాడు. కాని, ఏమికారణమో అతడింకను తిరిగిరాలేదు. అత డేమైనను తనను నమ్మించి మోసపుచ్చినాడా ? రాయబారపు నెపముతో వెళ్ళి, గుల్బర్గా యందు కుమార్తెతోబాటు నిలచిపోయినాడా ? తన మాటలలో అతని కేమైనను అనుమానము గోచరించినదా ? ఏదియును తోచక పోయినది.

కొన్నిరోజుల తర్వాత తిమ్మోజీ వెంటవెళ్ళిన అనుచరులు అతనికై నిరీక్షించి, చివరకు విసిగి వెనుకకు మరలి వచ్చినారు. వారి మూలమున అతడు కుమార్తెతో గుల్బర్గలోనే వున్నట్టు తెలిసినది. ఇదివిని దేవరాయలు తిమ్మోజీ తనకు ద్రోహము దలచినాడని కోపించినాడు. అతడు తనవద్ద విశ్వాసముగల వానివలె నటించి, తన చేతినుండి తప్పించుకొని వెళ్ళినాడని ఆగ్రహము జెందినాడు.

దేవరాయల చిత్తశాంతిని కల్లోలపరచునంతటి మరొక వార్తను వేగులు తెచ్చినారు. సుల్తాను విజయనగరముమీద దండెత్తి వచ్చుటకు సైన్యము నాయత్త పరచుచున్నాడనియూ, ఏ ఘడియలోనైనను యుద్ధము ప్రకటించవచ్చుననియూ చెప్పినారు. ఇది విని అతడు మరింత క్షుబ్ధుడైనాడు. తిమ్మోజీ-పార్వతుల మీద అతనికి అమితమైన కోపము వచ్చినది. వారిమీది కోపమును చెఱసాలలోనున్న మల్లన్నమీద తీర్చుకొనినాడు. చెఱసాలలో మల్లన్న కిచ్చిన సకల సౌలభ్యములను హఠాత్తుగా ఆపుదలచేసి, అతనిని హత్యా పాతకులను చూచినట్టుగా, కఠినముగా చూడసాగినాడు. గాలి-వెలుగులేని ఆనెగొంది చెఱసాల యందలి నేల గదిలోవేసి పుడిసెడు గంజి, ఒకటి రెండు రొట్టెలనుమాత్రమే రోజుకు యివ్వవలసినదిగా ఆజ్ఞాపించినాడు.

తన భోజన-వసతి సౌకర్యములలో హఠాత్తుగా జరిగిన మార్పుకు కారణమేదియో మల్లన్నకు అర్థముకాలేదు. తను ఏతప్పు చేసినాడని తనకీ శిక్ష? అని ఎంత ఆలోచించినను అతనికి స్ఫురించలేదు. తిమ్మోజీని తననుండి దూరముచేసినప్పుడే తనకేదో ఆపద మూడనున్నదని భావించినాడు. ఆ భావన తప్పుకాలేదు. కఠిన కారాగారవాసము లభించినది. మునుపే దేవరాయలపట్ల మనస్సువిరిగిన మల్లన్నకు యిప్పుడు ద్వేషము నఖశిఖపర్యంతము రగులసాగినది. తను బ్రతికియే వున్నచో దేవరాయల మీద పగదీర్చుకొనక మాననని వీరప్రతిజ్ఞచేసి, తన విముక్తికొరకై చాతకపక్షివలె నిరీక్షించుచూ కూర్చున్నాడు.

గూఢచారులు తెచ్చిన వార్త అబద్ధముకాలేదు. సుల్తాను విజయనగరము మీద వున్నట్టుండి యుద్ధము ప్రకటించి, తనసైన్యములతోవచ్చి

విజయనగర సమీపమున విడిసినాడు. యుద్ధము యింత త్వరలో సంభ వించగలదని దేవరాయలు నిరీక్షించక పోవుటచే, సుల్తాను సైన్యమును మార్గ మధ్యమున అడ్డువారు లేకపోయినారు. బహమనీ సుల్తాను సైన్యము ఖాన్ ఖాన్, మరియూ మహమద్ ఖాన్ అను దళపతుల నేతృత్వములో బయలు దేరి, సులభముగా కృష్ణనుదాటి విజయనగరము వద్దకు వచ్చినది.

ఈ వార్త విని దేవరాయలకు పిడుగుపడి నట్లయినది. అతడు ఆలస్య మొనరించక వీలైనంత సైన్య సంగ్రహణముచేసి దానిని రాజ ధాని రక్షణకు నియమించి, సామ్రాజ్యపు యితర ప్రదేశములనుండి మాండలీకుల, సామంతుల సైన్యములను సాయమునకు పంపవలసి నదిగా లేఖలు వ్రాసి దూతలచేత పంపినాడు. వారి సైన్యములు వచ్చు నంత వరకును తను ఏవిధముగా నైనా రాజధానిని శత్రుముట్టడినుండి రక్షించిన, తర్వాత మ్లేచ్ఛసైన్యములకు భీతిల్ల వలసిన పనిలేదని దేవ రాయలు భావించినాడు. అతనికి గల ఏకయిక ధైర్య మేమనగా విజయ నగరపు కోట నిసర్గ దత్తమైనది. అది అజేయమును - శత్రు దుర్భేద్య మును నైనది-యనునదే!

పూజ్యులైన విద్యారణ్య మహర్షులు విజయనగరమును నిర్మించు నప్పుడు, ప్రశస్తమైన ప్రదేశము నెన్నుకొని,రాజధానిని నిర్మించినారు. దాని చుట్టును అంజనాద్రి, ఋష్యమూకము, మాల్యవంతము, మాతం గము, హేమ కూటము మొదలగు దుర్భేద్యమైన పర్వతము లున్నవి. వాటినడుమగల ప్రదేశము సుభద్రమైన కోట కొత్తములచే రక్షింప బడినది. ఒకవైపు పర్వత పంక్తి-యున్ను, మరొకవైపు తుంగభద్ర విజయనగరము నొరసికొని ప్రవహించుచున్నది. వెలుపలి ప్రకృతి సిద్ధ మైన కోట నడుమ విస్తీర్ణమైన విజయనగరము వెలసినది. వెలుపలి కోట నుండి అంతఃపురము వరకును మరి ఆరు కోటలున్నవి.వీటన్నటిని దాటి వచ్చిననే మాత్రము అంతఃపురము-రాజ బొక్కసము శత్రువుల వశ మగుటకు సాధ్యము కాగలదు. కాని వెలుపలి కోటను భేదించి రెండవ కోటను ప్రవేశించుటకే శత్రువుల కసాధ్యము. ఎందుకన ఆ ప్రదేశము నందు శత్రువులకు హింసలు పెట్టుటకయి, పురుషప్రమాణపు శిఖిముఖి

వంటి రాతికంబములను భూమిలో పూడ్చిపెట్టి యున్నారు.కనుక గజాశ్వ సైన్యముల కచ్చట మార్గానుక్రమణ చేయుట కష్టతరము. దానిని దాటి లోనికి వచ్చినను, తుంగభద్రా నీటితో నిండిన లోతైన కందకమున్నది. ఈ విధమైన రక్షణ గలది గనుకనే ఆ నగరము శత్రుదుర్భేద్యముగా విలసిల్లు చున్నది.

శత్రువులకు దీర్ఘకాలము వరకును ఎదుర్కొనుటకు తగిన ఆహారము-నీరు పట్టణములో యథేచ్ఛగా నున్నది. సైనికులకు కావలసిన యుద్ధోపకరణము లన్నియునూ వున్నవి. దేవరాయలు దేనికైనను చింతించ పనిలేదు. కాని, నిరీక్షించిన సమయమునకు సామంతుల సహాయము లభించిన, రెండు వైపులనుండి శత్రువుల మీద పడి వారిని పరాజితులను చేయవచ్చును ! ఎంత దనుక తాము లోపలవుండి,యుద్ధ మొనరించిన అంత దనుక తమకు ఓటమిలేదని అమాత్యులు కూడా చెప్పినారు. ఇది మూఢనమ్మికయునూ కాదు !

ఫిరోజ్‌షా యీసారి విజయనగరముమీద అంతిమ దిగ్విజయము సాధించుటకు తానే బయలుదేరి వచ్చినాడు. తానే నిలబడి ప్రతి దళము యొక్క చర్యలను నిర్దేశింప సాగినాడు. యుద్ధదళము లెచ్చట నిలబడి శత్రుసైన్యము మీద ముట్టడి జరుపవలసినదియునూ, వారు కురిపించు విషబాణ వర్షము నడ్డుకొనుట, బల్లెము, ఈటె, ఖడ్గము, శతఘ్నుల నెటెదుర్కొనుట, వారు విసరు గుండ్లను-రాళ్ళను ఎట్లు తప్పించుకొనుట, వ్యూహ రచన చేయుట ఎట్లు ? మొదలగు విషయములను గురించి తానే నిలబడి సూచన లిచ్చుచూ, అశ్వము నధిరోహించి; స్కంధావారము నందు మెఱుపువలె దిరుగ సాగినాడు. అతనికి సాధ్యమైనంత త్వరలో విజయనగరమును ముట్టడించి, వశపరచుకొన వలయునని ఆతురత ! దేవరాయలు నిరీక్షించిన సైన్యములు రాకమునుపే తాము కార్యమును సాధించ వలయునని అతని యాకాంక్ష !"

దేవరాయలే స్వయముగా కోటబురుజు మీద నిలచి, తన కుమారుడు యువరాజ కుమార వీరవిజయ రాయలు మాండలీకుల సైన్యములతో బాటు వచ్చుచున్నాడేమోనని ప్రతిదినమును ఎదురుచూడ సాగి

నాడు. ఎన్నిరోజులు కోటను శత్రుముట్టడి నుండి రక్షించిననూ, వారిని ఓడించి తరిమివేయుటకు, వెలుపలి నుండి సైన్యసహాయము అనివార్య మైనది. కాని ముట్టడి దీర్ఘకాలము వరకును జరుగక పోవుటచే దేవరా యల చింత మరింత హెచ్చుతూ రాసాగినది. వీరవిజయుడు ఎందుల కింకను రాలేదు ? అని వ్యధజెంద సాగినాడు.

ఒకరోజు యీ చింతలోనే మునిగి దేవరాయలు కోట బురుజు మీద నిలబడి, దక్షిణ దిక్కునే చూచుచున్నాడు. అతని కంటికి ఎవరో వీరపురుషుడు అశ్వము నధిరోహించి శత్రు శిబిరములో మెఱపు తీగ వలె తిరుగుచూ వుండడము గోచరించినది. అతడు తెల్లటి దుస్తులను ధరించి యున్నాడు. నల్లటి అశ్వము నధిరోహించి వున్నాడు. చేతనున్న ఖడ్గమును ఝళిపించు చున్నాడు. అతనిని చూచి, దేవరాయలకు యాత డెవరో అసాధారణ పురుషుడై యుండునని తోచినది. చెంతనే నిలబడి వున్న లక్ష్మీధరా మాత్యుల నుద్దేశించి, కుతూహలముతో యీ విషయము నడిగినాడు :

"అమాత్యులూ, శత్రుసైన్యముల నడుమ సంచరించుచున్న ఆ మహాపురుషు డెవరు ? మీకేమైనను తెలియునా ?"

"ఎచ్చట ప్రభూ ?"

"అదిగో ! సైనికులు నిచ్చెన నెత్తుకొని వచ్చుచున్నారు కదా, వారి వెనుక—వారిని నడిపించుచూ వచ్చుచున్న వ్యక్తి !"

"ఆ నల్లటి అశ్వము నధిరోహించి వున్నవాడా ?"

"ఔను !"

"బహుశః అతడే ఫిరోజ్‌షా బహమనీయై వుండవలయును !"

"అతడు కోట సమీపముననే యింతధైర్యముగ అశ్వము నధిరో హించి తిరుగు చుండుటను చూచి, నాకును నదియే అనుమానము తోచి నది. మన ఊహ సరియైనచో, అతడే ఫిరోజ్‌షాయై వుండవలయును. చూడుడు, శరవేగముగా సంచరించు చున్నాడు !" అని గట్టిగా శ్వాస పీల్చినాడు.

లక్ష్మీధరా మాత్యుల కీ మాట విని ఏమని తోచినదో, అతడు

వెంటనే సమీప మందున్న ఒక విలుకాని వద్దనుండి విల్లమ్ములు లాగు కొని, గురిచూసి, ఒక్క బాణమును వదలినాడు. అది 'ఝుయ్' మని వైరి గుఱ్ఱము ముందు దూసుకొని పోయినది. సుల్తాను భీతిజెంది,గుఱ్ఱము నాపి, బాణము వచ్చిన వైపు చూచినాడు. మరొక బాణము 'రంయ్' మని దూసుకొనుచూ వచ్చి అతని తలమీదుగా వెళ్ళిపోయినది. ఎవరో తనను గురిచూచి బాణప్రయోగము చేయుచున్నారని అతడు అశ్వమును పరుగె త్తించుకొని వెళ్ళి, అపాయమును తప్పించు కొనుటకు చూసినాడు. ఇంతలో లక్ష్మీధరా మాత్యులు విడచిన మూడవ బాణము వచ్చి అతని కుడిభుజము నకు గుచ్చుకొనినది. సుల్తాను 'హా!' యని గుఱ్ఱము మీదనుండి నేల కూలినాడు. చివరకు లక్ష్మీధరుని గురి వ్యర్థము కాలేదు. అది సుల్తానును నేల గూల్చినది. కాని, అతని యదృష్టము వలన అది గుండెలో గ్రుచ్చు కొనక, కుడి భుజమునకు గుచ్చుకొనినది ! విషపూరితమైన ఆ కూర లుగు హృదయమునకు గుచ్చుకొని యుండిన అతని కథ అంతటితో ముగిసి యుండెడిది !

నేలకూలిన సుల్తానును సైనికులు వెంటనే ఎత్తుకొని, అచ్చటి నుండి పారిపోయినారు. శిబిరమును చేరునప్పటికి అతనికి ప్రజ్ఞ తప్పి నది. రక్తముతో కలసిన విషము దేహ మాద్యంతమును వ్యాపించినది. వెంటనే వైద్యులు వచ్చి, భుజములో విరిగిన బాణపు మొనను తీసివేసి, వేడినీటితో గాయమును కడిగి, శరీరములో వ్యాపించిన విషమును శమ నము చేయుటకయి ఏదియో వనమూలిక నిచ్చినారు. సుమారు మూడు దినముల వరకును సుల్తాను గాఢ నిద్రలో నుండినాడు. ఈ దెబ్బతో దేహము జడమై, నిశ్చేష్టిత మైనది. అది మరల సచేతనమై, అతడు ప్రజ్ఞగొన్నది వారం రోజు లనంతరమే! లక్ష్మీధరా మాత్యులు విడచిన ఒకేఒక బాణము యింతటి అనర్థమును కలుగజేసినది !

సుల్తానుకు బలమైన గాయము తగిలిన సంగతి సైనిక శిబిరములో వ్యాపించి, వారిని నిరుత్సాహవంతులను జేసినది. ఈ సమయములో, శత్రువు లసంఖ్యాకులై వచ్చి తమమీద పడక మునుపే, తాము అచ్చటి నుండి కాలుతీసి; సురక్షితమైన ప్రదేశమును చేరుకొన వలయునని సుల్తాను నిర్ణయించినాడు. యుదు మాసముల కాలము నతడు విజయనగర

మును ముట్టడించినను, కోట గోడ యందలి ఒక్క ఱాతిని సైతము కదలించ సాధ్యముగాక పోయినది. తమ ముట్టడి నిష్ఫలమగుట చూచి సైన్యాధిపతులు హతాశు లైనారు. వారు తమ సేనలను వెనుకకు త్రిప్పి, ఉత్తరప్రాంత ప్రదేశముల నన్నింటినీ కొల్లగొట్టి, నాశమొనర్చి, తమకు జరిగిన పరాభవమునకయి పగదీర్చు కొనుమని సైనికుల కాజ్ఞాపించి, సుల్తాను కొన్నికోసుల దూరము వెనుకకు వెళ్ళి, తన శిబిరము నచ్చట వేయించినాడు. అతని కిప్పుడు పూర్తి విశ్రాంతి కావలసి యున్నది. విజయనగర సైన్యము లెప్పుడు వచ్చి తనమీద పడగలవో నన్న భీతిచే, అతనికి నిద్రసైతము సరిగా వచ్చుటలేదు. అందువల్లనే అతడు విజయనగరమును ముట్టడించక వెనుకకు వచ్చినాడు.

ఇప్పుడు దేవరాయలకు ఊపిరి పీల్చుకొనుటకు కొంచెము అవకాశము లభించినది. అయినను, అతనికి శత్రువుల నిష్క్రమణము వలన మనస్సుకు సంతోషము కలుగలేదు. సేనాసమేతముగా రావలసిన వీరవిజయుడు మాత్ర మింకను రాలేదు. అతడు రానిదే తనకు లభించిన విజయము, విజయము కానేరదని దేవరాయలకు తెలియును. మ్లేచ్ఛ సైన్యమును రణరంగమున నెదుర్కొని,వారి నోడించి పలాయితులనుగా జేయని తన విజయము, స్థిరమైనది కాదని అతడు గ్రహించినాడు. దానికి తోడు మరొక చింతకూడా అతనిని పట్టి బాధించ సాగినది. తన సామ్రాజ్యములోని ఉత్తర ప్రాంత గూఢచారులు అనుక్షణమునువచ్చి అచ్చట మ్లేచ్ఛ సైన్యములు నిరపరాధి ప్రజలమీద జరుపుచున్న అత్యాచారములను, చిత్రహింసలను వర్ణించుచున్నారు. ఈ విషయములను విని దేవరాయల రక్తము గడ్డకట్ట సాగినది.

విజయనగరమునుండి వెనుకకు మరలిన బహమనీ సైన్యము సుల్తాను సహోదరుడైన ఖాన్ ఖాన్ మరిన్నీ మహమద్ ఖానుల నేతృత్వములో వెళ్ళి, సంపద్భరితమైన విజయనగర ఉత్తర సీమయందలి గ్రామములను ముట్టడించి, శిశువులను; స్త్రీలను చంపి, యిండ్లను కొల్లగొట్టి, ప్రతిఘటించిన వారిని సంహరించి, వారి యిండ్లకు నిప్పంటించి, చేతికి

చిక్కిన దానిని తీసుకొని వెళ్ళసాగినారు. వారి దుండగములకు, అత్యాచారములకు చిక్కి యెందరో హిందూరమణులు మరణము నందినారు. స్త్రీల పాతివ్రత్యమునకు భంగము కలిగించబడినది. హిందూ దేవాలయములు అపవిత్రము చేయబడినవి. విగ్రహములు భగ్నమైనవి. గుడి గోపురములు నేలసమమైనవి. గోబ్రాహ్మణవధ జరిగినది. యెందరో హిందువులను బలవంతముగా మతాంతరీకరణము చేసినారు. ఇటువంటి విషయములతో కూడిన అత్యాచారములను వేయింటిని ప్రతిదినము గూఢచారులు వచ్చి చెప్పసాగినారు. ఈ విషయములనువిని నెమ్మదిగా నుండుటకు దేవరాయల వలన సాధ్యము కాలేదు. ఈ దుశ్చర్యల నాపుటకు ఏదియో యొక ప్రయత్నము చేయక తప్పదని నిశ్చయించినాడు.

ఇప్పుడు తాము రాబోవు సైన్యసహాయమును నిరీక్షించుచూ,రాజధానిలో నిష్క్రియులై కూర్చొని యున్న,విజయనగరపు సంపద్భరితములైన గ్రామ సీమలు నాశము కాగలవని భీతిల్లినాడు. అభయ హస్తమివ్వవలసిన సమయమున తన ప్రజలను, శత్రువుల క్రౌర్యమునకు బలిఇచ్చుచున్నట్టుగా అతడు భావించినాడు. ప్రజల కష్టములను చూచి అతనికి అన్నపానీయములు సైతము సహించక పోయినవి. వెంటనే రాజధాని రక్షణకు కావలసిన ఏర్పాటులుచేసి, సైన్యసమేతముగా వెళ్ళి, శత్రువుల ఉపద్రవమును మూలోత్పాటనము చేయవలయునని నిశ్చయించినాడు. కాని ఈ సలహా చాలమంది దండనాథులకు సమ్మతము కాకపోయినది. దేవరాయల ఈ తీర్మానము తొందరపాటని వారు భావించినారు. అట్లు చేసినచో, విజయనగరమును తాము సులభముగా శత్రువుల కప్పగించినట్లు కాగలదని వారు సెలవిచ్చినారు. కాని దేవరాయలు తన హఠమును విడువలేదు. ఎవరును రానిచో తానొక్కడే సైన్యములను వెంటబెట్టుకొని వెళ్ళి శత్రువులమీద పడునట్టుగా ఖచ్చితముగా చెప్పినాడు. ఈ సమయమున తాము కార్యోన్ముఖులు కానిచో, ప్రజాదృష్టిలో పిరికి పందలుగా పరిగణింప బడగలమని అన్నాడు.

అతని వీరభాషణములను విని నాగన్న, ఈరన్న, వీరన్న మొదలగు దండనాయకులకు తలపంపు గలిగినది. వారు రాజధాని రక్షణకు

లక్ష్మీధరామాత్యులను నియమించి,తమ సైన్యములతో దేవరాయల ననుస రించినారు. విజయనగర సైన్యము రెండు భాగములుగాచీలి. ఒక భాగము దేవరాయల నేతృత్వములో సుల్తానుమీదను. మరొక భాగము ఖాన్‌ఖాన్. మహమద్ ఖానుల ముట్టడి నెదిరించుటకును వెళ్ళినది.

దేవరాయలు తన సైన్యముతో వెళ్ళి. తుంగభద్ర కాలువలుగా చీలిన ప్రదేశమందలి మైదానములో విడిసినాడు. దానికి కొంత సమీప ములోనే సుల్తాను కూడా తన సైన్యము తో విడిసి యున్నాడు

పూర్వమొకప్పుడు ఈ ప్రదేశము మిక్కిలి ఫలవంతముగా నుండి నది. అచ్చట వరి. చెఱకు సమృద్ధిగా పెరుగుచుండినవి. ఇప్పుడా ప్రదే శము శత్రుసైనికుల తాత్కాలిక స్థానరమై. పంటలన్నియూ ధ్వంసమై బంజరు భూమిగా మారినది. దానిని చూడగనే దేవరాయల కనులలో నీరు గ్రమ్మినది. పూర్వముండిన పచ్చటి తోటలూ. జనసమృద్ధమైన గ్రామసీమలూ యిప్పుడు శ్మశాన సదృశములైనందుకు అతనికి వ్యథ కలిగినది. మహమ్మదీయుల క్రౌర్యమునకు సంకేతముగా అచ్చట ప్రకృతి రామణీయకత విధ్వంసమైనది.

దేవరాయలు సైన్యసమేతముగా వచ్చి పాయవద్ద విడిసివున్నను శత్రువుల చర్యలను గమనించనిదే వారిమీద పడరాదని ఒకటిరెండు రోజులు ఊరక కూర్చున్నాడు. శత్రువుల బలాబలముల ఆయకట్టు స్థానములను తెలుసుకొనిన తర్వాత. కాలమును వ్యర్థపుచ్చ నిచ్ఛగించక మరునాడు శత్రువులమీద పడుటకు సైనికుల కాజ్ఞాపించి. ఆ రాత్రి పడుకొనుటకై వెళ్ళినాడు సైనిక శిబిరములో పహరా కాయువారుతప్ప. తక్కిన వారందరూ మరునాటి యుద్ధమునకు కావలసిన సన్నాహములను చేసుకొనసాగినారు. వేకువఝాము వేళకు ప్రశాంత వాతావరణ మేర్పడి నది. చల్లనిగాలి మందగతిలో వీచుచున్నది. సైనికులు శరీరమంతయూ కనులుచేసుకొని శత్రువ్రాడికి సిద్ధముగా కూర్చొని వున్నారు.

సూర్యోదయమునకు ఒకటిరెండు ఘడియలున్నదనగా 'అల్లాహో అక్బర్', 'దీన్ దీన్ !' అని అరచుకుంటూ శత్రువులు హఠాత్తుగా శిబి రముమీద వచ్చి పడినారు. సైనిక శిబిరములో భయంకర కోలాహలము

చెలరేగినది. విజయనగర సైనికులు శస్త్రధారులై వెళ్ళి శత్రుసైనికుల మీద పడినారు. కాని, ఆశ్చర్యం! వారు ఒకవైపునుండి ముట్టడించుటకు మారు, అన్ని వైపులనుండి వచ్చి దేవరాయల సైన్యమును మార్కొని నారు. ఇంత సైన్యము వారికెక్కడిది? అందరూ ఆశ్చర్య పడినారు. కాని, ఫిరోజ్‌షా ముందుగనే యీ ముట్టడికి కావలసిన ప్రయత్నము లన్నియును చేసుకొనినాడు. అతడు ఖాన్ ఖాన్, మహమద్ ఖానులకు రహస్యముగ లేఖవ్రాసి, వారిని తమ సైన్యములతో సహా బయలుదేరి తన సాయమునకు రావలసినదిగా తెలిపినాడు. దేవరాయలు వచ్చిన వెంటనే ఫిరోజ్‌షా మీద ముట్టడి జరపక, మూడురోజులు ఆలసించినదే అతని అపరాధమైనది! దాని ఫలితమును అతడు మాత్రమే కాదు — యావద్విజయనగర సైన్యము అనుభవించవలసి వచ్చినది!

విజయనగర సైనికులు నాలుగు వైపులనుండి దెబ్బకు తాళలేక పోయినారు. శత్రు సైనికులు చేతికి చిక్కినవారిని సంహరిస్తూ, అడ్డు పడిన గుడారములను అగ్నికాహుతి చేయుచూ, విజయనగర సేనలకు ఏ దిక్కునకు తప్పించు కొనుటకునూ అవకాశమివ్వక, గజాశ్వ సైన్య ములచే త్రొక్కించు కొనుచూ ముందుకు వెళ్ళినారు. వారి తంత్రమునకు దేవరాయల సైనికులు సులభముగా బలియైనారు. ఎట్లు తప్పించు కొను టకును వారి మార్గములేక పోయినది. ఇక వీరావేశముతో పోరాడి మర ణించుటొక్కటే వారి మున్మున్న మార్గం! ఈ మార్గములలో వారు నిర్భ యులై ముందుకు దూకినారు. కాని, అధికసంఖ్యతోనున్న శత్రు సైని కులముందు ఏంతసేపని నిలువగలరు? సూర్యోదయ మగునప్పటికి వారు శత్రు సైనికులకు శరణన వలసి వచ్చినది. చాలమంది సైనికులు మర ణించినారు. ఎందరో క్షతగాత్రులైనారు. శిబిరములలోని ఆయుధ సామగ్రి, ఏనుగులు, గుఱ్ఱములు శత్రువుల పాలైనవి. ముఖ్య సైన్యాధి పతులందరూ ఖైదీలుగా పట్టుబడినారు. ఇంత విధ్వంసము జరుగు చున్ననూ దేవరాయలు కనబడలేదు. అతడేమైనాడు? ఎక్కడికి వెళ్ళి నాడు??

ఈ విషయ మెవరికినీ తెలియదు. అదృష్ట వశమున అతడు శిబిరములు శత్రువులవశము కాకమునుపే వారి చేతినుండి తప్పించు కొనినాడు.

ఉన్నట్టుండి సైనిక శిబిరంలో కోలాహం చెలరేగగా దేవరాయలకు మెలకువ వచ్చినది. విషయమేమియో తెలుసుకొనుటకై అతడు ఖడ్గము చేతబట్టుకొని, తన శిబిరమునుండి వెలుపలికి వచ్చినాడు. పహరా కాయుచుండిన సైనికులు దూరములో నిలువెత్తు మంటలు కనబడు చోట నుండి యీ కేకలు వినబడుచున్నట్టుగా తెలియ జేసినారు. బహుశః శత్రువుల హఠాద్దాడియై యుండవచ్చునా? శత్రుదాడియైనచో పగటివేళ జరుగ వలయును. కాని, వేకువ ఝూమువేళ బయలుదేరిన యీ కోలాహలమునకు కారణమేమి? ఏదియో శిబిరమునకు నిప్పంటుకుని, కలకలములేచి యుండవచ్చునని ఊహించి, తన శిబిరమునకు తిరిగివెళ్ళి, పడుకొనవలయు ననుకొనుచున్నంతలో ఒక భటుడు పరుగునవచ్చి,

"ప్రభూ! అన్యాయము జరిగినది. శత్రువులు నాలుగు దిక్కులనుండి వచ్చి మన శిబిరములను ముట్టడించినారు!" అని విన్నవించినాడు

దేవరాయలు దుస్తులు ధరించుటకుకూడా తీరికలేక, కట్టుబట్టలతోనే ఖడ్గము ధరించి, అశ్వము నధిరోహించి శత్రువుల నడుటకే బయలుదేరినాడు. కాని, అప్పటికే శిబిరములు చాలవరకూ శత్రువుల వశమైనవి. శత్రు సైనికులదే పై చేయి అయినది. దేవరాయలు హతాశుడు కాక, చేతికి చిక్కిన వారిని సంహరించుచూ, తన సైనికులను ప్రోత్సహించుచూ ముందుకు దూకి పోరాడ సాగినాడు. కాని, ప్రయోజనములేక పోయినది. తన సైనికులు శత్రువుల చేతికిచిక్కి, భీకరముగా సంహరింపబడుట జూచిన మీదట, ఇంకను తప్పించుకొననిచో, శత్రువులకు పట్టుబడుట తథ్యమని భావించి, అశ్వము మీదనుండి క్రిందికి లంఘించి ఎదురుపడిన శత్రు సైనికులను సంహరిస్తూ, ఆవేకువ ఝూమునందలి చీకటిలోపడి తప్పించుకొని పారిపోయినాడు. అతడీ విధముగా ఒకటి రెండు క్రోసుల దూరము పరుగు పరుగున వెళ్ళి, శక్తిగుంది పడుకొనుటకై ఒకచోట చూచుచున్నాడు. కాని, దూరమున ఎవరో శత్రు

సైనికులు తనను వెన్నంటి వచ్చుచున్నట్లుగా తోచినది. అతని కిప్పుడేమి చేయటకును తోచక సమీపములో నున్న చెఱకుతోటలో దాగి తప్పించు కొనినాడు.

అతని నిరీక్ష అబద్ధము కాలేదు. వారు దేవరాయలను స్కంధా వారములో ఎచ్చటను కానక, అతనిని వెదకుచూ వచ్చిన శత్రుసైనికులే! వారికి ఖాన్ ఖానుడే నాయకుడుగా నడచుచున్నాడు. తమకు లభించిన అఖండ విజయము దేవరాయలు పట్టుబడనిదే పూర్తికాదని భావించి అతడే మితపరివారముతో బయలుదేరినాడు. దేవరాయల ముఖ్యసేనాను లందరూ అతనికి పట్టుబడిననూ, దేవరాయలు పట్టుబడక పోవు టతనికి నిరాశను కలిగించినది. ఆతడెచ్చట దాగియున్నను సరే, విడువక పట్టి తీసుకొని వచ్చుటకై అన్ని దిక్కులకూ సైనికులను బంపి, తాను కూడా బయలుదేరి యీ దిక్కుగా వచ్చినాడు. దేవరాయలను పట్టితెచ్చిన వారికి అయిదువేల వరహాలు బహుమాన మివ్వబడునని దండోరా వేయించుటచే, సైనికులందరూ తమ తమ అదృష్టమును పరీక్షించుకొనుటకై పూనుకొనినారు.

చెఱకుతోట కనబడగా ఖాన్ ఖాన్ గుఱ్ఱమునుండి దిగి, తోటలో వెదుకమని తన భటుల కాజ్ఞాపించినాడు. దేవరాయలు దాగి వుండిన ఒక వేళ అచ్చట దాగివుండ వచ్చునని తంత్రజ్ఞుడైన అత డూహించినాడు. ఆతని యాజ్ఞ మేరకు భటులు దేవరాయలను వెదకుచూ వెళ్ళినారు. తను శత్రువుల చేతికి చిక్కిన తనకథ అంతటితో పూర్తికాగలదని భావించి, దేవరాయలు చెఱకు తోటలోని గనిమక్రింద దాగుకొనినాడు.

శత్రుసైనికులు దేవరాయలను వెదకుచూ, తమకు యిష్టములేని ఆ కార్యములో మునిగియున్నారు. దేవరాయలు తను దాగియున్న ప్రదేశమునుండి ఆ భటు లిరువురు మాట్లాడుకొను విషయమును స్పష్టముగా వినవచ్చును. వారు యీక్రింది విధముగా మాట్లాడుకొనుచున్నారు :

"రాసిద్, ఆ పాడువెధవ ఎచ్చట దాగియున్నాడో తెలియదు! వానివలన యిప్పుడు మన ప్రాణముమీదికి వచ్చియున్నది. సైనికులందరూ శిబిరములను కొల్లగొట్టుచుండగా, మన మా కాఫర్ రాజును వెద

కుచూ యిచ్చట ఈవిధముగా అవస్థ లనుభవింపవలసి వచ్చినది" అని తన మిత్రునితో అంటున్నాడు.

"ఏమి చేయవలె ఖాసిం! మన వసీబు యిట్లున్నప్పుడు మనము మాత్రమేమి చెయ్యగలము? అతడు దాగియున్న ఈ చెరకు తోటలో దాగియుండ వచ్చునని ఆ ఖాన్‌ఖాన్ సాహేబులకు భ్రాంతి. ఎవరైనను చెరకుతోటలో దాగుకొనగలరా? దాగియున్న నక్కలు దాగియుండును. అంతియే! వారి పిచ్చికి మనము గాసిజెంద వలసి వచ్చినది కదా!"

"బాసిద్! ఈ సమయములో మనము శిబిరములో నుండవలసినది. అచ్చటనుండివున్న చాల హాయిగా నుండెడిది. కుత్తుక వరకును మద్యము, పొట్ట నిండుగా బిరియాని, బాహువులలో వడతులు....కాని మన కా యదృష్టము లేదు"

"అన్నియూ ఈ సైతాను ప్రభువువలన జరిగినవి. అతడు ఇచ్చట నున్నాడని ఖాన్ సాహేబులకు కల వచ్చినదేమో!"

ఇంతలో చెఱకుతోటలో సర సర శబ్దమైనది.

"చూడుము, ఎవరో నడచు చున్నట్టున్నది!"

క్షణకాలము మౌనము, అనంతరము —

"అయ్యో, సైతానుకా బచ్చే! నీవా? మేమెవరో ననుకున్నాము!"

"ఏమది? అట్లు పోవుచున్నది? కుక్కయా?"

"మూర్ఖుడా, కాదు. నక్కపిల్ల!"

"నీవు ఆవైపు వెదకినది ముగిసినదా?"

"ఊ!"

"నాదియును ముగిసినది రమ్ము, వెళ్ళి యిచ్చట ఎవరును చిక్క లేదని చెప్పుదము!"

అంతలో మరల తోటలో సద్దయినది. తన వైపుగా సైనికులు వచ్చుటను చూచి, దేవరాయలు గనిమదాటి చెఱకుతోట నుండి తప్పించుకొని వెలుపలికి వచ్చినాడు. సైనికులు చెఱకు తోటంతయు వెదకి ఎచ్చటను దేవరాయలు కనబడకపోగా, నిరాశతో తిరిగి వచ్చినారు.

"బాసిద్! తోట చూడుము, ఎంత దిల్‌ఖుష్‌గా పెరిగినదో! తిను

టకు ఒకటి రెండు గెడలు విరచుము ! ఇచ్చటికి వచ్చినందుకు మనకు అంత మాత్రమైననూ లాభము వద్దా?"

ఇద్దరూ కలసి ఒక మోపు చెఱకులు కోసినారు. కాని, దానిని సాగించే దారి?

అంతలో బాసిద్ కనులకు బురద నిండిన దేహముతో దేవరాయలు కనబడినాడు.

"ఎవరయ్యా అక్కడ?"

"నేను దొరా !"

"అక్కడ ఏమి చేయుచున్నావు ?"

"తోటలో గనిమలు వేయుచున్నాను దొరా !"

"మీ దేవూరు?...."

"ఇచ్చటనే, దగ్గరనే దొరా !"

"అయినచో, యిటురమ్మ...."

"ఎందులకు దొరా?"

"ఈ చెఱకుమోపు మోసుకొని వచ్చెదవా? "

"దొరా, నాకు పనివున్నది...."

"పని యట పని....దీని కన్ననూ వేరే పనియా?...."

అతడు ఒఱనుండి ఖడ్గమును సరాలున లాగినాడు.

"మాఫ్ చెయ్యండి దొరా ! ఇదిగో వచ్చుచున్నాను. ఈ భారాన్ని నా నెత్తిన పెట్టండి !"

వారు చెఱకుల మోపును దేవరాయల తలమీద నుంచినారు.దానిని మోసుకొని అతడు కూలివాని వలె వారివెంట నడచినాడు. మార్గ మధ్యమందే వారిని ఖాన్‌ఖాన్ కలుసుకొనినాడు. సైనికులు తాము వచ్చిన పనిని మరచి చెఱకుల మోపును మోయించుకొని వచ్చుచుండుటనుచూచి, అత డుగ్రుడైనాడు.

"బేవకూఫ్ ! నేను మీకు చెప్పినపని యేమి? మీరు చేయుచున్న పని ఏమి ?"

సైనికులు గజగజ వణకినారు.

"ఎవరు వీడు ?" చెఱకుల మోపును ఎత్తుకొన్న దేవరాయలను చూచినాడు.

"నేను దొరా !"

"వీడు మీకెక్కడ చిక్కినాడు ?"

"తోటలో పనిచేస్తూ వుంటిని దొరా ! వీరు పిల్చుకొని వచ్చినారు...."

"ఈ వైపు ఎవరైననూ పెద్దమనుషులు వచ్చినారా ?"

"ఎవరునూ రాలేదు దొరా !"

ఖాన్ ఖానుడు అతని మాటలను విని, అతని ముఖమును క్షణకాలము పరీక్షగా చూచి, తన సైనికులవైపు తిరిగి,

"బేవకూఫ్ ! ఇతని నెందుకు పిల్చుకొని వచ్చినారు ?" అని ఒర నుండి ఖడ్గమును లాగినాడు.

"సాహేబ్ — మాఫ్ చేయవలయును !" అని వారు అతని కాళ్ళమీద పడినారు.

"ఈరోజు మనకు యుద్ధములో జయము లభించినదని మిమ్మూరక వదలినాను. లేనిచో సైతాను లోకమునకు పంపించి యుందును !" అని దేవరాయలను చురచుర చూసినాడు. అతడు చెఱకుల మోపును అచ్చటనే పారవేసి, పరుగు తీసినాడు. విజయనగరమును చేరునంత వరకునూ అతడా పరుగును నిలుపలేదు.

దేవరాయల అదృష్టము బాగుండుటచే అతడు శత్రువుల చేతి నుండి చాతుర్యముగా తప్పించుకొని వచ్చినాడు. అతడు తప్పించుకొని వచ్చినందులకు విజయనగర వాసుల కత్యంత సంతోషమైననూ, దేవరాయలకు మాత్రము సంతోషము కలుగలేదు. అతడు శత్రువులచే ఓటమి నంది, తన శిబిరపు సమస్త వస్తువులను మాత్రమేగాక, తన విశ్వాస పాత్రులైన దండనాయకులనూ, తన యిద్దరు కుమారులనూ శత్రువుల పాలుజేసి, ప్రాణభీతితో తాను మాత్రము తప్పించుకొని వచ్చినాడు. ఇది అతనికి చాలా వ్యధను కలిగించినది. కాని, ఆ పరిస్థితిలో అతడంత కంటెనూ ఉచితమైన రీతిని ప్రవర్తించలేక పోయినాడు. తనకు సంభవించిన దుస్థితికై అతడు లోలోపలనే కుమిలిపోయినాడు !

# ఆత్మబలి

## 14

ఇప్పుడు దేవరాయల ముందు ఒక సమస్య తీవ్రరూపము దాల్చి నిలబడినది. విశ్వాసపాత్రుడైన నాగన్న దండనాయకుడు, ఈరన్న, వీరన మొదలగు ప్రభునిష్ఠా గరిష్ఠులు, తనప్రియ పుత్రులైన రామ చంద్ర, మల్లన ప్రభువులూ శత్రువులకు ఖైదీలుగా పట్టుబడినారు. వీరిని విడుదల చేయుటెట్లు ? అనునది అతనికొక పెద్ద సమస్యయైనది. తను ఓటమి నందినందుకై దేవరాయలకు వ్యధ కలుగలేదు. జయాపజయ ములు దైవాధీనములని అతనికి తెలియును. శిబిరములను శత్రువుల కప్ప గించినందుల కతనికి దుఃఖము కలుగలేదు. కాని,తన ప్రియతమ నాయకు లను, పుత్రులను శత్రువుల వశమొనర్చి రావలసివచ్చినందుకు అత్యంత ఖేదమైనది. ఇప్పుడు వారిప్రాణములు గండాంతరములలో నున్నవి. ఏమి చేసినచో శత్రువుల చేతినుండి వారిని తప్పించుటకు వీలగు ననునది అత నికి తెలియలేదు. అతడీ చింతలో నుండగా లక్ష్మీధరా మాత్యుడు అచ్చ టికి వచ్చినాడు.

లక్ష్మీధరుడు దేవరాయల అభిమానమునకు పాత్రుడైన అమాత్య వరుడు. దేవరాయల బాల్యమిత్రుడు. వారిరువురూ కలసి, మెలసి, ఆడు కొనుచూ పెరిగినవారు. ఇద్దరూకలసి యుద్ధ విద్యలను నేర్చుకొనినారు. ఇప్పుడు వారు విజయనగర సామ్రాజ్య రథమునకు సారధులైనారు. లక్ష్మీధరుడు దేవరాయల అభిమానమువలన గాక, తన స్వశక్తితో అమాత్య పదవి నలంకరించినాడు. ఇతడు నాగన్న దండనాయకుని అభి మాన పుత్రుడై, యుద్ధము నందును, రాజ్యపాలనము నందును అతనికి కుడిభుజమువలె నుండసాగినాడు. అంతఃపురము లోను, గురు గృహ మందును, అన్నిచోట్లను అతనికి విశేషమైన గౌరవము కలదు.

అతడు విజయనగరమును స్థాపించిన పూజ్యవిద్యారణ్య మాసీం దుల సహోదరుడైన సాయణాచార్యుల కుమార్తె కుమారుడు. అతని తల్లి సింగల కూడా తండ్రివలెనే పండితురాలు. ఆమె సోదరుడూ, లక్ష్మీ ధరుని మేనమామయూ యగు మాధవుడు రచించిన 'పంచదశి' యను గ్రంథమునకు గురు గృహములో గౌరవమున్నది. సాయణాచార్యులు తన సోదరుడైన విద్యారణ్యుల వలె తానుకూడా బుక్కరాయల వద్ద మంత్రిగా నుండెను. ఈ విధముగా పెద్దల ఆనువంశిక శక్తి సామర్థ్య ములకు తోడు, లక్ష్మీధరుడు పాండిత్యము కూడా గడించి, అందరి చేతనూ గౌరవింప బడినాడు. అతనికి లక్ష్మణ, లక్ష్మీపతి యను నామధే యము లున్ననూ, లక్ష్మీధరామాత్య లనియే అందరునూ ప్రీతి, గౌర వములతో నతనిని పిలిచెడివారు.

లక్ష్మీధరా మాత్యులు వచ్చినప్పుడు దేవరాయలు హంసతూలికా తల్పమునందు చింతాక్రాంతుడై కూర్చొని యున్నాడు. లక్ష్మీధరుడు వచ్చినది కూడా అతడు గమనించలేదు. ఇదిచూసి అమాత్యుడే పలుక రించినాడు :

"ప్రభూ! నావలన తమ ఏకాంతమునకు భంగము వాటిల్లియుండిన క్షమించ ప్రార్థితును. సుఖ దుఃఖములను పదుగురతో పంచుకొనిన హృదయము తేలిక పడగలదని పెద్దల వాక్కు! తమరు చింతాక్రాంతులై యుండుటను జూచి, నెమ్మదిగా నుండుటకు మావలన సాధ్యముకాలేదు. మీచింత నెరిగించిన, దానికొక పరిహార మార్గమును వెదకుటకు ప్రయ త్నించెదము...."

"నా చింత ఏమియో మీకు తెలిసియే యున్నది అమాత్యులూ! కాని ఆ విషయమై ఏమియునూ చేయలేని స్థితిలో నున్నాము, మనము! ఇదియే నా చింతకు కారణము!"

"తమరు శత్రువులకు ఖైదీలుగా పట్టుబడిన దండనాయకులను, కుమారులను గురించి ఆలోచించుచున్నారు. కాని, ఈ సమస్య కేవలము చింతించుటచే పరిష్కృతము కాగలదా ? ఏదైననూ తప్పించుకొను మార్గమును వెతుక వలదా? ప్రస్తుతము ప్రతి ఘడియయూ మిక్కిలి యమూల్యమైనది. మనము కాలమును వ్యర్థముగా గడిపిన నెట్లు ?"

"ఏమి చేయగలను అమాత్యులూ! నాకేమియునూ తోచుటలేదు!"

"ప్రభూ, కార్యోన్ముఖులు కావలసిన సమయంలో చింతించుచూ కూర్చొనరాదు. ధైర్యముతో ముందడుగు వేయవలయును!"

"ఇప్పుడు నేను అంధకార సాగరములో మునిగి యున్నాను! తప్పించుకొను మార్గమేదియునూ గోచరించుటలేదు! ఇక నావంటి వానిచే యితరుల తమస్సు ఎట్లు విడివడగలదు?"

"మన మిప్పుడు ఈ గాఢ తమస్సునుండి బయటపడు మార్గమన్వేషించ వలయును! ప్రస్తుత పరిస్థితిలో శత్రువులతో సంధి తప్ప,మనకు వేరు దారిలేదు!"

"ఏమీ? శత్రువులతో సంధి ప్రయత్నమా? క్రిందట మనము వ్రాసిపంపిన లేఖకు సమాధాన మిచ్చుసంతటి సౌజన్యము చూపని,మదోన్మత్తు డగు సుల్తానుతో, విజయోన్మత్తుడై యుండగా సంధిని కోరుటయా? మనము సంధికై ప్రయత్నించిన,ఇప్పుడు జరిగినదాని కంటెనూ ఎక్కువ పరాభవము జరుగ గలదు! ఓటమి నందిననూ యిప్పుడు మర్యాదను కాపాడుకొనినారము! సంధి చేసుకొనిన దానిని పోగొట్టుకొని, అవమానితులము కాగలము! ఈ మాట సత్యము!"

"ప్రభూ! మీరు హతాశులు కానక్కరలేదు. తగు సంధితో సాధించరాని అసాధ్య రాచకార్య మేదియునూ లేదు! బహమనీ సుల్తానులతో యిదివరకుకూడా మనము మిత్రులుగనే నుండినాము. కాని,పార్వతీ ప్రకరణము మన లెక్కకు మీరి ఈ రణమారిని ఆహ్వానించినది. మనమీ యుద్ధముతో ఇక దీనికి స్వస్తివాచకము వలుకవలె ననిన, ఖైదీగా పట్టుబడిన మల్లన్నను విడచిపుచ్చి, సుల్తాను కోరిన పరిహార ద్రవ్యము నిచ్చుటకు సమ్మతించిన, అప్పుడతడు మనతో గౌరవ యుతమైన ఒప్పందము చేసుకొన గలడు. ఇంతకంటెనూ ఎక్కువ అవమాన కరమగు షరతులను మనము ఒప్పుకొనవలసి యుండునని నేను భావించను. ఇప్పుడు తొందరపడి మరల మనము యుద్ధమార్గ మవలంబించిన, శత్రువుల బంధనములో నున్న మనవారు ఖండితముగ గండముల పాలు కాగలరు. వారిని సురక్షితముగ మరల పొందదలచిన సంధియొక్కటే మనకు మిగిలిన మార్గము!"

"అవమానకరమైన సంధి కొడంబడుట కన్ననూ మరణించుట మేలు !"

"నిజమే ప్రభూ ! స్వాభిమానియైన వానికి అవమానమున కంటెను చావే సుగమరము. కాని, ప్రస్తుత పరిస్థితి అటువంటిది కాదనునదితమష మరువరాదు ! ఇప్పుడు మనము తొందరపడిన, ఎందరి ప్రాణహాని, మానహాని జరుగగలదో తెలియునా ! రాష్ట్ర సంపదయైన ప్రభుసేవా పరాయణుల ప్రాణముల కంటెనూ, మన మానావమానములు గొప్ప వియా ? సామ్రాజ్యసేవలో తమనే నమ్మి కొల్చిన స్వామిభక్తులనూ, ప్రజల అభిమాన పుత్రులైన రాజకుమారులనూ, మన వైయక్తికపు గౌరవమునకు, గొప్పతనమునకునై బలిగావించుటయా ? మహత్తుకొరకై బృహత్తును మనము త్యాగము చేయవలసి యున్నది ! అల్పావమానము నకు మనము చింతించిన, చెఱయందున్న మన నాయకులను, రాజకుమారు లను విడిపించుటకు సాధ్యము కానేరదు !"

"అయినచో, దీనికి సంధి యొక్కటే మార్గమనుచున్నారా ?"

"ఔను, ప్రభూ ! ఇప్పుడు విజయులైన సుల్తానుతో సంధి చేసు కొనినమాత్రముననే మనము బ్రదుక సాధ్యము! లేనిచో సర్వనాశనము సిద్ధము !"

"వలసినచో శత్రువులకు మన బొక్కసము నంతయూ అర్పిం చుటకు సిద్ధముగా నున్నాను. కాని, సామ్రాజ్యమునకు అవమానము కలుగునట్టియూ, సింహాసనపు ఘనత; గౌరవములకు అపచారము కలుగు నట్టియూ ఏ షరతులకు గాని—ఒప్పుకొనుటకు నేను సిద్ధపడను—అమా త్యులూ !"

లక్ష్మీధరుడు మౌనముగా కూర్చున్నాడు. ఏమియునూ మాటాడ లేదు.

మరల దేవరాయలే అనినాడు :

"వైయుక్తికముగా నే నే మహాత్యాగమున కైననూ సిద్ధముగా నున్నాను అమాత్యులూ ! కాని, రాష్ట్రగౌరవమున కవమానము కలుగు నంతటి ఏ కార్యమునకూ నేను సమ్మతించను. శత్రువులతో యీవిధ మైన సంధి సాధించుసట్టుయున మాత్రమే నేసందుకు సమ్మతించగలను"

"ప్రభూ ! రాష్ట్ర గౌరవమునకు భంగము కలుగునంతటి ఏ షర తునకూ అవకాశ మివ్వక, శత్రువులతో సంధిచేసుకొనుటకు వీలుగలదు. మీరు దీనికై చింతించ పనిలేదు ! ఆ భారము మీరు నా కప్పగించుడు ! నా శక్తి కొలదిని, అంతటి గౌరవయుతమైన సంధిచేసుకొనుటకు ప్రయ త్నించగలను. ఆపైన పంపాపతి యిచ్ఛ !"

—అని చెప్పి, లక్ష్మీధరుడు అప్పుడే సంధి ప్రయత్నమునకై శత్రుశిబిరమునకు ప్రయాణించినాడు. ఈ రాయబార మేమికాగలదోనని దేవరాయలు కూడా ఆతృతను కనబరచసాగినారు.

లక్ష్మీధరుడు విజయనగరపువెలుపలిప్రదేశమునందుదండు విడిసి యున్న ఫిరోజ్‌షా శిబిరములో, అతనిని సందర్శించినాడు. కుశలప్రశ్నలు ముగిసిన తర్వాత లక్ష్మీధరుడునేరుగా విషయప్రస్తావమునకు వచ్చినాడు.

"సుల్తానుల అమూల్య సమయమును వ్యర్థపుచ్చి యుండిన క్షమించ ప్రార్థితుడను ! సామ్రాట్ దేవరాయల వదనుండి నేను సంధి గోరి వచ్చియున్నాను !"

"మీ సామ్రాట్టు లింత త్వరలో సంధానాపేక్షు లైనారా ? ఆశ్చ ర్యము !" ఫిరోజ్‌షా ఆశ్చర్యమును ప్రకటించినాడు.

"సుల్తానులు సర్వమూ నెరిగిన ప్రాజ్ఞులు ! ప్రస్తుత పరిస్థితిలో సంధి వలన మన ఉభయ రాష్ట్రములకు మేలు కలుగగలదని సామ్రా ట్టులు అభిప్రాయపడి యున్నారు !"

"మీరు సంధి నపేక్షించుచున్న, మేమునూ అందుకు సిద్ధముగా నున్నాము. మాకు నూ యుద్ధ మక్కరలేదు. కాని, మీ సామ్రాట్టుల అవి వేక వర్తనమునకు మేమేమి చేయగలము ? ముద్గలుమీద వారు దురా క్రమణ చేయనిచో, మేము విజయనగరము మీద యుద్ధమునకు వచ్చెడి ప్రమేయమేలేదు !"

"సుల్తానులు మామీద యుద్ధారోపణ చేయుచున్నట్టు తెలియు చున్నది. కాని, మేమునూ యుద్ధము కావలయునని ఏనాడూ కోరుకొనలేదు. పూర్వపు షరతులను పాలించుచునే వచ్చినాము. కాని, ముద్గల్లులో జరిగిన ఒకచిన్న విషయమును పెద్దదిచేసి, తమరు మామీద క్షుబ్ధులైనారు.

మా సైనికులు తెలియక చేసిన తప్పును మీరు దురాక్రమణ మనినారు! ఎట్లయిననూకానిమ్ము.తప్పు నంగీకరించి. మేము తగిన పరిహారద్రవ్యము నిచ్చుటకు సమ్మతించినాము! ఇప్పుడు సైతము అందుకు సిద్ధముగానే యున్నాము. కాని దీనికై యుద్ధము ఘోషించ వలసిన ప్రమేయము గలదా?"

"మీరు న్యాయ మార్గమున వచ్చియుండిన మీ సంధికి మేము సమ్మతించెడి వారము! కాని, మీ సామ్రాట్టులు సంధి నెపముతో మమ్ము లను మోసగించ ప్రయత్నించినారు!"

"సామ్రాట్టులకు మిమ్ములను వంచించ వలయునను ఏ దురుద్దేశ మును లేదు."

"లేనిచో, మా ఆశ్రయములోనున్న పార్వతిని - మా రాజ్యపు వ్యక్తిని తమ వద్దకు తీసుకొని రావలసినదని తిమ్మోజీ నెందుకు మోస ముతో పంపినారు?"

"ఇందులో నే మోసమునూలేదు. తిమ్మోజీయే పార్వతి దుడుకు ప్రవర్తనకు పశ్చాత్తాపపడి. ఆమెచే ప్రభువులవద్ద క్షమ నర్థింపజేసి, ఆమెను మల్లన్నకిచ్చి వివాహము చేయగోరి, పార్వతిని పిలుచుకొని వెళ్లుటకై వచ్చినాడు! ఇందులో మా సామ్రాట్టులకు ఆనాడునూ, ఈనాడును ఏ దురుద్దేశమూలేదు."

"మీ ప్రభువులు సదుద్దేశ ప్రేరితులే యైనచో, వారు ఖైదీలను ఆనాడే విడిచిపెట్టవలసినది, మేము కోరిన పరిహార ద్రవ్యమునువెంటనే చెల్లించి యుండవలసినది. కాని, ఉల్లంఘించక. మా వద్దనున్న, మా రాజ్యపు వ్యక్తిని మోసముతో అపహరింప ప్రయత్నించినారు. ఈ కార్యసాధనమునకై సంధి రాయబార మను నాటకము నాడినారు."

"ఖామందులు పూర్వము జరిగినదంతయూ మరచిపోవలయును. రాష్ట్రమునకూ-రాష్ట్రమునకూ మధ్య విరోధాభిప్రాయముల కవకాశ మిచ్చునంతటి చేదు విషయము లనేకము లుద్భవించు చుండుట సహ జము. వాటిని పెద్దవి చేసుకొని. చాలాకాలము నుండియూ వున్న స్నేహ బాంధవ్యమును బలియిచ్చుటయా? వైయక్తిక ప్రతిష్ఠల కంటెనూ,రాష్ట్ర స్నేహసౌహార్ద్రతలు ముఖ్యమనునది తమకు తెలియనిది కాదు. ఇప్పుడు

సైతము మేము తమ క్రిందటి షరతులను ఒప్పుకొనుటకు సిద్ధముగా నున్నాము. ఇందులో ఏ దురుద్దేశమును లేదనునది మీరు యిప్పుడైననూ గ్రహించ వలయునని మా ప్రార్థన...."

"మేమీ అల్పషరతుల కొరకై యుద్ధమును ఘోషించలేదు." అని ఫిరోజ్‌షా నవ్వినాడు.

"ఖామందులు తమ హృదయ కోర్కెను తెలిపిన, దానిని నెర వేర్చుటకు ప్రయత్నించ గలము!"

"మీవద్ద దాపరికము లేక మాట్లాడుచున్నాను, రాయబారులూ! మీరు మమ్ములను మిత్రులవలెనే గౌరవించినారు. వట్టిచేతులతో మిత్రులను వెనుకకు పంపుట నాకిష్టములేదు. కనుక నేను మీ సంధికి సమ్మతించుటకు సిద్ధముగా నున్నాను!"

"ఖామందులవారు షరతులను అనుజ్ఞ యిచ్చిన, వాటిని కార్యగత మొనరించుటకు విలంబనము జరుగదు...."

"ఎక్కువ షరతులేమియునూ విధించుటలేదు, అన్నియునూ క్రిందట తెలిపినవియే! కాని, ఈసారి యుద్ధ వెచ్చములకై - మరి పది లక్షల వరహాలను హెచ్చుగా యివ్వవలసి యుండును! యుద్ధములో లభించిన సంపద అంతయునూ మాకే చెందగలదు! కాని, యుద్ధఖైదీల నందరినీ విడుదల చేయగలము! మరిరెండు క్రొత్త షరతు లేవనగా, మీ సామ్రాట్టులు మాతో నిజమైన స్నేహసౌహార్ద్రతల నపేక్షించుచున్నందుకు గుర్తుగా, వారు నాకు తమ కుమార్తెనిచ్చి వివాహము చేయవలయును. ఆ మూలముగా ఉభయరాజ బంధువర్గములకు, రాజ్యములకు చిరంతనమైన స్నేహ బాంధవ్యమునకు భద్రమైన పునాదిని వేయవలయును. ఈ షరతులకు మీ సామ్రాట్టు ఒప్పుకొను నట్టయిన, నేను యిప్పుడు సైతము మీతో సంధి చేసుకొనుటకు సిద్ధముగా నున్నాను— దీనిని పురస్కరించుటయో, తిరస్కరించుటయో అది మీ ప్రభువులకే వదలిపెట్టుచున్నాను.........!" కొంతసేపు మౌనముదాల్చి మరల అన్నాడు: "వీటియందు ఏయొక్క షరతులకు సమ్మతించక పోయిననూ యీసంధి విఫలమైనట్లేనని గ్రహింపుడు! ముందుకు...."

తర్వాత సుల్తాను వాక్యమును పూర్తి చేయలేదు. లక్ష్మీధరుడుకూడా అడుగలేదు. కాని వారిరువురికిని ఆ విషయమేదియో బాగుగా తెలియును. అది యుద్ధము.

సుల్తాను తన షరతులను కార్యగత మొనర్చుటకు మూడురోజుల వ్యవధి నిచ్చినాడు. అంతవరకును యుద్ధము నాపుటకు సమ్మతించినాడు. సంధి విఫలమైనచో ముందటి కార్యాచరణకు పూనుకొనునట్లు స్పష్టముగా చెప్పినాడు.

లక్ష్మీధరుడు విజయనగరమునకు వెనుదిరిగి దేవరాయలను సందర్శించుటకయి అంతఃపురమునకు వచ్చినాడు. కాని దేవరాయలు కుమార్తె హేమాంబికతో మాటలాడుచూ యుండుటను చూచి, అట్లే వెనుకకు మరలుటకు ప్రయత్నించు చున్నంతలో దేవరాయలు గమనించి—

"అమాత్యులూ, యితరులెవరును లేరు. మా హేమాంబ....రండి కూర్చొనుడు...." అని తానే లక్ష్మీధరునికి స్వాగతము పలికి, కూర్చొనుటకు ఆసనము చూపి—"వెళ్ళిన కార్యము అయినదా అమాత్యులూ?" అని ప్రశ్నించినాడు.

హేమాంబిక సముఖములో ఈ విషయమును తెలుపుటెట్లని లక్ష్మీధరుడు సంకోచపడి కూర్చొనుటను జూచి, దేవరాయలే అన్నాడు— "హేమాంబ ఎదుట రాయబార విషయమును వివరించుటకు సంకోచపడ వలసిన పనిలేదు. ఆమెకూడా తన అన్నగార్ల క్షేమ సమాచారములు తెలుసుకొనుటకై నావలెనే చాల ఆతురత జెందుచున్నది. జరిగిన విషయములను సంకోచపడక తెల్పుడు" అన్నాడు.

"రాజకుమారులూ, దండనాయకులూ క్షేమముగా నున్నారు ప్రభూ!"

"సుల్తాను వారిని విడుదల చేయుటకు సమ్మతించినాడా?"

"సమ్మతించినాడు ప్రభూ! కాని కొన్ని షరతులను విధించినాడు"

"ఆ షరతులేవి?"

"చెప్పుటకు చాలా సంకోచమగుచున్నది ప్రభూ!"

"అంతటి అవమానకరములైన షరతులా?"

"ఔను ప్రభూ !"

"విషయములేవియో వివరముగా తెలుపుడు...."

"అవి తమ ఘనత—గౌరవములకు లోటు కలిగించునంతటి షరతులు ప్రభూ !"

"సామ్రాజ్య క్షేమమునకునూ, సింహాసన గౌరవము దక్కించుకొనుటకును నే నే త్యాగమునకయినను సిద్ధముగా నన్నాను అమాత్యులూ ! ఆ షరతు లేవియో మీరు నిస్సంకోచముగా చెప్పుడు...."

"ప్రభూ ! తమ రీ మాటను ఏ ఘడియలో సెలవిచ్చినారో — పంపాపతి మిమ్ములను అగ్నిపరీక్షకు గురిచేసినాడు."

"అనిన....?"

"తమ కుమార్తెను ఆ మ్లేచ్ఛుడు కోరినాడు ప్రభూ."

"ఏమీ? పవిత్రమైన సంగమ వంశములో పుట్టిన హేమాంబికను కోరునంతటి గర్వము వచ్చినదా అతనికి ?" కోపముతో కస్సుమనినాడు దేవరాయలు.

"హిందూ—ముస్లిముల నిజమైన మైత్రికిని, ఉభయ రాష్ట్రముల మధుర బాంధవ్యమునకునై, సుల్తాను ఈ వివాహము జరుగవలయునని అపేక్షించినాడు ! ఉభయ రాజబంధు వర్గములకును నిజమైన స్నేహ సౌహార్ద్రితలు చిరకాలము వుండుటకుగా ఈ వివాహమునకు సమ్మతించవలయునని అన్నాడు"

ఈ మాటలతో దేవరాయలు ముఖము జేవురింప జేసుకొని గర్జించినాడు.

"ఆ మదోన్మత్త సుల్తానుడు ఈ మాటను నాకు చెప్పి పంపినాడా? అతనికెంత అహంకారము ? తా నెవరితో వ్యవహరించుచున్నాడను విషయ మా నీచుడు విజయోన్మాదములో మరచినట్టున్నాడు. దేవరాయలు బ్రతికియుండగా ఈ పని సాధ్యముకాదు. ఈ శరీరములో ఒక్కబొట్టు రక్తమున్నంతవరకూ ఆ నీచుని దురాలోచనము నెరవేరదు. అతడు నన్నేమని భావించినాడో? యుద్ధములో పరాజయమందినంత మాత్రమున పిరికిపంద ననుకొన్నాడా? అభిమాన శూన్యుడని భావించినాడా?.... దేవరాయ

లెప్పటికినీ పిరికిపందకాడు. ఇటువంటి సుల్తానులు వందమంది వచ్చి నను ఏకాకిగా నిలబడి పోరాడుటకు భీతిల్లువాడు కాదు. అతడెప్పుడూ ప్రాణముమీది తీపిచే పవిత్రమైన సంగమ వంశమునకు మసిపూయు నట్టి పనిని చేయడు. ఈ శరీరము నశించినను సరియే. కులమునకు కళంకపు మసిని పూయలేను. ఈ మాటను మీరు ఆమ్లేచ్ఛునికి అచ్చటనే చెప్పియుండ వలసినది."

"ప్రభూ, ఆ సుల్తాను మాటలను విని అతని నాలుకను అచ్చటనే రెండుగా కోసివేయ వలయునను నంత కోపము వచ్చినది. కాని నేను రాయబారిగా వెళ్ళియుండుట వలన తొందరపడరాదని నాలుక కరచు కొనినాను"

"అమాత్యులూ, ఈ విధముగా కాగలదని నాకు ముందే తెలియును. అందువలననే ఆ నీచునితో సంధి ప్రయత్నములు వద్దని చెప్పినాను. కాని మీరు వినలేము" అసమాధానముగా అన్నాడు దేవరాయలు.

"సుల్తాను జయించినంత మాత్రమున యింత దురాలోచన చేయ గలడని నేను నిజముగా అనుకొనలేదు. కాని గోతిలో పడినామని మన మీద రాళ్ళు రువ్వుటకు మారు, మంటపమునే కూలద్రోసినాడు."

"ఈ మంటపముయొక్క రాళ్ళతోనే అతని గోరీని నిర్మించనిచో నేను దేవరాయలను కాను. కానిమ్ము విజయనగర రాజుల శక్తి ఎంత టిదో తెలియజేయుదును. ఆ రోజుకూడా నెంతయో దూరమున లేదు"

"అంతదనుక ఆ ద్రోహి చెరసాలలోనున్న రాజపుత్రులు, దండ నాయకులు బ్రతికియుండ వలదా ప్రభూ। మనము యిప్పుడే ఈ విషయమై ఏదియో యొక నిర్ణయమునకు రావలసి యున్నది. దీనికి మూడు రోజుల గడువు ఎట్లును మనకున్నదిగదా। ఇప్పుడు మనము చేయు నిర్ణయముమీదనే సామ్రాజ్యముయొక్క భవిష్యత్తు ఆధారపడి యున్నది. దాని మనుగడ—పతనము నిలచి యున్నవనినను అతిశయోక్తి కానేరదు."

"కానిమ్ము. ఈ విషయ మాలోచించి నా తుది నిర్ణయమును

తెలుపగలను" అని చెప్పి లక్ష్మీధరుని పంపివేసినాడు దేవరాయలు. అతడు భారమైన హృదయముతో అచ్చటినుండి వెళ్ళిపోయినాడు.

మూడురోజులు గడువు.

ఈ గడువులోగా నిర్ణయించవలసినది : యుద్ధము లేక శాంతి. ఈ నిర్ణయము మీద సామ్రాజ్యపు భవిష్యత్తు ఆధారపడి యున్నది. లక్ష్మీధరులు చెప్పినట్టు సామ్రాజ్యపు మనుగడ — పతనము ఈ ఒక్క నిర్ణయము మీదనే యున్నది. ఎందుకన, విజేతయైన సుల్తాను విజయనగరపు వెలుపలి ప్రాంతమందే విడసి యున్నాడు. విజయనగరసైన్యము వోటమినంది శక్తి సామర్థ్యములను కోల్పోయి యున్నది. రావలసిన సాయము యింకను రాలేదు. రాజకుమార వీర విజయదేవుడింకను మాండలీకుల సైన్యములతో వచ్చి చేరలేదు. అతడు సాయమునకు రానిదే యుద్ధము సాగనిచ్చిన విజయనగరము శత్రువుల వశమగుట తథ్యము. ఒక మారది శత్రువుల వశమైనచో యిక దాని స్వాతంత్ర్యపుఅస్తిత్వము నకే ముగింపు కలిగిన దనవచ్చును. దాని ఉజ్జ్వలేతిహాసమునకు భరత వాక్యము పలికి రనవచ్చును.

దేవరాయలు యిప్పుడు చేబూను నిర్ణయముమీద ఈ విధమైన పరిణామము లేర్పడగలవు ! వీటికి తోడుగా సామ్రాజ్యమునకు మహత్తరమైన సేవ చేసిన నాగన్న మొదలగు దండనాయకుల క్రూరహత్య జరుగ గలదు. సంగమ వంశమునకు అంకురములవలెనున్న రాజపుత్రిల యపహరణము జరుగగలదు. రాజపుత్రిలను కాపాడవలెనన్న రాజపుత్రిక బలిదాన మావశ్యకమైనది. కాని తాను ప్రేమగా చిలుకవలె సాకిన రాజకుమారి హేమాంబికను దేగ పాలు చేయుటయా ? ఈ కార్యము దేవరాయలవలన సాధ్యము కాలేదు. ఈ విషయమై ఏ నిర్ణయము చేబూన వలెనన్నను, హేమాంబికయే చేబూన వలసియున్నది. ఆమె తనను తాను బలిగావించుకొనుటకు సంసిద్ధురాలైన మాత్రమున ప్రస్తుత పరిస్థితినుండి సామ్రాజ్యమును తప్పింపవచ్చును. ఆమె ఈ విషయమై కూలంకషముగా ఆలోచించి చివరికొక నిర్ణయమునకువచ్చి, తండ్రిని - దేవరాయలను—కలసికొనినది.

హేమాంబిక సామ్రాట్ దేవరాయల చిన్నకుమార్తె. కనుకనే ఆమె యనిన అతని కంతప్రేమ. అతని కిద్దరే కుమార్తెలు. వారిలో పెద్దది యగు కమలాంబికను దేవరసు అను మాండలీకుని కొసగి వివాహము చేసినాడు. హేమాంబిక యిప్పుడే యౌవనాంగణములో అడుగిడిన కన్య. ఆమె కింకను యిరువది సంవత్సరములుకూడా నిండలేదు. అయినను సుఖముగా పెరిగిన ఆమె నిండు జవ్వనియైనది. ఆమె సౌందర్య కీర్తిని విని అనేకమంది రాజపుత్రు లామెను చేబట్టుటకు ముందుకువచ్చినారు. కాని కుమార్తెను తగిన వరునికిచ్చి వివాహము చేయవలయునని, దేవరాయలు ఆమె పెండ్లికి అంతగా తొందరపడిలేదు. సుల్తాను హేమాంబిక సౌందర్యమును విని యుండుటవలన ఆమెను చేపట్టవలయునను ఆశ అతని హృదయాంతరాళములో పొడగట్టసాగినది. కాని అది ఫలించెడి కోర్కె కాదని అతడు దానినంతటితోనే అణచుకొనినాడు. తలవని తలంపుగా ఆ కోర్కెను నెరవేర్చుకొను సదవకాశ మిప్పుడు లభించినది. దానిని జారవిడుచుకొనుట కతడు యిష్టపడలేదు. అందుకనియే దానిని తన సంధి షరతులలో ఒకటిగా చేర్చినాడు. ఆమెను చేబట్టుట ద్వారా దేవరాయల వంశ గౌరవమును భంగపరచు టతని వేరొక యాశ!

హేమాంబిక లక్ష్మీధరామాత్యులు చెప్పిన మాటలనన్నింటినీ చెవులారా విన్నది. తండ్రి తన మీదగల అభిమానముతో తనను సుల్తానుకు ధారబోయుటకు సమ్మతించుట లేదని కూడా గ్రహించినది. కాని ఇప్పుడీ షరతు నెరవేర్చనిచో, సుల్తాను ఖైదులోనుంచిన తన సహోదరులను, ప్రియతమ దండనాయకులను హత్యచేయు సందర్భమేర్పడగలదు. అంతకంటెను హెచ్చైన గండం విజయనగర సామ్రాజ్యమునకు సంభవించగలదు. అది విజయోన్మత్తులైన మ్లేచ్ఛ సైన్యములకు వశమగు సందర్భము వచ్చినది, ఒకసారి అది శత్రుహస్తగతమైనచో, తన స్వాతంత్ర్యమును పోగొట్టుకొని బహమనీ రాజ్యములో చేరిపోవునంతటి పరిస్థితి యేర్పడగలదు. లేదా ఇతిహాసమునుండి పూర్తిగా మరుగు పడిపోవునంతటి సంఘటన సంభవింపవచ్చును. దానిని తప్పించు సమర్థతగల వ్యక్తి యిప్పుడు తా నొక్కతె మాత్రమే. భగవంతుడు ఈ మహత్కార్యమును

సాధించుటకొరకే తనను పుట్టించి యుండవచ్చునని ఆమె యనుకొనినది. దేశమునకయి ఆమె తనను తా నర్పించుకొనుటకు సంసిద్ధురాలై తండ్రిని సమీపించినది.

"అప్పాజీ, నా దొక కోర్కెగలదు. నెరవేర్చగలరా ?"

ఎచ్చటనుండియో వచ్చిన వీణాగానమువంటి మంజుల రవమును విని, తన భావసమాధినుండి మేల్కొని దేవరాయలు మందస్మితుడై, కుమార్తె నవలోకించినాడు.

"అప్పాజీ, నాదొక కోర్కెగలదు నెరవేర్చగలరా?" హేమాంబిక మరల అనినది.

"ఏమికోర్కె తల్లీ?"

"మీరు నెరవేర్చుదునని ముందు మాట యివ్వవలయును"

"కానిమ్ము తల్లీ"

"మీమాట నిజమా?"

"నా మాటమీద నీకు సందేహమా తల్లీ?"

"సందేహములేదు అప్పాజీ. కాని అడిగినతర్వాత మీరు కాదన రాదు."

"అటే కానిమ్ము, చెప్పుతల్లీ."

"అప్పాజీ, నేను అమాత్యులు చెప్పిన మాటలన్నీ చెవులారా విన్నాను. ఈ విషయము లన్నియును విన్న తర్వాత భగవంతుడు నన్నేదో మహత్కార్య సాధనకయి సృష్టించినట్టనిపించినది. ఈ విషయిమై కూలంకషముగా ఆలోచించి నే నొక నిర్ణయమునకు వచ్చినాను. నా మాటను మీరు నెరవేర్చగలరా ?"

"అదేమి విషయమో చెప్పుము తల్లీ ! .... ఈ దేశకోశములు పాడైపోయిననూ సరియే. నీ సుకుమార జీవితమును మట్టిపాలు చేయ లేను. మన వంశపు సత్కీర్తికి మసిపూయు నంతటి ఏ హేయకృత్యము

నకును పూనుకొనలేను తల్లీ. నీవు భీతిల్లక, చెప్పదలచు కొన్నది చెప్పుము...."

"అప్పాజీ, మీకు నే నెక్కువయా? లేక మిమ్ములను నమ్మిన ప్రజలెక్కువయా? మీరు అధి వసించియున్న సింహాసన మెక్కువయా? దాని ఘనత గౌరవము లెక్కువయా? నిష్ఠాగరిష్ఠులైన రాజసేవకు లెక్కువయా? నా సోదరులు ఎక్కువయా ? తమకు ఎవరు ఎక్కువ? ఏది ఎక్కువ? చెప్పుడు."

"ఎంతటి విచిత్ర ప్రశ్నలు తల్లి ? నాకు మీరందరునూ కావల యును. నా ప్రాణాధి దేవతలు మీరేకాదా!"

"అయిన, నాకొరకయి. నా ఒక్కతె కొరకయి, సామ్రాజ్యపు క్షేమచింతనను మరువగలరా ?"

"ఏ క్షేమచింతననూ నేను మరువలేనమ్మా."

"ఒకవేళ నన్నో లేక సామ్రాజ్య క్షేమమునో ఈ రెంట నేదో ఒక దానిని మాత్రమే ఎన్నుకొన వలసిన విషమ పరిస్థితి యేర్పడిన నేమి చేయగలరు?"

"అటువంటి పరిస్థితి యేర్పడినప్పుడు చూచుకొందములే తల్లి !"

"ఇప్పుడు యేర్పడినది"

దేవరాయలు నిరుత్తరుడై కుమార్తె ముఖ మవలోకించినాడు.

"ఇప్పుడు అటువంటి పరిస్థితి యేర్పడినది. మీరు నన్ను త్యాగము చేయవలసి యున్నది. లేదా దేశమును, శత్రు కారాగారములో నున్న సామ్రాజ్యపు పంచప్రాణము లనదగిన ఆ ఏవురనైనను త్యాగము చేయ వలసి యున్నది."

"నే నెవరినీ త్యాగము చేయుటలేదు తల్లి. నన్నే బలిగావించు కొందును."

"దీనివలన సమస్య పరిష్కృతము కానేరదు అప్పాజీ."

"నేను ఏమి చేయవలయునని నీ విప్పుడనుట?"

"మీరు నేను సూచించు మార్గమున నడువగలరా?"

"ఆదారి ఏదో వివరించినచో నడువగలను."

"అట్లని మాట యివ్వ వలయును."

"ఇదివరకే యిచ్చినాను కదా, చెప్పుము తల్లి."

"మీరు నన్ను ఆ మ్లేచ్ఛుడైన సుల్తాను కొసగి వివాహముచేసి, సంధి చేసుకొనవలెయును."

ఈ మాట విని దేవరాయలకు పిడుగు పడినట్టయినది. ఏమి చెప్పుటకును తోచక నిరుత్తరుడై కూర్చున్నాడు.

"అప్పాజీ, నన్నా దూర్తుడైన సుల్తానునకిచ్చి పెండ్లిచేసి, అతని యభీష్టమును నెరవేర్చి. సామ్రాజ్యమును గండమునుండి తప్పించి, చెఱలోనున్న రాజబంధువులకు విముక్తి కలిగించుడు."

"అయ్యో కుమారీ, ఏమి నీ మాటలు? ఇటువంటివి ఎక్కడ నైననూ గలవా?"

"నామాటలు అక్షరశః సత్యములు అప్పాజీ. ఈ విషయమును గురించి నేను బాగుగా ఆలోచించినాను."

"నీవు ఆ నీచుని వరించుచున్నావా తల్లీ?"

"ఔను అప్పాజీ. రాష్ట్ర క్షేమమునకయి ఈ కార్యము చేయవలసియే యున్నది. ఈ ధర్మ సింహాసన, ధర్మ సామ్రాజ్యముల మనుగడకయి ఈ త్యాగము చేయుటకు సిద్ధముగా నున్నాను."

"కుమారీ, ఆ ద్రోహివి—కులహీనుని నీవు పెండ్లాడి సుఖముగా వుండగలవా?"

"సౌఖ్యమును గురించిన చింత నాకులేదు, అప్పాజీ! ఇదొక మారణ హోమము. దీనికి ఆత్మాహుతి గావించుచున్నాను. నా స్వసుఖమును బలిగావించుచున్నాను. పవిత్రోద్దేశమునకై నాసర్వమునుత్యాగము చేయుచున్నాను!"

కుమారీ! ఇంతవరకు ఏ హిందూప్రభువూ సంతోషముతో మ్లేచ్ఛునితో సంబంధము చేయలేదు! ధర్మ బాహిరమైన ఈ సంబంధమునకు శాస్త్రముల ఆధారమేదియును లేదు. వాటిమాట అట్లుండనిమ్ము. పవిత్రమైన సంగమ వంశమునందు జన్మించిన నీవు మ్లేచ్ఛుని చేపటుటయా? ఇటువంటి నీతిదూరమైన కార్యమును నేను స్వప్నమున సైతము చేయలేను తల్లీ!"

"అప్పాజీ, అట్లయిన మీరు నాకిచ్చిన మాట విలువ యింతేనా?"

"నే నిటువంటి మాటలను పాలించలేను తల్లీ!"

"మీకొరకై, సామ్రాజ్యము కొరకై మీరిచ్చిన వాగ్దానమును నెరవేర్చ వలయును. విజయనగర సామ్రాట్టులు ఎన్నటికీ మాటయిచ్చి తప్పినారను అపకీర్తికి లోనుకాగూడదు! దేశ క్షేమమునకై మీరు నిర్మల హృదయముతో ఈ కార్యమునకు అనుమతి నొసగుడు! ఇది దేశ కల్యాణ కారకము కాగలదు! హిందూధర్మ సంస్కృతుల రక్షామణియైన విజయనగర సామ్రాజ్యము మనగలదు! మీరు అజరామర కీర్తిని పొందగలరు!"

"నా స్వార్థమునకై నీవు హుతాత్మురాలు కావలయునా, కుమారీ?" కన్నీరు కార్చుచూ దేవరాయలు అనినాడు.

"దీనిలో పరహితమే కాని, వ్యక్తుల స్వార్థములేదు అప్పాజీ! మీరీ విషయమై చింతించ పనిలేదు! వెనుక ముందులు ఆలోచించ నక్కరలేదు! దేశ క్షేమముకోరి మీరు నన్ను త్యాగమొనర్చి కీర్తిశాలురు కావలయు ననునదియే నా యపేక్ష!"

"హేమా, నీవు నా కుమార్తెవు కావు — దేవతవు! నీవంటి దేవత నావంటి హతభాగ్యుని పొట్టన పుట్టక యుండవలసినది! నేను నీతండ్రిని కాను తల్లీ — నీ పాలిటి మృత్యువును!"

"అప్పాజీ, మీకు నామీద అతిశయమైన ప్రీతి, మోహము లున్నవి. కనుకనే నన్ని కార్యమునకై బలి గావించుటకు మీ మనస్సు కింత వ్యాకులము కలుగుచున్నది! అంతయూ దైవేచ్ఛయని కర్తవ్యమును విడచి కార్యమును నిర్వహించుడు! మమతా బంధనములను పార

ద్రోలి, స్థితప్రజ్ఞులవలె ప్రవర్తించుము ! జనతయును, జనార్దనుడునూ మెచ్చగలరు !"

"కుమారీ, స్వార్థమునకై కుమార్తెను బలిగావించిన పిరికిపంద యని చరిత్ర నన్ను పిలువగలదు. దాని దృష్టిలో నేను పుత్రికాద్రోహిని కాలేను !"

"అప్పాజీ ! మీరు చరిత్రకారులను గురించి చింతజెంద పని లేదు. ఇతిహాసము మనను దేశ కృత్యమునకై మరణించిన హుతాత్ముల మాలలో చేర్చి స్మరించగలదు. ఒకవేళ స్మరింపక పోయిననూ మన బలి దానము వ్యర్థముకాదు. అది ఇకముందు నావంటి వెయ్యారు దేశభక్తు రాండ్రకు—బలిదానమునకు స్ఫూర్తి నివ్వగలదు !" అనినది హేమాంబిక నిశ్చిత కంఠముతో.

ఈ మాటకు దేవరాయల కేమి చెప్పుటకును తోచలేదు. అతడు క్షణకాలము కుమార్తెను నిశ్చలుడై చూచి,అనంతర మామెను కౌగిలించు కొని, బిగ్గరగా యేడ్చినాడు. వా రుభయులూ ఆ విధముగా చాలసేపటి వరకును రోదిస్తూనే కూర్చున్నారు.

ఫిరోజ్‌షా లక్ష్మీధరా మాత్యులు వచ్చి, హేమాంబికను వివా హముచేసి యిచ్చుటకు దేవరాయలు సిద్ధముగానున్న విషయము చెప్పగా విని, స్వర్గము మూడడుగుల దూరమున నున్నట్టు భావించినాడు. అతని చిరకాల వాంఛ నెరవేరినది. తన జనానా యందతడు అన్నిదేశముల రాజపుత్రికలను వుంచియున్నాడు. కాని, విజయనగర రాజపుత్రిక మాత్రము లేదు. ఇప్పుడు వారిలో అత్యంత రూపవతియు, భువనమోహి నియు నైన హేమాంబికయే అతని వశమగు సంఘటన ఏర్పడినది ! ఆ క్షణములో అతనికి ప్రపంచమున తన కంటెను భాగ్యశాలి మరొకడు లేడని తోచినది. అతడు హేమాంబిక వివాహమునకు, గొప్ప గొప్ప ఏర్పాటులు చేయవలసినదిగా తన దండనాయకులకు ఆజ్ఞాపించి, వాటిపై పర్యవేక్షణకు తానే నిలబడినాడు !

ఉభయ పక్షములలోను వివాహ కార్యములు ఎక్కువ ఉత్సాహ ముతో సాగుచున్నవి.

కొన్నిఘడియల క్రిందట నుండిన హిందూ-ముస్లిం సైనికుల వైరత్వము మరుగుపడి, వారిప్పుడు మిత్రులైనారు. అందరికీ ఆ క్షణములో, ఉభయ రాష్ట్రములకును నిజమైన స్నేహ మేర్పడినట్లు దోచినది.

ఫిరోజ్‌షా నలుబది రోజులవరకును వివాహ సంభ్రమముల సందర్భమున రకరకముల వినోద నృత్యముల ఏర్పాటులు జరుగ వలయునని ఆజ్ఞాపించినాడు. ఈసందర్భమున సైనికుల కట్టుదిట్టములనుకొంతతగ్గించి, వారికి యిష్టము వచ్చిన చోటికి వెళ్ళుటకు అవకాశ మిచ్చినాడు. సైనికులు తాము యుద్ధమునకు వచ్చినారను మాటను మరచి, వివాహ సంభ్రమములలో మునిగి యున్నారు. ఉభయ శిబిరాల నడుమ సుమారు పది క్రోసుల దూరము రాజమార్గములో బంగారు జరీ అల్లిన మఖమల్, పట్టు తివాసీలను పరచినారు. దానికిరువైపులా రకరకముల విలువగల వస్త్రములను విక్రయించు దుకాణములు తెరువబడినవి. సైనికుల వినోదమునకై ప్రశస్తములైన శిబిరములు లేచినవి. విజయనగరపు గాయకులు, నర్తకీమణులు, వేశ్యలు అచ్చట చేరినారు. సైనికులు యథేచ్ఛగా త్రాగి,వలసినంత తిని, తేన్పుటకై మద్య-మాంసములు బండ్లమీద వచ్చివి.

రెండుశిబిరముల నడుమ వివాహమునకు రాజయోగ్యమైన.వివాహ మంటపము నిర్మించబడినది. అందలి స్తంభములకు భిత్తికమీదముత్యాల చెండ్లను వ్రేలాడగట్టినారు. మంటపము ముందు వరసలో యిరువైపులా నున్న స్తంభములకు పైభాగమున గాలిలో ఉభయరాష్ట్రముల పతాకలెగురుచున్నవి. చుట్టునూ పట్టు పీతాంబరములను జాలవిడచి యున్నారు. నేలమీద పర్షియాదేశపు రత్నకంబళ్ళను పరచియున్నారు. వివాహ వేదికమీద రత్న ఖచితమైన - పసుపు నలదిన - పీటను వేసి యున్నారు. దేవరాయలు కుమార్తెను హిందూశాస్త్ర పద్ధతి ప్రకారము, వివాహముచేసి యిచ్చుటకు నిశ్చయించినాడు ! వేదిక చుట్టునూ అతిధుల కొరకై ప్రశస్తములైన ఆసనముల శ్రేణులేర్పడి యున్నవి. ఒక్క మాటతో—వివాహ మంటపము స్వర్గలోక వైభవమును యించుమించుగా ప్రతిబింబింప జేయుచున్నది।

ముహూర్తపురోజు సమీపించుటకు మునుపే ఫిరోజ్‌షా తన ఆప్తులైన ఖాన్‌ఖాన్, మీర్ ఫజులుల్లాలతో అమూల్యములైన రత్నాభరణము

లను, వస్త్రాలంకారములను, గజాశ్వములను, తదితర మంగళ ద్రవ్యము లనూ హేమాంబికకు పంపినాడు. దేవరాయలు విధిలేక ఆదవాని, బెంకిపుర ప్రదేశములను, సుమారు పదిలక్షల బంగారు నాణెములను, అయిదు మణుగుల ముత్యములను, రత్నములను అల్లునికి అలంకారముగా నిచ్చినదేగాక, కుమార్తె సేవకై రెండువేల పరిచారికా పరివారమునుకూడా యిచ్చినాడు.

నిశ్చయమైన రోజు, ఏర్పరచిన మంగళ ముహూర్తములో దేవ రాయలు హేమాంబికా-ఫిరోజ్‌షాల వివాహమును సాంగముగా నెరవేర్చి నాడు.

ఎనిమిది రోజుల కాలము, వివాహ విధులన్నియూ ముగిసిన పిమ్మట వధువును స్వీకరించుటకు ఫిరోజ్‌షాకు ఆహ్వానమంపి, దేవరా యలు అంతఃపురమునకు తిరిగి వచ్చినాడు.

ఫిరోజ్‌షా వధువును హిందూపద్ధతి ప్రకారము స్వీకరించుటకు దేవరాయల ఆహ్వానము నందుకొని అంతఃపురమునకు విచ్చేసినాడు.

ఆస్వీకరణకార్యము ముగిసినతర్వాత, హేమాంబికనుతనతోగుల్బర్గు తీసుకొని వెళ్లుటకు ముందు, తమను సాగనంపుటకై నగర ద్వారము వర కును వచ్చిన దేవరాయలను చూచి, ఫిరోజ్‌షా : సామ్రాట్టులూ ! ఈ రోజు మన ఉభయరాష్ట్రముల చరిత్రలో ఒక పుణ్యదినము. ఈరోజు మన రాజ్యముల కెంటికినీ నిజమైన స్నేహసౌహార్ద్రత లేర్పరచుటకు, హిందూ-ముస్లిముల ప్రీతి విశ్వాసమునకు భద్రపునాది వేయుటకు, మన ఉభయరాజ వర్గములకును సంబంధ బాంధవ్య మేర్పడినది. మీరు మా యపచారములను మరచి, మమ్ములను మిత్రులనుగా భావించినారు. మీ విశ్వాసము మా హృదయమును జయించినది. ఇదే విధమైన స్నేహ బంధము మనఉభయుల యందును చిరకాలము నిలువ వలయునని, మీరు 'పంపాపతి' యని పిలచు; సర్వాంతర్యామియైన ఆ 'అల్లా'ను నేను ప్రార్థించుచున్నాను ! మీరు మమ్ములను రాజోచితముగా గౌరవించినారు; ఒక పర్యాయము మా పట్టణమునకు విజయముచేసి, మా ఆతిథ్యమును స్వీకరించ వలయును!" అని సవినయముగా విన్నవించుకొన్నాడు.

ఈ మాటలు దేవరాయల ఆత్మాభిమానమునకు వాతపెట్టినవి. ఇంత వరకూ అతి కష్టముమీద ఆపుకొనుచూ వచ్చిన సహనము కట్టలుతెంచుకొనినది. అతడు కోపావేశుడై అనినాడు :

"సుల్తానులూ, నేను మీకు కుమార్తెను సంతోషముతో యిచ్చి వివాహము చేసినానని మీరనుకొని యున్న, అది మీ దురభిప్రాయము। నేను మా కుమార్తె కిచ్చిన వాగ్దానమును నెరవేర్చుటకునూ, దేశ కల్యాణమునకును నై, ఈ వివాహమునకు సమ్మతించినాను. ఇదివరకునూ హృదయములో హాలాహల మున్ననూ, మంగళకార్యము నిర్విఘ్నముగా నెరవేర నిమ్మని, నేను నగుముఖము తోడనే యుంటిని. ఈ ఘడియనుండి నాకును—మీకును—నా కుమార్తెకునూ ఋణము తీరినది । నీవు మా అల్లుడవుకావు-మా పరమ శత్రుడవు ।

"మ్లేచ్ఛునికి కుమార్తె నిచ్చినంత మాత్రమున, హిందూ-ముస్లిముల మైత్రిని పెంచుటకు భద్రమైన పునాదిని వేసినానని మీరు భావించి యుండినచో, అది మీ భావన మాత్రమే కాగలదు । ఈ రెండురాష్ట్రములకు యీ జన్మలో మైత్రి జరుగదు । ఇవి పరస్పరము పగ, వైరములను కొంగున కట్టుకొనియే జన్మించినవి. మన మాగర్భశత్రువులము । కుమార్తెనిచ్చి సంబంధము చేసినంత మాత్రమున మన శత్రుత్వము మాసిపోగలదని మీరు భావించకుడు । ఈ వివాహము అగ్నికి అజ్యము పోసినట్లయినది. మీరు నాకుచేసిన అవమానమును ప్రాణమున్నంత వరకును నేను మరువను । మీవంశము నిశ్శేషమగునంత వరకు, మీసామ్రాజ్యము నామావశేష మగునంతవరకు, నేనీ ఖడ్గమును క్రిందపెట్టను। ఈ మాట జ్ఞాపక ముంచుకొనుడు....

"ఈ ఘడియ నుండియు మనము పరస్పర శత్రువులము। పరమ శత్రులైన మీపట్టణమునకువచ్చి ఆతిథ్యమును స్వీకరించుమాట అటుండనిమ్ము । ఇకపై మీ ముఖావలోకనము కూడా చేయను ।" అనిచెప్పి అచ్చటినుండి వెళ్ళిపోయినాడు.

దేవరాయ లనిన ప్రతి మాటయు, నిప్పురవ్వ వలె వచ్చి ఫిరోజ్ షా చెవిని తాకినది । స్వర్గసౌఖ్యపు ఉన్మాదములో నుండిన అతడు

హఠాత్తుగా నరకమునకు త్రోయబడినాడు. దేవరాయలు వెళ్ళిన తర్వాత, “ఈ నీచునికి బుద్ధి గరపక పోయిన నేను ఫిరోజ్‌షాను కాను ! ఈనాడు అతడనిన మాటలకై ముందొకరోజు పశ్చాత్తాప పడునట్లు చేయనిచో నేను బహమనీ సుల్తానును గాను !” అని ఘోర ప్రతిజ్ఞను చేసి, భార్య-హేమాంబిక ముఖము చూచినాడు.

హేమాంబిక మనసులో నేమున్నదో ? ఆమె తిరస్కారముగా నవ్వినది !

పంచాయతీ
వేమన గ్రంథాలయము
తెలప్రోలు

# ప్రతిజ్ఞా ప్రయత్నము

## 15

ఫిరోజ్‌షా దేవరాయలతో చేసుకొనిన ఒప్పందము ప్రకారము నడచుకొని, తన రాజధానియైన గుల్బర్గునకు తిరిగి వెళ్ళిననూ అతని మనస్సుకు మాత్రము శాంతి కలుగక పోయినది అతడు దేనిని పూలమాలయని ధరించెనో అది పాము పడగయైనది. తనకు-హేమాంబికకు జరిగిన వివాహముతో హిందూ-ముస్లిం సఖ్యము, ఉభయరాష్ట్రములమైత్రి, సంవర్ధించినదని భావించునంతలో, తను త్రాగిన అమృతమే హాలాహలమైనది. దేవరాయలు అందరి సముఖములో ఫిరోజ్‌షాను ధిక్కరించి, అవమాన పరచినాడు. అతనిమీద పగదీర్చుకొన వలయునని దోచినను, వీరవిజయుడు సైన్యసమేతముగా వచ్చుచున్నాడను వార్త, సుల్తానును ఏ దుడుకు తనమునకును పూనుకొన కుండునట్లు చేసినది. అతడు తన రాజధానికి తిరిగివెళ్ళి, దేవరాయలమీద పగదీర్చుకొను ప్రయత్నములలో మునిగినాడు.

సుల్తాను తన నూతన వధువు హేమాంబికతో అంతఃపురమునకు

రాగా, అచ్చట వారికి పార్వతి ముత్యాల హారతి నెత్తి, సంభ్రమముగా స్వాగతము పల్కినది. సుల్తాను హేమాంబిక కుతూహలమునుగ్రహించి:

"ఈమెయే పార్వతి, మా అభిమాన పుత్రి!" అని హేమాంబికకు ఆమెను పరిచయము చేసినాడు.

హేమాంబిక ఆమెను చూచి తిరస్కార భావముతో నవ్వినది. ఆమె మూలముననే యింతటి హత్యాకాండ జరిగినదనియో ఏమో! తొలి చూపులోనే వారిరువురకూ తాము మిత్రులుకాము — శత్రువులు అను భావన కలిగినది! ఇరువురూ మౌనముగా నిలబడినారు. ఈ మౌనము సుల్తానుకు దుస్సహనీయమైనది. "పార్వతీ, నీ మిత్రురాలికి యీఘడియ నుండి నీవు ఆత్మసఖివి! ఆమెకు తన అంతఃపురమును చూపుము! ఇది క్రొత్త ఊరు, క్రొత్త ప్రదేశము క్రొత్త ప్రజలు! కనుక ఆమె యిచ్చట దేనికినీ వ్యసన పడనట్లు చూచుకొనుము! మీ రుభయులూ హిందూరమణులు, సంతోషముతో ఎల్లప్పుడునూ నవ్వుచుండ వలయును!" అనిచెప్పి, వారి నిద్దరినీ అంతఃపురము లోనికి పంపినాడు.

కాని, వారిరువురకూ మైత్రి కుదరలేదు! పరస్పరము శత్రువుల వలె వా రుభయులూ దూరముగా తొలగ సాగినారు. ఇదిచూచి సుల్తానుకు నిరాశ కలుగ సాగినది. హిందూరమణులే యీ విధముగా అయినచో యిక హిందూ-ముస్లిం సఖ్యమా? అని తనలోనే అనుకొనినాడు.

పార్వతి సుల్తాను మాట మీరలేక హేమాంబికను ఆమె కొరకై నిర్మింపబడిన స్వర్గతుల్యమైన అంతఃపురమునకు తోడ్కొని వెళ్ళి, అచ్చట ఆమెకు యితర పత్నుల పరిచయము చేసినది. వారి నందరినీ చూచి, హేమాంబికకు జాలి కలిగినది! వీరిలో ఎందరు తనవలె బలాత్కారముగా యిచ్చటికి వచ్చి చేరినవారో? అనుకొన్నది. వారిలో కొందరు హేమాంబిక అనుపమ సౌందర్యమును చూచి, సుల్తాను మంచి వేటనే సంపాదించినా డనుకొన్నారు! మరికొందరు యింతటి సుకుమారి యీ విలాస జగత్తునకు రాక యుండవలసినది, అని తమలోనే నిట్టూర్పులు బుచ్చుకున్నారు! హేమాంబిక మాత్రము యీ విషయముల నేమియూ పట్టించుకొనక, యాంత్రికముగా వారిని చూచినది. ఆమె

మనస్సు యీ ప్రాపంచిక సుఖదుఃఖముల కతీతమైన వేరొక జగతిలో విహరించ సాగినది.

పార్వతి హెమాంబికను ఆమె అంతఃపురములో విడచివచ్చి, హంసతూలికా తల్పముపై కూర్చొని ఏదియో ఆలోచించుచున్న సులాను వద్దకు వచ్చి, నవ్వుచూ నిలబడినది. ఆమె కిప్పుడు తన ప్రియుడైన మల్లన్న వార్తను తెలుసుకొన వలయునని యున్నది. మల్లన్న సంధి షరతు ప్రకారము విడుదల పొందిననూ ఎందుకో యింకనూ గుల్బర్గు నకు రాలేదు. అందుకు కారణ మరయుటయే ప్రస్తుతపు ఆమె ఉద్దేశము.

"నిలబడినా వెందుకు పార్వతీ! చిన్నబేగం సాహెబాను అంతః పురము చేర్చితివా?"

"చేర్చితిని....!"

"ఆమె ఏమను చున్నది?"

"సంతోషముగా నున్నది హుజూర్!"

"ఆమె ఎట్లున్నది?"

"అనిన....?"

"ఆమె రూప....?"

"ఖావందులు సామాన్యులా! వారు సామాన్య స్త్రీలను కన్నెత్తి చూచువారా?"

"నీవు పొగడ్తను ఎచ్చట నేర్చుకొన్నావు?"

"తమరే నేర్పినారు హుజూర్!"

"పోనిమ్ము....ఇప్పుడు నీరాకకు కారణము?"

"ఆ విషయము తమకే తెలిసియున్నది! అయిననూ నా నోటి ద్వారానే వినవలయునని అట్లనుచున్నారు!" పార్వతి చిరుకోపముతో అనినది.

"ఓ తెలిసినది. మల్లన్న విషయమా?"

"అవును! సామ్రాట్టులు యీ పేదదాని నెచ్చట మరచిపోయి నారో అనుకొన్నాను! నా కోరిక నింకనూ జ్ఞప్తియందే వుంచుకొని యున్నారు! అది నా భాగ్యము."

"అది నేను మరువగలనా కుమారీ?నీ కొఱకే యింత చేసినాను."

"దీనికొక మంగళము పాడుడు; హుజూర్ ! మేము ఆమరణ పర్యంతమును మీకు కృతజ్ఞులుగా నుండెదము."

ఈ మాట విని సుల్తాను వదనము గంభీరమైనది.

"పార్వతీ, చాల రోజులుగా నిన్నొక మాట అడుగవలయునను కొన్నాను. నీవు విసుగుజెందనిచో అడుగ గలను."

"అడుగుడు హుజూర్ ! తమ మాట నాకు వేదవాక్యము."

"నీ వెందుకు ఆ సామాన్య శిల్పి మల్లన్నను అంతగా ఆరాధించు చున్నావు?"

"మే ముభయులమూ ప్రేమికులము హుజూర్."

"కాని నీవు ఒక రాజపుత్రివలె నున్నావు. అతడొక సామాన్య పల్లె యువకుడు. నీవు అతనిని ప్రేమించుచున్నావా? ఆశ్చర్యము."

"ఇందులో ఆశ్చర్యపడవలసిన విషయమేదియును లేదు హుజూర్ ! మేము బాల్యమునుండియు ఒకటిగా పెరిగిన వారము. ఒకరి నొకరు ప్రాణమున కంటెను అతిశయముగా ప్రేమించుకొనినాము. మల్లన్న నా దృష్టిలో పల్లె యువకుడు కాదు. అతడొక రాజపుత్రుడు ! కానిచో నేను విజయనగర సామ్రాట్ల ప్రేమను తిరస్కరించెడు దానినా?"

"అయినచో, అతనినెందుకు ఇదివరకే వివాహమాడలేదు ?"

"మా తల్లి అడ్డువచ్చినది. లేనిచో మేము సతీపతులై ఎంతయో కాలమై యుండెడిది. ఇప్పుడు మీరు నా భాగ్యదేవతవలె ఆశ్రియమిచ్చి కాపాడినారు. నా కొరకయి సామ్రాట్ దేవరాయలమీద యుద్ధమొన రించి మల్లన్నను బంధవిముక్తుని జేసినారు. కాబట్టి మీరే పెద్దలుగా నిలచి, ఈ వివాహమును జరిపి మమ్మాశీర్వదించ వలయును."

"నీ వివాహమును సంతోషముగా జరుపగలను. నీవు చింతించ పనిలేదు. అయినను నీ వీ నిర్ణయమునకు వచ్చుటకుముందు మరొకసారి ఆలోచించుట మంచిది. ఎందుకన నీవంటి రూప — యౌవనములు గల

సౌందర్యనిధిని నిర్భాగ్యుడయిన ఆ మల్లన్న చేపట్టుట నా కిష్టము లేదు. నీవు అతని కన్నను ఉత్తములైన ఏ రాజపుత్రులనో చేబట్టవలయునని నా యపేక్ష. నీవు మా అభిమాన పుత్రికవు – షహజాదినివినైనావు. నీ వివాహము షహజాదులతో జరిగిన, నీ రూప, గుణ, యౌవనములు సార్థకములు కాగలవు."

ఈ మాట విని పార్వతి బొడు గరచినది. తనకు ఆశ్రయమిచ్చిన సుల్తానుయేనా ఈ మాటలనుట? అనుకొన్నది. ఆమెకు సుల్తాను మాటను విని నడుము విరిగినట్లయినది. తల గిర్రున తిరిగినది. కనులకు చీకటి క్రమ్మినది. ఇంతవరకూ తను నిర్మించుకొన్న స్వప్నమందిరము గభాలున కూలిపోయినట్టుగా తోచినది. అయినను ఆమె హతాశురాలు కాక, ధైర్యముగా చెప్పినది:

"హుజూర్, నామీద తమకుగల ఆదరాభిమానములకు కృతజ్ఞురాలను. కాని నా వివాహము మల్లన్నతో మానసికముగా ఏనాడో జరిగిపోయినది. నేను పెండ్లాడక పోయిననేమి? అతని సతిని – సహధర్మచారిణిని అయినాను. ఈ జన్మలో నే నతనిని తప్ప అన్యులను కన్నెత్తి చూడను. అతడే నా పతి." అని చెప్పునప్పటికి కంఠము గాద్గదికమైనది. కనులలో నీరు గ్రిమ్మినది.

"అయ్యో, పిచ్చిదానా! ఇంతమాత్రమునకే కన్నీరు కార్చెదరా? నీవుయింతవరకునూ క్షత్రియ రమణివలె మెలగి, ఇప్పుడు సామాన్య స్త్రీవలె ఏడ్చెదవా? నేను మాటవరుసకు అనినాను. రాజపుత్రునితో వివాహమైన నీవు ఎట్లుండగలవోనని. కాని ఇదే నా తుది నిర్ణయముకాదు. నీ మనస్సుకు వ్యతిరేకముగా నే నెప్పుడూ ప్రవర్తించను. ఎవరిని వివాహమాడవలయునని నీకు గలదో వారినే వివాహమాడుము. నా అభ్యంతరములేదు. నీవు సుఖముగా వుండిన నా కదియే చాలును." అని పార్వతిని సమాధాన పరచినాడు. అంతలో అచ్చటికి ఏదో రాజకీయ విషయమును చర్చించుటకు మీర్ సాహెబ్ వచ్చినాడు. అతడు రాగానే పార్వతి తలమీద ముసుగు వేసుకొని అచ్చటినుండి వెళ్ళిపోయినది. మీర్ సాబ్‌హె మెరుపువలె మాయమైన పార్వతినే తదేక ధ్యానముతో

చూచుచూ - "ఈ ముగ్ధ ఎవరు హుజూర్?" అని ప్రశ్నించినాడు.

"ఆమె పార్వతి. ఆమెను నీవు యింతవరకునూ చూచి యుండ లేదా?"

"చూచినాను. కాని యింత సమీపమునుండి ఎప్పుడునూ చూసి యుండలేదు. నిజముగా ఆమె ఒక రాజపుత్రివలె నున్నది. తమ షహజాదిని యగుటకు తగియున్నది" అని ఆశ్చర్యమును ప్రకటించినాడు.

"ఆమె పొగడ్త అటుండనిమ్ము. ఇప్పుడు నీవు వచ్చిన పని యేమి?"

"పార్వతి విషయమును గురించియే నేను తమతో మాట్లాడవచ్చి నాను ప్రభూ."

"ఏమియో చెప్పుము?"

"అది చాలా రహస్యమైనది. మంత్రాలోచన మందిరమునకు వెళ్ళుదము రండు-చెప్పెదను."

"ఆ విషయ మంత గోప్యమైనదా?"

"అవును. అది పార్వతి చెవిని బడిన రాద్ధాంతము కాగలదు." అని సుల్తాన్‌ను లోపలి అంతఃపురమునకు తీసుకొనివెళ్ళి వాకిలి భద్రముగా మూసి, మీర్‌సాహెబ్ అనినాడు :

"హుజూర్! ఆనాడు నేను చెప్పిన విషయము నేమి చేసినారు?"

"ఏవిషయము, మీర్‌సాహెబ్?"

"పార్వతిని షహజాదుల వారికి తీసుకొను విషయము."

"ఆ విషయమునే నేనూ ఆలోచించుచున్నాను, మీర్‌సాహెబ్."

"షహజాద్ హసన్ ఖానులు ఆమెను చూచినది మొదలు, పిచ్చి వారివలె యైనారు. మీరిచ్చట వున్నప్పుడు వారి కీ విషయమై నోరు తెరచుటకు ధైర్యము లేకపోయినది. మీరు విజయనగరమునకు వెళ్ళిన సమయములో ఆమెను తన దానినిగా చేసుకొనుటకయి తమ సాహసము నంతయూ ప్రయోగించినారట. కాని ఆమె షహజాదులకు అవకాశ మివ్వకపోవుట అటుండనిచ్చి, వారివైపు కన్నెత్తియునూ చూడలేదట.

వారు ఆమెను గురించిన చింతతోడనే కృంగి, కృశించిపోవుచున్నారు. అన్నపానీయములను సైతము ముట్టుటలేదు. ఇప్పుడు మీరు హిందూ రమణిని పెండ్లాడుటవలన, తనుకూడా పార్వతిని చేబట్ట గోరిన అది అంతటి యపరాధము కానేరదని, నాతో తమ బాధలు తోడుకొని మీ సమ్మతి సంపాదించుటకు శతవిధముల ప్రార్థించినారు వారి కోర్కెను మీరు నెరవేర్చనిచో పార్వతిమీదగల ప్రణయాతిశయముచే తప్పక ఆత్మహత్య చేసుకొనగలరు. ఈ మాట సత్యము" అని ఉద్వేగముతో అన్నాడు.

"మీర్‌సాహేబ్‌గారూ, షహజాద్ ఖాన్‌లు పార్వతిమీద అంత ప్రణయాపేక్షులై వున్నారా? ఆశ్చర్యము!"

"మీరీ నడుమ వారిని చూచి యుండలేదను కొందును?"

"అవును, చూడలేదు. నాకు స్వాగతము చెప్పుటకు అందరునూ వచ్చినారు. కాని షహజాదులు రాలేదు. కారణమేమియో విచారించ వలయు ననుకొన్నాను. ఇంతలో మీరే వచ్చినారు."

"వారు పార్వతి చింతను మనసున పెట్టుకొని ఎండుకట్టెవలె అయినారు హుజూర్! మీకు ముఖము చూపుటకు వారికి సిగ్గుచున్నది. కాబట్టి, వారు అంతఃపురమునుండి వెలుపలికి తల చూపలేదు."

"అదియా విషయము?" ఆశ్చర్యమును వ్యక్త పరచినాడు ఫిరోజ్‌షా.

"వారిని చూచిన మీరే మనగలరో? నాకు మాత్రము వారిని చూచిన ప్రేవులు చురుక్కు మనుచున్నవి. ఎట్లుండిన వారు ఎట్లయి నారు?"

"ప్రేమ ఎంతటి వారినైననూ ఆ విధముగా పిచ్చివారిని చేసి వేయును మీర్‌సాహెబ్‌గారూ! మీ రెవరినైననా ప్రేమించి యుండిన విరహవ్యధ యనిన ఏమియో తెలిసియుండును. అది యట్లుండనిమ్ము. యిప్పుడు షహజాదుల రుగ్మతకు తగిన ఔషధమేది యని ఆలోచించ వలసి యున్నది."

"ఇందులో ఆలోచించ వలసిన దేమున్నది హుజూర్? వారికి

పార్వతినిచ్చి వివాహము చేసిన, వారి రుగ్మత—పిచ్చి—తనంతట తానే నెమ్మదించగలదు "

"ఈ విషయము మీరు చెప్పునంతటి సులభ సాధ్యమైనదికాదు మీర్ సాహెబ్ గారూ."

"ఎందులకు హుజూర్?"

"ఈరోజు మీరు వచ్చుటకు కొంతముందుగా నేను పార్వతితో మాట్లాడుచూ, ప్రసక్తాను ప్రసక్తముగ ఈ విషయమును ప్రస్తావించి నాను. కాని ఆమె మల్లన్నను తక్క అన్యులను కన్నెత్తికూడా చూడనని ఖచ్చితముగా చెప్పివేసినది."

"కాని మల్లన్నతో ఆమె వివాహ మింకనూ జరుగలేదుకదా!"

"జరుగకున్ననేమి. 'నేను అతనిని ప్రాణమునకంటెనూ ఎక్కుడుగా ప్రేమించుచున్నాను. ఈ జన్మమునకతడే నా భర్త. తక్కిన వారంతయూ పరపురుషులు' అని ఖచ్చితముగా చెప్పినది. నేను ఒత్తిడి చేసినందుకు కన్నీరు కార్చినది. ఆ విషయ ప్రస్తావనకది తగిన సమయము కాదని వూరక వుండిపోయినాను. అంతలో మీరు వచ్చినారు."

"మీరు తలచుకొనిన ఈ కార్యము అసాధ్య మేమియునూ కాదు హుజూర్! ఆమెకు మీ మాటమీద చాలా గౌరవమున్నది. మీరు మంచి చెప్పిన ఆమె కాదనజాలదు. దానికిని ఆమె సమ్మతించనిచో తెలిసియే యున్నదికదా నిర్బంధము."

"కాని, నా వద్దకు ఆశ్రయముకోరి వచ్చిన పార్వతిమీద—నన్ను తండ్రియను భావనతో చూచుచున్న ఈ చిన్నదానిమీద—బలాత్కార ప్రయోగము నా కిష్టములేదు."

"అట్లయినచో షహజాదులు పార్వతీ విరహములో ప్రాణములు విడచుట నిశ్చయము. మీకు వారికంటెనూ ఈ కాపర రాజు కుమార్తెయే ఎక్కువైనదా?"

"అట్లనికాదు మీర్ సాహెబ్ లూ! మన మీ విషయమును ఒత్తిడి మీద జరుపుటచే ఎవరికినీ ప్రయోజన ముండదు. ఉపాయముగా నామెను షహజాదులకు 'నిఖా' చేయసంయుమనని నా ఆశయము."

"అట్లయినచో దీనికొరకు ఉపాయము వెదకుట అంత కష్టమైనపని కానేరదు."

"కాని ఆ శని—మల్లన్న—యున్నాడుకదా అతనినేమి చేయవల యును?"

"అతని ప్రతిబంధకమును తొలగించుకొనుట కష్టమా?"

"కష్టము కానేరదు. అతడిప్పుడు ఎట్లును చెరనుండి విముక్తిని పొంది యున్నాడు. మన సైన్యముతో యిచ్చటికి బయలుదేరి వచ్చు చున్నాడు. మార్గ మధ్యమందే అతనిని చడీ—చప్పుడు లేక సంహరిం చుట కష్టముకాదు. కాని దానితో ఈ సమస్య మరింత జటిలము కాగ లదు."

"ఎట్లు?"

"మల్లన్నను మనము హత్య చేయించినామని పార్వతి గ్రహిం చిన ఆమె క్షణకాలము జీవించదు. ఆత్మహత్య చేసుకొనగలదు. ఇది ఖండితము. మీ కింకనూ ఆమె స్వభావము తెలియదు. ఆమె చాలా విచిత్ర వ్యక్తి. ఆమెను వ్యతిరేకించిన కార్యము చెడగలదు. ఉపాయ ముగా ఆమెను దారికి తీసుకొని రావలయును."

"ఆమెను మతాంతరీకరించి, ముస్లిం వనితనుగా చేసిన?"

"వెనుకముందు చూడక ఆత్మహత్య చేసుకోగలదు."

"అయినచొ షహజాదులతో లగ్నము ?"

"ఉపాయముగా సాధించవలయును."

"ఎట్లు సాధించగలరో నాకు తెలియదు. నాకేమో దిగులుగా నున్నది. రోజు రోజుకూ షహజాదుల స్థితి చింతాజనకముగా నున్నది. వారు మనచేయి దాటిపోక మునుపే మనము వారిని దక్కించు కొన వల యును."

"ఈ విషయమై మీరు చింతించవలదని షహజాదులకు తెలు పుడు. వారిని నా వద్దకు పంపిన, నేను వారి రుగ్మతకు తగిన ఔషధ మిప్పించ గలను" అని చెప్పి, మీర్‌సాహెబ్‌ను సాగనంపి చాలసేపు ఆలోచించుచూ కూర్చున్నాడు. చివరకేమి నిర్ణయించుకొనినాడో ఏమో. అచ్చటినుండి వెళ్ళునప్పు డతని ముఖమున చిరుదరహాసము తొంగి

చూచినది. కాని గదినుండి వెలుపలికిరాగా, తమ మాటల నెవరో పొంచియుండి వినుచూ, తను లేచి రాగానే హఠాత్తుగా నిష్క్రమించి నట్టు అతనికి తోచినది.

"ఎవరది?" అని సుల్తాను గర్జించినాడు.

పహరా సైనికుడు పరుగునవచ్చి "హుజూర్!" అన్నాడు.

"ఇచ్చట యితంవరకూ దాగియుంటిన దెవరు?"

"ఎవరునూ లేదు హుజూర్!"

"కబడ్దార్! ఇచ్చట ఎవరో దాగియుండి, మా సంభాషణ నాలించి, మేము రాగానే వెళ్ళిపోయినట్టు మా మనసుకు తట్టినది."

"ఇచ్చటికెవరునూ రాలేదు హుజూర్."

"మంచిది." అని అచ్చటినుండి వెళ్ళిపోయినాడు. కాని అతని హృదయాంతరాళములో ఎవరో తలుపు వెనుక దాగి, తమ మాటలను పొంచి వింటూ యుండిరను సంశయము నివృత్తి కాలేదు.

తమ మాటలను పొంచి వినుచుండిన హితశత్రువులు అంతఃపుర ములో ఎవరైయుండవచ్చును? అని ఎంత ఆలోచించిననూ అతనికి తోచక పోయినది. ఈ విషయమై కొంత హెచ్చరిక వహించవలయు నని అనుకొన్ననూ, తదితర రాచకార్యములలో మరల ఈ విషయమెప్పు డును గురునకే రాకపోయినది.

ఫిరోజ్‌షా అనుమానము అబద్ధము కాలేదు. అంతఃపురములో నిర్బంధములో నుండిన తిమ్మోజీ మల్లన్న విషయము తెలుసుకొనుటకై కుతూహలముతో సుల్తాను—పార్వతుల సంభాషణను వినుచూ అచ్చట నున్న స్తంభముచాటున దాగియుండినాడు. పార్వతి వెళ్ళిపోయిన తర్వాత మీర్‌సాహెబ్ - సుల్తానుల సంభాషణ చెవిని పడినది. అతడు మరింత కుతూహలము హెచ్చి, నిశ్శబ్దముగా వారిని వెన్నంటి లోపలి గదివర కును వచ్చి, తలుపు రంధ్రము గుండా లోపల జరుగుచున్న సంభాషణను విన్నాడు. అంతఃపురములో నిర్బంధములో నున్ననూ, అచ్చట ఎక్కడ కావలయు ననిన అచ్చట సంచరించు స్వాతంత్ర్య మతనికి గలదు.

అత డా రోజు తన జీవితములో అత్యంత రహస్యమైన విషయ మును విన్నాడు. తొలిసారిగా అతనికి సుల్తాను గోముఖ వ్యాఘ్రత్వము

తెలిసివచ్చినది. పార్వతిని వెంటనే హెచ్చరించకపోయిన, ఆమె అన్యాయముగా కులభ్రష్టురాలై, యవనుల పాలు కాగలదని భావించి, కుమార్తెకీ విషయము తెలుపుటకయి ఉపవనమునకు పరుగున వచ్చినాడు.

అతడు పార్వతి నేకాంతమునకు తీసుకొనివెళ్ళి: "తల్లీ ! నీవు సుల్తానును తండ్రి సమానుడని భావించినావు. కష్టదశలో సాయపడిన ఆప్తబంధువని అనుకొన్నావు ! ఆ నీచుని గోముఖ వ్యాఘ్రిత్వ మీనాడు బయటపడినది !" అని ఆగి నలుదిక్కులా పరికించినాడు.

తాను వారి మాటలను పొంచి వినినట్లే, తన మాటలను ఎవరైననూ పొంచియుండి విని సులానుకు తెలియజేయుదురేమోనని అతని భీతి ! చుట్టూ ఎవరును లేకపోవుటచే హృదయము తేలిక పడునట్లు దీర్ఘముగా ఒక నిట్టూర్పు విడచినాడు.

"అప్పాజీ ! ఇప్పుడంతటి సంఘటన ఏమి జరిగినది ?" ప్రశాంతముగనే ప్రశ్నించినది పార్వతి.

"ఇంకేమి జరుగవలయును తల్లీ ? అతడు నిన్ను నమ్మించి గొంతు కోయనున్నాడు ! నిన్ను జాతిభ్రష్టనుచేసి, తన కుమారుడగు హసన్‌ఖానుకి యిచ్చి వివాహముచేయ నిశ్చయించినాడు.

ఈ మాటలు విని పార్వతికి దిగులు కలిగినది ! ఆమె ముఖము వివర్ణమైనది ! మరొక సందర్భమున తిమ్మాజీ యీ మాటలు చెప్పియుండిన, అబద్ధమని త్రోసిపుచ్చి యుండెడిది. కాని, ఆ ఉదయమే ఆమె సుల్తాను నోటివెంట షహజాదినివలె నున్న తనను హషజాదుల కిచ్చి వివాహ మొనరింప వలెనను మాటను వినియున్నది ! అట్లయిన, సుల్తాను తనను నయగారపు మాటలతో మోసగించు చున్నాడా ? తనకోరికకు, తండ్రి కోరికకు వ్యతిరేకముగా దేవరాయలమీద దండెత్తివెళ్ళి, అతని కుమార్తె హేమాంబికను బలవంతముగా వివాహమాడినట్లే, తనను అతని కుమారుడగు హసన్‌ఖానుకు పెండ్లిచేసి, తన జీవితమునకు చిచ్చుపెట్ట నిశ్చయించినాడా ? ఆలోచించిన కొలదిని యీ విషయము పట్ల ఆమె సందేహము దృఢము కాసాగినది. ఆమెకు సుల్తాను రాజధానిలో లేనప్పుడు అతని కుమారుడు షహజాద్ హసన్‌ఖాన్ తనను ఏడ్పించిన దృశ్యము చప్పున స్ఫురణకు వచ్చినది. దానితో ఆమె గడగడ వణికినది.

పార్వతిని చూచినది మొదలు షహజాద్ హసన్‌ఖాన్ ఆమెపై మరులు గొన్నాడు. మొదటినుండి విషయాసక్త జీవితము గడిపిన ఆ యువకునికి పార్వతి సౌందర్యరాశి వలె కనబడినది. ఆమె ఏ విధమైన అడ్డంకియునూ లేక జింక వలె స్వేచ్ఛగా అంతఃపురములో తిరుగసాగినది. ఆమె రూప యౌవనములు చూచుటకు అటువంటి సమయము లతనికి అవకాశమును కల్పించినవి. అతడు దూరము నుండియు చూచిన పిట్టపై మరులుగొన్నది మాత్రమేకాదు, ఎట్లయిననూ దానిని తన వశము చేసుకోవలయునను కల గన్నాడు. కాని, పార్వతి సుల్తాను అభిమాన పుత్రి యగుటచే యితర యువతులను పీడించినట్లుగా ఆమెను పీడించుటకు భీతిల్లినాడు. ఫిరోజ్‌షా కుమారుల ప్రవర్తన విషయములో ఎంతటి కట్టుదిట్టముల నేర్పరచి యున్నదీ, ఎంతటి కఠినత్వము గలిగియుండునదీ గ్రహించిన హసన్‌ఖాన్ తోక తెగిన నక్కవలె ఏమియునూ చేయలేక దూరమునుండి పార్వతిని చూచి సంతోషపడుచుండువాడు.

కాని, సుల్తాను విజయనగరము మీద దండెత్తి వెళ్ళగా, పార్వతి ముందు తన ప్రేమ ప్రదర్శనమునకు అతని కవకాశము లభించినది. అతడెన్నియో సారులు పార్వతి ముందు తనప్రేమను వెల్లడించి,ఆమెచే తిరస్కృతుడైనాడు.చివరకు అతని మితిమీరిన ప్రవర్తనమును సహించలేక పార్వతి—"ఇంకొకసారి నీవు నా జోలికి వచ్చిన నేనీ విషయమును ఖామందులకు తెలుపగలను !" అని భీతి కలిగించినందు వలన అతడు తన ప్రణయచేష్టలనూ, అశ్లీల ప్రవర్తనమునూ చాలవరకు తగ్గించుకొన్నాడు. పార్వతికూడా అతని ప్రవర్తనమును మరచిపోయినది. కాని, యీనాడది బృహద్రూపముదాల్చి ఆమెను మ్రింగునట్లుగా నిలచినది.

"అయినచో, సుల్తాను తాను హెమాందికను వివాహమాడినట్లే, నన్నుకూడా తన కుమారునకిచ్చి చేయుటకు ఆలోచించుచున్నాడా ?"

ఆమెకు ఎందుచేతనో యీ మాటను నమ్ముటకు శక్యముగాక పోయినది ! సుల్తాను అంతటి నీచుడైన తన నెందుకు అభిమాన పుత్రికగా పరిగ్రహించెడివాడు ? తన కొరకై ఎందరికిన్ని యిడుములు పడగలడు ? నా యవమానమే తన యవమానము —నా ప్రతిజ్ఞయే తన

ప్రతిజ్ఞయని తలచి, తన పగను తీర్చుకొనుటకై విజయనగరము మీద దండెత్తి వెళ్ళి, దేవరాయల గర్వము నణచలేదా ? ఆ దుష్ట ప్రభువు– ఆ దేవరాయలను పరాభవించలేదా ? చెఱలో నున్న మల్లన్నను బంధ విముక్తునిగా చేయలేదా ? తను మల్లన్నను తప్ప అన్యులను వివాహమాడ నని చెప్పగా ఆ ప్రకారమే చేయునట్లుగా మాట యివ్వలేదా ?....

సుల్తాను చెప్పిన మాట లింకనూ ఆమె చెవిలో ప్రతిధ్వనించు చునే యున్నవి. "ఎవరిని పెండ్లాడనలయునని నీకు గలదో వారినే పెండ్లా డుము ! నా అభ్యంతరములేదు. నీవు నెమ్మదిగా నుండిన నా కదియే చాలును !"

అట్లయిన, యిది నయగారపు మాటయా ?

పార్వతి ఏదియునూ నిర్ణయించలేక పోయినది ! ఆమెకు ఫిరోజ్ మీద సంశయపడుటకు మనస్కరించలేదు ! దిక్కులేని అనాధ వలె తాను అతని ఆశ్రయమునకు వచ్చినది మొదలు అతడు చూపిన సద్వ ర్తన, ఆమెను అనుమానింపకుండునట్లు చేసినది. అన్నియును విన్న తర్వాత ఆమె తండ్రితో అనినది :

"అప్పాజీ ! మీరు ఫిరోజ్‌షా గారిని గురించి చెప్పిన విషయము విస్మయము కలుగుచున్నది. వారు ఆశ్రితులైనవారి మానభంగము జేయు నంతటి పతితులైనారని నాకు దోచుటలేదు ! నన్నువారు తమ కన్నకుమా ర్తెనుగా భావించి చూచుకొను చున్నారు. అటువంటి వారు నన్ను మోస గించి, తమ కుమారుని కొసగి పెండ్లిచేసి, నా బ్రతుకును నాశనమొనర్చ గలరా ? నేను మల్లన్నను త్రికరణశుద్ధిగా ప్రేమించు చున్నానను విష యము తెలిసికూడా, నన్ను నిర్బంధముగా తమ కుమారునికి బలి గావించ గలరా ? ఎందులకో మీ మాటలమీద నాకు నమ్మిక కలుగుటలేదు! మీరు చెప్పిన విషయములు నమ్మశక్యము గాకున్నవి. బహుశః మీరు వారు చెప్పుచున్న ఏ మాటలనో విని, అపార్థము చేసుకొని యీ విధముగా ననుచున్నారేమో !"

"కుమారీ! నేను చెవులార విన్నమాటను చెప్పినను నీకు నమ్మిక పుట్టక పోవుటను చూచి ఆశ్చర్యము కలుగుచున్నది ! నాకంటెనూ నీకు

సుల్తానులమీద అంత నమ్మికయా ?.... వలదు ! నా మాట వినుము, మన మిద్దరమునూ యిచ్చటినుండి తప్పించుకొనివెళ్ళి, ఎచ్చటనైనను తలదాచు కొందము ! నీవు యిచ్చటినుండి యిప్పుడే బయటపడిన, మల్లన్నను చేబట్టి నెమ్మదిగా నుండగలవు ఇచ్చటనే వుండవలయునని పట్టుబట్టిన నీకు సర్వనాశము తప్పదు!"

"అప్పాజీ ! మీరు చెప్పున దంతయూ ముగిసియున్న, నాదొక మాట ! నేను మీ మాటప్రకారము నడచుకొనుటకు సిద్ధముగా నున్నాను! కాని, నా సంశయము యదార్థము కావలయును! కష్టదశలో నున్నప్పుడు నా కాశ్రియమిచ్చి నన్ను కుమార్తెతో సమానముగ చూచుకొనుచూ వచ్చిన సుల్తానులవిషయములో కేవలము సందేహముదాల్చి వారిని విడచి వెళ్ళలేను ! వారు నిజముగా మీరు చెప్పునట్టు గోముఖ వ్యాఘ్రమే యైనచో, మన మిచ్చటినుండి తప్పించుకొని వెళ్లుదము !"

"తల్లీ, నీవు ఈ విషయమై సుల్తానులతో మాట్లాడుట నాకిష్టము లేదు. ఇది సంశయాస్పదము కాగలదు ! అనంతరము మనమిచ్చటినుండి తప్పించుకొనుట కష్టము కాగలదు ! ఇది తొందరపడు విషయముకాదు"

"మీరు చింతించ నక్కరలేదు, అప్పాజీ ! నేను ఏ సంశయము నకూ అవకాశము కలుగని రీతిని యీ విషయమును భేదించగలను. మీ రధైర్య పడకుడు !" అని చెప్పి, పార్వతి అప్పుడే ఫిరోజ్‌షా వద్దకు యీ విషయమును తెలుసుకొనుటకై వెళ్ళినది—

"హుజూర్ ! నగరమునకు సైన్యములు ఎప్పుడు రాగలవు ?"

"ఎందులకు ? మల్లన్న ఎప్పుడు రాగలడనియా ?"

ఈ మాటకు పార్వతి చిరునవ్వునే సమాధానముగా యిచ్చినది.

"హుజూర్ ! మీరు నన్ను హాస్యమొనరించకుడు ! నా ఆవేదన ఎంతటి దనునది మీకు తెలియదు ! మీరు ఎవరినైననూ ప్రేమించి యుండిన మీ కది అర్థమయ్యేడిది !" అనినది.

"నేను ఎవరినీ ప్రేమించకపోయిననేమి కుమారీ! ప్రేమికులను చూచి ఆ యనుభవము కలిగినది !" అని నవ్వినాడు.

మీ రెవరినో ఉద్దేశించి యీ మాట లనుచున్నట్టు తెలియుచున్నది !"

"ఎవరి నుద్దేశించియు అనలేదు. ఊరకనే అనినాను...."

"మాట మార్చుచున్నారు. మీరు మీ షహజాదులను మనసున-నిడుకొని ఈమాట అనుటలేదా ?"

"ఔను, నేకీ విషయమెట్లు తెలిసినది ?"

"నేను మీ కనులను చూచి తెలుసుకొన్నాను!"

"కానిమ్ము, మా షహజాదులు నీకొరకై చాలా పరితపించుచున్నారట, అవునా ?"

"ఈ విషయము మీ చెవినికూడా పడినదా ?"

"నా చెవిని పడుటయేకాదు, కంటితోకూడా చూచినాను!"

"ఏమి విన్నారు ?—ఏమి చూసినారు ?"

"వారు నీముందు చేయుచుండిన ప్రణయచేష్టలన్నియునూ మాకు తెలిసినవి ! వారిని నేనే స్వయముగా వెళ్ళి చూచినాను. వారు నీ పరితాపములో కృంగి, కృశించి, పుల్లయై పోయినారు."

"ఇదంతయూ ప్రేమయొక్క మహిమ హుజూర్ !" పార్వతి నవ్వినది, మరల అన్నది :

"త్వరలో వారికి సరియైన కన్యను తెచ్చి లగ్నము చేయుడు. అన్నియునూ సరిపోగలవు! చూచిన స్త్రీలందరి ముందట ప్రేమాలాపము లాడుట అప్పుడు నిలువగలదు !"

"అయిన వారిని పెండ్లాడుట నీ కిష్టములేదా ?"

"షహజాదులను నేను పెండ్లాడుటయా ?"

"ఎందుకు పెండ్లాడకూడదు ?"

"వారు రాజపుత్రులు ! రేపు సింహాసనము నధివసించి, బహమనీ సుల్తానులుగా రాజ్యపాలనము చేయువారు. వారెక్కడ ?—నేనెక్కడ ?"

"అయిననేమి ? వారు నిన్ను అధికముగా ప్రేమించుచున్నారు ! నీవు సమ్మతించు నట్లయిన, నిన్ను వారికొసగి; కోడలునుగా పరిగ్రహించెదను. నీ కంటెనూ మంచి సౌందర్యముగల రాజకుమార్తె ఎచ్చట లభించ గలదు ?"

"అయినచో నన్ను మతాంతరీకరించి, మీ జనానా లోనికి చేర్చ వలయు ననుకొన్నారా ?"

"అటువంటి దురాలోచన నాకులేదు కుమారీ ! నీవు సమ్మతించు నట్టయిననే మాత్రము...."

"మీకు నే నిదివరకే, మల్లన్నను తప్ప, అన్యులను పెండ్లాడనని స్పష్టముగా చెప్పియున్నాను. ఆ మాటను మరచినారా ?"

"లేదు; జ్ఞాపకమున్నది !"

"ఉన్నచో, మరల నా పెండ్లి ప్రస్తావనయా ?"

"నీ తండ్రినైన తప్పిదమునకు కుమార్తె వివాహబాధ్యతనుఅంత సులభముగా మరువ గలనా ?"

"ఈ జన్మలో, నా వివాహము మల్లన్నతో మాత్రమే !"

"సంతోషము. ఆ యదృష్ట వంతుడగు మల్లన్నతోనే నీ వివాహము చేయుదును !"

"మల్లన్న అదృష్టవంతుడా ?"

"మరేమి ? రాజ;మహారాజులను తిరస్కరించిన వధువు మల్లన్న కంఠములో మాల వేయుచున్నదనిన, అత దదృష్టవంతుడు కాదా ?"

"అత డంత అదృష్టవంతుడే యైనచో, నావలన ఎందుల కిన్ని కష్టములు పడుచున్నాడు ?"

"ఇప్పుడు భగవంతుడైన 'అల్లా' కనులు తెరచి చూచినాడు. ఇకమీదట మీకు కష్టము లుండనేరవు."

"భగవంతుని దయయే యున్నచో మా వివాహ మెందుకు జరుగక యీ విధముగా విఘ్నము లేర్పడుచున్నవి ?"

"ఈ విషయములో నీ ఆతురత ఎంతటి దనునది నాకు తెలుసు కుమారీ ! జీవితములో నీవు చాలా వ్యథజెందిన దానవు ! త్వరలో మల్లన్నను చేబట్టి సుఖపడగలవు ! చింతించ వలదు ! నేనిప్పుడే లగ్నము నిశ్చయించి, వివాహ ప్రయత్నములు కూడా చేయుచున్నాను !"

"మల్లన్న లేనిదే వివాహప్రయత్నములా ?"

"మల్లన్న యీ వివాహమున కెట్లునూ వ్యతిరేకి కాడు. ఇకఅతడు వచ్చు వరకును పెండ్లిప్రయత్నము లెందుకాపవలయును ? ఇప్పుడే నేను ముహూర్తమును కూడా నిశ్చయించినాను. ముహూర్త సమయమునకు సరిగా మల్లన్నకూడా యిచ్చటికి రాగలడు ! ఒకవేళ వచ్చు టాలస్య మైనచో, భటులను పంపి తీసుకొని వత్తును. దీనికి నీవు సమ్మతించిన, చాలును, అంతియే !"

"మీరు చాలా చెడ్డవారు హుజూర్ !"

"ఎందులకు కుమారీ ?"

"ఇన్ని ఏర్పాటులను చేసియూ, నాకు ఒక్కటికూడా తెలుపలేదు కదా!"

"నిన్నూ, మల్లన్ననూ చకితులను చేయవలయునని ఈ విధముగా ఆచరించినాను కుమారీ ! మీ రుభయులూ వివాహ వేదికమీదనే కలుసు కొనవలయునని నేను నీ కీ సంగతి తెలుపలేదు. ఇందుకు నీవు సమ్మ తించుచున్నావుకదా?"

"మీ మాటకు నే నెప్పుడయిననూ బదులు పల్కి యున్నాన హుజూర్? నా శ్రేయస్సు నా కంటెనూ మీకే యెక్కువగా తెలియును మీ చిత్తము వచ్చినట్టు కానిండు" అని చెప్పి, వివాహ వార్త విని, సంతోషముతో ఉప్పొంగి పోవుచూ వచ్చి, తండ్రి కీ విషయముల నన్నింటినీ తెలియజేసినది. అనంతరము;

"యింతటి సహృదయులను మీరు గోముఖ వ్యాఘ్రమనిఅన్నారు కదా అప్పాజీ" అనినది.

"కుమారీ, యీ వివాహములో ఏదో మోసమున్నది. మల్లన్న లేనిదే పెండ్లిప్రయత్నమా?"

"అప్పాజీ,మీరు మొదటినుండియూ సుల్తానులపట్ల దురభిప్రాయ మునే వ్యక్తపరుచుచున్నారు. మీకు వారి మాటలు—ప్రవర్తన అన్నీ సంశయాస్పదములుగనే యున్నవి. అందుకు నే నేమి చేయగలను ?"

"నీవేమియునూ చేయవలదు. మరుమాటాడక నావెనుక బయలు దేరి రమ్మా."

"అది సాధ్యముకాని పని."

"అట్లయిన నేను వెళ్ళి—మల్లన్న వచ్చువరకునూ యీ వివాహ ప్రయత్నముల నాపవలసినదని సుల్తానుకు చెప్పి వచ్చెదను."

"సుల్తానులు మమ్ములను—దీర్ఘకాలము వియోగ దుఃఖమునను భవించిన మమ్ములను—చకిత పరచుటకే విధముగా చేసినారు. అప్పాజీః మేము పరస్పరము కలుసుకొనుటకు వివాహ వేదిక కన్ననూ ఉత్తమ మైన స్థలముగలదా। మీరు నా కొరకై విఘ్నకారకులు కారాదు। అట్లు చేసిన నా మీద ఆన।" అని తండ్రినోరు మూసినది.

"తిమ్మాజీ పార్వతిని చురచుర చూసి, ఏదో నిర్ణయించుకొని అచ్చటినుండి వెళ్ళిపోయినాడు।

# మోసకృత్యము

## 16

అంతఃపురములో పార్వతి వివాహప్రయత్నములు గొప్ప ఎత్తున జరుగుచున్నవి. ఎంతైననూ పార్వతి సుల్తాను ఫిరోజ్‌షా వారి అభిమాన పుత్రిక కదా! ఆమె అంతస్తుకు తగిన వైభవముతో ఆమె వివాహపు ఏర్పాటులు గావించబడినవి. శిల్పులు; చిత్రకారులు; కళాకోవిదులు నూరారు మంది ముందుగనే వచ్చి వివాహ మంటప నిర్మాణమునకు పూనుకొన్నారు. పగలు—రాత్రి విధి విరామములు లేక మంటపపు అలంకారములు జరుగ సాగినవి. ఫిరోజ్‌షా పార్వతి వివాహమును హిందూ శాస్త్ర పద్ధతి ప్రకారము జరుపుటకు తీర్మానించినాడు. పర్యవేక్షకుడుగా సుల్తానే స్వయముగాని లబడి అన్నియునూ చూచుకొన సాగినాడు.

ముహూర్తపురోజు సమీపించిన కొలదిని పార్వతి ఉత్సాహము చల్లారిపో సాగినది। ఆమె చకోరపక్షి వలె నిరీక్షించుచూ యుండిన—

చంద్రుడు—మల్లన్నతో వివాహమున కిక కొన్నిరోజుల వ్యవధి మాత్రమే యున్నది. ఆమె ఒకచోట క్షణకాలము నెమ్మదిగా నిలువ లేక పోయినది! ఆమె తమకమును చూచి తిమ్మోజీకి ఆశ్చర్యము కలుగసాగినది. మల్లన్న—పెండ్లికుమారుడు—లేని వివాహము అత నికి విచిత్రముగా తోచినది! దీనిలో నేదియో దురాలోచన మున్నదని అతనికి దోచినది! ఏ విధముగా నైననూ పార్వతిని ఫిరోజ్‌షా దుష్టతంత్రము నుండి తప్పించుటకు నిశ్చయించినాడు. కాని, ఎట్లు తప్పించ వలయు నన్నది మాత్ర మతనికి తెలియలేదు!

ముహూర్తము దగ్గరపడిన కొలదిని అత డుద్విగ్నుడు కాసాగి నాడు. అందులో పార్వతి కూడా పాలుపంచు కొనినది. ఇది గ్రహించిన ఫిరోజ్‌షా, మల్లన్నను ముహూర్తసమయమునకు తీసుకొని వచ్చుటకై లేఖ వ్రాసి, దూతలను పంపియున్నట్టు, అతడు ఎచ్చట నున్ననూ ముహూర్త సమయమునకు తప్పక రాగలడనియునూ, ఆ విషయమై పార్వతి చింతించవలసిన పనిలేదనియునూ చెప్పి, ఆమెను సమాధాన పరచినాడు అతడు చెప్పిన మాటను నమ్మి పార్వతి నిశ్చింతురాలైనది.

ముహూర్తము రేపనగా ఫిరోజ్‌షా చెప్పిన మాటలు నిజమను నట్టు, మల్లన్న రాజధానికి వచ్చియున్నట్టూ, అతనిని అతిధి గృహములో నుంచినట్టూ, ముహూర్తపురోజు వివాహ మంటపమునకు సకల రాజ మర్యాదలతో తీసుకొని వచ్చునట్టూ వార్త పుట్టినది. ఇది విని పార్వతి హృదయ ముప్పొంగి పోయినది! సంతోషముతో చిందులు త్రొక్కి నది! ఇక కొన్ని ఘడియల అనంతరం తమ పునస్సమాగమము కాగల దని ఆమె కలలు గన్నది. కాని, తిమ్మోజీకి మాత్రము ప్రాణములలో ప్రాణములేక పోయినది. ఇదంతయునూ నేదియో కుట్రయని అతనికి తోచినది. కాని, అది యింతటిదని చెప్పుటకు సాధ్యము లేకున్నది. అతడు తన జాగ్రత్తలో తాను వుంటూ, పార్వతిని ఎట్లయిననూ సుల్తాను కుతంత్రమునుండి తప్పించుటకు శరీరమంతయూ కనులు చేసుకొని చూచుచూ కూర్చున్నాడు.

ఆరోజు కూడా వచ్చినది—

ముహూర్తపు రోజు పార్వతి వేకువనే లేచి తన ప్రాతర్విధులను తీర్చుకొనినది. సుమంగళులచేత అభ్యంగ స్నానము చేయించుకొని, అలంకరించుకొనుటకు కూర్చున్నది. నూరారుమంది దాసీ లామె అలంకరణకై నిలచినారు. విచిత్ర మనునట్టుగా ఆనాడు హేమాంబికయే స్వయముగా పార్వతిని సింగారించుటకు ముందుకు వచ్చి, ఆమెను చక్కగా రాజపుత్రికవలె అలంకరించినది.

ఆమె పార్వతికి పట్టు పీతాంబరమును కట్టి, దానికి తగిన చీనాంబరపు మేలుకట్టును అందముగా కట్టినది. నవరత్న ఖచితమైన కంఠాభరణమును మెడలో వేసినది. ముత్యములతో, రత్నములతో చేయబడిన స్వర్ణ కంకణములను హస్తములకు తొడిగినది. కాలికి బంగారు నూపురమును ధరింపజేసినది. ముఖమును అత్తరు పన్నీటితో కడిగి, కనుబొమలను కాటుకతో దిద్ది, వాటిమీద సింధూరముతో సన్న సన్నని చుక్కలను విల్లువలె పెట్టినది. కనులకు నల్లటి రంగు పులిమి వాటిని ఎగిరివచ్చు చున్న భ్రమరములని భ్రాంతి గొల్పునట్లు చేసినది. తలవెండ్రుకలను నున్నగా దువ్వి, ముడిని చిత్రాకర్షముగా కట్టి, నవరత్న ఖచితమైన జడ బిళ్ళను పెట్టినది. నవమల్లికా పుష్పముల మాలతో ముడి నలంకరించినది. సహజ సౌందర్యవతియైన పార్వతి యిప్పుడీ అలంకారములతో మరింత సౌందర్య రాశియై, శివుని వశపరచుకొనుటకై మన్మథ సాయమున బయలుదేరిన పర్వత రాజపుత్రివలె గోచరించినది. కాని ఆమెకు జరిగిన పరాభవమే ఈమెకునూ జరుగ గలదని ఎవరూ అనుకొనలేదు!

ముహూర్త సమయ మాసన్నమైనది. విశాలమైన వివాహ మంటపములో సుల్తాను బంధుమిత్రులూ, అతిథులూ, ఆహ్వానితులూ అగ్ని హోత్రుని ప్రతిష్ఠాపనచేసి, హోమమునకు సిద్ధులైనారు. అందరూ వధూవరుల ఆగమనమును నిరీక్షించుచూ కూర్చొనియుండగా, వరుని రాజపుత్రునివలె అలంకరించి, తగిన మర్యాదలతో వివాహ మంటపమునకు తీసుకొని రావడమైనది. అతని కెదురుగా తెరను పట్టుకొని యున్నారు. ఇప్పుడందరూ వధువు రాకను నిరీక్షించుచూ కూర్చున్నారు.

ముహూర్త సమయము మించిపోవుచున్నదని పురోహితులు త్వరిత పెట్టుచున్నారు. సుల్తాను అలంకారము ముగిసియుండిన పార్వతిని వెంటనే పిలుచుకొని రావలసినదని దాసీలకు ఆజ్ఞాపించినాడు. దాసీలు ఈ వార్తను హేమాంబికకు తెలియజేసినారు. హేమాంబిక పరిచారికల నందరినీ అలంకరణ గదినుండి వెలుపలికి పంపివేసి, అలంకరణకు చివరన దృష్టిబొట్టు పెట్టుచూ, పార్వతితో మెల్లగా అనినది. ఆమె మాటలను తిమ్మోజీకూడా శ్రద్ధగా విన్నాడు—"పార్వతీ! ఇంతటి మంగళ ముహూర్తములో అమంగళము పలుకుటకు నాకు మనసు రాకున్నది. మల్లన్నను నీవు ప్రాణమునకంటెనూ ఎక్కుడుగా ప్రేమించుచున్నావు. ఆ విషయము నేను బాగుగా ఎరుగుదును. అతనికొరకై సామ్రాట్లను కూడా తిరస్కరించినావు. నీ ఆదర్శ ప్రేమను చూచి నే నీ విషయమును నీకు చెప్పవలయునని నిశ్చయించినాను....

"నీవు నా తండ్రిమీద పగదీర్చుకొన బ్రయత్నించి నా జీవితమును నాశమొనర్చినావు. అదే విధముగా నీ జీవితమునుకూడా నేను నాశనముచేసి యుండవచ్చును. కాని కోపావేశమున నీవు వివేకమును కోల్పోయి, పగతో ఆత్మఘాత మొనరించుకొన్నట్టే. నేను పగకు వశవర్తినిని కాలేదు. నీవును నావలెనే బ్రతుక గోరుచున్న ప్రాణివి. నిన్ను చూచిన నాకు సంకటము కలుగుచున్నది. 'అయ్యో' యనిపించుచున్నది. అందులకే యీ మాటలు చెప్పుచున్నాను.

"నేను చెప్పుమాటలు నిజము కావచ్చును, లేదా అబద్ధములూ కావచ్చును. కాని నా చెవిని పడిన సంగతి నీకు తెలియజేయుచున్నాను నన్నీ నీచుడగు సుల్తాను ఫిరోజ్‌షా నాశమొనర్చినట్టే, నిన్నుకూడా నాశమొనరించుటకు నిశ్చయించినాడు. నన్ను తన కామేచ్ఛకు బలిగావించుకొన్నటే, నిన్నుకూడా తన కుమారుని కొసగి పెండ్లి చేయుటకు నిశ్చయించినాడు. కాని ఈ వివాహమునకు నీవు సమ్మతించవని గ్రహించి, నిన్ను మోసగించుటకే కపట నాటక మాడుచున్నాడు.

"వాస్తవాంశ మేమనగా, మల్లన్న నిజముగా యిచ్చటికి రాలేదు. అతనికి నీ వివాహ విషయమే తెలియదు. అతని పేరుతో యీ రోజు

నీ చేతినుండి మాల వేయించుకొను వ్యక్తి హసన్‌ఖాన్. సుల్తాను పుత్రుడు. ఒక్కసారి అతనిచే నీకు మాంగల్యధారణ చేయించిన, యిక నీ సమాధి సిద్ధమైనట్లే. నీవు నిజముగా మల్లన్నను ప్రేమించుచున్నచో- కామాంధుడైన మ్లేచ్ఛుని పెండ్లాడుట కన్ననూ ప్రియునికై ప్రాణము విడచుట మంచిది. నీ శరీర మపవిత్రము కాకముందే దాని కంత్యమును దెచ్చుకొనుట నేయిరెట్లు మేలు. అటువంటి సమయములో నీకు సాయ పడుటకు ఈ దృష్టిబొట్టును నుదుట పెట్టుచున్నాను. చూచుటకిది కుంకు మవలె కనబడినను యిందులో కాలకూట విషము దాగియున్నది.దానిని నోట వేసుకొనిన నీ సౌశీల్యమును కాపాడుకొన వచ్చును. నీ మాన మును దక్కించుకొనవచ్చును. నిన్ను వంచించిన సుల్తానును నీవు వంచించ వచ్చును" అని చెప్పి, అప్పటినుండి మెఱుపువలె మాయమై పోయినది హేమాంబిక. ఆమె అదివరకెన్నడూ ఆవిధముగా పార్వతితో ఆత్మీయముగా మాటాడి యుండలేదు. ఆమె చెప్పిన విషయాలను విని పార్వతి బొడు గరచుకొనినది.

అయినచో, తాళిగట్టవచ్చిన వాడు మల్లన్న కాదా ? అతడు.... ఆమె ఆలోచించుటకు సైతము భీతిల్లినది. అంతలో పురోహితులు ముహూర్తము మించిపోవుచున్నదని మరల ఒకసారి తొందరపెట్టినారు. ఈ పర్యాయము పార్వతిని వివాహ వేదిక మీదికి తీసుకొని వచ్చుటకై సుల్తాను తనే స్వయముగా వెళ్ళినాడు. అతడటు వెళ్ళుటయు, పార్వతి తన తండ్రివెంట వివాహ మంటపమునకు వచ్చుటయు రెండునూ ఏక కాలములో జరిగినవి.

పార్వతి వచ్చి తెరకొక వైపున నిలబడినది.మరొక వైపు వరుడు నిలబడి యున్నాడు. పురోహితులు మంత్రఘోష చేసినారు. మంగళ వాద్యములు మారుమ్రోగినవి. బ్రాహ్మణులు రాజాశీర్వాదమునకు సిద్ధ పడినారు. ఉన్నట్టుండి వధూవరులమధ్య నున్న తెర క్రిందికి దిగినది. పురోహితులు పార్వతికి జీలకర్ర బెల్లము వేయుమని చెప్పినారు.వాటిని మల్లన్న మీద వేయుటకు ఆమె అతనివైపు చూచినది.

ఆశ్చర్యము ! ఎదుట మల్లన్నకు మారుగా హిందూ వరుని వేష భూషణములలో సుల్తాను పుత్రుడు హసన్‌ఖాన్ నిలబడి యున్నాడు. ముఖము చుట్టునూ పూలగుత్తులను జార్చి యుండుటచే అతని వదనము సరిగా ప్రజలకు కనబడుటలేదు. కాని పార్వతి కనులు తనకు చిరపరి చితమైన మల్లన్న సుందర వదనమును వెతికినవి. అతనికి మారుగా హసన్‌ఖాన్ ముఖము కనబడినది. ఆమెకు వెంటనే తండ్రిమాటలు జ్ఞప్తికి వచ్చినవి. 'వరుడు లేనిదే పెండ్లియా ? దీనిలో నేదో మోస మున్నది' సుల్తాను చెప్పిన మాటలు కూడా జ్ఞప్తికి వచ్చినవి.'నీవు కోరిన వానిని పెండ్లాడుము. నీవు నెమ్మదిగా నుండుటయే నాకు కావలసినది' తండ్రి మాట చెవిలో ప్రతిధ్వనించినది : "నీవు ఆ నీచుని తండ్రి సమానుడని, ఆప్త బంధువని భావించినావు. చూడుము అతని గోముఖ వ్యాఘ్రత్వము...."

"అప్పాజీ, మీరు వారి విషయములో పూర్వాగ్రహ పీడితులై యున్నారు వారి ప్రతి మాట—ప్రవర్తనలో మీకు సంశయమే గోచ రించుచున్నది" అనిన తన మాటలుకూడా తలపునకు వచ్చివి.

"నీవు పగకు వశవర్తినివై నా జీవితమును నాశముజేసినావు.కాని నీ జీవితమును నాశమొనర్చుట నా కిష్టములేదు. కామాంధుడైన ఆమ్లే చ్ఛుని పెండ్లాడుటకంటెనూ, ప్రియునికొరకై ప్రాణము విడచుటమేలు. ఈ దృష్టిబొట్టు చూచుటకు కుంకుమవలె కనబడిననూ, ఇందులో కాల కూట విషమిమిడి యున్నది. దానిని తిని నీ శీలమును కాపాడుకొన వచ్చును. నీ మానమును దక్కించుకొన వచ్చును. నిన్ను వంచించిన సుల్తాన్‌ను వంచించ వచ్చును."

—హేమాంబిక మాటలను తలచుకొనుచుండగనే పార్వతి తల తిరుగసాగినది. ఆమె కనులకు చీకటి గ్రమ్మినట్లయినది. వేయి కంఠ ములు తనను వెక్కిరించుచున్నట్లయినది. ఆమె కనులముందు ఒకసారి సామ్రాట్ దేవరాయలు, మరొక సారి మల్లన్న, వేరొకసారి హసన్ ఖాన్ కనబడసాగినారు. హసన్‌ఖాన్ వికటముగా నవ్వుచున్నాడు. అతని ననుసరించి ఫిరోజ్‌షా పైశాచికపు నవ్వు నవ్వుచున్నాడు. హసన్‌ఖాన్

పార్వతిని చేబట్టబోవుచున్నాడు. అది చేయికాదు-పాముపడగ! 'అయ్యో' అని అరచి, పార్వతి నేలకూలి పోయినది. ఆమె నుదుట నుండిన కుంకుమబొట్టు మాయమైనది. దానిని పార్వతి మ్రింగి చాలసేపైనది.

పార్వతి నేల కూలుటచూచి, ప్రజలు హాహాకారములు చేసినారు. హసన్‌ఖాన్‌దే స్వయముగా బొబ్బపెట్టినాడు. తిమ్మోజీ ఆమెవద్దకు పరుగున వచ్చినాడు. ఫిరోజ్‌షా దిగులుజెంది వచ్చి నిలబడినాడు. పురోహితులు పార్వతికి మెల్లగా గాలి విసిరినారు హకీములకు వెంటనే కబురు వెళ్ళినది. వారుకూడా పరుగున వచ్చినారు. హకీములు ఏదో రసమును పార్వతి నోటిలో పిండినారు. అది కడుపులోనికి వెళ్ళక మునుపే వమనమైనది. ఒక్కసారి ఆమెకు స్మృతి కలిగినది. తండ్రిని దైన్యముగా చూచి, ఏదో గొణిగినది. "మల్లన్నా.....క్షమించు...." అన్న మాట మాత్రము అస్పష్టముగా వినబడినది. మరుక్షణములోనే ఆమె బాధగా మూల్గి, కనులు మూసుకొన్నది. మరల ఆ కనులు తెరువ బడలేదు.

"హుజూర్ ! ఆమె కాలకూట విషము మ్రింగినది" హకీములనినారు.

"ఎట్లయిననూ చేసి ఆమెను బ్రతికింపుడు, హకీములూ !" ప్రార్థనా పూర్వకముగా సుల్తాను అనినాడు.

"ఆమె అల్లా పాదములు చేరినది హుజూర్" అని చెప్పి హకీములు ముఖము వాల్చుకొన్నారు.

చివరకు తిమ్మోజీ చెప్పిన మాట నిజమైనది.

సుల్తాను పార్వతిని బలవంతముగా తన కుమారుని కొసగి వివాహము చేయలేక, మోసముతో ఆ కార్య మాచరించుటకు నిశ్చయించినాడు. తనను మోసగించ ప్రయత్నించిన సుల్తాన్‌ను పార్వతి తగిన రీతిని మోసగించినది.

కుమార్తె శవముమీద తలనుంచి శోకించుచున్న తిమ్మోజీనిచూచి, సుల్తాను సమాధాన పరచుచున్నట్టుగా అన్నాడు :

"పార్వతి మంచి పిల్ల. నిష్కారణముగా విషముతిని ఆత్మహత్య

చేసుకొన్నది. ఎవరో ద్రోహులు చెప్పిన మాట విని, తన సుకుమార జీవితమునకు చిచ్చుపెట్టుకొనినది. అన్యాయముగా ఆమె జీవితము నాశనమైనది" ఇది విని తిమ్మోజీ కడుపున నిప్పులు గుమ్మరించినట్టయినది. అతడు గర్జించినాడు.

"ఛండాలా! దూరము తొలగుము. నాకు ముఖము చూపకుము. పార్వతిని చంపినవాడవు నీవు! ఆమె సుకుమార జీవితమునకు చిచ్చు పెట్టిన వాడవు నీవు. ఛీచా! వెళ్ళుము, ఇచ్చటినుండి వెళ్ళిపొమ్ము" అని కోపము నాపుకొనలేక పిచ్చివానివలె అరచినాడు.

ఇంకనూ ఎక్కువ మాటల కవకాశమిచ్చిన, తిమ్మోజీ వలన తన మోసమంతయూ బయట పడగలదని భావించి సుల్తాను —

"పట్టుకొనుడు. అతనిని, నోటికి వచ్చినట్టు వాగుచున్న ఆ పిచ్చివానిని పట్టి చెరసాలలో వేయుడు" అని ఆజ్ఞాపించి, అచ్చటినుండి వెళ్ళిపోయినాడు.

వివాహ మంటపములో కోలాహలము బయలుదేరినది. ప్రజలు నోటికి వచ్చినట్లు మాట్లాడుకొన సాగినారు. అంతలో భటులువచ్చి వివాహ మంటపములో నున్న జనులందరినీ వెలుపలికి పారద్రోలి, పరిస్థితిని స్వాధీనమునకు తెచ్చినారు. అయిననూ ఊరివారి నోరు మూయుటకు సుల్తాను వలన సాధ్యము కాకపోయినది. వివాహ మంటపములో జరిగిన హత్యాకాండను గురించి ప్రజలు తమకు తోచినట్లు చెప్పుకొని-ఫిరోజ్‌షాను యిష్టమువచ్చినట్టు దూషించినారు. దీని నరికట్టుటకు ఫిరోజ్‌షా నగరమంతటా సైనికులను; గూఢచారులను నియమించినాడు. తనకు వ్యతిరేకముగా ప్రవర్తించిన వారిని చెరసాలలో పడవేయుడని ఆజ్ఞాపించినాడు.

మల్లన్న రాజధానికి వచ్చునప్పటికి సుల్తాన్‌ను గురించి ప్రజలు బహిరంగముగా మాట్లాడుకొనక పోయిననూ, లోలోపల రకరకములుగా అనుకొన సాగినారు. నగరమునకు వచ్చిన మల్లన్నకు తిమ్మోజీగాని, పార్వతిగాని స్వాగతము చెప్పుటకు రాలేదు. చెరనుండి విముక్తిజెంది,

పార్వతిని కలుసుకొనుటకై వెళ్ళుచున్న తనకు ఘనమైన స్వాగతము లభించవచ్చునని అత డూహించినాడు కాని ఎవరు స్వాగతము పల్కుటకు రాకపోయిననూ, తనకొరకయి యింతటి సాహసము లొనరించిన పార్వతి యైననూ తప్పక తనకెదురువచ్చి తోడ్కొని పోగలదనిభావించినాడు. పార్వతితో తను మున్ముందు జరుపబోవు వైవాహిక జీవితములోని సుందర స్వప్నములను చూచుచూ వచ్చినాడు. కాని గుల్బర్గలో అడుగిడిన ఘడియలోనే అతని కచ్చటి విష వాతావరణమును గురించి తెలిసినది. తను వీధివెంట వెళ్ళుచుండగా గురుతు — పరిచయము లేని జనులు తనను చూచి నవ్వుకొన సాగినారు. కొందరు నిట్టూర్పులు విడువ సాగినారు,మరికొందరు తిరస్కార దృష్టితో తిలకించ సాగినారు. కాని ఎవరునూ అతనికి జరిగిన సంగతి ఏమియో తెల్పక పోయినారు. అందరునూ సుల్తానుకు భయపడి, తమ నోళ్ళకు తాళములను వేసుకొన్నారు.

సాయంకాల మగునప్పటికి ఎవరిద్వారానో జరిగిన హత్యాకాండ యొక్క కథ మల్లన్నకు తెలిసినది. అతడీ వార్త విని కోపముతో మండిపడినాడు. కాని వాస్తవముగా జరిగిన విషయమేమియో ఎవరికిని బోధపడలేదు. ఆనాటి వివాహ మంటపములో జరిగిన విషయమును ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా చెప్పసాగినారు. కొందరు సుల్తాను కుతంత్రమునకు బలియైన పార్వతి ఆత్మహత్య చేసుకొనినదని చెప్పిన, మరి కొందరు ఎవరో ద్రోహులు చెప్పిన మాటవిని ఆత్మహత్య చేసుకొనినదని చెప్పసాగినారు. పార్వతి మరణించిన సంగతి నిజమైననూ, ఆమె మరణమునకు కారణము మాత్రము స్పష్టముకాలేదు. పార్వతి ఎందులకు వివాహ మంటపములో ఆత్మహత్య చేసుకొనిన దనునది తెలియక పోయినది. ఈ విషయమును భేదించుటకు మల్లన్న వలనకూడా సాధ్యముకాక పోయినది. సుల్తాన్‌ను దర్శించి; అతని ముఖతః అన్నియునూ తెలుసుకొనగోరి, పిచ్చివానివలె అంతఃపురమునకు వచ్చినాడు.

ద్వారపాలకులు వాకిలి వద్దనే అతని నడ్డగించ బోయి, అతడు మల్లన్నయని తెలియగా, పరుగునవెళ్ళి సుల్తానుకు తెలియజేసినారు. ఇది

వినగానే అతని వడుము విరిగినట్లయినది. మల్లన్నకు తెలియకుండా పార్వతిపట్ల తా నొనరించిన విద్రోహమునెట్లు దాచడమనునది అతనికి తోచక పోయినది. ఎట్లయిననూ, అతనిని ఉపాయముతోనే సాగనంప వలయునని నిశ్చయించి, మల్లన్నను మర్యాదతో తనవద్దకు తీసుకొని రావలసినదని భటులను పంపినాడు. అతడు వచ్చునంతలో సుల్తాను అత నిని తన పరమశత్రువుయొక్క వినాశమునకు ఉపయోగించుకొనుటకు నిశ్చయించినాడు.

మల్లన్న కోపోద్దీపితుడై వచ్చి, కాలయమునివలె సుల్తానుముందు నిలబడినాడు. అతని రేగినతల, ఎరుపెక్కిన కనులు, నిప్పులను గ్రక్కు చున్న తీక్షణమైన చూపు, తిరస్కార భావముతో కూడిన నవ్వు అన్ని యూ అతడున్మత్తుడనుటకు సాక్షిగా వున్నవి. అయిననూ సుల్తాను అధైర్యపడక, శాంత స్వరముతోనే అన్నాడు-"మల్లన్నగారూ,ఎప్పుడు వచ్చినారు. క్షేమముగా వున్నారు కదా?"

"ఖామంద్, నా క్షేమసమాచార మటుండనిమ్ము! ముందు పార్వతి విషయమును తెలుపుడు ?" అని గర్జించినాడు.

"మీరు కూర్చొని, శాంత మనస్కులరై వినునట్టయిన మీతో మాట్లాడవలసిన విషయము లనేకములున్నవి. కాని నిలబడిన చోటనే అన్నియును చెప్పమని కోరిన ఎట్లు సాధ్యపడగలదు ?"

"ఇటువంటి నయగారపు మాటలతో నన్ను వంచించలేరు సుల్తానులూ ? మీరు పార్వతిని ఏమిచేసినారో ముందు సెలవిండు ! ఆమె ఎందుల కాత్మహత్య చేసుకొనినదను విషయమును తెల్పుడు"

"మల్లన్నగారూ, ఈ స్థితిలో మీకు పార్వతి విషయమును తెలియ చేయవలసి వచ్చినందుకు చాలా విషాదముగానున్నది. పార్వతిని గురించి ఎవరో 'యిల్లామల్లి' మాటలు చెప్పువానిని నమ్మి, మీరు నామీద ఆమె హత్యారోపణను మోపుచున్నట్టు తెలియుచున్నది. కాని నా ప్రేమంపు బొమ్మ, నా అభిమాన పుత్రిక పార్వతి వియోగముతో నేను ఎంత వ్యధ జెందుచున్నాననునది మీరు గ్రహించకున్న నా మనస్సుకు నొప్పి కలుగ

జేసెడివారుకారు. ఇంతకునూ నా దురదృష్టము! అంతటి కన్యారత్నమును దక్కించుకొను భాగ్యమును పరమాత్ముడైన 'అల్లా' మాకు ప్రసాదించి యుండలేదు" అని చెప్పి నిట్టూర్పు విడచి, కనుకొలకులనుండి కారు చున్న అశ్రువులను కరవస్త్రముతో తుడుచుకొనినాడు.

ఇదిచూసి యిదేమియూ మొసలి కన్నీరు కాదుకదా ? తనను మోసగించుటకు ఆడిన నాటకము కాదుకదా? అని తననుతానే ప్రశ్నించు కొన్నాడు మల్లన్న. అయిననూ అతని కోపముపశమనము కాలేదు. ఇంకను భావోన్మాదముతో మునిగియున్న అతడు మరల గర్జించినాడు :

"హుజూర్ ! పార్వతి మరణమునకై నాకు చింతలేదు. ఆమె వీర వనితవలె జీవించి, వీరవనితవలెనే మరణించినది! కాని, ఆమె మరణము నకు కారకులెవరు? ఎందుకామె ఆత్మహత్య చేసుకొనినది? అను విష యములు తెలియవలసి యున్నది! ఆమె చావుకు కారకులైన ద్రోహు లెవరైననూకానీ, వారిమీద పగదీర్చుకొనక మానను! ఉన్నదియున్నట్లు, యథార్థము నెరుకపరచుడు! మీరు నిజముగా పార్వతి అభిమానపాత్రులై నచో, ఆమె మరణముతో శోకము కలిగియున్నచో ఏ విషయమునూ దాచక నాతో చెప్పగలరు"

"పార్వతి చావునకు కారకులెవరో చెప్పుటెట్లు మల్లన్నా ! ఆమె ఆత్మహత్య చేసుకొనిన విధానమునుబట్టి చూడగా, యిదంతయూ ఎవరిదో ద్రోహుల పనితనమని తెలియుచున్నది. కాని జరిగిన సంగతులెవరికి కావలయును ? నేను పార్వతి వివాహము మీతో చేయ నిశ్చయించినదే నా యపరాధమైనది! పార్వతి హత్య నాచే జరుపబడినదను నంతవరకు, ప్రజల నిందకు పాత్రుడనైనాను! ఇదంతయూ నా దురదృష్టము! అల్లా నా నుదుట యీ విధముగా వ్రాసియుంచిన నేను మాత్రమేమి చేయ గలను?"

"ఏమీ, మీరు పార్వతి వివాహమును చేయ నిచ్చగించినారా?"

"ఔను! మీతో ఆమె వివాహముచేయ నిచ్చగించి, ముహూర్త మును గూడా నిశ్చయించినాను. ముహూర్త సమయమునకు ఎచ్చట

నున్ననూ బయలు దేరి రావలసినదని మీకు లేఖ వ్రాసి పంపినాను. కాని, పార్వతి యొక్కయు, నాయొక్కయూ దురదృష్టమువలన ఆ లేఖ సకాలములో మీ చేతికందక, ఈ దుస్సంఘటన అన్నింటికినీ కారణ మైనది."

"నాకు తెలుపకనే నావివాహమును నిశ్చయించినారా?ఆశ్చర్యం!"

"ఇందులో ఆశ్చర్య పడవలసిన దేమియునూ లేదు. మిమ్ములను పార్వతి ఎంత గాఢముగా ప్రేమించుచున్నదను విషయము తెలిసిన వారి కిది ఆశ్చర్యకరముకానేరదు. పార్వతి సాధ్యమైనంత శీఘ్రముగా ఈ వివాహము నెరవేర్చవలయునని తొందరపెట్టసాగినది. ఆమె కోర్కె ప్రకారము ముహూర్తమును నిశ్చయించి, మీకు లేఖ వ్రాసినాను"

"మీరు వ్రాసిన ఏ లేఖయునూ మాకు అందలేదు"

"పార్వతి హత్యానేరం నామీద మోపబడినది; అందువలననే. నేను వ్రాసిన లేఖ మీకు సకాలములో ముట్టి, మీరు ముహూర్త సమయమునకు వచ్చివుండిన అన్నియునూ నిశ్చయించిన ప్రకారమే జరిగి యుండెడివి. మీరుభయులూ పెండ్లాడి సుఖముగా నుండెడివారు. కాని మా దురదృష్టమువలన లేఖ అందక, మీరు సకాలమునకు రానైతిరి. ఇటువంటి సమయముకొరకే ఎదురుచూచుచుండిన మీవైరులెవరో ఆమెకు విషమునిడి, ఆమెను మోసముతో హత్యచేసినారు"

"ఏమీ? నా వైరులెవరో విషమునిడి పార్వతిని హత్యచేసినారా?"

"ఔను! వారు పార్వతి మీచేబట్టుటను తప్పించుటకై, విష ప్రాశనతో నామెను యుక్తిగా హత్యచేసినారు. లేనిచో వివాహమంటప ములో ఆమె మరణించగలదా!"

"నాకు ద్రోహము తలపెట్ట ప్రయత్నించినంతటి దురాత్ములెవరు? వారు నిరపరాధియైన పార్వతిని చంపి, నామీద ఎందులకు పగ దీర్చు కొనినారు?"

"అదంతయూ చాల పెద్దకథ మల్లన్నగారూ! మీరు శాంత మనస్కులరై వినునట్టయిన చెప్పగలను"

"పార్వతి నెవరు హత్యచేసినారో చెప్పుడు! వారెవరైననూ

సరియే. పంపాపతి సాక్షిగా వారిమీద పగదీర్చుకొనెదను. స్వర్గములో నున్న పార్వతి ఆత్మకు శాంతి కలుగజేయుదును। ఈ కార్యములో యీ శరీరము నశించిపోయిననూ సరియే. నేను బ్రతికివున్నచో ఆ పాతకుల మీద పగదీర్చుకొనక మానను"

"పార్వతి మరణకారకులైనవారు మీకు చాల కావలసిన వారు. వారీ హేయకృత్యమునకు పూనుకొనిరనిన నమ్ముటకూడా కష్టము. కాని, రాజనిష్ఠ ఎంతటివారి నెంతటి కార్యమునకు పేర్రేపించగలదనుట కిది యొక ఉత్తమోదాహరణము। తన ప్రభువుకిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకొనుటకు ఒకవ్యక్తి తన కుమార్తెను మాత్రమేకాదు. అభిమానపుత్రుని అభ్యుదయమునుకూడా చేజేతులా దూరము చేసుకొనిన విచిత్రమైన వాస్తవికతా నిదర్శనము పార్వతీ పరిణయ ప్రకరణములో నున్నది."

ఈ మాట విని మల్లన్న బొడుగరచినాడు.

"అయినచో మీరు చెప్పుచున్న హత్యాకారి...."

"మరెవరోకాదు. మీ అభిమాన గురువు, తండ్రియని నీవు భావించిన ఆ మహితైషియైన తిమ్మోజీగారు...."

"ఏమీ? తిమ్మోజీగారు। నన్నీస్థితికి తీసుకొని వచ్చిన పుణ్య స్వరూపులైన తిమ్మోజీగారు, కలలోసైతము నాకు ద్రోహము దలచని తిమ్మోజీగారు, నా....కాదు, వారి మోహంపుబొమ్మ - ప్రాణములో ప్రాణము - ప్రేమలత యందలి పూవు - అభిమాన దేవతయగు పార్వతిని హత్యజేసినారా? ఆశ్చర్యము। మీరు వారిపై మిధ్యారోపణను మోపుట లేదుకదా?...."

"నా మాటలు నమ్ముట కష్టము। అయిననూ యిది వాస్తవ సత్యము। కఠోరమైన సత్యము।।"

"తిమ్మోజీగారు తమ సొంత కుమార్తెమీద, తాము కని, పెంచి పెద్దదానినిగా చేసిన ఒకేఒక వంశాంకురమగు పార్వతిమీద చేయి చేసుకొనినారా? ఆమె సుకోమల జీవితమునకు చిచ్చుపెట్టినారా?"

"మల్లన్నగారూ, యిదివరకే విన్న వించుకొన్నాను, దీనిని నమ్ముట కష్టమని. కాని, అల్లాసాక్షిగా యిది సత్యము।"

"ప్రాణమున కంటెను ఎక్కుడుగా చూచుకొనుచూ వచ్చిన తిమ్మోజీగారే పార్వతి నెందులకు హత్య చేసినారు?"

"అది సాంగముగా వినునంతటి వ్యవధిమీకున్నచో చెప్పగలను. అంతయునూ వినినతరువాత నిజమైన హత్యాకారు లెవరని మీరే తీర్పు చెప్పుడు!" అని దీర్ఘముగా నిట్టూర్పు విడచినాడు ఫిరోజ్‌షా.

"నిస్సంకోచముగా చెప్పుడు! సత్యము నెవరునూ దాచియుంచ లేరు! తిమ్మోజీగారు నిజమైన హత్యాకారు లైనచో, వారుకూడా దానికి తగిన శిక్ష ననుభవింపక పోరు! మీరు నిర్భయముగా చెప్పుడు!" మల్లన్న గంభీరముగా అనినాడు.

ఈ మాటలతో ఉత్తేజితుడైన ఫిరోజ్‌షా తన కట్టుకథను ఒప్ప జెప్పినాడు.

"తిమ్మోజీగారు ఒకనాడు సామ్రాట్ దేవరాయల ఆజ్ఞమేరకు పార్వతిని విజయనగరమునకు తీసుకొని పోవుటకయి యిచ్చటికి వచ్చిన విషయము మీకు జ్ఞప్తి యుండవచ్చును....!"

"ఉన్నది!"

"తిమ్మోజీగారికి పార్వతిని సామ్రాట్ దేవరాయల కొసగి వివాహము చేయవలయునని చాల కోరికగా నుండినది!"

"ఈ మాట అబద్ధము! వారికి నన్నుతప్ప, పార్వతికి అన్యుల నెవరినీ తీసుకొనట కిష్టములేదు!"

"అది; వారికి విజయనగరమును చేరక పూర్వముండిన భావము! కాని, విజయనగరమును చేరిన తర్వాత, ప్రభువుల అధికార; వైభవములు; సిరి; సంపదలు—విలాస భోగములను చూచి, వారు తమ మనస్సును మార్చుకొన్నారు. తమ బలమైన నిశ్చయమును సామ్రాట్టులతో నివేదించుకొని, విముక్తిని బొందినారు! ఆ తర్వాత ప్రభువులకు ఏక నిష్ఠా గరిష్ఠుడగు సేవకుడుగా నిలచినాడు! రాజు పార్వతిని ఉపాయముగా విజయనగరమునకు పిలిపించి, వివాహమాడుటకు తిమ్మోజీగారిని యిచ్చటికి పంపినాడు. కాని, పార్వతికి దేవరాయల ద్రోహచింతనతెలిసి యుండుట వలన, తండ్రితో విజయనగరమునకు వెళ్ళుటకు సమ్మతించ

లేదు. వారు కుమార్తెను బలవంతముగా దోడ్కొని పోవుటకు ప్రయత్నించగా, అప్పుడు నేను వారిని చెఱలో నుంచుటకు మారు – పార్వతి మాటకు విలువనిచ్చి, అంతఃపురములోనే నిర్బంధమున నుంచినాను. అయిననూ యిచ్చట వారికి అన్నివిధములైన అనుకూలములనూ ఏర్పాటు చేయించినాను. వారు మా ఉప్పు తినుచూ మాకు ద్రోహము తలచినదే గాక, తమ కుమార్తె జీవన వృక్షమునకు కుఠార ప్రాయులైనారు.

"ఎందులకు ?"

"పార్వతిని యిచ్చటినుండి దోడ్కొని పోవుటకు ప్రయత్నించి, విఫలులైన పిమ్మట, వారు తమ ద్రోహచింతనను అంతటితో నిలుప లేదు. పార్వతి నెట్లయిననూ మనసు మార్చి ఆమె నిచ్చటినుండి దొడ్డొని తప్పించుకొని పారిపోవుటకయి చూచినారు. కాని, నేను ముందుజాగ్రత్త తీసుకొనుటచే వారి యాట సాగలేదు. ఆ తర్వాత నేను పార్వతి యొక్క పగదీర్చుకొనుట కొరకయి విజయనగరము మీద దండెత్తి వెళ్ళి, మిమ్ము లను చెఱనుండి విడిపించినాను. మీ ఉభయుల వివాహమునకు పార్వతి వలెనే ఆతురతను కలిగియుంటిని! అందువలననే వివాహమునకు మీరు లేకపోయిననూ ముహూర్తమును నిశ్చయించితిని ! కాని, ముహూర్త సమయమునకు మీరిచ్చటకి రావచ్చునని, మీరాకను ఎదురు చూచి చూచి మేము విసుగుజెందినారము ! ఈ సమయములో తిమ్మోజీగారు చివరి సారిగా మరొక పర్యాయము ద్రోహచింతన చేసిననూ, మీరు వచ్చినచో మీతో పార్వతి వివాహము జరిగిపోగలదని హతాశులైనారు. దేవరా యల కిచ్చిన వాగ్దానమును పాలించుట కొరకయి, కుమార్తెను హత్య చేయుటకు నిశ్చయించినారు. దీనిని వారెట్లు సాధించినా రనునది నాకిప్ప టికీ ఆశ్చర్యమును కలిగించుచున్నది. బహుశః కుమార్తెకు వారు పాలలో విషము కలిపి యిచ్చి యుండవచ్చును. ఎందుకన, చివరిసారిగా నేను పార్వతిని చూచినప్పుడు ఆమె వద్ద తిమ్మోజీగా రుండిరి. వారి చేత పాల గిన్నెకూడా నుండినది. ముగ్ధయైన పార్వతి, ఏ ద్రోహచింతన నెరుగ లేక, వారిచ్చిన పాలను పుచ్చుకొని, వివాహమంటపములోనే మూర్ఛితు రాలై, అట్లే ప్రాణము వదలినది. ఆమె మరణించుటకు మునుపు మిమ్ము లనే తలచుకొని, క్షమాపణ నర్థించి మరణించినది ! ఇది ఆమె మీయందు

గల్గిన ప్రేమ ప్రగాఢతను తెలుపుచున్నది....!" అని నిట్టూర్పు విడచి మౌనముగా కూర్చున్నాడు. క్షణకాలానంతరం మరల, "తిమ్మోజీగారు కుమార్తె కొరకై దుఃఖించు చున్నట్టు ముసుగు ధరించి, ఆమె హత్యాప రాధమును నా గొంతుకు కట్ట బ్రయత్నించినారు. కాని, వారు చేసిన ద్రోహ మందరికీ తెలిసిపోయినది. వారిని వెంటనే బంధించ ప్రయత్నించగా, పారిపో జూచినారు. బ్రతికియుండిన తమ గుట్టు బయటపడ గలదని భీతిల్లి, తామూ విషప్రాశనచేసి, ఆత్మహత్య జేసుకొన జూచి నారు. కాని, దాని కవకాశ మివ్వక, వారిని మేము బంధించి, చెఱలో వేసియున్నాము. మీకు నామాట ఒబద్ధమని తోచిన, చెఱసాలలో నున్న తిమ్మోజీగారినే సందర్శించి, అడుగవచ్చును."

"అక్కఱలేదు, ఆ నీచుని ముఖము యిక చూడను!"

"మొత్తముమీద దేవరాయల కొరకయి వారు తన కుమార్తెకే ద్రోహము తలచినారు! కుమార్తెను హత్యచేసి హతాత్ములైనారు. కాని, దీనిలో వారి తప్పులేదు!" అని చెప్పి, ఫిరోజ్‌షా అర్ధ గర్భితముగా మల్లన్నవైపు చూచినాడు.

"అయినచో, నిజమైన హత్యాకారు లెవరు? పార్వతిని చంపిన వారెవరు?"

"ఆ నీచుడగు దేవరాయలే!—ఈ విషయమై మీ కింకనూ సంశ యమా? అతిడు పార్వతిపై కన్నువేసి యుండుట వలననే కదా యింతటి అనిష్ట పరంపరల కన్నింటికీ కారణమైనది. అతని మూలముననే కాదా ముద్గల్లు వాసులు నిష్కారణముగా బాధ లనుభవించినది? పార్వతి తల్లి అత్యాచారముతో మరణించినది? తిమ్మోజీ యిప్పుడు హతాత్ముడైనది? మీకు ఆత్మాభిమాన మున్నచో, అన్యాయము నెదిరించు ధైర్యము—సాహ సము నున్నచో, మీరు సత్యప్రతిజ్ఞు లైనచో, పార్వతి మనోవల్లభు లైనచో, వచన భ్రష్టులు కాగూడదని యనుకొనినచో, మోసముచేచంప బడిన పార్వతి ఆత్మకు శాంతి లభింపజేయ వలయునన్న యిచ్ఛయుండి నచో, నిజమైన హత్యాకారియైన ఆదుష్టుడగు దేవరాయలమీద పగదీర్చు

కొన గలరు ! లేనిచో, యితరులవలె, పిరికి కన్నీరు కార్చి, పార్వతికి జరిగిన అన్యాయమును మరచిపోగలరు !" అని మల్లన్నలో ఆత్మాభిమానమును పురికొల్పినాడు.

"ఈ హత్య దేవరాయల వలన జరిగియుండిన, అతడు రసాతలమున దాగిననూ అతనిని చంపనిదే, పగదీర్చుకొననిదే విడువను!"

"ఇది నిజమైనపౌరుషము!మీరు పిరికిపందలు కారని నాకుతెలియును! నా ఊహను మీరు వ్యర్థ పరచలేదు!.... మీకు, ఈ కార్యమునకు నా వలన ఏమిసాయము కావలసినను నిస్సంకోచముగాతెల్పుడు! కావలయునన్న నా సమస్త సైన్యమును, రాజ భాండాగారమును మీ కప్పగించగలను నాకు కావలసినది పార్వతి ఆత్మకు శాంతి!ఆమె హత్యాకారులకు సరియైన శిక్ష!"

"అంతటి అవసరము వచ్చినప్పుడు నేను మీ సహాయమర్థించగలను. ప్రస్తుతమునకు నాకే సహాయమును అక్కరలేదు! ఎవరి సహాయమును అక్కరలేదు! దైవసహాయ మొందుగల్గిన ఈబాహు ద్వయము తోడనే ఆ కార్యమును సాధించ గలను" అని గదల వలె యున్న — ముష్టి బిగించిన - తన రెండు చేతులను - ఫిరోజీషాకు చూపి, అచ్చటినుండి వాయువేగముగా వెళ్ళిపోయినాడు ! అతని దైత్యావేశమును చూచి, "నీచ దేవరాయా ! నీ కథ యిక ముగిసినట్టే ననుకొనుము !" అని నిటూర్చి, తన కుటిల తంత్రమునకు ఉబ్బిపోయి తనలో తానే నవ్వుకొన్నాడు !"

# మిత్రప్రాప్తి

## 17

ఇప్పుడు మల్లన్న మనసులో పగ తప్ప అన్యమేదియునులేదు. పగ ఆతని జీవితపు ఏకయిక గమ్యము. తనను ప్రాణమునకంటెను ఎక్కుడుగా ప్రేమించిన పార్వతి మరణమునకు కారకుడయిన దేవరాయలమీద పగదీర్చుకొన వలయునని అతడు బ్రతికియున్నాడు. అంతకంటెను అతని జీవితములో సాధించ వలసిన మహత్కార్య మేదియును లేదు. పగ ! పగ !! పగ !! పగ కొరకయి నడచుచూ, దానినెట్లుతీర్చుకొన వలయుననునది తెలియక, పిచ్చి వానివలె గుల్బర్గా నుండి బయలు దేరి, ఊరూరా తిరుగుచూ, విజయనగరమునకు వచ్చి చేరినాడు.

సరియైన ఆహారపానీయములు - నిద్రలేక అతడు కృశించిపోయి నాడు. మానస ముద్వేగముతో ఉడికిపోవుచున్నది. హృదయము పార్వతి మరణముతో మానవత్వమును కోల్పోయి పాషాణ సదృశమైనది. అతడొక చోట నిలువలేక, ఒకచోట కూర్చొనలేక చిత్తచాంచల్యముతో తిరుగుచున్నందుకు కొందరతనిని పిచ్చివాడని భావించి అనుకంపము జూపినారు; మరికొందరు రాళ్లురువ్వి వెలుపలికి తరిమినారు. జడలుగట్టిన తలవెంట్రుకలు, క్షౌరములేని గడ్డము,చిరిగిన వస్త్రము,పిచ్చినవ్వు,అర్థము లేని మాటలు అన్నియును పిచ్చివాని లక్షణములే అతనివద్ద కనబడసాగినవి. కాని, అతనికి నిజముగా పిచ్చిపట్టి యుండలేదు. పార్వతికి జరిగిన అన్యాయమును తలచి- తలచి, అతని మనసు పాడైనది, పగకై వగచి; హృదయము శూన్యమైనది. దైహిక యాతన కంటెను అతడు మానసిక క్షోభచే ఎక్కువ జర్ఝరితు డైనాడు. ఎన్నియో మారులు; తనవంటి దుర్బల, అనామధేయ వ్యక్తిచే సామ్రాట్ దేవరాయ లంతటి వానిని చంప సాధ్యమా ? అని అతడను కొనువాడు. అప్పు డతనికి నిరాశ గల్గెడిది. కాని, పార్వతి తలపునకు వచ్చినపు డామె హత్యాకారుల మీద

పగ దీర్చుకొనుటకై తాను చేసిన ప్రతిజ్ఞ జ్ఞప్తికి వచ్చి, అతని మనో చంచలత్వము, హతాశాభావము లదృశ్యములై మరల దృఢవిశ్వాసము కలిగెడిది ! ఈ విధముగా ద్వైధీభావముల నడుమ అతని మనస్సుతూగా డుచూ ఏ కార్యనిశ్చయపు టాలోచనను చేసుకొనక విజయనగరమును చేరినాడు.

సంపద్భరితమైన విజయనగర మందలి భవ్యభవనములు అంత స్తులూ, గుడిగోపురములూ దూరము నుండియే అతనిని నగరమునకు ఆహ్వానించినవి. విశాలమైన రాజవీధులలో అతడు గురి—గమ్యము లేక తిరుగాడ సాగినాడు. ఎవరునూ అతనిని గుర్తించలేదు. అందరూ అతని నొకపిచ్చివానిగా భావించి,దూరము తొలగుమని చెప్పసాగినారు. కొందరు శ్రీమంతుల గృహములలో కుక్కలతో బాటు అతనికినీ ఎంగిలాకులు వేసినారు. ఆకలితో కడుపు దహించుకొని పోవుచున్ననూ, తానెవరు ? ఎందులకయి విజయనగరమునకు వచ్చినాడు ? అను విషయములు మరు వని మల్లన్న వాటిని ముట్టుకొనలేదు. ఇచట నచట తిరిగి ఆకలిదప్పు లతో బడలిక జెంది తుంగభద్రా తీరమునకు వచ్చిచేరినాడు, అచ్చట యధేచ్ఛగా నీరు త్రాగి, సంజవేళకు తూగాడుతూ, మెల్లగా అడుగులిడి వచ్చిన దిక్కును బట్టి నడువసాగినాడు. ఆకలి దప్పుల కంటెనూ అత నికి, ఈ విశాలమైన నగరంలో తన కాశ్రితు లెవరు ? తను చేబూనిన మహత్కార్యమును సాధించుటెట్లు ? అనుచింతలో అతని మనస్సు వ్యథ పడ సాగినది. ఎంత ఆలోచించిననూ అతనికి మార్గము గోచరించలేదు. "దైవేచ్ఛ ప్రకారము జరుగ నిమ్మ"ని చివర కతడు బడలిక జెందిన శరీరమునకు ఒకచోట కొంత విశ్రాంతి నివ్వదలచి, అనువగు స్థల మును వెదకుచూ బయలుదేరినాడు.

ఈ విధముగా అతడు తిరుగుచూ, విశాలమైన ఆ నగర మందొక భాగమైన కమలాపురమునకువచ్చినాడు కమలాపురము పూర్వమునుండియు గొప్ప గొప్ప అధికారుల, నగరమందలి గణ్యవర్తకుల, రాజబంధువుల నివాస స్థలము. అచ్చట రెండు; మూడు; నాలుగు; అయిదంతస్తుల

భవ్యమైన ప్రాసాదము లున్నవి. ఎటు జూచిననూ ఉద్యానవనములు, కొలనులూ కనబడుచుండును. సంజవేళ యగుటచే అచ్చటి రాజవీధులలో జన సంచారము తక్కువగా నున్నది. మల్లన్న ఆ దివ్య ప్రాసాదములను చూచుచూ, అచ్చటి సుఖజీవన, భోగ విలాసములను తలచుకొని లోలోపలనే నవ్వుకొన్నాడు! అటువంటి జీవనమే తనకుకూడా లభించి యుండెడిది! కాని పార్వతి మరణముతో తన స్వప్నభవనము నేలకూలి పోయినది! ఇప్పుడీ మల్లన్న భగ్నప్రేమికుడు! శిల్పిచెక్కిన భగ్నమూర్తి !! అని అనుకొనుచూ గురి-గమ్యము లేక నడువసాగినాడు.

అట్లు కొంతసేపు నడచుచూ వెళ్ళునప్పటికి కాళ్ళు గుంజ సాగినవి. అతనికి అచ్చటనే ఒకచోట ముడుగుకొని వలయు నన్నంత శ్రమ దోచినది! దానికి తగినట్టు అచ్చట ఒక భవ్యమైన మందిరము కనబడినది. అందులో ఎవరునూ నివసించు చున్నట్టు గోచరించలేదు. ఎందుకన, ఆ భవనము ముందు కావలి వారెరునూ లేరు. మందిరమునకు ముందుగల ఉద్యానవనము కూడా నిర్మానుష్యముగా నున్నది. అచ్చటగల పూలమొక్కలకు నీరులేక వాడిపోయి యున్నవి. మార్గములు కసవు, గడ్డితో నిండియున్నవి! కొలనులు పాచిపట్టి యున్నవి. ఇదంతయూ చూచి, బహుశః ఈ మందిరములో ఎవరూ నివసించుట లేదేమో? ననుకొన్నాడు. మరుక్షణములో యింతటి భవ్య భవనమును ఎందుకు నిర్మానుష్యముగా నుంచినారో నని ఆశ్చర్యపడినాడు. మందిరములో మనుష్యులున్ననూ, లేకపోయిననూ, తా నా రాత్రి కచ్చటి ఉపవనములోని లతామంటప మందలి శిలాసనము మీద పడుకొని గడుప వలయునని నిశ్చయించుకొని, ఉపవనమును ప్రవేశించినాడు.

అచ్చట,అతని [illegible]నూ అడ్డుకొనలేదు.చెట్టుపై నున్న ఘూకము వికారముగా కూసి అతనికి స్వాగతము పలికినది.కాకి బలగములు 'కావు, కావు' మని అరచి సుస్వాగతమును చెప్పినవి. మల్లన్న ఇవన్నియునూ గమనించక, లతా మంటపమందలి, చంద్రకాంత శిలమీద పడుకొనుటకై, దానిమీద గల దుమ్ము-ధూళిని తుడుచు పనిలో నిమగ్నుడైనాడు. ఇంతలో అతని కంటికి మందిరములో దీపములు వెలుగుట కనబడినది.

ఇదిచూచి అతనికి భయాందోళనము లేక కాలములో కలిగినవి. దీపముల ప్రకాశవంతమైన వెలుగులో లోపల నున్న వైభవము లస్పష్టముగా కనబడసాగినవి. ఈదృశ్యములను తిలకించు చుండగనే ఎచ్చటనుండియో ఇంపైన సంగీతము, మంజీరముల ధ్వని వచ్చి అతని చెవిని బడినవి. అతడు మరింత ఆశ్చర్య పడినాడు ! అయినచో, ఈ మందిరము నిర్మానుష్య మైనది కాదు....?

మందిరములో ఎవరో నున్నారని తెలియగనే అతనికి తా నచ్చట విశ్రమించిన, గృహయజమానులు వచ్చి రాత్రిలో తనను లేపి, 'వెలుపలికి పంపవచ్చునను సంశయ మేర్పడినది. అతడు యజమానుల అనుమతి కోరుటకూ, వీలైన ఆహారమును కూడా అర్థించుటకూ మందిరపు మహద్వారము వద్దకు మెల్లగా అడుగులిడుచూ వెళ్ళినాడు. మందిరమును సమీపించగనే ఎందులకో మనసున భీతి జనించ సాగినది! ఇతర శ్రీమంతులవలె యీ మందిరములోని వారుకూడా నిర్దయులైనచో ?

ధైర్యముచేసి అతడు మందిరము ముందు నిలచి—"తల్లీ !" యని అరచినాడు. ఎవరునూ బదులు పలుకలేదు. మునుపటి వలెనే నృత్య సంగీతము లింకనూ వినబడుచునే యున్నవి.

"తల్లీ ! ఎవరమ్మా లోపల ?"

ఎవరునూ మారు పలుకలేదు. ద్వారమును కూడా తెరువలేము.

నిలబడి నిరీక్షించి. నిరీక్షించి విసుగెత్తి మల్లన్న ద్వారమును బలముగా ముందుకు త్రోసినాడు. ద్వారము తెరచుకొనినది.

మందిరములోని శృంగారము, దాని నిర్మాణము అతని నాశ్చర్య చకితుని జేసినవి. నేలమీద రత్నకంబళ్ళను పరచియున్నారు. నడుమ నాలుగైదు సుఖాసనములు వేయబడి యున్నవి. వాటి నడుమగల ముక్కాలి పీటమీద పలువిధములైన ఫలములను ఒకపళ్ళెరములోనుంచి [illegible]న్నారు. అవన్నియునూ అప్పుడే కోసి తెచ్చినట్టుగా నున్నవి. ఇంటి [illegible]కు నిదర్శన మన్నట్టు ఒకవైపున వీణను ఒరిగించియున్నారు. [illegible]లువైపులా చిత్రములను చిత్రించి యున్నారు. అప్పుడే వెలి

గించి పెట్టిన ఊదువత్తుల పొగతో మిళితమై, అత్తరు—గంధముల సువాసన ఆ మందిరము నంతయునూ వ్యాపించి యున్నది!

మల్లన్న భీతిల్లుచునే మందిరములో అడుగిడినాడు.

"తల్లీ! మందిరములో నున్నవారెవరు?" అని మరల నొకసారి పిలచినాడు.

ఎవరునూ మారుపలుకక పోవుట చూచి అతనికి సందేహము, దిగులును యేర్పడినది. అచ్చటనున్న ఫలములను చూచి నోట నీరూరినది. ఒకటిరెండు పండ్లను తీసుకొని తినిన యింటివారికేమియునూ నష్టము కలుగదని భావించి,వెనుకముందు చూడక అచ్చటనున్న సుఖాసనములో నాశీనుడై పండ్ల పళ్ళెరములోనుంచి పండునెత్తుకొని, తిన బోవు చున్నంతలో ఎవరో పైనుండి క్రిందికి దిగి వచ్చుచున్నట్టుగా తోచినది, అతడు నివ్వెరపోయి చూచుచూ నిలబడినాడు. సుమా రిరువదియైదు సంవత్సరముల వయస్సుగల ఒక విలాసిని, కాలి యందెలను ఘల్లు మనిపించుచూ ఉప్పరిగె నుండి క్రిందికి దిగి వచ్చుచున్నది. ఆమెను చూచి మల్లన్న శిలావిగ్రహము వలె లేచి నిలబడినాడు,

"కూర్చొనుడు!" అని ఆమె సవినయముగా చెప్పి, ఆసనమును చూపినది! క్షణమాగి మరల,

"మీరు వచ్చి చాలసేపైనదా!" అని నవ్వినది!"

"లేదు, యిప్పుడే వచ్చినాను....మందిరములోని వారిని పిలచి, పిలచి అలసినాను....ఎవరునూ మారుపలుకలేదు. లోనికి వచ్చినాను...." అని, తన ప్రవర్తనమును సమర్థించుకొను ధోరణిలో మాట్లాడినాడు.

"చింతలేదు....మీరు అందుకై వగవకుడు.........నేను ఉప్పరిగె మీద నుండుటచే మీ రాకను గమనించలేదు...."

అని చెప్పి, అతనిని సమాధాన పరచి, సమ్మోహనమైన నవ్వు నవ్వినది. ఆమె నవ్వు, హావభావములు చూచి, తను దారి తప్పి, ఏవేశ్య యింటికో వచ్చినట్టుగా మల్లన్న భావించినాడు. లేనిచో, ఆగంతకుడైన తన కామె యింత ఆదరముతో ఉపచర్య చేయుటనిననేమి? కాని, తన నీస్థితిలో ఆదరించగల విలాసిని ఎవరై యుండవచ్చు నన్న ఆలోచన మతనికి కలుగకపోలేదు.

"మీ నామధేయము?" ఆమె నవ్వుచూ ప్రశ్నించినది.

"మల్లన్న."

"మీరు మా మందిరమునకు వచ్చినందులకు చాల సంతోషము! పేదల యింటికి పెన్నిధి వచ్చి నట్టయినది. నేను చిరకాలముగా మీ కొరకై వేచి యుంటిని....చివరకు వచ్చినారు...." అని నవ్వినది.

ఏమీ, ఈమె తనకొరకై చిరకాలముగా వేచియున్నదా? అయిన, నీమె ఎవరయి యుండవచ్చును? యీమెకు నా పరిచయముగలదా? కాని యీమెను తాను యిదివరలో ఎచ్చటనూ చూచి యున్న జ్ఞాపకము లేదు.....మల్లన్నకు అంతయునూ అగమ్య గోచరముగా నున్నది....

"నీవు పరిచితురాలవలె మాట్లాడుచున్నావు కాని నీ వెవరైనదీ తెలియలేదు."

"నే నెవరైనదీ మీకు మున్ముందు తెలియగలదు. ముందు మీ భోజనము కానిండు పాపము, చాల ఆకలిగొని యున్నారు!"

'అయ్యో! ఈమెకు నేను ఆకలిగొని యుండుటెట్లు తెలిసినది?' మల్లన్న ఆత్మగతముగా అనుకొన్నాడు.

"రండు, ఉప్పరిగె మీదికి వెళ్ళుదము. అచ్చట దుస్తులు మార్చు కొందురు."

అని, అతనిని బలవంతముగా చేయిపట్టుకొని, ఉప్పరిగె మీదికి తీసుకొనివెళ్ళి, రాజ యోగ్యమైన దుస్తులను తానే తొడిగినది. అనంతర మతనిని అచ్చటగల తూగు టూయెలలో కూర్చుండజేసి, పలువిధములైన ఫలహారములను, ఫలములను యిచ్చినది. అతడు వాటిని భుజించిన తర్వాత, చేతికి మద్యముతో నిండిన సువర్ణ పానపాత్రి నందించుచూ, అతని ముఖములో ముఖముంచి—"నే నెవరైనదీ మీ కిప్పుడైననూ తెలిసినదా?" అని యడిగినది.

"లేదు, తెలియలేదు!" అని మల్లన్న ఆమెను బాహువులలో బంధించుచూ అన్నాడు.

"మద్యమును సేవించుడు! అప్పుడు నే నెవరైనదీ తెలియ గలదు" అని మద్యపాత్రిను పెదవులకందించినది.

మల్లన్న మద్యమును సేవించి, ఎన్నియో యుగములైనట్లు దాని నొక గుక్కలో త్రాగివేసినాడు. మరల మరల ఆమె మద్యమును పాత్రలో నింపుతూ వచ్చినది. మల్లన్న ఆమె నింపిన కొలదిని త్రాగుతూ వచ్చినాడు. అప్పటికే అతనికి మైకము క్రమ్మినది. తల,కనులు వాలిపో సాగినవి.

"నే నెవరైనదీ మీ కిప్పుడైననూ తెలిసినదా ?"

"తెలిసినది."

"నే నెవరు?"

"స్వర్గలోకపు సుందరివి !"

"ఇది స్వర్గం !" అని చెప్పి, అతనికి చివరిగుక్క మద్యమును తానే త్రాగించి, అతనిని పడుకొమ్మనుచూ, ఒకే ఒక్కసారి కౌగిలించు కొనినది.

తర్వాత ఏమి జరిగినదీ మల్లన్నకు తెలియదు.ఉన్నట్టుండి భయంక రమైన బాధ హృదయములో కనబడినది. స్వర్గంనుండి నరకములోనికి దిగజారినట్టుగా దోచినది. శరీరమంతయునూ శూలములతో పొడిచినట్టి బాధ. తల పగిలిపోవుచున్న దేమో నను నంతటి వేదన. రక్తవమనము- రక్తవిరేచనము. ఇవేమియునూ తెలియలేని స్థితిలో పడి - పొర్లుచూ, బాధగా మూల్గసాగినాడు మల్లన్న. ఈ విధముగా అతడెంతసేపు పడి యుండెనో ఎవరికిని తెలియదు. స్మృతి కలిగిన తర్వాత అతడు తన కెవరో ఉపచర్యలు చేయుచూ యుండుటను తెలుసుకొన్నాడు. మెల్లగా కనులు తెరచి చూచినాడు. తెల్లగా తెల్లవారినది. తా నెచ్చట నున్నాడు? ఈ యవస్థ తనకెందులకు కలిగినది? అని తెలుసుకొనుటకై చుట్టునూ పరికించినాడు. క్రిందటి రాత్రి తను ప్రవేశించిన భవ్య ప్రాసాదము ముందుగల వీధిలో పడియున్నాడు. నిన్న చూచిన స్వర్గమెచ్చట ? స్వర్గ సుందరి ఎచ్చట ? ఈ నరకమెక్కడిది ? తన కుపచర్యలు చేయుచున్న యీ వృద్ధ సేవకు డెక్కడివాడు ? అంతయునూ అగమ్య గోచరముగా నున్నది.

'అయ్యో !' అని అరచి, మరల అతడు మూర్ఛితుడయినాడు. వృద్ధసేవకుడు పరుగున వెళ్ళి, పుష్కరిణినుండి నీరు ముంచుకొనివచ్చి ముఖముమీద బాగుగా ప్రోక్షించినాడు. ఆ చల్లని నీటి శైత్యమునకు మల్లన్నకు స్మృతి కలిగినది. ఇప్పుడతడు తా నెచ్చట నున్నాడు? తన కుపచర్యలు చేయుచున్న దెవరు? అను విషయమును బాగుగా గ్రహించ గలిగినాడు. కనులువిప్పి, ఆ వృద్ధ సేవకుని కృతజ్ఞతా భావముతో చూచి, ఏమియో చెప్ప బ్రియత్నించినాడు. కాని సాధ్యపడలేదు. పెదవి కదల్ప లేక పోయినాడు. లేచుటకు బ్రియత్నించినాడు కాలు చేతులు, నడుము తన స్వాధీనములో నున్నట్లు తోచలేదు. వృద్ధసేవకు డతనిని మరొక చోట పరుండజేసి, తినుట కేవియో యిచ్చినాడు. అది భుజించినతర్వాత అతనికి మాట్లాడునంతటి శక్తి కలిగినది.

"అయ్యా ! దయాళూ ! నీ వెవరు తండ్రీ? నన్నెవరు ఆ మంది రమునుండి తెచ్చి యిచ్చట పడవేసినవారు?" అని అడిగినాడు. స్వర్గ సమానమైన మందిరములో అమరసౌఖ్య మనుభవించు చుండిన తాను అచ్చటినుండి యీ వీధిలోనికెట్లు వచ్చినాడు ? అని ఎంత ఆలోచించి ననూ అతనికి తెలియక పోయినది.

"అయినచో నీవా మందిరములోనికి వెళ్ళియుంటివా?"

వృద్ధసేవకుడు ఆశ్చర్యముతో అడిగినాడు.

"అవును, వెళ్ళియుంటిని. రాత్రి అచ్చటనే పరుండినాను."

"నీ అదృష్టము మంచిది ! ఉదయములేచి మంచివారి ముఖము చూచినావు. లేనిచో, ఈ విషయము చెప్పుటకు నీవు యింతవరకును బ్రితికి యుండవు."

"ఏమీ? అచ్చటికి వెళ్ళకూడదా?"

"అట్లయిన, నీ కింకనూ ఆ విషయము తెలియదు?"

"ఏ విషయము ?"

"అది భూత గృహము!"

"అనిన....?"

"అచ్చట భూత ప్రేతములు నివసించుచున్నవి ! సాయం వేళ

దాటిన, యెందులకు ? పగటిపూట సైతము అచ్చటికి వెళ్ళుటకు ఎవరికి ధైర్యముండదు. ఇట్లుండగా, నీవు ఒంటరిగా ధైర్యముచేసి ఆ భూత గృహమును ప్రవేశించి, అచ్చటినుండి మరల బ్రతికి, ఎట్లు బయటపడి నావనునది ఆశ్చర్యకరమైన విషయము. ఇదివరలో నీవలెనే తెలియక ఆ మందిరమును ప్రవేశించి, యెందరో ప్రాణములను పోగొట్టుకొని నారు. నీ అదృష్టము గొప్పది ! ప్రాణములతో తిరిగివచ్చినావు."

"అయినచో అది భూతగృహమా ? నిన్నరాత్రి నా కుపచర్యలు చేసిన సుందరి పిశాచియా?"

"నిస్సంశయముగా...."

"అయ్యో, దైవమా ! నేను పిశాచి చేతికి చిక్కితినా ?"

"అవును. చిక్కియును బ్రతికి వచ్చినదే నా కాశ్చర్యం !"

"అంతటి సుందర మందిరములో భూతములెందుకు నివాసము చేయుచున్నవి ? అది భూతగృహ మెందులకైనది ?"

"అది చాలా పెద్దకథ ! తర్వాత చెప్పెదను."

"పోనిమ్ము, దానిని కట్టించిన వారెవరు?"

"శ్రీమంతులైన విరూపాక్షరాయలు."

"విరూపాక్షరాయ లెవరు ?"

"వారు రాజకుటుంబమునకు చేరినవారు. ప్రస్తుత మీ నగరమును పరిపాలించుచున్న ప్రభువుల సహోదరులు."

ఈ మాట విని మల్లన్న నిట్టూర్పు విడచినాడు.

"నడచుటకు శక్తి గలిగియున్న, నావెంట రమ్ము."

"ఎచ్చటికి?"

"శ్రీమంతుల మందిరమునకు."

"అనిన, విరూపాక్షరాయల గృహమునకా ?"

"ఔను ! నిన్నీ స్థితిలో మొదట చూచినది వారే. ఉదయమే వాయు సంచారమునకని గుర్రముమీద బయలుదేరి వెళ్ళుచూ, నీ వికార కంఠస్వర మాలించి, యిచ్చటికి వచ్చినారట ! ఎవరో భూతగృహము నకు వెళ్ళినవారై యుండవచ్చునని భావించి,నీ మీద కరుణ గలిగి,నన్ను

నీ ఉపచారమునకు పంపినారు. నడచుటకు శక్తి గలిగిన వెంటనే నిన్ను గృహమునకు తోడ్కొని రావలసినదని ఆజ్ఞాపించినారు!"

"అట్లయిన, చాల సంతోషము!" అని చెప్పి, అతికష్టముమీద వృద్ధసేవకుని నూతగా గొని మెల్లగా నడచుకొనుచూ, విరూపాక్షరాయల నివాసమునకు వెళ్ళినాడు! దారిలో సేవకుని ద్వారా ఆ భూతగృహ వృత్తాంతమును సవివరముగా విన్నాడు—

విజయనగరమును యితఃపూర్వము పరిపాలించిన, ఇమ్మడి హరిహరరాయలకు యిద్దరు ముఖ్య పత్ను లుండెడివారు. వారిలో పంపాదేవి యందు ఇమ్మడి బుక్కరాయలూ, మల్లాదేవి లేక మైలాదేవి యందు నల్వురు కుమారులూ హరిహరునకు పుట్టినారు. మల్లాదేవి సుప్రసిద్ధ సేవుణప్రభువగు రామచంద్రదేవుని కుమార్తె. ఈమె గర్భమున దేవరాయలు, విరూపాక్షరాయలు, చిక్కరాయలు, కుమార కెంపరాయలు అను పుత్రులు జన్మించినారు. వీరిలో దేవరాయలు జ్యేష్ఠుడు.

ఇమ్మడి హరిహరుడు క్రీ. శ. 1404వ, సంవత్సరము ఆగష్టు20వ తేదీనాడు పరలోకగతుడు కాగా, అతని అనంతరము సింహాసనమునకై ఈ అయిదుగురు సోదరులలో కలహ మేర్పడినది. ఉదయగిరి మాండలీకుడుగా తన పరిపాలనను ప్రారంభించిన దేవరాయలు తండ్రి మరణ సమయమునకు 'సిరా' సీమను కూడా పరిపాలించు చుండెను. ఇతని రాజ్యమునకు యిప్పటి కోలారు జిల్లా యందలి ముళబాగలు తాలూకాలోని కొన్ని ప్రదేశములుకూడా చేరియుండెను. విరూపాక్షరాయలు తాను బాహుబలముతో గెల్చిన తొండై మండలము, మరియు చోళప్రాంత్య భూములను పరిపాలించు చుండెను. చిక్కరాయలు ఆగరసీమకు మాండలీకుడుగా నుండెను. కుమార కెంపరాయలు యింకనూ బాలకుడుగా నుండెను.

ఇమ్మడి హరిహరు డున్నట్టుండి హఠాన్మరణము పొందుటచే అమాత్యులూ, దండనాయకులూ రాజకుటుంబము వారి సలహా మేరకు యువరాజకుమారుడైన ఇమ్మడి బుక్కరాయలకు పట్టము గట్టి, అతనిని

విపయనగర సామ్రాట్టని ఘోషించినారు. కాని, అతడు చాలా దుర్బ లుడు. తండ్రికాలములో యువరాజ పదవిలో నున్నప్పుడే అతడుప్రజల దృష్టికి అంత మంచివాడుగా కనబడలేదు. ఎటుజూచినా శతృవులు సామ్రాజ్యముమీద కత్తినూరు చున్నారు. ఇటువంటి సమయములో సింహాసనము మీద సమర్థుడైన ప్రభువు యుండవలయునని కొందరు దండనాయకులు వాదించినారు. వారి అభిప్రాయము మేరకు, అందులకు దేవరాయలే తగిన వ్యక్తియని ఆశించినారు. వెంటనే రాజధానికి బయలు దేరి రావలసినదని వారు దేవరాయలకు వార్త పంపినారు.

కాని, దేవరాయలు రాజధానికి వచ్చునంతలో,మహదాకాంక్షియు, రాజకీయ తంత్రజ్ఞుడునూ మంచి నేర్పరియూనైన ఇమ్మడి విరూపాక్ష రాయలు సింహాసనమును తానే ఆక్రమించుకొనుటకై రాజధానికి వచ్చి నాడు. అతడు తనఅభిమానుల సాయముతో బుక్కరాయలను సింహాసన చ్యుతిని జేసి, తానే దానిని ఆక్రమించుకొని, సామ్రాట్టని చాటించు కొన్నాడు.

సింహాసనము బుక్కరాయల అనంతరము న్యాయముగా మల్లా దేవి జ్యేష్ఠకుమారుడైన దేవరాయలకు చెందవలసి యున్నది. దానిని రాజ్యలోభముతో తమ్ముడే ఆక్రమించు కొనినాడు. సింహాసనమును దక్కించు కొనుటకు అతడు బుక్కరాయలను చెఱసాలలోవేసి, అతని పక్షము వహించిన యితర రాజబంధువులనూ, తనకు వ్యతిరేకులైన అమాత్యులనూ, దండనాయకులనూ, నిర్దయుడై క్రూరముగా హత్య చేయించినాడు. అయిననూ సింహాసన మతనికి దక్కలేదు.

దేవరాయల హితైషులైన మల్లినాధుడు అతని ముర్వురు కుమా రులు, నాగన్న దండనాయకుడు అతని చేతికి చిక్కక తప్పించుకొని తలలు దాచుకొనినారు. వారు; యితర సైన్యాధిపతులను, సామ్రాజ్య నిష్ఠగల సేవకులను అన్యాయముగా రక్తము ప్రవహింపజేసి రాజ్యము నాక్రమించిన విరూపాక్షరాయలనుపదచ్యుతుని చేయుటకై ప్రోత్సహించి నారు. వారి ప్రయత్నము విఫలము కాలేదు. వారు సమయముచూచి దండెత్తివచ్చి, విరూపాక్షరాయలను అధికారచ్యుతినిజేసి, దేవరాయలను

సింహాసనా సీనునిచేసి, విజయనగర సామ్రాట్టని ఘోషించినారు. ప్రభువుగా నుండిన బుక్కరాయలను హొయిసల సీమకు మాండలీకునిగా నియమించినారు. పారిపవురిలో మునుపటి వలెనే విశ్వాసము మిగిలినది. అదేవిధముగా తను పూర్వము పాలించుచూనుండిన తొండై మండలమును విరూపాక్షరాయలకు యిచ్చిననూ, అతడు దానిని స్వీకరించుటకు సమ్మతించలేదు. సమయము చూచి చేజారిపోయిన సింహాసనమును మరల పొందుటకయి అతడింకనూ రాజధానిలోనే యున్నాడు. కాని, అతడు కృతక విశ్వాసము నటించుచూ లోలోపల దేవరాయలకు విరుద్ధముగా ద్రోహము తలపెట్ట సాగినాడు. ఇది కొందరికి మాత్రమే తెలియును ! అయినను దేవరాయలు శత్రువులనుండి రాజ్యమును రక్షించు కొనుటకు తన జాగ్రత్తలో తానున్నాడు. విరూపాక్షరాయల కోరిక నెరవేరలేదు. అయినను అతడు హతాశుడు కాక, తన ప్రయత్నమును తాను చేయుచునే యున్నాడు.

కాని, జనప్రియ సామ్రాట్టయిన దేవరాయలకు సింహాసనము భద్రతరముగా నుండెను. ఈ నడుమ జరిగిన కొన్ని సంఘటనల వలన క్రమముగా అతడుకూడా జనప్రియతను పోగొట్టుకొనినాడు. ఫిరోజ్‌షాచే జరిగిన పరాభవము, హేమాంబికా వివాహము మొదలగు సంఘటనల వలన ప్రజలు క్షుబ్ధులైనారు. కొంద రున్నతోద్యోగుల మనస్సుకుకూడా విసుగు జనించినది. ఈ సమయము చూచి, మరల దేవరాయలనుసింహాసన భ్రష్టునిచేసి, తానే దాని నాక్రమించుకొన వలయునని విరూపాక్షరాయ లాలోచించి, ఆనందము జెందుచున్నాడు. అతని ఆలోచన - ఆశ, దేవరాయలను హత్య జేసి, అతని అభిమానులను చెఱలోనుంచి, సింహాసనము నాక్రమించుకొన వలయుననియే ! దేవరాయలను హత్యజేయుటకు తగిన వ్యక్తి యింతవరకును అతనికి లభించలేదు. అందువలననే అతని విద్రోహము కార్యగతము కాలేదు !

విరూపాక్షరాయలు దేవరాయలు ఉదారముగా నిచ్చిన తొండై మండలపు మాండలీక పదవిని తిరస్కరించి, రాజధానియందే నిలచినందు వలన. అతనికి తన ఘనత—గౌరవములకు తగిన ఒక అంతః

పురము యొక్క ఆవశ్యకత ఏర్పడినది. కుటిల తంత్రజ్ఞుడూ, రాజ్య లోభి యను రెండు దుర్గుణములను విడచిన, అతనిలో అనేక సద్గుణము లున్నవి. సంస్కృత మందతడు ఉద్దండ పండితుడు, కావ్య రసికుడు, కవి. 'నారాయణి విలాస'మను అయిదంకముల సంస్కృత నాటకము నతడు రచించినాడు. ఎందరో కవులకు, కళాకారులకు ఆశ్రియ దాత యైనాడు.

ఇటువంటివాడు తన వైభవమునకు, రసికతకు తగిన ఒక అంతః పురమును నిర్మించ నిశ్చయించి, అనేక రచనలను - పటములను పరిశీ లించి 'విరూపాక్ష నిలయ'మును అధిక వ్యయముతో, అనేకమంది కళా కారుల - పనివాండ్ర సహాయముతో కట్టించినాడు. కాని, అచ్చట నివ సించు యోగము మాత్ర మతనికి లేకపోయినది. అతడు అంతఃపుర మును కట్టించిన తర్వాత కొన్నిరోజులు మాత్రమే అచ్చట నివసించి నాడు. అచ్చట నున్నంతకాలమూ అతని మనశ్శాంతిని హరింపజేయు సంఘటనలు చాలా జరుగసాగినవి.

ఉన్నట్టుండి హఠాత్తుగా మందిరములోని వస్తువులన్నియూ మాయమై పోయెడివి. వంటయింటిలోనికి అపరిశుద్ధ మంతయూ ఎచ్చటి నుండియో వచ్చి పడుచుండెడిది. మందిరములో సదా వికార ధ్వనులు వినవచ్చు చుండెడివి. అచ్చట పడుకొను వారికి భయంకర స్వప్నములు వచ్చెడివి. ఎన్నియో రోజులు రాత్రి అంతఃపురములో పరుండిన విరూ పాక్ష రాయలు ఉదయ మగునప్పటికి వీధిలో పడి యుండెడివాడు. ఒక రోజు జ్యోతిష్కులను విచారించగా, ఆ మందిరములో భూతప్రేతములు చేరుకొని యున్నవని చెప్పినారు. విరూపాక్షరాయల కీ మాట వినగానే నడుము విరిగి నట్టయినది. తాను సింహాసనమునకయి జరిపిన హత్యలు- దుండగములు తలపునకు వచ్చి, అతడు తల్లడిల్లినాడు. తనచే హత్య గావింపబడిన వ్యక్తులు యిప్పుడు భూత, ప్రేత పిశాచములై తనను వేధించు చున్నవని భావించినాడు. గృహమునుండి వాటిని పారద్రోలుట కయి అతడు చేసిన జప తపములు—పూజలు పురస్కారములు—దాన ధర్మములు—మంత్ర తంత్రములు అన్నియూ వ్యర్థమైనవి. ఒక్కసారి

గృహమును తమఆవాస స్థానముగా చేసుకొనినభూతప్రేతములువారిచర్య లకు లొంగలేదు. అందుకు మారుగా వాటి చేష్టలు మరింత ఎక్కువైనవి. విరూపాక్షరాయలు యీ పిశాచ బాధకు తట్టుకొనలేక, మిత్రుల సలహా మేరకు ఆ మందిరమును వదలి వేరొక అంతఃపురములో నివసించ తొడగిన పిమ్మట భూత బాధ నివారణ యైనది. అప్పటినుంచియు 'విరూపాక్ష నిలయము' భూతగృహ మైనది. * తెలిసిన వారెవరును సంజ యైన తర్వాత ఆ ఛాయలకుకూడా వెళ్ళరు. ఆ గృహమును కన్నెత్తి చూచుటకు సైతము భీతిల్లెడివారు. ఇట్లుండగా మల్లన్న తెలియక అచ్చటికి వెళ్ళి, భూతము చేతికి చిక్కి జీవచ్ఛవమై బయట పడినాడు. అతని అదృష్టము మంచిదగుటచే ప్రాణ గండము తప్పినది.

వృద్ధసేవకుని మూలమున ఈ విషయములన్నియూ వినినతర్వాత మల్లన్న హృదయములో దిగులు బయలుదేరినది. భీతిచే అడుగులుపడక కూలబడు నట్లయినది. కాని వృద్ధసేవకుడు అతనిని పడనివ్వలేదు. సేవకుని సాయముతో మల్లన్న కాళ్ళీడ్చుకొనుచూ వచ్చి, విరూపాక్షరాయల అంతఃపురమును చేరినాడు.

తన భూత నివాస గృహమును ప్రవేశించి, అపాయమునకు గురి యైన మల్లన్నమీద జాలిగొని, విరూపాక్షరాయలు అతనికి తగిన ఔషధోపచారములు చేయించినాడు. ఈ ఉపచారములతో స్వస్థుడైన మల్లన్న:

---

* తర్వాత యీ భూతగృహమందుండిన అంతర పిశాచములకు శ్రీ వైష్ణవ మత స్థాపకులైన శ్రీ రామానుజాచార్యుల శిష్యులగు శ్రీ నరసింహాచార్యులనువారు పిశాచ జన్మనుండి ముక్తి సంపాదించి యిచ్చిరని, ప్రసన్నామృతమను శ్రీ తాతాచార్యుల మహిమను వర్ణించు తమిళ శ్రీవైష్ణవ గ్రంథము వలన తెలియుచున్నది. శ్రీ నరసింహాచార్యులు తమ సహోదరులతో గూడి, ఆ భూత నివాసమును అంతఃపురమని భావించి, లోనికి ప్రవేశించి రనియూ, అది భూత నివాసమని తెలియగనే రాత్రింతయూ శ్రీమద్రామాయణమును గానము చేసిరనియూ, అది వినిన పిశాచములు పునర్జన్మలేక, ముక్తి పొందినవనియూ ఆ గ్రంథమువలన తెలియుచున్నది.

"ప్రభూ! తమకు నే నే విధముగా కృతజ్ఞత లర్పింప వలయునో తెలియకున్నది. భూతగృహమును ప్రవేశించి జీవచ్ఛవమైన నన్ను తీసుకొని వచ్చి, మీరు తగిన ఔషధోపచారములచే మనుష్యునిగా చేసినారు. మీరు నా మీద జాలిదలచక యుండిన, నేను మరణించి యిప్పటికి చాల కాలమై యుండెడిది. బహుశః నా ప్రతిజ్ఞను నెరవేర్చుకొనకనే మరణించి యుందునేమో! మీరు నాకు పునర్జన్మను ప్రసాదించినారు. ఆజన్మాంతము మీకు నేను కృతజ్ఞుడుగా నుండగలను" అని కృతజ్ఞతలో చేతులు జోడించినాడు.

"అట్లయిన, మీరు విజయనగర వాసులు కారా?"

మల్లన్న కాదని తల ఆడించినాడు.

"విజయనగర వాసులైనచో మీకు భూతగృహ విషయము తెలిసి యుండెడిది."

"నే నీ నగరవాసిని కాను ప్రభూ! ఏదియో కార్యార్థమై యిచ్చటికి వచ్చినాను."

"ఏ కార్యార్థమై మీరిచ్చటికి వచ్చినారు?"

"నా ప్రతిజ్ఞ యొకటి నెరవేర్చుకొనుటకయి వచ్చినాను."

"ఏమి ప్రతిజ్ఞ?"

మల్లన్న విరూపాక్షరాయలతో తన రహస్యమును చెప్పుటకు వెనుక ముందాడినాడు.

"నాకు చెప్పరాని ప్రతిజ్ఞ యైనచో, మిమ్ములను బలవంతపెట్టుట లేదు. చూడగనే మీరొక విలక్షణ పురుషులని నాకు దోచినది. అందుకనియే అడిగితిని."

"మీతో నా ప్రతిజ్ఞను తెలుపుటకు నా కే సంకోచమును లేదు ప్రభూ! కాని...." అని చుట్టును పరికించినాడు.

"ఇచ్చట మన వైరులెవరును లేరు. మీరు ధైర్యముగా జెప్పవచ్చును."

"నే నిచ్చటికి వచ్చినది...."

"కానిమ్ము...."

"దుష్టుడగు దేవరాయలమీద పగదీర్చుకొనుటకు."

"వారిమీద ఎందులకు పగదీర్చుకొనవలయు ననుకొన్నారు? వారు మీ కొనరించిన అన్యాయమేమి?"

"అన్యాయమా ? ఒకటియా, రెండా ? అతడు నా జీవితమును నాశనమొనర్చినది మాత్రమేకాదు; నా తల్లివలెయుండిన గౌరాంబను సైనికులచే హత్య జేయించినాడు. నా తండ్రి-గురువు సర్వమూనైన తిమ్మాజీగారినే నా విరోధిగా జేసినాడు. వీటికి మకుటప్రాయముగా నా జీవన సర్వస్వమైన పార్వతిని అతడు బలితీసుకొనినాడు. అతని పేరెత్తిన రక్తము గడకట్టగలదు. నేను జీవించియే యున్నచో అతనిని చంపక విడువను. నేను మల్లన్ననైనది నిజమైనచో ఆ నీచుడు నాచేతినుండి తప్పించుకొనలేడు"

"నీ వెవరితో మాట్లాడుచున్నావో తెలియునా ?"

"తెలియును. సామ్రాట్టుల సోదరులైన విరూపాక్షరాయల సన్నిధిని"

"అయినను యింతధైర్యమా ? నే నీ విషయమును ప్రభువులకు తెలిపిన వారు నిన్ను ప్రాణముండగనే చర్మము ఊడదీయింతురు. లేదా ఏనుగ పాదముక్రింద బడవేయగలరు"

"మీరు నాకు ద్రోహము తలపెట్టరని నమ్మిన పిమ్మటనే నేను మీకు అన్నివిషయములను హృదయము విప్పి చెప్పితిని"

"నాపై అంతటి నమ్మికయా ?"

"ఔను. మీవంటి ప్రభువులను వెదకుచునే నే నిచ్చటికి వచ్చినాను. మీరు నా కాశ్రియమిచ్చుటకు నిరాకరించరని నమ్ముచున్నాను"

"నీవంటి విద్రోహికి ఆశ్రియమా ?"

"ఔను. ఆశ్రియమిచ్చిన నేను మీకు తగినరీతిని సాయపడి, మీ ఋణమును తీర్చగలను"

"ఎట్లు తీర్చగలవు ?"

"అగ్ని ! ఆజ్యము ! ఈ మాటలువిని విరూపాక్షరాయలు ఔదు గరచుకొనినాడు. ఈ పిశాచి తన హృదయాంతరాళపు విద్రోహమునెట్లు

తెలుసుకొనినది? అని ఆశ్చర్యపడినాడు! అయినను అతని నింకను పరీక్షించ వలయునని తోచినది.

"నీవు ఏమి మాట్లాడుచున్నావు? ఎవరితో మాట్లాడుచున్నావు? అను విషయమును జ్ఞప్తియందుంచుకొనుము." అధికారస్వరముతో విరూపాక్షరాయలనినాడు.

"నేను ఆలోచించనిదే ఏ విషయమును, ఎవరితోను చెప్పువాడను కాను ప్రభూ! నా ప్రతిజ్ఞను మీకు తెలుపుటకు మునుపు వేయి పర్యాయములాలోచించి, మీతో నా ఆంతర్యమును చెప్పినాను."

"దీనికి నా సహకార మర్థించుచున్నావా?"

"ఔను ప్రభూ!"

"నీవలె నేను రాజద్రోహిని కాలేను."

"మనస్ఫూర్తిగా మీ రీ మాటలు అనుటలేదు."

"నా మీదనే ఆరోపణయా?"

ఈ మాట విని మల్లన్న విరూపాక్షరాయలను చూచి అర్థగర్భితముగా నవ్వినాడు.

"చూచుచున్నారేమి? ఈ నీచుని పట్టుకొని, ఆ కంబమునకు కట్టి, కొరడాతో నాలుగు దెబ్బలు కొట్టుడు" అని యరచినాడు.

సేవకులు పరుగునవచ్చి మల్లన్నను పట్టుకొనివెళ్ళి అచ్చటనున్న కంబమునకు కట్టినారు. చేతిలో కొరడా పట్టుకొని, కాలభైరవునివలె కనులెర్రజేయుచూ విరూపాక్షరాయలే నిలబడినాడు. కాని మల్లన్న నవ్వుచునే యున్నాడు. విరూపాక్షరాయలకు కోపము గట్లు తెగ్గించుకొనినది. "ఒకటి, రెండు, మూడు...." మూడు పర్యాయములు కొరడాను విసరినాడు. మల్లన్న శరీరముమీద వాతలు తేలినవి. అయినను అతడు పెదవి కదపలేదు—ఏడ్వలేదు. తాను నిరపరాధినని చెప్పుకొనలేదు; విరూపాక్షరాయల మీద మోపిన ఆరోపణకు విషాదము జెందలేదు. చివరకు విరూపాక్షరాయలే అతని కట్లను విప్పి, మెల్లగా నేలమీదికి వాల్చినాడు. సేవకులతని నెత్తుకొని వెళ్ళి తల్పముమీద పరుండజేసి, అచ్చటినుండి వెళ్ళి

పోయినారు. వారు వెళ్ళిన తర్వాత మల్లన్న మెల్లగా అనినాడు: "ప్రభూ! యిప్పుడైననూ మీకు నా నిష్ఠ పట్ల నమ్మిక పుట్టినదా ?"

ఈ మాట విని విరూపాక్షరాయల కంఠము గాద్గదికమైనది. అతని కనులలో నీరు గ్రిమ్మినది. అతడు మల్లన్నను కౌగిలించుకొని: "మల్లన్నా! నీవంటి వాని కొరకే నేను చిరకాలముగా నిరీక్షించు చుంటిని ! నిన్ను పరీక్షించుట కొరకే శిక్షించినాను ! నా యపరాధమును మన్నింపుము ! ఈ ఘడియ నుండియు నీవు నా ఆప్త మిత్రుడవు." అనినాడు.

కొన్ని ఘడియలకు పూర్వము అపరిచితులుగా నుండిన ఆ యిరువురును యిప్పుడు ప్రాణమిత్రులైనారు. దేవరాయల మీది ద్వేషము వారిద్దరునూ ఒక్కటిగా చేర్చినది !"

# దైవోపహతులు

## 18

మల్లన్న చెప్పినట్టు అగ్నియు ఆజ్యమును రెండునూ ఒక్కటైనవి. విరూపాక్షరాయల విద్రోహాగ్నికి మల్లన్న వాయువువలె వచ్చి చేరినాడు. ఇదివరకు నివురుగప్పిన నిప్పుగా నుండినది; యిప్పుడు ప్రజ్వలించ సాగినది ! వారిరువురూ వైయక్తిక కారణముల కొరకయి దేవరాయల మీద పగదీర్చు కొనుటకు ఆతురత జెందుచున్నారు. తనచేతి నుండి సింహాసనమును లాగుకొని, సామ్రాట్టయిన దేవరాయలను మరల సింహాసన చ్యుతినిగా జేసి, దానిని తా నాక్రమించు కొనవలయుననునదే విరూపాక్షరాయల పగకు కారణము ! తనకు జరిగిన అన్యాయమునకు, పార్వతి సుకోమల జీవితమునకు చిచ్చుపెట్టి నందుకు; అతని జీవితమునకు కూడా

చిచ్చుపెట్టవలయు ననునదే మల్లన్న పగకు కారణము। ఈ యిరువురి ఉద్దేశ సాధనకు గల ఒకేఒక మార్గం, దేవరాయల హత్య। దీనినెట్లు కార్యగతము చేయవలయు నననది యిరువురునూ దీర్ఘముగా నాలోచించి ఒక పితూరీ నేర్పరచుకొనినారు. దాని ప్రకారము మల్లన్న దేవరాయల హత్యకు కంకణము కట్టుకొనినాడు. అందుకయి వలయు జనబలము—ధనబలము చేకూర్చుటకు విరూపాక్షరాయలు సంసిద్ధుడైనాడు. ఈ విధముగా వారిరువురూ అగ్ని—వాయువుల వలె ఒక్కటిగా చేరిన తర్వాత విద్రోహజ్వాల అంతటనూ అలుముకొనినది.

వారు సామ్రాట్ దేవరాయల చర్యలను గమనించుటకయి తమ ఆప్తమిత్రులగు గూఢచారులను నియమించినారు. అంతఃపురమందునూ, ఆస్థానములోనూ, దేవరాయలమీద ఏదియోఒక కారణముతో అసమ్మతిని పొందిన వారందరూ ఈ పితూరీకి తోడైనారు. వారి ద్వారా దేవరాయల ప్రతి కార్యమూ విరూపాక్షరాయలకు, మల్లన్నకు తెలియుచుండెడిది. అంతియ కాక, మరికొందరు ఉన్నతోద్యోగులకు, పదవీ వ్యామోహమును ధన ప్రలోభమును జూపి, తమపక్షపు వారినిగా చేసుకొనినారు. రాజధానియందు దాకవేళ రాజ్యక్రాంతి జరిగిన, సైన్యములతోవచ్చి సాయపడుటకయి, విరూపాక్షరాయలు తన మాండలీకుల కందరికీ లేఖలువ్రాసి పంపినాడు. నగరములోగల సైన్యములో కూడా అంతఃకలహములు కలిగింప జేసినారు. నిర్ణీత దినమున దేవరాయల హత్య జరిగి, ఎక్కువ ప్రతిఘటనలు-రక్తపాతము లేక సింహాసనము, సామ్రాజ్యము విరూపాక్షరాయల హస్తగత మగుటకు కావలసిన ఏర్పాటులు రూపుగొన్నవి,

మల్లన్న దేవరాయలను హత్యగావించుటకు అన్ని ఆయకట్టు ప్రదేశములనూ సూక్ష్మముగా పరిశీలించినాడు. అన్నిటికంటెనూ అతనికి అంతఃపుర కోటవద్ద గల మారుతిదేవాలయ ప్రాంతము, దేవరాయలను చంపుటకు ప్రశస్తమైన స్థలముగా దోచినది. అచ్చట సంపంగిచెట్లు ఎక్కువగా నుండుటచే, కోట వాకిలివద్ద దాగుకొనుట కనుకూలముగా నున్నది. పైగా నా ప్రదేశము హత్యగావించిన పిమ్మట శత్రువులకు పట్టుబడిక తప్పించుకొనుట కనువుగా నున్నది. అందువలననే మల్లన్న దేవరాయల హత్యకా స్థలము నెన్నుకొన్నాడు.

కాని, ఆ ప్రదేశము చేరుటకు అంతఃపురము యొక్క వెలుపలి కోటను దాటి లోనికి ప్రవేశించవలసి యున్నది. వెలుపలి కోటను విచ్చు గత్తులతో సైనికులు సర్వకాల సర్వావస్థలలోను కావలికాయు చుందురు. కోట యందలి సైనికులను రోజుకు రెడుసారులు తొలగించు చుందురు. పగటివేళ పహరా నిచ్చినవారు రాత్రులందు రాను. రాత్రులందు పహరా నిచ్చినవారు పగటివేళ రారు. వారందరూ, స్వయముగా దేవరాయలే సైన్యము నుండి ఎన్నికచేసి తెచ్చిన అత్యంత స్వామి నిష్ఠా గరిష్ఠులు-ప్రభుసేవా పరాయణులు ! ధన కనక వస్తు వాహనాది ప్రలోభములతో వారిని వశపరచుకొనుటకు శక్యముగాదు. అటువంటి ప్రయత్నము లొనరించినవారే అపరాధులుగా పరిగణింప బడెదరు. ఆ యపరాధులను విచారణ జరుపకయే దండించుటకు కోట కొత్వాలునకు అధికారముగలదు. రాత్రివేళల సందేహాస్పదముగా ప్రవర్తించిన వారెవరైననూ సరియే. వారిని కఠినముగా శిక్షించుట కధికారము వారి కొసగబడినది. అనుమానాస్పదులైన వ్యక్తులను కనుగొనుటకై వారు రోజునకొక సంకేత శబ్దము నేర్పరచెడివారు. అది యానాటి పహరా సైనికులకు తెలిసియుండెడిది. దాని నత్యంత రహస్యముగ కాపాడువారు. ఈ సంకేతము తెలియని వారెవరైననూ, రాత్రికాలములో కోట ఛాయల సంచరించిన, వారినీ ఉదయము వరకును చెఱసాలలో వేసియుంచెడివారు. సంకేత శబ్దము తెలిసిన వారైననే మాత్రము వారికి విముక్తి లభించెడిది. లేనిచో, విచారణ యనునదిలేక వా రా అంతఃపుర చెఱసాలయందలి నేల మాళిగెలో మ్రగ్గిపోవలసినదియే !

ప్రధానామాత్యుడూ, దండనాయకుడూ అయిన నాగన్నసేనాని దేవరాయల పట్ల యింతటి జాగ్రత్తలను తీసుకొనినాడు రాజధానిలో దేవరాయల హితశత్రువు లనేకు లున్నారని అతనికి తెలియును. వారిలో పెక్కురు రాజబంధువులే ! దేవరాయల పక్షపాతులు కాని రాజబంధువు లందరి మీదనూ, అతడు ఒక కన్నువేసి యుంచినాడు. ఇతః పూర్వము సార్వభౌముడుగా నుండిన ఇమ్మడి బుక్కరాయల వలనను, విరూపాక్ష రాయల వలనను సామ్రాజ్యమున కేదియోఒక అపాయము కాచుకొనియే యున్నది. వీరిరువురిలో నొకడగు బుక్కరాయలను హొయిసల సీమకు

మాండలీకునిగాజేసి, దేవరాయ లతనిని రాజధానికి దూరముగా నుంచినాడు. అతడు దుర్బలుడూ, అల్పసంతోషి యగుటచే తనకు లభించిన పదవితోనే తృప్తి జెందినాడు. అంతకంటెనూ ఎక్కుడు మహత్త్వాకాంక్ష నాతనికి లేదు।

కాని, విరూపాక్షరాయలు మాత్రము తన కర్పింబడిన తొండై మండల రాజ్యమును తిరస్కరించి, రాజధానియందే నిలచినాడు. కాబట్టి అతడు అంతరంగములో దేవరాయలమీద కత్తినూరు చున్నాడని ఊహించుట కవకాశమేర్పడినది. అతడు మహత్త్వాకాంక్షియూ, అత్యంత కుటిల రాజ తంత్రజ్ఞుడూ, చతురుడూ నగుటచే, అతని ఆంతర్యమును భేదించుటకు శక్యముగాక పోయినది। నాగన్న దండనాయకుడీ విషసర్పమును సాధ్యమైనంత దూరమున నుంచిననూ, అతని వలన ఏఘడియలో నేమి జరుగ నున్నదో చెప్పుట కెవరికినీ సాధ్యముగాక పోయినది. కనుకనే అతని విషయములో నాగన్నసేనాని శరీరమంతయును కనులు చేసుకొని చూడసాగినాడు. అతని భీతిచేతనే దేవరాయల రక్షణా వ్యవస్థ పట్ల అంతటి విశేషమైన ఏర్పాటులు చేయుట।

దుర్గమమైన కోటలోనికి ప్రవేశించు టెట్లనునది మల్లన్నకొక సమస్యయైనది. ఈ విషయమును గురించియే ఆలోచించు చుండగా, నీల విజయనగరములో నున్నదను సంగతి అతనికి స్ఫురణకు వచ్చినది.

పార్వతి ప్రాణస్నేహితురాలైన నీల భర్తయగు వీరన్నకు అంతఃపుర రక్షణాదళములో కొలువు గలదు. నీల కిప్పుడు వివాహమై, భర్త గృహమునకు వచ్చి, ఒక బిడ్డతల్లి కూడా అయినది. అనాధుడగు మల్లన్నకు నీల ఒక సహోదరి వలె నుండినది. ఆమెకు మొదటి నుండియూ మల్లన్నను 'బావ' యని పిలచి, పీడించుటనిన చాల యిష్టము। "నీపెండ్లి భోజనము నాకెప్పుడు పెట్టెదవు బావా ?" యని మల్లన్న నామె వేయి మారులు హాస్యమొనరించెడిది. ఎట్లయినను నీల భర్త పరిచయమును సంపాదించి, దేవరాయల హత్యాకాండను పూర్తిచేయ వలయునని అతనికి దోచినది. నీల సంగతి స్ఫురణకు వచ్చినదే తడవుగా, అతడు వారి గృహమును వెదికికొనుచూ బయలు దేరినాడు.

నీల గృహమును వెదకుటకు మల్లన్నకు కష్టతరము కాలేదు. వీరన్న చిన్నఉద్యోగి యైననూ అతని తండ్రి ఈరన దండనాయకుడు, సైన్యములోని వారందరికిని పరిచయముగల వ్యక్తి యగుటచే వారిని కనుగొనుట కొంత సులభమైనది. నగరమందలి ఉన్నతోద్యోగులు నివసించుచున్న ప్రదేశమందే వారి మూడంతస్తుల మేడకూడా నున్నది.

ఈరన దండనాయకునికి వీరన్నగాక మరి ముప్వురు కుమారులున్నారు. వారందరూ అంతఃపురములోనూ, సైన్యములలోనూ ఉన్నతోద్యోగములలో నున్నారు. వారిలో చిన్న కుమారుడైన వీరన్న అంతఃపురకోట రక్షణా దళమున కధిపతి. ఈ నడుమనే అతడు కొత్వాలు పదవి నలంకరించినాడు. ఈరన దండనాయకుడు అత్యంత ప్రభు భక్తి పరాయణుడై, వారి ఆదరమునకు పాత్రుడయినట్టు, అతని కుమారులు కూడా ప్రభువుల ప్రీతి విశ్వాసములకు పాత్రులైనారు! వారి విషయములో సామ్రాట్ దేవరాయలకు చాల నమ్మిక గలదు. సామ్రాట్‌ల యీ విశ్వాసము నెప్పుడును వారు దురుపయోగ పరచుకొనలేదు. వారు తమ స్వశక్తితో ముందుకు వచ్చినారు కాని, ఈరన దండనాయకుని కుమారులని ఉన్నతిలోనికి రాలేదు.

ఈరన కుమారులలోకెల్లా వీరన్న వాచాలుడు—స్నేహపరుడు. అతనికి తగిన భార్య నీల. ఆ దంపతు లిరువురూ సరసులు. మాటల కుపక్రమించిన, అన్నపానీయములను కూడా మరచి కూర్చొనువారు—నగరములో జరిగెడి విషయములన్నియూ వారి ప్రసంగములో దొర్లుచుండెడివి. ఈ మాటలలో ప్రభువు మొదలు పేదవారి వరకూ అందరునూ చోటు చేసుకొనువారు. నగరములో తాను కనిన—వినిన విషయములను భార్యతో పాలు పంచుకొనిదే అతనికి తోచెడిదికాదు. అతని వద్ద యే గుట్టూ—గోప్యము దాగెడిదికాదు: "నీలా! యీ విషయమెవరికి నీచెప్పకుము. రహస్యముగా నుంచుము" అని యింటనున్న వారి కందరకును వినబడునట్టు, గుట్టును భార్య కెరిగించువాడు. ఎన్నియో మారులు నీల, "మీరు రహస్యమని చెప్పుటకు రాకుడు; గుట్టు – రట్టు రెండునూ మీ కొక్కటియే" అని పరిహాసము చేసెడిది. మొత్తము మీద వారిది అను

కూల దాంపత్యము ! వారు తల్లిదండ్రులకు అణగి—మణగి, సంసార మును చక్కగా సాగించుకొనుచూ పోవుచున్నారు.

ఒకనాడు నీల యింటి పనులన్నియునూ ముగించుకొని, కుమా రుని కొక ఉడుపును తయారు చేయుచున్నది. కుట్టుపని అంతయూ పూర్తియై, దానికిక జరీ అల్లుట మాత్రమే మిగిలి యున్నది. రానున్న పండుగనాడు దానిని కుమారునకు తొడిగి, ఆనందించ వలయునని ఆమె యాశ ! నీల తన కుట్టుపనిలో నిమగ్నురాలై యుండగా, ఆనాటి తన పనులన్నియును ముగించుకొని యింటికి వచ్చిన వీరన్న, భార్య నుద్దే శించి ;

"చూడు, నీలా ! నే నెవరిని తోడ్కొని వచ్చితినో ?" అని అన్నాడు.

నీల తాను చేయుచున్న పనిని వదలి, తలపైకెత్తి ఆ వచ్చినవారిని చూచినది. వెంటనే ఆమెకు వారెవరైనదియును స్ఫురణకు రాలేదు. ఒక క్షణకాలము పరీక్షించి చూచినది.

"నీలా, నన్ను గుర్తించలేక పోవుచున్నావా ? ఇంత త్వరలో మల్లన్నను మరచిపోతివా ?" అని మల్లన్న చెప్పగా అప్పుడు గుర్తించి:

"ఓ! మల్లన్న ! పార్వతీ ప్రియుడు మల్లన్న ! ఎప్పుడు వచ్చి నారు బావగారూ ?" అని సంతోషముగా ప్రశ్నించినది.

"ఇప్పుడే వచ్చుచున్నాను. దారిలో మీ భర్తగారి పరిచయము లభించినది. ఇద్దరును కలసి వచ్చితిమి" అని మల్లన్న జవాబు చెప్పి నాడు.

"వారి పరిచయము మీకెట్లు కలిగినది?" నీల భర్తవైపు చూచి కుతూహలముగా అడిగినది.

"వారు మన గృహమును వెదకుచూ బయలుదేరినారు. ఈశాన దండనాయకుల యిల్లేది యని విచారించుచున్నారు. ఈ మాట నా చెవిని పడి, నేను వారిని ఎవరు మీరని విచారించినాను. నీ పేరు చెప్పి, నీబాల్య మిత్రులనినారు. వెంట తీసుకొని వచ్చినాను" అని వివరించినాడు వీరన్న.

"మల్లన్న బావగారూ, మీరు ప్రస్తుత మెచ్చట నుండి వచ్చు చున్నారు? ఎందులకింత కృశించి నారు? గుర్తించలేనంతగా మారిపోయి నారేమి ? శరీరము స్వస్థతగా లేదా?" అనినది.

"నేను ముద్గల్లునుండి వచ్చుచున్నా నమ్మా."

"అచ్చట చిన్నాన్న – పినతల్లి అందరూ క్షేమముగా నున్నారు గదా !"

"అందరూ క్షేమముగనే యున్నారు."

"ప్రస్తుతము పార్వతి యెచ్చట నున్నది? ఊరువిడచి వెళ్ళిన తర్వాత ఆమెను చూచుటకు వీలుగాక పోయినది ! అయినను ఆమె విషయ మప్పుడప్పుడూ చెవిని పడుచున్నది. గుల్బర్గా యందామె తండ్రి గారితో సుఖముగా నున్నదని వారును వీరును చెప్పగా విన్నాను. మీ రీ వైపునకు వచ్చుటయేలేదు - ఈ నగరమున చాల దినములుగా నున్నట్టు విన్నాను. బహుశః గుల్బర్గునకు వెళ్ళియుండ వచ్చునని భావించినాను. పోనిమ్మా. చివరకు మీరు ప్రేమించిన పార్వతిని పెండ్లాడినారుకదా ?"

"అది యీ జన్మకు లేదు !"

"ఎందులకు ? ఏమైనది ?" ఆందోళనగా అడిగినది నీల.

"నే నంతటి యదృష్టమునకు నోచుకొనలేదు ! మా వివాహము, రాబోవు జన్మలో జరుగ గలదు !"

"మీ మాటలు విచిత్రములుగా నున్నవి. విషయ మేదియో వివ రిముగా చెప్పుడు !"

మల్లన్న పార్వతి మరణ విషయము నామూలాగ్రముగ నీలకు తెలియజేసినాడు. ఈ దురంతోదంతమును విని నీల కన్నీరు కార్చినది స్నేహితురాలికి కలిగిన దుస్థితికై చింతించినది.

"చివరకు పార్వతి జీవితము చితికెక్కినదా !" అని భారముగా నిట్టూర్చినది. "ఇంతటి గుణ, రూప, యౌవనము లుండియును ఆమె జీవితము వ్యర్థమైనది ! సుఖ మామె ముఖమున వ్రాయబడలేదు. ఇంత కును మనము దురదృష్టవంతులము !" అని బాధ జెందినది.

"నీలా ! ఆ మాటను మరి శత పర్యాయము లనుము, ఆమె

అంత్యఘడియలలో సైతము నన్ను దఁచు కొనుచునే కనులు మూసిన దట ! కాని, నాకొరకై యిన్ని యిడుమ లనుభవించిన దేవతను మరణ సమయమున జూచు భాగ్యము నాకు లేకపోయినది ! కన్నతండ్రియేఆమె సుకుమార జీవితమునకుచిచ్చుపెట్టినారు. అంతయును మనదురదృష్టము !"

"ఎంతటి వారెంతగా మారినారు ? తమ కుమార్తె జీవితమునకే చిచ్చుపెట్టునంతటి నిర్దయులు వారు కాగలరని, నేను కలలోసైత మను కొనలేదు. ఎటువంటి పరిస్థితిలోనైనను పార్వతిని మీకే యివ్వవలయు ననుకొనిన వారు, చివరకు ఎందుల కీ విధముగా మారినారు ? ఈ విష యము లన్నియును విని, నాకెందుకో నమ్మశక్యము గాకున్నది. దీనిలో నేదియో మోసమున్నట్లు తోచుచున్నది. బహుశః యిదంతయును నీచుడగు సుల్తాను ఫిరోజ్‌షా కుట్రయొ పితూరీయేయైయుండవలయును. ఈ విష మును గురించి మీరు బాగుగా విచారించినారా ?"

"బాగుగనే విచారించినాను. ఇదంతయును తిమ్మాజీగారి తంత్ర మని ఋజువు పడినది !"

"మీరీ విషయమై వారితో ముఖాముఖి చర్చించితిరా ?"

"లేదు. ఆ పాపి ముఖదర్శనము చేసి యిప్పటికి సరిగా సంవ త్సర కాలమైనది. మీసామ్రాట్టుల తియ్యని పలుకులకు మోసపోయి, నన్ను చెఱసాల పాలుజేసి, వారికి కుమార్తెనిచ్చి వివాహము చేయ నిశ్చయించి, రాజధానిని విడచి వెళ్ళిన తర్వాత నే నతని ముఖదర్శనము చేయలేదు!"

"ముఖ్యముగ మీకీ జన్మలో కంకణ బలము—ఋణానుబంధము లేదు ! సులభముగా జరుగవలసిన వివాహమునకు ప్రథమము నుండియు ఎన్నియో విఘ్నము లేర్పడుచూ వచ్చినవి. ఆమె దుర్మరణమును తలచు కొనిన శరీరము జలదరించుచున్నది !" అని నీల అనుకంపము జూపినది.

ఆమె సానుభూతి వాక్కులను విని వీరన్న కూడా నిట్టూర్పు విడచినాడు !"

"పోనిమ్మా, యికముందేమి చేయవలయునని యున్నారు ?"

"ఇంకనూ ఏమియూ నిశ్చయించుకొనలేదు ! ఏమిచేయుటకునూ మునుపటి ఉత్సాహములేదు ! మనస్సు కెల్లప్పుడునూ ఏదో దిగులు !— అశాంతి !"

"మరేమియూ ననుకొనక పోయిన, నేనొక సలహా చెప్పెదను, ఆలకించెదరా ?"

"చెప్పుము !"

"నేనీ మాటను మీ సోదరివలె చెప్పుచున్నాను. ఇంతవరకునూ జరిగిన విషయముల నన్నింటినీ మీరొక దుస్వప్నముగా భావించి మరచి పొండు !"

"ఎట్లు మరువగలను నీలా ! ఇది నా జీవితమును దహించివేయుచున్న దావాగ్ని ! ఈ జన్మకిక నాకు సుఖము—శాంతి యనునవి లేవు ! ఆమాట మరచిపొమ్ము !"

"మీరొక వివాహము చేసుకొనినచో....?"

"ఈ జన్మకు నాకింకొక వివాహమా?"

"అయిన, మీ రాజన్మ బ్రహ్మచారులుగనే యుండగలరా ?"

"పెండ్లాడదలచిన, పార్వతి యంతటి సుగుణ లభించగలదా ?"

"ఆ విషయమై మీరు వ్యధజెంద నక్కరలేదు. మీ కనుగుణవతియైన కన్యను నేను చూచి నిర్ణయించగలను ! ముందు మీరు వివాహమునకు సమ్మతించుడు ! తక్కిన విషయములు నేను చూచుకొనగలను !"

"నీలా ! నీవే యిప్పుడు నా ఏకైక బంధువు ! నీ యిష్టము వచ్చినట్లు చేసుకొనుము, వద్దనుటలేదు ! కాని, నీ యింటికి వచ్చినప్పుడు యీ నిర్భాగ్యుని క్షేమ సమాచారములను విచారించు చుండుము. పార్వతి స్మృతిని కలిగించుటకు, నా జీవితమునకు నీ వొక్కతెవే ఆధారము ! నీ సాంత్వన వచనములతో నా మనోవ్యధ నంతయునూ మరువగలను !"

అచ్చట కొంతకాలము మౌన మావరించినది. ఇంతలో తన దుస్తులను మార్చుకొని, కాలుచేతులు కడుగుకొని వీరన్న అచ్చటికి వచ్చినాడు.

"నీలా ! ఇదియేమి ? రాకరాక వచ్చిన బావగారిని విచారించునది

యిటులేనా ? వారు చాల అలసియున్నారు. కన్నీటితోనే వారి కడుపు నింప వలయునని యున్నావేమి ?" అని గద్దించినాడు.

ఆ మాట విని నీల—"అయ్యో ! నేనెక్కడి మరదలను? క్షేమ సమాచారములు విచారించు సంభ్రమములో, భోజనమునకు లెమ్మనుట మరచినాను !" అనిచెప్పి, మల్లన్నను భోజనమునకు లేపినది. తనకు ఆకలి లేదని మల్లన్న ఎంతచెప్పినా వినక, ఆమె బలవంతపరచి, అతనిచే భోజనము చేయించినది.

ఆనాడు మల్లన్నకు నీలనుచూచి,పార్వతిని పరికించినంత సంతోష మైనది. అతని మానసమునకు ప్రప్రథమముగా ఒక విధమైన శాంతి లభించినది. ఆ క్షణములో అతనికి జీవితము చాల అర్థవంతముగా, సుఖ కరమైనదిగా గోచరించినది—మల్లన్న వీడ్కోలు పుచ్చుకొని వెళ్ళు నపుడు నీల :

"మల్లన్న బావగారూ ! మీ కిప్పుడు ఆత్మబంధువు లను వారెవ రునూ లేరు. ప్రస్తుత పరిస్థితిలో మీకు సాంత్వన వచనముల ఆవశ్యకత ఎంతయైనను గలదు. కనుక, మీరు మాయింటనే ఎందులకు నిలువ రాదు ?" అనినది.

"లేదమ్మా ! నాకిప్పుడు ఏకాంత జీవనము గడుపవలెనని యున్నది ! నన్ను నిర్బంధ పరచకుము....! మీ విశ్వాసమునకు కృతజ్ఞు డను !" అనినాడు మల్లన్న.

"ప్రస్తుతమునకు, మీరు మా యింట నుండకపోయినను చింత లేదు, ఎచ్చటనైనను మీ యిష్టమువచ్చిన చోట, సుఖముగా నుండిన చాలును. ఈ మీ మఱదలును మరువకుడు. తరచు వచ్చుచుండుడు." అని, నీల కన్నీరు కార్చినది.

ఆ దృశ్యమును చూచుటకు మల్లన్నవలన సాధ్యముకాక పోయి నది. అతడు వెనుదిరిగి చూడక గృహమునుండి బయట పడినాడు.

అతి త్వరలో మల్లన్న ఈరన దండనాయకుల యింటి వారిలో ఒకడైనాడు. వీరన్నకు ప్రాణమిత్రుడైనాడు. అతనితో కలసి, అత డుద్యోగము చేయుచున్న కొత్వాలు కచేరీకి ఎన్నియో మారులు వెళ్ళి వచ్చినాడు. వారిరువురకూ సోదర వాత్సల్య మేర్పడినది. తమ విరామ

సమయములో వారు ఒకరి నొకరు కలసికొని, హాయిగా పొద్దుపుచ్చెడి వారు. వారి మైత్రి యితరులు అసూయ పడునంతటి గాఢముగా నేర్పడి నది. ఈ విషయమై వీరన్న మిత్రులు కొందరతనిని ఒకటి:రెండు పర్యాయములు హెచ్చరించినారు. కాని, వీరన్న ఒక నవ్వు నవ్వి ఊరకొనువాడు. హెచ్చుగా చెప్పవచ్చిన వారికి : "పాపం ! అతడు జీవితములో వెతజెందిన వాడు. అతని కిప్పుడు నేను తక్క, అన్యులెవరునూ, బంధుమిత్రులు లేరు" అని చెప్పి, సమాధాన పరచ సాగినాడు. ఈ సమాధానముతో తృప్తి కలుగక పోయిననూ, వా రతని మనసును బాధించలేక, మారు మాటాడువారు కారు.

మల్లన్న, నీలా - వీరన్నల ప్రీతి విశ్వాసములను దురుపయోగ పరచుకొనలేదు. ఆ దంపతులను జూచి నిజముగా సంతోష పడువాడు ! తన మనస్సుకెంత విసుగుగా నున్ననూ, వారి నగుమోములను చూచిన వెంటనే అది తొలగిపోయెడిది !

వారి దరహాస వదనములు — సుఖ; శాంతులు 'స్పర్శవేది' వలె, జడముగా నున్న అతని చేతనమునందు, మానవత్వపు గుణములను మొలకెత్తింప జేసినవి. అతనికిప్పుడు జీవితములో తన పగయే ప్రాముఖ్యమని తోచుటలేదు. తానుకూడా వారివలెనే పదిమందికి కావలసిన వాడై పరోపకారార్థ జీవితమును గడుప వలయునని దోచ సాగినది. కాని పార్వతి విషయము గుర్తుకు వచ్చినప్పుడు, అతని హృదయములోని మృదుభావనలన్నియును ద్వేషాగ్నిలోబడి దగ్ధమై పోయెడివి. మనసు మరల వజ్రకఠోర మయ్యెడిది. పగకై పతీక్షించెడివి ! చివర కతడు, 'ఏమైననూ సరియే ! తన ప్రతిజ్ఞను నెరవేర్చు కొనవలయును. ఆ విధమైన సుఖ—శాంతులతో కూడిన జీవితము కాదు తనది. ఈ జన్మలో తనకా సౌఖ్యములేదు' అనుకొనువాడు.

అతడు వీరన్న ప్రీతి — విశ్వాసములకు పాత్రుడై, అంతఃపుర కోటయందలి కొత్వాలు కచేరీ అధికారుల పరిచయము సంపాదించిన పిమ్మట, తన కుట్రను కార్యగత మొనర్చుటకు తగిన సమయము కొరకై ఎదురుచూచుచూ కూర్చున్నాడు. తనపై ఎవరికినీ సంశయము

కలుగకుండుటకు, తన విద్రోహకర కార్యము తెలియకుండుటకును అతడు చాల జాగ్రత్త వహించినాడు. ఎవరితోడను ఎక్కువగా కలసి తిరిగెడువాడు కాడు. దినమంతయునూ యింట గూర్చుని ఏదియో శిల్పములను చెక్కుటలో నిమగ్నుడై యుండువాడు. విరూపాక్షరాయల గూఢచారులు వ్యాపారుల వేషములో అతని వద్దకు వచ్చి విషయము లను తెలుసుకొని వెళ్ళుచుందురు. మల్లన్న తాను స్వయముగా తయారు చేసిన—దంతపు—శ్రీ గంధపు—బొమ్మలను వీరన్నకూ, అతని మిత్రులకూ స్నేహపు కానుకగా సమర్పించెడివాడు. వారు ధనమిచ్చిన పుచ్చుకొనడు. "మీరు నన్ను ధనము పుచ్చుకొనుమని బలవంతపరచిన, మన మైత్రి చిరకాలము నిలువదు" అని సౌజన్యముతో వాకృచ్చెడివాడు. యీ విధముగా అందరి అభిమాన — గౌరవాదరములకు పాత్రుడయి అంతఃపురమందన్ని ప్రదేశములందును నిరాటంకముగా తిరుగుటకు వలను పడిన తర్వాత, రాబోవు మహాశివరాత్రి నాడు శ్రీ విరూపాక్ష స్వామికి విశేషపూజ సల్పి, సామ్రాట్ దేవరాయలు దేవాలయమునుండి తిరిగి వచ్చునప్పుడు, మారుతి ఆలయము వద్ద దాగియుండి అతని కథను ముగించవలయునని నిశ్చయించినాడు.

అతడు నిరీక్షించిన శివరాత్రి దినముకూడా సమీపించినది. మల్లన్న తాను చేసుకొనవలసిన ప్రయత్నములన్నియూ చేసుకొన్నాడు. ఉద్విగ్న మానసుడైన మల్లన్న కిప్పుడొక దినమొక యుగముగా తోచినది. చివరకా రోజుకూడా వచ్చినది. 'ఇది దేవరాయల జీవితమునకు చరమ దివసము ! తనకు సైత మిదియే తుదిరోజు కావచ్చును. తను దేవరాయలను హత్యజేసి తప్పించుకొన వచ్చును : లేదా ఆ ప్రయత్నములో మరణము పొందవచ్చును। కాని హత్య చేయనిదే పట్టుబడరాదు, పట్టుబడిన మరణ దండన । లేదా యావజ్జీవ కారాగారవాసము । ఏమైన నూ సరినే దీని కవకాశ మివ్వరాదు.' అని నిశ్చయించు కొన్నాడు మల్లన్న—

ఆనాడు మహాశివరాత్రి ! మహాదేవుని భక్తుల కందరికిని అది పర్వదినము. శివభక్తులందరూ ఉపవసించి, పుణ్యసంచయనము చేయు దినము ! పంపా విరూపాక్షస్వామి సాన్నిధ్యములో నున్న విజయనగర

ప్రజ లానాడు వేకువనే లేచి, తుంగభద్రలో స్నాన సంధ్యా వందనములను తీర్చుకొని, శివునర్చించి, ఆ మహాభాగుని చింతనలో తొడగు పుణ్యదినము. ప్రజలానాడు శివరాత్రి కారణముగా శ్రీవిరూపాక్షస్వామి దేవాలయములో జరుగు ప్రత్యేక పూజ—ఉత్సవములను చూచి ఆనందించుటకయి గుంపులు గుంపులుగా చేరినారు.

ఆచార ప్రకారము యీ ఉత్సవమునకు సామ్రాట్ దేవరాయలు కూడా వచ్చినాడు. సహజముగా దైవభక్తిగల అతనికి ఈ నడుమ—పరాభవము జరిగినదాదిగా—ఆ భక్తి యినుమడించినది. శుభ్రవసన ధారుడై, మితపరివారముతో, దేవాలయము నందానాడు జరుగనున్న ప్రత్యేక పూజను తిలకించి, స్వామినర్చించి పోవుటకై సంజవేళకే వచ్చినాడు. పూజలన్నియునూ ముగిసి, తీర్థ ప్రసాదములను స్వీకరించి-అంతఃపురమునకు తిరిగి వెళ్ళునప్పటికి దాదాపు అర్ధరాత్రము కావచ్చినది. దేవరాయలు స్వామి మహిమను కొనియాడుచూ, ఆనాటి పూజోత్సవములను కనులార గాంచి, జన్మ పావనమైనదని చెప్పుకొనుచూ, దేవాలయమును విడచి, తన పల్లకీలో కూర్చొన వలయునని యున్నంతలో దేవరాయల అంగరక్షకుల సమూహమును భేదించుకొని ఎవరో ఒక వృద్ధుడు అతని వద్దకు పరుగిడి వచ్చుచుండుట కనబడినది ఆ వచ్చుచున్న ఆగంతుకుడు బిగ్గరగా "ప్రభూ, ప్రభూ!" అని అరచి, నిలువుడని చేతితో సంజ్ఞ చేయుచూ సమీపించుచున్నాడు. ఇదిచూచి దేవరాయలు పల్లకీ నెక్కుట చాలించి, ఆ వృద్ధుని తోడ్కొని రమ్మని చెంతనే యున్న లక్ష్మీధరా మాత్యులకు తెలియ జేసినాడు.

లక్ష్మీధరు డా వృద్ధుని తోడ్కొని వచ్చి, దేవరాయలముందు నిలువ బెట్టినాడు.

"ఎవరు మీరు? మమ్ములనెందుకు పిలచినారు?" దేవరాయలు గంభీర కంఠముతో ప్రశ్నించినాడు.

"ప్రభూ! నేను తిమ్మోజీని. మీకొక రహస్య విషయ మెరిగించుటకై వచ్చినాను"

"ఏమీ? మీరు తిమ్మోజీగారా? నన్ను మోసగించి, విజయనగరమునుండి తప్పించుకొని పారిపోయిన తిమ్మోజీగారా? మీకిప్పుడు

నాతో నేమిపని ? మరల నన్ను మోసపుచ్చుటకై వచ్చినారా ?" దేవ రాయలు తన మాటలలో విసుగును ధ్వనింపజేసినాడు.

"ప్రభూ ! నా యపరాధమును క్షమింపవలయును. ఇప్పుడు నేను మిమ్ములను వంచించుటకై వచ్చినవాడను కాను. మీ ప్రాణములను కాపాడుటకై వచ్చినవాడను"

"ఏమీ ? నా ప్రాణములను కాపాడుటకై వచ్చినారా ? ఆశ్చ ర్యము ! విషయమేదియో వివరింపుడు !"

"అది యత్యంత రహస్యము ప్రభూ ! మీకు గోప్యముగా చెప్ప వలసి యున్నది"

"అయిన మీ రీ పల్లకీలోనికి రండు; విషయమేదియో త్వరిత ముగా జెప్పుడు"

తిమ్మోజీ వెనుక ముందాడుట జూచి దేవరాయలు "సంకోచపడ కుడు. మీ యాందోళనను జూచిన యీ విషమ మత్యంత మహత్తరమై నదిగా దోచుచున్నది.నా ప్రాణాపాయ విషయమైనచో యిప్పుడే చెప్పుట మంచిది"

తిమ్మోజీ పల్లకీలో గూర్చొని, జరిగిన విషయముల నన్నింటినీ వివరముగా తెలియజేసినాడు.

ఆ జరిగిన విషయము లేవనగా___

ఫిరోజ్‌షా మల్లన్నను ఉపాయముగా మోసగించి, అతడు దేవ రాయలమీద పగదీర్చుకొనునట్లుగా జేసి, విజయనగరమున కతనిని పంపిన తరువాత ఈ విషయమును దేవరాయల కుమార్తెయగు హేమాం బిక ముందు చెప్పుకొని తన పౌరుషమును ప్రకటింపజేసికొనుటకై ఆమె యంతఃపురమునకు వచ్చి విజయోన్మాదములో :

"ప్యారీ ! చూచితివా నీ సుల్తానుని పౌరుషము ? ఆ సైతానును మీతండ్రియగు దేవరాయలమీదికి వదలిపెట్టినాను.అతడు పార్వతియొక్క నిజమైన హత్యాకారి దేవరాయలనియే భ్రమించి, అతనిని ఆహుతిగొను టకై యిప్పుడు విజయనగరమునకు వెళ్ళియున్నాడు. ఇక నీ తండ్రి కథ ముగిసినట్టే ననుకొనుము. ఆనాడు నీ వివాహ సమయమున నన్నవమాన

పరచి పంపినందుకు, యిప్పుడు మల్లన్నచేతిలో తగిన శిక్ష ననుభవించ గలడు. కోపావేశముతో పిచ్చివాడైన మల్లన్న దుష్టుడగు ఆ దేవరాయ లను తుదముట్టించుట నిక్కువము. ఇక నీవు తండ్రి యాశను వదలు కొనుము. అతడిప్పుడు నరకద్వారము కడ నున్నాడు" అని చెప్పి, హేమాంబికను నిశ్చేష్టితురాలినిగా జేసినాడు.

"జహాపనా! ఆ విషయమేదియో స్పష్టముగా జెప్పుడు. మల్లన్న యిచ్చటికి వచ్చియుండెనా? అతనిని మా తండ్రిమీది కెట్లుసి గొల్పి-నారు? మీ పలుకుల సతము సమ్మినాడా?" అని కుతూహలముతో ప్రశ్నించినది హేమాంబి:.

సుల్తాను హేమాంబిక వలన తన కే అపాయమునూ కలుగదను భావముతో, తాను మల్లన్నను మోసగించి దేవరాయలమీద పగదీర్చు కొనుటకై పంపిన సంగతులన్నియూ ధైర్యముగా చెప్పినాడు. హేమాం బిక కన్నీరు కార్చుట చూచి, అతనికి మరింత ధైర్యము కలిగినది.

ఈ విషయము లన్నియునూ వినిన తరువాత హేమాంబిక నిరప రాధియైన మల్లన్నచే, నిరపరాధియగు దేవరాయలు అన్యాయముగా హత్యగావింపబడుటను తప్పించవలయుననుకొనినది. కాని ఈ కార్యము నెట్లు సాధించవలయుననునది ఆమెకు తెలియలేదు. ఎన్నియో రోజు లీ చింతతో, అన్నపానీయములను సైతము ముట్టుకొనక గడపినది. ఒక దిన మీ చింతనలో నుండగా, హఠాత్తుగా ఆమెకొక ఆలోచన తట్టినది. తిమ్మాజీ అచ్చటనే చెఱసాలలోనున్న సంగతి స్ఫురణకు వచ్చినది. ఏ విధముగానైననూ అతనిని చెఱనుండి తప్పించి, ఆయన ప్రాణములను కాపాడవలయు ననుకొన్నది. అనుకొనుటయేకాదు; కార్యాచరణకుగూడా గడంగినది.

ఆ రాత్రి అందరూ నిద్రించిన తరువాత హేమాంబిక తన నమ్మి కకు పాత్రురాలైన ఒక సేవకురాలితో అంతఃపురమునుండి బయలుదేరి సూటిగా కోటయందలి చెఱసాలకు వచ్చినది. మధ్యాహ్నము ఉపాయ ముగా సుల్తాను చేతినుండి తా నపహరించిన రాజముద్రాంగుళీయమును అచ్చటి చెఱసాలాధికారికి చూపి, తిమ్మాజీని విడిపించి, అతని నేకాంత

మునకు తోడ్కొనిపోయి, జరిగిన విషయములన్నియునూ సంగ్రహ ముగా చెప్పినది.

"తిమ్మోజీగారూ ! మీరు వెంటనే యిచ్చటినుండి తప్పించుకొని వెళ్ళి, విజయనగరము చేరి, సామ్రాట్‌లకు సంభవించినప్రాణగండము నుండి వారిని తప్పింపుము. ఈ సంచిలో మీ ప్రయాణ వెచ్చములకై నూరు వరహాలను వేసియున్నాను. ఇప్పుడే మీరు బయలుదేరుడు" అని చెప్పి, తిమ్మోజీని పంపివేసినది. ఈ కార్యమునకు సాయపడిన చెఱ సాలాధికారిని ఉచితరీతిని సన్మానించి, రెండవ కంటికి తెలియక మరల అంతఃపురమును చేరుకొనినది. తన భుజము మీద మోపబడిన ఒక పెద్ద భారమును క్రిందికి దింపివేసినంతగా సంతసించి, ఆమె ఒక నిట్టూర్పును విడచినది.

తిమ్మోజీ వేషము మార్చుకొని గుల్బర్గను విడచి, విజయనగర మార్గ మనుసరించినాడు. కాని మార్గమధ్యములో అతడున్నట్టుండి హఠా త్తుగా రోగగ్రస్తుడైనాడు. చెరసాలలో సరియైన గాలి—వెలుగు, ఆహార ములు లేక కృశించి పోయినాడు. దానికి తోడతని మానసిక ఉద్వేగము, అతని అస్వస్థతకు సగము కారణమైనది. ఆ యస్వస్థతనుండి కోలుకొని మరల ప్రయాణించుట కతనికి రెండుమాసముల కాలము పట్టినది. యీ కారణముచే అతడు విజయనగరమును చేరుట కాలస్యమైనది. తాను విజయనగరమును చేరుటకు మునుపే, దేవరాయల హత్య జరిగిపోవు నేమోయని భీతిల్లుచూ వచ్చిన తిమ్మోజీకి, దేవరాయల ముఖము చూడ గనే సంతోషమైనది. అత డీ విషయమును దేవరాయలకు తెలుపుపెట్టు లని ఆలోచించుచూ రాగా, ఆనాటి శివరాత్రి పూజా విశేషములను తిల కించి, శివునర్చించి వెళ్ళుటకై ప్రభువులు శ్రీ విరూపాక్షస్వామి దేవా లయమునకు వచ్చియున్నారను వార్తవిని, ఆ సమయములో ప్రభువుల కీ విషయము తెలుప వచ్చునని భావించి, తిమ్మోజీ ఆలయము కడకు వచ్చి నాడు. చివర కతని యభీష్టము సిద్ధించినది:—

యీ విషయములన్నియును వినిన దేవరాయలకు గుండె దడదడ కొట్టుకొనసాగినది. ఆనా డుదయమునుండి తనకు కనబడుచూ వచ్చిన

దుశ్శకునముల అర్థమేమియని అప్పుడు తెలిసినది....ఈ సంఘటనలను తలచుకొనిన కొలదిని మనస్సు వ్యాకులము జెందసాగినది. అతడు లక్ష్మీధరా మాత్యులవైపు చూచి—"అమాత్యులూ, ఈనాడు నాకు ఒకదాని మీద నొకటిగా అన్నియునూ దుశ్శకునములే గానబడుచున్నవి. తిమ్మోజీ గారి మాటలను వినిన దిగులు గలుగుచున్నది!" అనినాడు.

"ప్రభూ! తమరు భీతిల్లకుడు. శ్రీవిరూపాక్షస్వామి కృపయొక్కటి గల్గిన, తమ సిగపూవు దలుగుటకు సైత మెవరి వలననూ సాధ్యముకాదు. నిశ్చింతులరై మీ రంతఃపురమునకు మరలుడు. కాని, ప్రతిదినమునూ ప్రవేశించు ద్వారమున గాక, వేరొక ద్వారమున బ్రవేశింపుడు! నేను మీ పల్లకీలో గూర్చుని, మామూలు ద్వారమున అంతఃపురమునకు వచ్చెదను. దీనియం దేమైననూ హెచ్చుతగ్గులు సంభవించిన నేను చూచు కొనగలను. కాని, నేను వచ్చి అంతఃపురములో మిమ్ములను చూచువరకునూ మీరు నిద్రించరాదు! మీ చెంతకు అంగరక్షకులను తక్క, అన్యులనెవరినీ చేర్చకుడు!" అని, ధైర్యము చెప్పి, దేవరాయలను పంపినాడు. తరువాత ప్రభువు పల్లకీలో తానునూయెక్కి వెళ్ళినాడు, లక్ష్మీధరామాత్యుడు.

ఆనాడు మల్లన్న సాయంవేళ వరకునూ వీరన్నతో కొత్వాలు కచేరీ యందు కూర్చొని యుండి, అతని నుండి ఉపాయముగా ఆనాటి సంకేతమైన "జై శంకర!" యను పదమును గ్రహించి, అచ్చటినుండి బయట పడినాడు. వీరన్న యింటికి రమ్మని ఆహ్వానించినను, ఏదో పని యున్నదని చెప్పి, మల్లన్న తప్పించు కొనినాడు. కచేరీ నుండి సూటిగా యింటికి వెళ్ళి, తనతో నల్వురు వీరభటులను పిలుచుకొని, ఆయుధ పాణులై, అంతఃపుర కావలి వారివలె వేషము మార్చుకొని, కోట దిడ్డి వాకిటి వద్దకు వచ్చి, "జై శంకర!" అన్నాడు. ద్వారపాలకులకు మల్లన్న పరిచయస్థు డగుటచేతను, అతని కానాటి సరియైన సంకేతపదము తెలిసి యుండుట చేతను అతనిని, సంగడి కాండ్రను లోనికి ప్రవేశ పెట్టినారు.

అప్పటికి సగముపని యైదని మల్లన్న సంతసించినాడు. తక్కిన సగమునుకూడా పూర్తిచేయుటకు, తగిన సంగడి కాండ్రను నియమించి, మారుతి ఆలయ సమీపము నందుగల సంపంగిచెట్టు బోదెవెనుక దాగి, దేవరాయల ఆగమనము నెదురు చూచుచూ కూర్చొనినాడు.

ఒకటి; రెండు; మూడు—వరుసగా మూడు ఘడియలు గడచినవి. కాని, దేవరాయలు రాలేదు. మల్లన్నకు దిగులు కలుగసాగినది.తన కుట్ర అతనికి తెలిసిపోయినదేమోనని భీతిల్లినాడు. బహూశః ఒకవేళ దేవాలయము నందలి విశేషపూజోత్సవముల నిమిత్తమై వచ్చుటాలస్యమై యుండును!—ఇప్పుడు రాగలడు!, ఇంకొక ఘడియలో రాగలడు! అని ఘడియలను లెక్కించుచూ కూర్చొన్నాడు.

ఘడియలు గడచి, ఝాములు ప్రవేశించినను దేవరాయలు రాలేదు. అప్పుడు, మల్లన్నకు నిజముగా భీతి కల్గినది! తన కుట్రబయట పడినదేమో నను సంశయముకూడా జనించినది. అంతలో బోయీలు పల్లకీ మోయునప్పుడు చేయు శబ్దము వినవచ్చినది. దేవరాయలు వచ్చుచున్నాడు! అదిగో అతడు కూర్చొనియున్న పల్లకీ! పల్లకీ దగ్గర పడుచున్న కొలదిని అతని రక్తము తీవ్రముగా ప్రవహించ సాగినది. పల్లకీ సంపంగి చెట్టుక్రిందకు రాగా, మల్లన్న మేనాలో నున్న దేవరాయల నొక్క పోటు పొడిచి, హత్యగావించి, తప్పించుకొని పారిపోవుటకై పల్లకీ మీద పడినాడు!

అతని సంకేతము మేరకు, సంగడికాండ్రు కూడా ఆయుధపాణులై వచ్చి, రక్షకదళము మీదను-బోయీల మీదనూ పడినారు. కాని, ఆశ్చర్యము! పల్లకీలో దేవరాయలకు బదులుగా పురుష ప్రమాణపు తలదిండ్లున్నవి. మల్లన్న పొడిచిన పోటు దిండునకు గుచ్చుకొనినదే గాని, ఆ కశాఘాతమునకు దేవరాయలు బలికాలేదు. ఇంతలో కోటనుండి నూరారుమంది ఆయుధపాణులైన భటులు దూసుకొని వచ్చి, మల్లన్న మీద పడినారు.క్షణకాలములో అతనిని నిరాయుధునిజేసి, పట్టుకొనినారు. తన నీ విధముగా మోసగించి,బంధించిన వారెవరని చూడగా,తిమ్మోజీ—లక్ష్మీధరామాత్యు లతని ఎదుట నిలబడియున్నారు.

వారిని చూడగనే మల్లన్నకు నడుము విరిగిపోయినది. కనులకు చీకటులు గ్రిమ్మినవి. తాను నిలబడిన ప్రదేశము లోనికి కుంగిపోవు చున్నట్లు తోచి, అతడక్కడే నేలకూలినాడు.

అయినచో, తన హత్యా ప్రయత్నము దేవరాయలకు తెలిసిపోయినది ! కానిచో లక్ష్మీధరామాత్యులు—తిమ్మోజీగారు యిచ్చట....? వారిచ్చటికెట్లు వచ్చినారని ఎంత ఆలోచించిననూ మల్లన్నకు తోచలేదు. అతడు విస్మయకర దృష్టితో వారినే రెప్పవాల్చక చూచుచూ నిలబడినాడు. ఆ చూపుకు ప్రత్యుత్తరముగా తిమ్మోజీ—లక్ష్మీధరామాత్య లతనిని చూచి, తిరస్కారపు నవ్వు నవ్వినారు—

మల్లన్నను బంధించి, కోటయందలి చెఱసాలలో వేసి,లక్ష్మీధరామాత్యుడు అంతఃపురమునకు వచ్చి, తన రాక కొరకై నిరీక్షించుచున్న దేవరాయలకు జరిగిన వృత్తాంత మంతయూ నెరిగించినాడు !

"పామును పట్టి బుట్టలో వేసినాము ప్రభూ ! దానిని చంపుటయో లేక కోర లూడదీసి విడచుటయో, అది తమరే నిర్ణయించ వలయును ! ఈలోపున అతనిని, ఈ హత్యా ప్రయత్నములో ప్రముఖపాత్రలు ధరించిన తదితర ద్రోహులనూ, పరిశోధన జేసి తమ సన్నిధికి దోడ్కొని వచ్చెదను!" అని చెప్పి, అచ్చటినుండి వెళ్ళినాడు. దేవరాయ లీ సంఘటన నన్నింటనీ తలచుకొని : "పంపాపతియే తననీ విపత్తునుండి కాపాడినాడు. నా కీనాడు పునర్జన్మ మెత్తినట్టున్నది !" అనుకొనినాడు.

ఆ రాత్రి ఎంత ప్రయత్నించినను అతనికి నిద్దురరాలేదు. కన్ను మూసిన పార్వతి, కన్నుతెరచిన మల్లన్న వీరే కనబడసాగినారు.

* * * *

అది సామ్రాట్ దేవరాయలను హత్యగావింప బ్రయత్నించిన మల్లన్నా—విరూపాక్షరాయల బహిరంగ విచారణా దినముగా నిర్ణయింపబడినది. ఆనాటి విచారణా వైఖరిని చూచుటకు ఆస్థానీకులు, పురప్రముఖులు, సైన్యాధిపతులు తదితరులగు సర్వులూ సభా భవనమున నిండియున్నారు. సామ్రాట్ దేవరాయలు న్యాయపీఠములో కూర్చొనియున్నారు.

నిర్ణీత సమయమునకు సరిగా అపరాధులను సభా భవనమునకు తోడ్కొని వచ్చి, అపరాధుల స్థానములో నిలువబెట్టి, విచ్చుకత్తులను దరించిన భటులు వారికి పహరా నిచ్చుచూ నిలబడినారు.

మొదట మల్లన్న విచారణ జరిగినది. ప్రధానామాత్యుడు నాగన్న దండనాయకుడు లేచి నిలచి, మల్లన్న అపరాధమును-సభ వినుచుండగా-న్యాయమూర్తులకు సవివరముగా నెరిగించినాడు.

ఆ తరువాత తిమ్మోజీ విచారణ జరిగినది. అతడు తాను విజయ నగరమును విడచి వెళ్ళినదాదిగా మరల యిచ్చటికి వచ్చువరకును జరిగిన విషయములను సవిస్తరముగా విన్నవించుకొనినాడు. అతడు చెప్పునది ముగియగనే, అపరాధి స్థానములో నిలబడియున్న మూడవ వ్యక్తి విరూపాక్షరాయల విన్నపమును ధర్మమూర్తులు శ్రద్ధగా విన్నారు. విరూపాక్ష రాయలు తన విన్నపములో యీ విధముగా చెప్పినాడు :

"ప్రభువులు మొదటినుండియును నా విషయములో సంశయ మునే దాల్చుచున్నారు. నేను తా మనుగ్రహించిన తొండైమండలము మొదలగు సీమల మాండలీక పదవిని వైయక్తిక కారణములచే స్వీకరించు టకు తిరస్కరించితినిగాని, ప్రభువులకు ద్రోహము తలపెట్టవలయునని కాదు. కాని, నాగన్న దండనాయకులు మొదలగువారు తమ స్వార్థసాధనకై, యీ విషయము నాధారముగాగొని, నామీద సామ్రాట్టుల హత్యాభి యోగమును దీసికొని వచ్చినారు ! ఈ యభియోగమునకు నేను సర్వదా బాధ్యుడను గాను ! ఇవన్నియును స్వార్థపరులు చేసిన కుట్రయొక్క ఫలితములు ! సర్వజ్ఞులైన ప్రభువులు ద్రోహుల పలుకు లాలించక, నా యపరాధమును మన్నించి, నన్నీ హత్యాభియోగమునుండి తప్పించి కాపాడ వలయునని ప్రార్థించు చున్నాను !"

"అయినచో, మీరు నిర్దోషులని చెప్పుచున్నారా ?"

"ఔను, ప్రభూ !"

"మేమిచ్చిన మాండలీక పదవి నెందుకు తిరస్కరించినారు ? మీకు సామ్రాజ్యసేవ చేయుట యిష్టములేదా ?"

"ప్రభూ ! మొదటినుండియును నాకు సంగీత సాహిత్యములమీద నెక్కువాసక్తి యుండుటను తాము కూడా గ్రహించియున్నారు. విరామ

సమయము నంతయును యీ సంగీత-సాహిత్య రచనా వ్యాసంగములకే ప్రత్యేకించ వలయునని నా యభీష్టము. అంతకంటెను వేరు దురుద్దేశము గాని, స్వార్థముగాని, ఏదియును నాలో లేదు।"

"మీకు మల్లన్నతో పరిచయముగలదా?"

"అతడొక శిల్పి - కళాకారుడని మాత్రము తెలియును।"

విరూపాక్షరాయల విచారణ ముగిసినది. మల్లన్న తన విన్నపములో సామ్రాట్ దేవరాయల పట్ల తనకు గలిగిన ద్వేషపు కథ నంతయును సవిస్తరముగా తెల్పుకొనినాడు.

"నేను త్రికరణ శుద్ధిగా ప్రేమించినపార్వతిని తిమ్మోజీగారుహత్య చేయునట్లు ప్రేరేపించిరని సామ్రాట్టులను నేను హత్యగావింప ప్రయత్నించినది సత్యమే। వారిమీద పగసాధింప దలచినదియును సత్యమే। నాయపరాధమున కేశిక్షయైనను విధింపుడు. సంతోషముగా అనుభవింప గలను।" అన్నాడు మల్లన్న.

"సత్యాంశము లన్నియును తెలిసిన తరువాత కూడా మీరు సామ్రాట్టులను ద్వేషించుచున్నారా? వారిమీద పగదీర్చుకొన నాశించుచున్నారా?"

"లేదు. నాయకృత్యమునకై పశ్చాత్తాప పడుచున్నాను।"

"ఈ హత్య చేయుటకు మీకు విరూపాక్షరాయలు ప్రోత్సాహమిచ్చినారని వారిమీద ఆరోపణ మోపబడినది. దీనికి మీరేమనెదరు?"

"వారి ప్రోత్సాహము మీదనే యీ కార్యమునకు నేనింత ధైర్యముగా పూనుకొనినాను।"

"వారితో మీకు పరిచయ మెట్లేర్పడినది?"

మల్లన్న భూత గృహవృత్తాంతమును తెలియజేసినాడు. ఇదివిని సభికులాశ్చర్య చకితులైనారు।

"అయినచో విరూపాక్షరాయలుకూడా యీహత్యా ప్రయత్నములో భాగము వహించి నాడందురా?"

"అవును, ప్రభూ! వారుకూడా నాతోబాటీ హత్యాప్రయత్నములో భాగము వహించినారు। నేను పట్టుబడినాను - వారు పట్టుబడలేదు। ఇంతియే వ్యత్యాసము।"

"మీ యపరాధమెంతటిదో తెలియునా?"

"తెలియును, ప్రభూ!"

"దీనికి శిక్ష; మరణదండనయని కూడా నెఱుగుదురా?"

"ఎఱుగుదును, ప్రభూ! దానిని సంతోషముగా అనుభవించ గలను!"

"ఎందులకు?"

"నాకీ జీవితము మీద ఏవగింపు కలిగినది! బ్రతుకుటకన్నను చావే సుఖకరమని దోచుచున్నది! పార్వతిలేని యీ జగత్తే నాకు మిథ్యగా తోచుచున్నది! సామ్రాట్టులు కృపజూపి, మరణదండనను విధించిన, సంతోషముగా నా ప్రణయదేవత సాన్నిధ్యమును చేరుకొనగలను!"

అంతటితో మల్లన్న విచారణ ముగిసినది!

న్యాయమూర్తు లేక కంఠముతో అపరాధులు దండనార్హులని తీర్పు నిచ్చినారు.

సభికులు సార్వభౌముల తీర్పునెదురు చూచుచూ కూర్చున్నారు. సామ్రాట్టులు తమ ప్రాణములను కాపాడిన లక్ష్మీధరామాత్యులను చూచినారు. వారి చూపులోని అర్థమును గ్రహించిన లక్ష్మీధరులు లేచి యీ విధముగా చెప్పినారు:

"ప్రభూ! తమరు న్యాయపీఠములో ధర్మదేవతలవలె కూర్చుని రాజహంతకు లిరువురి మొరలను ఆలించినారు! న్యాయమూర్తులు అపరాధులు దండార్హులని తీర్పుచెప్పినారు! కాని, ఇచ్చట విచారార్హమైన ఒక అంశముగలదు. మల్లన్న ప్రారంభము నుండియూ దురభిప్రాయ పరుడై ప్రవర్తించినాడు. అతడు సామ్రాట్టులను హత్యచేయుటకు సమకట్టినది కూడా తెలిసికాదు! దీనిని అపరాధియే ఒప్పుకొని, తన తప్పుకు పశ్చాత్తాపమును కూడా వ్యక్త పరచినాడు. అతడు పార్వతిమీద తనకుగల ప్రేమాతిశయముచే గ్రుడ్డివాడై యీ కార్యమునకు పూనుకొనినాడు. అతడొనరించిన ప్రతిదుడుకు తనమునకునూ - ఈ పూర్వాగ్రహమే కారణమని స్పష్టముగా తెలియుచున్నది! కాని, తన ఉద్దేశమెంతటి సత్యదూరమైనదని తెలిసినప్పుడతడు తన యకృత్యమునకై పశ్చాత్తాప పడినాడు.

"వేరొక అపరాధి ప్రవేశ మీ హత్యా ప్రయత్నములో నున్న దనుటకు మనకు మల్లన్న సాక్ష్యమొక్కటియే ఆధారము! ఈ హత్యాభియోగమును నిష్కారణముగా తనపై మోపినారనియు, తాను నిర్దోషిననియూ, శ్రీ విరూపాక్షరాయలు తమ విచారణలో విన్నవించుకొనినారు. వారికి హత్యపై నాసక్తి యుండవచ్చును. కాని వారి వ్యక్తి ప్రవేశ మిందులో లేదు. ఆత్మసాక్షిగా తామెప్పుడూ ప్రభువులకు ద్రోహము తలపెట్టలేదని, వారు తమ పలుకులలో నడివినారు. ఎంతటి అపరాధులైనను వారు తమ సహోదరులు! రక్తము పంచుకొని పుట్టినవారు. వారిని ప్రభువు లుదారచిత్తులై క్షమించవలయునని ప్రార్థించుచున్నాను"

లక్ష్మీధరుల మాటలు విని సభ నివ్వెరపోయినది. అందరి దృక్కులూ సామ్రాట్ దేవరాయలమీద కేంద్రీకృతమైనవి. సార్వభౌములేమని తీర్పు చెప్పగలరో యని వా రాతురత జెందసాగినారు.

సామ్రాట్ దేవరాయలు నిలచి, గంభీర కంఠముతో అనినారు :

"అమాత్యులగు లక్ష్మీధరులు చెప్పిన మాటలలో సత్యాంశము లున్నవి. అపరాధులు తమ యకృత్యమునకు పశ్చాత్తాప పడినారు. కాబట్టి; వారిని ఉదారముగా క్షమించుచున్నాము"

ఈ తీర్మానమును విని సభికులు జయకారములతో తమ సమ్మతిని వ్యక్తపరచినారు. సామ్రాట్‌లు ఉత్కృష్టమైన న్యాయతీర్మానమును చేసిరని అందరును పొగడినారు.

అపరాధుల కిద్దరికీ విముక్తి లభించినది. తమ జీవిత శేషమును వారు ప్రభువుల సేవలో గడుపునట్లుగా నిశ్చయించుకొన్నారు. ఆ నిశ్చయము మేరకు విరూపాక్షరాయలు, పూర్వపు తన తొండైమండల మాండలీక పదవిని స్వీకరించినాడు. తిమ్మోజీ ఆస్థాన శిల్పిగా నిలచినాడు.

మల్లన్న తన మరణదండనను తప్పించి, ప్రాణములను కాపాడిన లక్ష్మీధరామాత్యులను మరువలేదు. అత డామరణ పర్యంతము వారి సేవలో గడపినాడు. రాజధానిలో అనేక దేవాలయములను నిర్మించుటకు సాయపడినాడు. వాటియం దిప్పుడు కృష్ణాపుర–పంపాపుర మార్గములో నున్న గణపతి దేవాలయముకూడా నొకటి. ఆ దేవాలయ ప్రాకారకుడ్య

ములో, తన కాళ్రియమిచ్చిన లక్ష్మీధరామాత్యుల నీ క్రింది విధముగా కీర్తించుచూ అతడొక పద్యమును మలచి యున్నాడు :

॥ సీ ॥

బహుతటాకంబులు వనరులు గల్పించి
కర్షక తతినెల్లఁ గాఁచె నెవఁడు ?
జీవన పూర్ణమౌ బావుల ద్రవ్వించి
పాంథుల తృష్ణను బాపె నెవఁడు ?
దేవాయతనము లర్థిని ఘటించియు మించి
భక్తి తత్పరతను వరలె నెవఁడు ?
చెఱ నున్నవారిని నెఱి విముక్తులఁజేసి
శీలవర్తనులుగఁ జేసె నెవఁడు ?

॥ గీ ॥

మిత్త్రి తతి బెంచి శత్రుసమితిని నొంచి
సుభటకోటుల బోషించి యభయమొసగి
భువిని ఆచంద్రతారార్కముగ యశంబు
బొందె లక్ష్మీధరామాత్య పుంగవుండు ।

—'అనంత, సింహ'

—• సంపూర్ణము •—

శ్రీ ఛత్రపతి గ్రంథాలయం, తెలప్రోలు :: కృష్ణాజిల్లా

దీని తర్వాతి కథకొరకై "సామ్రాట్ ప్రౌఢ దేవరాయలు" అను భాగమును జదువ గోరెదము.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B187 |
| పుస్తకం పేరు | రాయపరాభవము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 281 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |